ఓం

పరమాత్ముడగు

శ్రీమన్నారాయణునికి

# అయోధ్యకాండ

## కథాసంగ్రహము — పాత్రలు

### దశరథుడు :—

రాముడు గుణవంతుడు ప్రజల క్షేమము చూచువాఁడు అని తెలిసికొని ప్రజల మంత్రుల సలహాను అనుసరించి దశరథుడు రాముని యువరాజుగాఁ జేయదలఁచెను. కైక కుమారునికి రాజ్య మీయవలె నని కైక వివాహ కాలపు షరతు ఉన్నను తన కుమారులు పూర్వ వంశాచారము ననుసరించి పెద్దవానినే రాజుగాఁ జేయుటకు అంకరింతు రని తనలో తలచి మనుష్యుల బుద్ధులు ఎట్లు ఉండునో తెలియదు గాన త్వరగా భరతుఁడు అయోధ్యలో లేని సమయమున ఏలాగో మనసు సరిపెట్టుకొని రాముని యువరాజును చేయ నిశ్చయించెను. "పట్టాభిషేకసమయమునరాగాజ్ఞాపకము చేసినచో కైకకొడుకుకే రాజ్య మిచ్చెద" నని యున్నను భరతునికి పెండ్లి అయి రాజ్య మేలు వయసు వచ్చినను కైకవైపువారు వచ్చి ప్రస్తావించి జ్ఞాపకము చేయలేదు. కాన పూర్వ సంప్రదాయము ప్రకారము పెద్దవానికే రాజ్యము ఇవ్వవచ్చునని కైక వంశీయులు తలచియుండవచ్చును అను కారణముచేత దశరథుఁడు రామునికే పట్టము గట్టదలఁచె నని మన మనుకొనవలసి యున్నది. ఈ సంగతి తరువాత విందురులే యని దూరమందున్న కేకయరాజునకుఁ గాని జనకునికిఁగాని తెలుపలేదు. కేకయరాజునకు తెలిసినచో కైక కొడుకునకు రాజ్యమివ్వ మను నేమో యని యనుకొనెనేమొ కూడ. కాని భరతుని భావి ప్రవర్తనయు అతని రాజ్య విముఖత్వమును దశరథుని భావము సరియైనదే యని సమర్థించిన ట్లయ్యెను.

దశరథుఁడు రాముని యువరాజును జేయదలఁచెనో లేదో గాని అంతలోనె ప్రజలు అత్యుత్సాహముతో ఉత్సవాలతో పురము నింపివైచిరి.

మంథర జ్ఞాతిదాసి :–

పురాలంకరణోత్సవాలు మంథర చూచినది. మంథర కైక జ్ఞాతులకు దాసిగానున్నది. కైకతోనున్నది. మంథర కుటిలబుద్ధిగలది. కైక క్షేమమును మాత్రమే చూచునది. ప్రకృతియంతటి దాదివల్ల రాముని పట్టాభిషేకవార్తను విని సహింపలేకపోయినది. రాముని పట్టాభిషేకమును భగ్నపఱచినది. సృష్టి నిర్ణయము విచిత్రమైనది. రావణుని జంపుటకు రాముఁడు అడవిపాలు కావలసియున్నది. అందుచే మంథర పాత్రను కల్పించిరి కవులని యందురు. అట్లనరాదు. మందబుద్ధి వక్రబుద్ధి యగు మంథర కిట్టి యాలోచన యుండు ననుట అసంభవము. సహజముగా వక్రబుద్ధి గల మంథర రావణ సంహారమునకు ఉపయోగపడినది. లోకములోని సంఘటనలు చిత్రముగా ముందుగానే యూహించి కల్పింపఁబడినట్లు కనిపించును. అందుకని దానిని దైవసంకల్ప మనుచుందురు. దేవతలు తమకార్యనిర్వహణకై యిట్లు చేసిరనునదియు సరియైన కల్పనకాదు. వక్రబుద్ధుల దుష్టత్వమును మంచిగా మరలించి మలచఁబడెనని యనుకొన్నచో అది యుత్తమ భావన కాఁగలదు.

కైక :–

ఆశాపరు లగు మానవుల స్వభావము ఇట్లుండు ననియు, మహాత్ముల స్వభావము సత్యము వైపుగా – (ఎన్ని కష్టములు వచ్చినను) – వెళ్ళు నని మనము తెలిసికొనవలసిన విషయము. ప్రకృతిసిద్ధముగా సరళముగానున్నను స్వవిషయము వచ్చునప్పటికి స్వార్థము వైపునకే మొగ్గెదరని కైక స్వభావము మనకుఁ దెలుపుచున్నది. రాముఁడు ఒకడు భరతుఁడు వేఱొకడు అను భేదము చూపక మొదట రాముని పట్టాభిషేక వార్త విని సంతోషించినది కాని సవతి యగు కౌసల్యవల్లఁ దనకు భరతునికి కష్టములు వచ్చునని మంథర మాటలు వినునప్పటికి ఊరుకొనలేకపోయినది. అదివఱకు "దశరథుఁడు కౌసల్యపై చూపిన భావము, నీ మీఁదఁగల యనురాగము చూపెనుగదా. అప్పుడింక కౌసల్య రాజమాతగా అయినప్పుడు నీ మీఁద పగ తీర్చుకొనక యుండునా" అనునప్పటికి కాలిమంట తలకెక్కినది. మంథరవలెనె కైకకూడ కుటిలయే, స్వార్థపరయే. కాని సృష్టిస్వభావము వారికార్యములకు సరియగు ఫలములు కలుగునట్లు దిద్ద

గలదు. అందుకని యిది దేవతల కల్పనయే యనునంత వఱకు వచ్చినది. ముళ్ళు, విషము మొదలగువానిని సరియైన విధముగాఁ దీర్చిదిద్దకపోయినచో హాని కలుగును. దారిలో నున్నచో ముళ్లు గుచ్చి బాధించును. కంచెగా వైచిన పంటకు రక్షణ యిచ్చును. త్రాగిన విషము చంపును. ఔషధములో వేసిన మేలు గూర్చును. సృష్టిలో అన్ని వస్తువులు మంచివే. యుండవలసినవే. వానిని ఉపయోగించుకొనవలసిన రీతిగా విజ్ఞులు ఉపయోగింతురు. మంథర, కైకలు వక్రబుద్ధు లయినను ఆ వక్రబుద్ధిచే జరిగినదానిని మంచికై (రావణ సంహారమునకై) సృష్టిస్వభావము తీర్చిదిద్ద నవలెను. అహా ఏమి విచిత్రము ! ఇది ముందుగా ఆలోచించి చేసిన కల్పనయే యని తరువాత మనకు తోచును. ఇట్లు మంచిగా అయినంతమాత్రమున మంథర కైకలు మంచివారు కాఁజాలరు. వారు చేసిన పాప ఫలిత మీ వక్రత. ఆ వక్రతను సరిగాఁ జేసినది సత్యదేవుని సంకల్పము. రాముఁడును- ఇది మానవబుద్ధివల్ల జరిగినది కాదని ఎల్లపుడు తనయందు మంచిగానున్న కైక యిప్పు డిట్టు లెందుకున్నది- అని అన్నాడు. భరద్వాజుఁడు భరతునితో "భావిలో మంచి జరుగుటకే యిదంతయు- కైకను నిందించకు" అని యనెను.

రాముఁడు :-

సరే యింక రాముఁడో సహజముగా ధీరుఁడు. సుఖమును వలె దుఃఖమును తీసికొన గలఁడు. అందుకే పట్టాభిషేకము సంగతి తండ్రి చెప్పినపుడు ఉబ్బిగంతులు వేయలేదు. అడవికి వెళ్ళుమన్నపుడు క్రుంగిపోవ లేదు. తండ్రిమాట శిరసావహించుట ప్రధానకృత్యము. అది కూడ సత్యమైతేనే. అట్టి మనుష్యులు లోకములో అరుదు. ఇటువంటి వారు అసలు ఉండనే యుండరనుకొనుటకు వీలులేదు అని గాంధిమహాత్ముని వంటి వారి నడతలు ప్రత్యక్షముగాఁ జూచిన వారికిఁ దెలియకపోదు.

భరతుఁడు:-

పోనీ తల్లి తనకు ఏలాగో ఒకలాగు రాజ్యము తెచ్చిపెట్టినది. ఇది సిద్ధాన్నమని భరతుఁ డంగీకరించెనా ? వాని మనసులో అట్టి సూచనయేని

మునుమ అహోష్యగాను జూడమని అడవికి త్రోసినది. అలీ సోదరులను వారి తల్లి గాంధీతోపాటు జైలుకు పంపుచు ఆశీర్వదించి తోసినట్లు. ఇట్టి పాత్రలు అసంభవములుగావు మనము అర్థము చేసికొని వారివలె మన జీవితములను దిద్దుకొనవలెను.

ఊర్మిళ :–

అసలు ఊర్మిళకు ఎందుకో ప్రత్యేకస్థానములేదు భక్తునికివలె. ప్రత్యేకత యులేదు. తన్ను భర్త ప్రియుడు అగు లక్ష్మణునికి అంకితముచేసికొన్నప్పుడు తాను భర్తతో ఏకమైపోయినది. ప్రియునికంటె ప్రియురాలు ప్రత్యేకత యెక్కడ. దైవముకంటె భక్తునికి ప్రత్యేకత ఏది? వివాహమైనపుడే ఊర్మిళకు తెలిసినది తన ప్రియుడగు లక్ష్మణుఁడు రాముని కంటె వేరుకాడని. శరీరములు రెండు గాని, ఆత్మయొక్కటి. ఇట్లు తెలిసిన ఊర్మిళ తాను భర్త కంటె వేరుగా ఎట్లుండఁగలదు. అడవిలో రాత్రింబగళ్ళు మేల్కొని నిద్రాహారాలుమాని సీతారాముల సేవలో నిమగ్నుఁడై భర్త యుండఁగా తాను తన హృదయములో భర్తృ ధ్యానమును నిల్పుకొని సమాధి యందు, యోగి భగవంతునితోవలె, ధ్యానములో లీనమైపోయినది. ఇట్టి యువాజ్మానస స్థితిని వర్ణించుటకు పదాలు చాలక వాల్మీకి మౌని మౌనము వహించినాఁడేమో! ఈ సంగతి గ్రహించలేక వాల్మీకి ఊర్మిళను మఱచినాఁడను దోషము వేయుట భరింపరానిదే అని మనము అనుకొనక తప్పదు. అంతటి వాల్మీకి అన్ని విషయములు ప్రతిబిన్న విషయము ధ్యానములో చూడగలడని బ్రహ్మయె యోగ్యతా పత్రమిచ్చినపుడు మనవంటి వారు ఇచ్చిననేమి ఇవ్వకున్ననేమి. ఒకరికొకరు అర్థమైనపుడు ఊర్మిళా లక్ష్మణులు స్వాగతాలు వీడ్కోలులు ఇచ్చుకొననక్కరలేదు.

సీత :–

ఇంక సీత దగ్గరకు వచ్చెదము. రామునికి సీతమీఁద ఎంత యధికారమున్నదో అంతకంటె ఎక్కువ యధికారముకలది సీత. వనికి వసేమిరా రావద్దు అన్న భర్తమీఁద కోపపడినది: సీత వినలేదు. వినగూడదు కూడ, నీవు మగవాడివికాదా నివు మగవాడివని మానాన్న అనుకొని పొరపడ్డాడేమో అన్నది.

అడదానిని రక్షించుకోలేని వాఁడు మగవాడా అన్నది. ఇంకేమున్నది, ఆదెబ్బ రాముని నషాళానికంటినది. మరి మాటాడలేదు. రమ్మన్నాఁడు. నిన్ను విడిచి నేను మాత్రము ఉండగలనా అన్నాఁడు. భార్యాభర్తల సంబంధము ప్రణయనీ ప్రణయుల సంబంధము అట్టిది. విడదీయరానిది, అది లోక సహజము, లోకము నేర్చుకొనవలసినదికూడ. ఇందులో దైవసంకల్పమున్నది అను వారి మాట కూడ ఒప్పుకొనుటలో పెద్ద యపరాధమేమిలేదు. అసలు దైవసంకల్పము లేకుండ గడ్డిపరకయైనను కదలదనుమాట ఉన్నదికదా. తాను ఏమిచేయఁగలడు. తానెవడో తానున్నాడో లేడో కూడ హేతువాది చెప్పగలడా. ఈసృష్టి ఏమిటి సహజమన్నంత మాత్రాన సరిపోవునా, దానిని గ్రహింప యత్నము చేయవలదా, లోకములో భర్తకోసము భార్య, భార్యకోసముభర్త కష్టాలుపడుటలో తప్పేమియున్నది. అర్థముకానిది అర్థముచేసికొనుటకే మనకు బుద్ధియున్నది. లోకులకు కర్తవ్యము బోధించుటకేగదా అందముగా తీయఁగా క్రాంతదర్శులగు కవులు వర్ణించుట. అవర్ణనలను గ్రహించి మానవులలో ఉత్తమమువైయాచరణలో నుండుటలోనె యున్నది మానవత.

లక్ష్మణుడు :—

అందఱును రాములుకారు. అందఱు సీతలునుకారు. అందఱు లక్ష్మణులు కారు. లక్ష్మణుఁడు తన రామునికి ఏపాటి కష్టము వచ్చినను సహింపలేఁడు. రామునికెట్లు సేవాసదుపాయములు చేయుదునా అని యాలోచించుచుండును, అతనికింకే ప్రపంచము కనిపింపదు. తట్టదు. నీసుఖమునకు ఎవరు అడ్డువచ్చినను సరే వారు దశరథ భరతులైనను సరే శిక్షించి నీకు పట్టముగట్టుదును చూచుచుకూర్చుండుము అనును. రాముఁడు రాముని క్షేమము మాత్రమే కనిపించును, రాముని ఎపుడును ఉల్లంఘింపడు, రాముఁడు జ్ఞాపకము చేయును తండ్రిమాట కాదనుటకు శక్తిలేదని, అంతతో నోరు మూసికొనును. మంత్రబద్ధమైన పాముపలె బుసలు మాత్రము కొట్టును. అంతే. నీయిష్టమే నాయిష్టము అని వనికి అందఱికంటె ముందె బయలుదేఱెను. వానికి తల్లి కూడ గనిపింపదు. సరే తల్లికూడ రామునినె చూడమనునుగదా. ఇఁక ఊర్మిళ ఊర్మిళయె.

సుమంత్రునికి మంత్రి సిద్ధార్థునకు చివరకు వసిష్ఠునికిని గోపము రాక మానలేదు. లోలోపలనే కోపాగ్ని రగులుచున్నది. సుమంత్రుడపుడు నీ తల్లి యిటువంటిదే అని, నీతల్లి గుణాలు పోలేదు అన్నాడు. కట్టుకొనుటకు నార బట్టలు కైక తేఁగా రామలక్ష్మణులు కట్టుకొన్నారు. సీత కట్టుకోవాలని యను కొన్నను వలను చూచిన లేడివలె వానిని జూచి భయపడిపోయినది. రాము డేలాగో ఒక లాగు చీర మీదనే చుట్టబెట్టెను. అప్పుడు ఇంక ఊరుకోలేకపోయి నారు అందరు. వనవాసపుషరతులో సీత విషయములేదుగదాఅని సీతకు వస్త్రా భరణాలు ఇప్పించిరి. అమ్మయ్య అనుకొని ఎంతకంతగానే సీతకు వనవాస సంవత్సరాలు లెక్కించి చీరలు ఇప్పించెను మామ. చివరకు ఇవన్నితలచుకొని ముని శాపము జ్ఞాపకము తెచ్చుకొని కౌసల్యకు చెప్పి దశరథుడు ప్రాణాలు వదలెను.

సీత తనంతతానుగా వనమునకు వచ్చినది; సీత సౌకుమార్యము చూచి ఆమె కెక్కడ సుఖముగా నుండునో యని మునులవల్లఁ దెలిసికొని చిత్ర కూటాల (శిఖరాల)తో సుందరమైన చిత్రకూటగిరి దగ్గఱనే అన్ని సదుపాయము లతోఁ గూడిన పర్ణశాలను లక్ష్మణుచేఁ గట్టించెను చెప్పినదే తడవుగ లక్ష్మ ణుఁడు శిల్పివలె పర్ణశాలను చక్కగానిర్మించెను. వాల్మీకి అక్కడనేయుండెను. వాల్మీకిని దర్శించిరి. రామాదులు చిత్రకూటగిరిదరికి వచ్చినపుడు వాల్మీకి అక్క డనేయుండెను. పిదప భరతాదులు వచ్చి వెళ్ళిన పిదప ఋషులు ఆ చోటికి రాముఁడు వచ్చుటతోడనే రాక్షసభయము హెచ్చినది. కనుక వాల్మీకి తమ సాతీరమునకు వచ్చెనని తెలియునది అని వ్యాఖ్యాతలు. రాముని చూచి నప్పటి నుండి రామునిపైని ఆదరణ గౌరవము పెరిగెను. నారదునడిగి తెలిసి కొన్న పిదప ఆది రామాయణ రచనకు దోహదమై రామాయణ రూపము దాల్చినది.

భరతుడు :—

మేనమామ యింటి దగ్గఱ ఉన్నాఁడేగాని మనసంతయు తండ్రి దశ రథునిపైని తండ్రివంటి యన్న రాముని మీఁదను గలదు. తల్లి గుణాలు

తెలిసినవాడుగాన తల్లి క్షేమము తెలిసికొన్నంతతో తృప్తిపడినాడు తాను అనుకొన్నది యొక్కటి జరిగినది యింకొకటి. రామునికిఁ బట్టాభిషేకము ఎప్పుడగునా, అన్నగారికి ఎప్పుడు గొడుగు వేయుదునా అని అనుకొన్నాడు. ఆకలలు వేరైనవి. దూతలు రాకమునుపే, చెడుకలలు ప్రారంభించినవి. అదియేమో దైవసంకల్పమో పూర్వానుబంధమో స్వభావమోకాని జరగబోవు వానిని సూచించునవి మనకును జరుగుచుండును. అవి నిజమని తర్వాతఁ గాని మన మనుకొనలేము. దూతలు వచ్చి త్వరపెట్టుట అయోధ్య పాడుపడి నట్లు ఉండుట యివన్నియు తన కలలకు రూపమిచ్చినవి.

తండ్రి యింటిలోఁ గనిపింపలేదు. కొడుకుకు ఇంతటి మహోపకారము చేసితినిగదా అని, కొడుకు విని యుబ్బిపోవునని చేసినది జరిగినది కైక చెప్పివైచినది. విన్నాడో లేదో మొదలు నఱికిన చెట్టువలె భరతుఁడు క్రిందఁబడి పోయినాఁడు. అటువంటి క్రూరురాలు దుష్టురాలి కడుపులో పదినెలలు ఉన్నందుకు తన్ను నిందించికొని మొత్తుకొన్నాఁడు. అన్న రాముఁడు తన్ను మాతృఘాతకుఁడని తనతో మాటాడడేమో యని తల్లిని చంపనన్నాడు. చంపినంత పని చేసినాఁడు. అన్నిటికి సూత్రధారిణి యగు మంథరను జనులు చెప్పగాఁ ఈడ్చు శత్రుఘ్నుని ఆపినాడు. ప్రయాణము కట్టి సేనలతో రాముని తీసికొని వచ్చుటకు సన్నాహాలు చేసెను. కౌసల్య ఒడిలోపడి బొరుమన్నాడు. ఇట్టి ఆలోచనయే కనుక ఉన్నట్లయితే నేను ఈఈ పాపాలు చేసినట్లే అని ఎన్నో యొట్లు పెట్టుకొన్నాడు. "అసలే కొడుకు అడవికి వెళ్ళినందుకు చావలేక యేడ్చు చుండ ఇట్లులనుచు ఇంకా నన్నుఁ జంపెదవేమిటిరా" అని భరతుని ఓదార్చి నీవంటివారు ప్రపంచములో ఉండరని కౌసల్య భరతుఁడు తొందరపెట్టఁగా సుమిత్రతో బయలుదేఱినది అడవికి రాముఁని చూచుటకు.

కైక :—

ఒక మూల తన కోరికా తీరలేదు పైగా భరతుఁడు కన్నకొడుకు అనెడి సూటిపోటుమాటలు ప్రజలు అనెడి మాటలకే చచ్చుచున్నది. యింకా భరతుని సంగతి చూచి చచ్చి క్రుంగిపోయి తలెత్తుకోలేక వెళ్ళలేక ఎట్లు వెళ్లెనో ఆమెకే

తెలియును. భరతునితో బయలుదేఱినది. మొదట భరతుని సంశయించిన భరద్వాజుడు భరతుని మాటలు మెచ్చుకొని తల్లులను జూచి వీరెవరెవరు అని యడిగెను. ఈమె యెవ్వరు అని కైకను చూపి యడుగగా అంతటికి కారణమైన తల్లి కైక అని భరతుడన్నపుడు ఇది భావిలో మంచికే యగును తల్లిని నిందింపకుము అన్న భరద్వాజుని చుట్టు మాటిమాటికి సిగ్గుతో ప్రదక్షిణాలు చేసినది కైక. మఱిమఱి ప్రదక్షిణాలు చేసినది.

గుహుడు — భరతుడు :—

నిజము తెలిసికొని గుహుడు భరతుని ఆదరించెను. సీతారాములు జడలు కట్టుకొన్న చోటు, పరుండిన ఆకుల ప్రక్క చూపెను. చూచి భరతుఁడు గుండె పగుల ఏడ్చి దీనికంతకు తానేగదా కారణమని బావురుమన్నాడు. కాలి నడకనే బయలుదేఱెను. పర్ణశాలముందు కూర్చున్న సీతారాములఁ జూచి ఆగలేక పరువెత్తుకొనిపోయి "అన్నయ్యా" అని రాముని యొడిలో పడెను. భరతుని వేషముచూచి ఎత్తుకొని, కౌఁగలించుకొని, యోగక్షేమము లడిగి ఇదేమిటి ఇట్లు వచ్చితి వేమి అన్నాడు రాముఁడు. సంగతి అంతా తెలిసి రాముఁడు పిల్లవాఁడువలె సీతదగ్గఱకు వెళ్ళి "మీ మామ పోయినాడట" అని మూర్ఛిల్లెను.

అందఱు వసిష్ఠుని యాజ్ఞప్రకారము తండ్రికి నీళ్ళు వదలిరి. స్తిమితపడి కూర్చున్న పిదప ఎవరు ఏమి మాటాడుదురో యని వేయి కళ్ళతో కిక్కురు మనకుండ ప్రజలు మంత్రులు తల్లులు చూచుచుండిరి.

పాదుకలు :—

భరతుఁడు రంగము సిద్ధముచేసెను. నేను అమ్మ ప్రజలు మంత్రులు నీవే రాజువు అనుచున్నారు. రమ్మన్నాడు. జాబాలితోపాటు అందఱు హేతువాదములు చేసి రమ్మన్నారు. రాకపోయినచో చచ్చిపోవుదునని బ్రతిమాలుచు దర్భలపై పరుండి ప్రాయోపవేశము చేసెను భరతుడు. పౌరుషము, క్షాత్రధర్మముగల నీవు ద్విజునివలె పస్తుందువా ! లే, అని చివాట్లు వేసి లేవదీసి యొడిలోనుంచుకొని నీవు రాజ్యము, నేను వనమును పాలించి తండ్రిని సత్యవంతునిగాఁ జేయుదమని ఏదో విధముగా భరతుని రాముఁడు ఒప్పించెను.

వసిష్ఠుని సూచనపై పాదుకలు అడిగి పుచ్చుకొని వానికి నివేదించి పాలింతు నని, అనుకొన్న గడువు దాటితే చనిపోవుదునని చెప్పి అయోధ్యకు వచ్చి తల్లులను అయోధ్యలో దింపి వనములో దొరకిన యాహారము తినుచు జడలు కట్టుకొని స్వేచ్ఛతో మునియై నందిగ్రామములో రామునిరాక కెదురుచూచుచు నుండెను.

అన్ని పాత్రలు వేనికి అవే సాటి. ఇందులో అసహజము, అతిశయోక్తి గాని లేదు. ఇట్టివారు ఇప్పుడును లేకపోలేదు. వీరినిబట్టి వీరు కల్పిత పురుషులు గారు చరిత్ర పురుషులే యని మనకళ్ళయెదుట పెట్టినాఁడు వాల్మీకి మహర్షి, కాదు శిల్పి, కాదు కాదు కవికోకిల ! ఆ కోకిల పాడినది అమృత గానమె.

———

# రా మా య ణ ము

## —: అనువాదముల రీతులు :—

### బా ల కా ం డ :—

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. |–|

తపమున స్వాధ్యాయంబున
నిపుణుని వాగ్విద్వరేణ్యు నిఖిల మునిజనా
ధిపు నారదు సంప్రశ్నము
తపస్వి వాల్మీకి యిటు తమిఁ గావించెన్.

శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు

తపస్స్వాధ్యాయ కమనీయ శీలు
మునినాథు నారదముని లోకవంద్యు
ననఘు తపోనిధియైన వాల్మీకి
గనుగొని యొకనాఁడు కర మర్థినడిగె.

రంగనాథరామాయణము

మునివరుఁడు తపస్స్వాధ్యా
య నిరతుఁడై పండితాళి యందుత్తముడై
తనరెడు నారదు ప్రశ్నిం
చెను వాల్మీకి యను తపస్వి చిత్తంబలరన్.

శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు

తపమున స్వాధ్యాయంబున
సుపరము వాగ్విద్వరేణ్యు శుద్ధాత్ము మునీ
శ పదాఢ్యు నారదుం గని
తపస్వి వాల్మీకి పలికెఁ దద్దయు భక్తిన్.

రామకథామృతము, తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు, బాల. 1

శ్రీయుత తపోవిశిష్టు స్వాధ్యాయ నిరతు
వాగ్విదగ్రణి నిత్యతపస్వి వరుని
నారదమునీంద్రు నతుల విజ్ఞానరాశి
నడిగె వాల్మీకి మునిపుంగవుఁడు ప్రియముగ.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బాల. 1

తపమున స్వాధ్యాయంబున
నెపుడు మునిఁగి వాక్కుతత్త్వ మెఱిఁగిన చతురున్
తపసి విశారదు నారదు
నపు డా వాల్మీకిమౌని యడిగెను నిటులన్.

శ్రీ చర్ల గణపతిశాస్త్రి, 1-1

మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః
య త్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితం.

బాల. 1-15

ఓరి మహోగ్రపాతకుడ యోరి నిషాదుఁడ క్రౌంచయుగ్మ మిం
పారఁగఁ గాముకేళి మెయినాడగ నందొక పక్షి నీల్గ ని
ష్కారణ మేల చంపితటు గావున నీవును వేగ చావు పో
రోరి దురాత్మ యంచుఁ గడు నుగ్రత నమ్ముని పల్కెఁ బల్కినన్.

భాస్కర రామా. బాల. 10

తెలియుమా నిషాదుండ ! ప్రతిష్ఠ నీక
ప్రాప్తమయ్యెడు శాశ్వత హాయనములఁ
గ్రౌంచ మిథునంబునందు నొక్కండు నీవు
కామమోహితముం జంపు కారణమున.

వావిలికొలను, బాల. 161

వినుమా నిషాద ! క్రౌంచ మి
థునమున నీవేటి కొకఁడు దునిమితొ కామం
బున మోహము నొందుచు గడుఁ
దనరఁగ నిలగనుమ శాశ్వతమగు ప్రతిష్ఠన్.

జనమంచి, బాల.

ఓ నిషాదుండ ! యీ యిల నుండఁబోకు
మిక శాశ్వతమగు సమలేల నీకుఁ
గ్రౌంచ మిథునంబులోన నొక్కండు కాము
మోహితముఁ బొరిగొంటివి మోసమునను.

రామకథా. తాడేపల్లి, బాల. 96

మా నిషాదాప్రతిష్ఠ నీకౌనుగాక
ఇలను శాశ్వతభంగిఁ దుల్యులను గొనక
క్రౌంచ మిథునంబునందు నొక్కటిని మోహ
వశను ద్రుంచితి వేకైక బాణ నిహతి.

బులుసు, బాల. 9

తెనుఁగు అనుష్టుప్పు :-

క్రౌంచ మిథునంబు నుండి, కామి నొక్కని జంపుటన్
మహా ప్రతిష్ఠఁ బొందుమా, నిషాద ! శాశ్వతంబుగన్.

చర్ల గణపతిశాస్త్రి, 8

వివ. :- క్రౌంచమిథునము=రాక్షసుల జంట. మహాప్రతిష్ఠ, మహా అప్రతిష్ఠ. పొందుమా నిషాద, పొందు మానిషాద=లక్ష్మీపతి.

స నిత్యం ప్రశాంతాత్మా మృదు పూర్వంతు భాషతే
ఉచ్య మానోపి పరుషం నోత్తరం ప్రతి పద్యతే
కథంచి దుపకారేణ కృతేనైకేన తుష్యతి
నస్మర త్యపకారాణాం శతమ ప్యాత్మవత్తయా

అయోధ్య 1-9-10

మరియు శీల వృద్ధుండును జ్ఞానవృద్ధుండు దయావృద్ధుండును
మధుర భాషణుండును జిత క్రోధుండు - నగు రాముడు

భాస్కర, అయోధ్య 10

ఎవ్వరి నేనియుఁ దన్నున్
నొవ్వం బలికినను దాను నుడువఁడు కఱకుల్
నవ్వుచు మృదుపూర్వంబుగ
ద్రెవ్వనఁ బ్రతివచన మిచ్చుఁ దిరమగు శాంతిన్

ఉపకార మేమి పనికే
నెపుడే నించుక యొనర్ప నెలమిఁగను సదా
యపకార శతము సల్పిన
విపరీతమునెంచఁ డాత్మ విజ్ఞుం డగుటన్

వావిలి, అయోధ్య 10

ఒరులు పరుషంబు లాడిన
నురుమతిఁ బేశల సుధామయోక్తులఁ దగ ను
త్తర మిచ్చుఁగానీ కినుక
న్పరుషోత్తర మీఁడు శాంతి భావుం డగుటన్

గోపీనాథ, అయోధ్య 10

తనుఁ బరుసములాడ నతం
డని యవని నొకండయేని నగపడఁ డున్నన్
మనమున నిడఁ డవ్వాని
న్మానయుఁడు ప్రత్యుత్తరముల మొగకొని మెలఁపన్

రామకథా, తాడేపల్లి, అయోధ్య 1 : 21

ఎట్లొనర్చిన నయ్యది యించుకైన
నొక్క యుపకారమునఁ దృప్తినొందు మఱవఁ
డెన్ని యపకారములు సేసిరేనియును ద
లంపడు నయ్యాత్మవంతుఁ బోల్ప నొకఁడగునె.

రామకథా. తాడేపల్లి, అయోధ్య 7-37

ఆ సుతుఁడున్ సురూపి యయి యప్రతిముండయి యీసులేనివా
డై సుగుణాలచే దశరథాత్మజుడే యన మీఱి వీరుఁడై
యే సమయంబులం దయిన నెంతొ ప్రసన్నతఁ బూని మెత్తనౌ
బాసలనాఁడు నాడుచు జవాబిడు నే పరుసంబు లేకయే.

ఏయదొ మేలు సుంత యొనరించిన నాయొకటే గని మెచ్చి మోదిలున్
ఏయవి నూఱు కీడు లొనరించిన నెంచఁడు నాత్మవంతుఁడై
ఏయెడ శీలవృద్ధులను వృద్ధులఁ జిన్నల జ్ఞానవృద్ధులన్
బాయక మాటలాడును శుభాస్త్ర సుశిక్షణకేళి నేనియున్.

చ. గ. శాస్త్రి అయోధ్య 8-7

ఇదంతు మంధరే మహ్య మాఖ్యాసి వరమం ప్రియం
ఏతన్మే ప్రియమాఖ్యాతుః కంహి భూయః కరోమి తే.

అయోధ్య. 7-34

రామేవా భరతేవాఽహం విశేషం నోపలక్షయే
తస్మాత్తుష్టాస్మి యద్రాజా రామం రాజ్యేఽభిషేక్ష్యతి. 7-35

అని చెప్పిన విని కైకేయి సంతసించి లేచి మంధర కిట్లను, కుబ్జా నీవు నేఁడు సుఖకరంబగువార్త చెప్పితివి, రాముండు భరతుండును నాకొక్క రూప. విశేషించి రాముండు నామీఁదఁ బ్రేమాతిశయుంబు గలిగియుండు నట్టి గుణ రత్నంబునకుఁ బట్టంబు గట్టుట మేలుకాదె.

భాస్కర అయోధ్య 15

ఇంతటి కడు ప్రియమగు వృ
త్తాంతము నెఱిఁగించు నీకుఁ దగురీతిగ నే
నింతకు నేమి యొనర్తు నా
చింతన మొనరించి నాకుఁ జెప్పుము కుబ్జా.

రామునకును భరతునకును
నేమాత్రము భేద మే నెఱుఁగ నేనటు గానన్
భూమీశుడు పట్టంబును
రామునకుం గట్ట మనసు రంజిలకున్నే.

వావిలికొలను అయోధ్య 175

శ్రీరామ పట్టాభిషేకోత్సవంబు, చేరి నాకెఱిగించి చెవులకు విందు
చేసితి వేమందుఁ జెలువ నీ పొందు: వాసిగా ఫలియించె పక్రోక్తులును
భరతునికంటె నాభరతాగ్రజుండు: తిరమైన భక్తి విధేయుండు నాకు.

రంగనాథ అయోధ్య 83 పుట

చెలియా పరమ ప్రియ మగు
నల జనక సుతాధినాథు నభిషేకము నొం
పలరం జెప్పితి దీనికిఁ
గల ప్రత్యుపకార మేమి గావింతు నికన్.

గోపీనాథ అయోధ్య 9-4

ఆ రాముఁడు భరతుఁడు నా
కారయ నొక్కరూప యటుగావున నా
భూరమణుఁ డతని రాజ్య
శ్రీరమణునిఁ జేయు టరయ బ్రియమగుఁగాదే.

గోపీనాథ అయోధ్య 185

భరతుఁడు రాముఁ డంచను విభాగము నామది లేదొకప్పు న
ప్పురమ గుణాఢ్యు మేలెఱుకపాటొనరించితి గాన నింక నొం
డరయను గోరు మిష్టకరమాదృతిమై నిడుదాన దీనిలో
సరియగు సంతసంబు తఱి చానరో! కానఁగరాదు చూడఁగన్.

రామకథా అయోధ్య 2-51

ప్రియమైన మాట చెప్పితి
రయమున నీ నగను గొమ్ము రావే యనినన్
భయ కోప వివశ మంధర
యయోయయోయనుచు నేడ్వ నారంభించెన్.

విశ్వనాథ రామాయణకల్పవృక్షము అయోధ్య అభిషేక 18 పుట

ఇంతకంటెను ప్రియమైన దేది నాకు
నంత శుభవార్తఁ దెచ్చిన యట్టి నీకు
నేమి యొసఁగినఁగాని యోసీ మిగులను
నల్పమే యగుఁ బరికింప నల్పతమము.

బులుసు వెంకటేశ్వరులు అయోధ్య 30

ఇంతకు మించి నాకుఁ గడుదృప్తిని గూర్చెడిదేమి మంధరా!
ఎంతటి మంచిమాట వినిపించితి విప్పుడు నన్ను నీవలెన్
సంతసపెట్టువా రెవరు చక్కని వార్తను తెచ్చినందుకున్
ఎంతటి కాన్కలైన సరియే మఱి కోరు మికేమి యిత్తునో.

చర్ల గణపతిశాస్త్రి అయోధ్య 170

కింత్వామన్యత పై దేహః పితామే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుష విగ్రహం.

అయోధ్య 30-3

మజ్జనకుండగు జనకుండు బలపరాక్రమ సత్యసుగుణంబులు గల
మహానుభావుండ వని నన్నిచ్చెం గాని నీవు పురుషాకృతిం
గైకొనిన యింతి వగుట యెఱుంగఁడు.

భాస్కర అయోధ్య 167

నాదు జనకుండు మిథిలాధినాథుఁ డిప్పు
డిది వినంగ వైదేహుడే యెంచు నిన్ను
రామ! జామాత పురుష విగ్రహముఁ గొన్న
స్త్రీయటంచును దలఁపడే చిత్తమునను.

వావిలికొలను అయోధ్య 134

రామ! మా తండ్రి జనకుండు రమణతోడ
రూపమాత్రంబు చేతఁ బురుషుండ వైన
నిన్ను స్త్రీనిగా నెఱుంగక నన్నొసంగె
నెఱిగి యుండినం గని గని యేల యిచ్చు.

గోపీనాథ అయోధ్య 655

తలఁపడా యేమి రామ! నా తండ్రి జనకుఁ
డా యశోనిధి మిథిలాధినాయకుండు
స్త్రీపురుష విగ్రహంబయి సిరికిఁ గూర్చె
ననుట జామాత తన కెటో యబ్బె ననుచు.

రామకథా అయోధ్య 3-431

అసదృశ విదేహుఁడౌ మిథిలాధిపుండు
నన్ను గొనిపోవ జంకిన నిన్నుఁ గూర్చి
యేమి తలపోయునో రామ! యెఱుఁగవాక్కొ
పురుష విగ్రహుఁ డయ్యు స్త్రీమూర్తి యనఁడె.

బులుసు అయోధ్య 10-2

మగవేషము వేసిన
మగుపగఁ బిత తెలిసికొనక మగువను నన్నున్
మగటిమియె లేని నీ కిడి
యెగిరెను చల్లుండ వనుచు నేమనుకొనెనో.

చ. గ. శాస్త్రి అయోధ్య 30

రాజా భవతుతే పుత్రో భరతశ్శాస్తు మేదినీం
వయంతత్ర గమిష్యామో యత్రరామో గమిష్యతి.

అయోధ్య 15-10

నీ కొడుకే ధరిత్రిగాననీ ప్రభుతం గననీ ధ్రువంబుగా
లోకుల మెల్ల రాముఁ డెటు లోలమతిం జరియించునందము
ద్భికులమై చరించెద మిసీ నెఱిమాలిన నీదు వీటిలో
నేకరణిన్ వసింతురు సుధీంద్రులు సజ్జను లార్య సన్నుతుల్.

వావిలికొలను అయోధ్య 986

సరె నీపుత్రుఁడు భరతుఁడు
నరపతి యగుఁగాక మేము నగర నివాసుల్
అరిగెదము రాముతోనే
భరతుఁడు నీవేలుకొనుఁడు పాడగు పుడమిన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

నీరాజ్యములో బ్రాహ్మణు
లేరును వాసంబుచేయ నెంచరు సుమ్మీ
ఈ రీతిగ నీవు దురా
చారపుఁ గర్మలనె యెపుడు నలిపెదుగానన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

నహి తద్భవితా రాష్ట్రం యత్ర రామో న భూపతిః
తద్వనం భవితా రాష్ట్రం యత్ర రామో నివత్స్యతి.

అయోధ్య 37-29

రాముఁడు పాలింపనిచోఁ
గామిని రాష్ట్రం బదెప్డుగానేరదు శ్రీ
రాముఁడు లిచిన వనమె
శ్రీమానిత రాష్ట్ర మగును సిద్ధము సుమ్మీ.

వావిలికొలను అయోధ్య 1041

ఇక జనులెల్ల బోవఁదరులే తుదకుండిన శూన్యమౌ ధరన్
యొకతెవె రాజ్యమేలుచును నుండుము రాముఁడు రాజుగాని యీ
సకల ధరిత్రి కానయగు సాధువు రాముఁడె యున్న కానయే
సకల జనాఢ్యయై తనరు చక్కనిరాజ్యమయౌను పాతకీ.

చ. గ. శాస్త్రి అయోధ్య

రామం దశరథం విద్ధి మాంవిద్ధి జనకాత్మజాం
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత యథా సుఖం. అయోధ్య 40-9

మనమున రాముని దశరథ
జననాయకుఁగాఁ దలంపు జనక తనూజన్
ననుగాఁ దలఁపుము కానన
ము నయోధ్యఁగఁ దలఁపు మేగు ముదమునఁ దండ్రీ.

భాస్కర అయోధ్య 224

రాముఁడ యెఱుంగుమీ దశరథుఁడు నింద
నను దలంపుమా జనకుని తనయఁ బుత్త్రి!
యటవి యయోధ్యయంచు నాత్మఁ జూడు
పోయి రమ్ము యథా సుఖముగను దండ్రి.

వావిలికొలను అయోధ్య 1094

రాముని దశరథ రాజుగాఁ జూడు
భూమిజ నన్నుఁగా బుద్ధిఁ జింతింపు
మడవి నయోధ్యగా నాత్మలోఁ దలపు
కడు భక్తి యుక్తి రాఘవుఁ బోల్చి యుండు.

రంగనాథ అయోధ్య 99

తనను శేఖర రాముని దశరథునిగ
గహ్వరీ పుత్రికను నన్నుఁగాఁగ దండ
కాటవి నయోధ్యగా హృదయమున నెరిగి
భూరి సుఖలీల నడవికిఁ బోయి రమ్ము.

గోపీనాథ అయోధ్య 854

అన్నా లక్ష్మణ! కాననాంతరములం దశ్రాంతముం దైవమ
ట్లన్నన్‌జేరి చతుర్దశాబ్దములు నిద్రాహారముల్ మాని తం
డ్రిన్నాఁగొల్వుము, జానకిని జననిగా గూడ భక్తి భావింపుమీ.
కొన్నాళ్ళున్ వనమే యయోధ్య యనుచుఁ గోర్కెన్ బ్రవర్తింపుమీ.

శ్రీకృష్ణరా. అయోధ్య 1-111

అప్ప! దశరథుఁగా రాము నెన్నఁగనుము
మలసి నన్నట్లె భావింపుమా జనకజ
నటవి నెప్డు నయోధ్యగా నరసికొనుచు
ననుచుము యథా సుఖస్థితి మనుము చనుము.

రామకథా అయోధ్య 4-195

దశరథునిగాఁగఁ జూడుమీ దాశరథి
జనకజాతను నన్నుఁగాఁ గనుము వత్స!
అడవిని నయోధ్యగాఁ గను నరయు మన్న,
పోయి రమ్ము సుఖముగాఁ బోయి రమ్ము.

బులుసు అయోధ్య 40-9

కను, రాముని దశరథుఁగా
కనుమీ మాతగను సీతఁ గర్తవ్యముతో
కనుమి యయోధ్యగ వనమును
కనుగొనుచు యథాసుఖముగఁ గడు వడి రమ్మా.

మాతగను=తల్లిగను, దశరథుని=పది యింద్రియరథముల కధిపతి విష్ణువునుగాను కూడ
మా=లక్ష్మిగా, తగను తగునట్లు.

చ. గ. శాస్త్రి అయోధ్య

తిష్ఠేతి రాజా చుక్రోశ యాహియాహీతి రాఘవః
సుమంత్రస్య బభూవాత్మా చక్రయోరివ చాంతరా;

అయోధ్య 40-48

కూడంజాల రథంబు నిల్పుమని యాక్రోశించుచుంగూడ రాఁ
జూడం దండ్రి యవస్థఁజూచి మరిలో శోకం బధైర్యంబుతోఁ
గూడందోడసె తెంపు గూడుటయు నక్కుంఠిన్నధీశాగ్రణీ
చూడారత్నము తేరు వేనడుపుమంచుం జెప్ప నయ్యాజ్ఞకున్.

భాస్కర అయోధ్య 240

నిలు నిలు మటంచు నఱవంగ నృపతి పిఱుఁద
బద పద మటంచు రాముండు పలుకుచుండ
బండి కలుదోయి జిక్కినవాని భంగి
మిడికెను సుమంత్రు మనమంత మడుకు గదురు.

వావిలికొలను అయోధ్య 112

ఓసుమంత్రుఁడ రథ మునుపవే యనుచు
నాసుమంత్రుఁడు వినునట్లు చీరుచును
వెనుకొని పురి దాటి వెసవెస నేగుదేర
మనుజేశుఁ జూచి సుమంత్రుతో ననియె

నిదె వచ్చుచున్నాఁ డినకులేశ్వరుఁడు
పొద పొద పోనిమ్ము రథము
అని యని రఘురాముఁ డందంద తఱుమ
మొనసి యాతఁడు రయంబునఁ దేఱుఁ బఱపె.

రంగనాథఅయోధ్య 101 పుట

నిలు నిలు మని పలుకు దశరథుని వాక్యంబును రథంబు రయంబునఁ దోలు మనియెడి రాముని వాక్యంబును విని సుమంత్రుఁడు ఎద్దియుఁ జేయ నేరక చక్రమధ్యంబునఁ జిక్కియున్న చందంబున.

గోపీనాథ అయోధ్య 867

ఆగు త్రోలకుమని రాజు నఱచుచుండె
నడపు నడపని రాముండొ నుడువుచుండె
వారి నుడుల మధ్య సుమంత్రు స్వాంత మపుడు
నడచు మునుపెన్క చక్రాల నడుమఁ బడెను.

చ. గ. శాస్త్రిఅయోధ్య

యావత్తు నిర్యతస్తస్య రజోరూప మదృశ్యత
నై వేక్ష్వాకువర స్తావత్ సంజహారాత్మ చక్షుషి
యావద్రాజా ప్రియంపుత్రం పశ్యత్యత్యంత ధార్మికమ్
తావద్వ్యవర్ధతేవాస్య ధరణ్యాం పుత్ర దర్శనే.

అయోధ్య 42-1, 2

రామ రథోత్థితం బగు పరాగము దోఁచెడు నంతదాక నా
భూమివిభుండు పుత్రకుని పోయిన వంకను జెప్ప వాల్పఁ డా
భూమి పరాగమున్ సుతుని పోవుట భూపతి చూచునట్లు న
స్తోమముగాఁగ రేగెఁ బతి స్రుక్కక యుండెడిఁగాక యంచునో

వావిలికొలను అయోధ్య 1140

అథవుడు దశరథుఁ డటు పోక నిలిచి
తన సూను రథమును దప్పక చూచి
యదియుఁ గానక ధూళి నటు చూచి చూచి
యదియుఁ గానక బయు నటు చూచి.

రంగనాథ అయోధ్య 101 పుట

రాము రథమేగినట్టి మార్గంబునందు
బయలు వెడలిన ధూళి కన్పడు వఱకు
నవనిపతి చూచుచుండె నేత్రాగ్రదృష్టి
సకల లోకాభిరాము యశఃప్రధాను.

బులుసు. అయోధ్య 42-1

రాము రథంపు ధూళి కనులంబడి కన్పడు నంతదాక న
ట్లే మొగమెత్తి చూచు మరలింపఁడు కన్నుల, ధార్మికున్ సుతున్
వేమఱు చూచునందనుక వేగమె వెంటనె మేనుసాచు నెం
తో మెయి సాగిపోయె మది నుబ్బిన పుత్రుని బెంగతోడుతన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

అదె రఘువీరుఁ డున్నరథ మల్లదె పోయెడి రాము తేజు పొ
మ్మదె యదె పోయె నయ్యరద మక్కడఁదోచెఁ దదీయ ధూరజం
బదియు నడంగెఁ బొమ్మకట హా గుణరత్నమ హాకుమార హా
సదమల కీర్తిహార నృపసత్తమ హా నన్నుఁగూడనీఁగదే.

భాస్కర అయోధ్య 244

అదిగో రాము రథంబు చక్రము లవే యౌనౌను జెండాయు న
ల్లదె యాపైపుగనున్న ధూళి యదియే యా చెట్లపైపే రథం
బదిగో పోవుచునుండె నాకస మదే యాపైపె యంచున్ గడున్
మదిఁ దృప్తింబడి రాజు నద్దియు గనన్ రామిన్ నిరాశన్ గనెన్.

చ. గ. శాస్త్రి అయోధ్య

# గాయత్రీ బీజాక్షరయుత
# రామాయణసుధ

"ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్

అన్నది గాయత్రీ మంత్రము

ఓం
తప స్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరం।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవం॥

బాల 11

ఓం
తపమున స్వాధ్యాయంబున
నెపుడు మునింగి వాక్కు తత్త్వ మెఱిగిన చతురున్
తపసి విశారదు నారదు
నపుడా వాల్మీకి మౌని యడిగెను నిటులన్

సహత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీ పురా

బాల 30 25

త్సరు సహిత ఖడ్గము శరాలు తనరు రాము
డపుడె యజ్ఞము పాడుచేయంగ వచ్చి
నట్టి రాక్షసుల వధియింప నమరవిభుని
యటు జయించు రాముని మెచ్చిరంత ఋషులు

త్సరు : కత్తిపిడి

విశ్వామిత్ర స్సధర్మాత్మా శ్రుత్వా జనక భాషితం
వత్స రామ ధనుఃపశ్య ఇతి రాఘవ మబ్రవీత్

బాల 67;12

విజ్ఞుఁడు జనకుఁ డిటు లన వినియు ధర్మ
మూర్తి యయిన విశ్వామిత్ర మునివరుండు
నాయనా! వత్స! యో రామ! యీ యపూర్వ
ధనువుఁ జూడు మటంచును ఁనియెఁ బ్రీతి

తుష్టావాస్య తదావంశం ప్రవిశ్య సవిశాంపతేః
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్టత

అయోధ్య 15:30

తురగములు లాగ రథముపై నరపతి గృహ
(తుర్) మటు ప్రవేశించియు సుమంత్రుఁ దధిప కులము
మొదటి నుండి స్తుతించి యా భూపు శయ్య
దరికి దరయుగ వేగ నరిగి పొగడె

వనవాసంహి సంఖ్యాయ వాసాం స్యాభరణా నిచ
భర్తార మను గచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ

అయోధ్య 40:17

వనవాస వత్సరంబులు
గణియించియె క్షౌమములును ఘన భూషణముల్
తన భర్త ననుసరించెడు
జనకజకు నరపతి మామ సరగున నిచ్చెన్

రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులం
రాజా మాతా పితాచైవ రాజా హితాకరో నృణాం

అయోధ్య 17:31

రేడే – (రాజే) సత్యము ధర్మము
రేడే – (రాజే) కులవంతులకును ఋతయుత (ప్రథితము) కులమున్
రేచే – (రాజే) తల్లియు దండ్రియు
[illegible] – (రాజే) హితకరుడు సర్వపృథివిన్ ప్రజకున్ (ప్రజకున్, ధరకున్),

నిరీక్ష్య సముహూర్తంతు దదర్శ భరతో గురుం
ఉటజే రామమాసీనం జటావల్కల ధారిణం

అయోధ్య

వట్టి దర్భచాపపయిని నేలపయినె
సీత లక్ష్మణుండు చేరి యుండ
నా మహామహితుని రాము నగణ్య పు
ణ్య గరి మాత్ము భరతుఁ డరసె.

యది బుద్ధిః కృతాద్రష్టు మగస్త్యం తం మహామునిం
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః

అరణ్య 11-44

మలలం దొప్పగు వృక్ష రమ్య వనసీమన్ సీత హర్షించి క్రీ
(మ్)డల దేలంగల, దీవులక్ష్మణుఁడు గూడన్ హర్షముం గాంత్రు, పు
ష్కల వృక్షంబుల నాకసం బలరు నా కాలమందే కనన్
దలఁతేన్ వెళ్లుమి యా యగస్త్యముని పూత స్వచ్ఛ రమ్యోర్వికిన్

అరణ్య 11

భరత స్యార్య పుత్రస్య శ్వశ్రూణాంచ మమ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి

అరణ్య 42-17

భరతునికిని మీకు నందమై మా యత్త
(భర్) లకు నాకు నిది కేళులకు నెసంగు
జీవింపకయు అది చేఁజిక్కునా దాని
చర్మంబె రుచిరమై సౌరు మీరు

గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలం
వయస్యం తం కురుక్షిప్రం, మితోగత్వాద్య రాఘవ

అరణ్య

గోచరగతి కాలము దాటఁ గూడు నెటులు
సలుపు సుగ్రీవుతో మైత్రి జ్వలను నెదుట
వానితో నగ్నిసాక్షికమైన మైత్రి .
సలుప ద్రోహంబు చేయుట వలనుపడదు

దేశ కాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియా ప్రియే
సుఖదుఃఖసహఃకాలే సుగ్రీవ వశగో భవ

కిష్కింధ 22-20

దేశకాలాలు పొందఁ ద్రత్ప్రియము నప్రి
యమును సైచుచు సుఖము దుఃఖమును గూడ
సైచి సుగ్రీవునియెడ నాశ్రయము పొంది
దేశ కాలానుసారము వాసి గనుము

వంద్యాస్తేతు తపస్సిద్ధా స్తపసావీత కల్మషాః
ప్రష్టవ్యాచాపి సీతాయాః ప్రవృత్తి ర్వినయాన్వితైః

కిష్కింధ

వంద్యులు సుమి వారలు, వారు వ్రతము తపము
చేసి పాపముల్ క్షాళన చేసికొన్న
వారు, వారిని జానకి వార్తలడిగి
వినయ మొప్పారఁగాఁ దెల్సికొనుము వేగ

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీం
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః

సుందర 4-1

సతమారీతిగఁ గామరూప యయి రక్షాదక్షయౌ లంకిణిన్
అతి తేజుండయి వాయుజుండు భువి వీర్యంబొప్ప నోడించి స
న్మతితో ద్వారముగుండఁ గాక విలస త్ప్రాకారముం దాటి శ
స్యతముండై రిపు నెత్తిపై నెడమ కాల్ చల్లంగ నుంచెన్ వడిన్

ధన్యా దేవా సగంధర్వాః సిద్ధాః పరమర్షయః
మమ పశ్యంతియే నాథం రామం రాజీవలోచనం సుందర 26-41

ధీయుతుఁ బ్రియుఁగను దివ్యసిద్ధఋషి గం
ధర్వులు దేవతల్ ధన్యతములు
పోని పద్మాక్షుఁడు పుణ్యాత్ముఁడు పరాత్ముఁ
డగు రామునికిన్ నాదు ప్రాప్తియేల

మంగళాభిముఖీ తస్య, సాతదాసీ న్మహాకపేః
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనం సుందర 53-27

మంగళము మారుతికిని గూర్పంగఁ గోరి
నియమమును పూని సీత యగ్నిని భజించె
అగ్నిదేవ ! హనుమకు శైత్యంబు గూర్పు
మనుచు సీత ప్రార్థనచేయ నగ్ని వినియె

హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీత కాలాయతి సంప్రతిక్షమం
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసంగ వాను త్తర మేతదబ్రవీత్

హిత నిర్ధారణచేసి యుక్తముగ గావింపంగ నౌనంచుఁ బల్
స్తుతమౌ రీతిగ యుక్తియుక్తముగ నెంతో గొప్ప యర్థంబు నీ
మతి కెంతో తగియున్న దిప్పటికి సొంపై ముందుగా నీ మటె
ట్టితటింగాని క్షమంబయైన గతినిట్లే మంత్రులందట్టులన్

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః
లంకైశ్వర్యం ధ్రువంశ్రీమా, నయంప్రాప్తో హ్యకంటకం
యుద్ధ 41-67

విను ధర్మాత్ముఁడు గుణకం
ధినుతుండు విభీషణుఁడు గనెను నాశరణున్
కని శ్రీమంతుఁడు ముఖ్యుం
డని లంకైశ్వర్యము ధ్రువమందెను జుమ్మీ

యోవజ్రపాతా శనిపాతాన్న చుక్షుభే నచాపిచచాలరాజా
సరామ బాణాభిహతో భృశార్త శ్చచాలచాపంచముమోచ వీరః

యుద్ధ 59-139

యోధముఖ్యుఁ డేరావణుఁ డుగ్రవజ్ర
పాతమున, నశనిహతిని స్వల్పమైన
క్షోభపడఁడొ చలింపఁడొ యాబలుండు
రామశర విద్ధుఁడగుచు విల్వదలె వణఁకె

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనంగతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయం

యుద్ధ 72-10

యోద్ధయగు రాముఁడెంత మహాబలుండొ
అతని యస్త్రాలు నెంత మహత్తుగలవొ
ఎవని విక్రమమున దైత్యు లెల్లఁజచ్చి
రాయభయు రాముఁదలఁతు నారాయణునిగ

నతే దదృశిరే రామం దహంత మరి వాహినీం
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా

యుద్ధ 94-28

సమ్మోహనాస్త్రన సమ్మూఢులైరి రిపును
నఃఖరు శూరుని రాముని గ్గనరు పోర
వేల రాముల నరసి మరల నొక్క
రాముని గాంతురు రాక్షసాళి

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాంజలిపుటాచేద మువాచాగ్ని సమీపతః

యుద్ధ 119-23

ప్రథిత దేవ విప్రుల సీత ప్రణుతి చేసి
అగ్ని దరిఁ గేలు జోడించి యనియె నిటులు
నా మనసు రాముని విడి పరుం దలఁపదేని
లోకసాక్షియౌ నగ్ని నన్ బ్రోచుఁగాక

చలనా త్పర్వత స్యైవ గణా దేవస్య కంపితాః
చచాల పార్వతీచాపి తదాఽఽశ్లిష్టా మహేశ్వరం

ఉత్తర

చోటుఁ గని రావణుండు నాక్షోణిధరము
నిటులు నటులును వేగఁ గంపింపఁజేయ
దేవగణముల్ వడంకిరి దేవదేవుఁ
గౌగిలించుగొనియు మనుయుఁ గూడ వడఁకె

దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాద భోజనం
సర్వమేఽ వావిభక్తం నౌ భవిష్యతి హరీశ్వర

ఉః త్తర44-4

దయిత లాత్మజుల్ సర్వప త్తనము రాష్ట్ర
మఖిల భోగ మాచ్ఛాదనాహారములును
ఓయి కపిరాజ! నీకును నుర్వి నాకు
నెల్లను నవిభాజ్యములుగ నెసఁగుఁ గాక

యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలా ముపావిశత్
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారక ద్వయం

ఉత్తర

ప్రీతిని శత్రుఘ్నుండు ద
యాతత హృదుఁ డేనిశితటి నా పర్ణకుటిన్
(యా) ఏతెంచెనొ యా రాత్రియె
సీత యిరువురు కొమరులను చెచ్చెరఁ గనియెన్

ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజ సంయుతమ్
త్రిఃసంధ్యం యఃపఠేన్నిత్యం, సర్వ పాపైః ప్రముచ్యతే

ఈయది రామాయణ మిటు
గాయత్రీ బీజ వర్ణ కలితము, సతమున్
ఏయెడఁ ద్రిసంధ్యలను శ్ర
ద్ధాయుతుఁడై చదువఁ బాప తమము నశించున్.

———

## -: రాముని వనవాస కాలము :-

### (గోవిందరాజీయము ననుసరించి)

1వ రోజున చైత్ర శుద్ధ దశమినాడు వనవాస ప్రయాణము- రాత్రి తమసాతీర వాసము.

2వ రోజున జాహ్నవీతీర వాసము- గుహుని రాక.

3వ రోజున గంగా దక్షిణతీర తరువుక్రింద నుండుట.

4వ రోజున ప్రయాగలో నుండుట- భరద్వాజ దర్శనము.

5వ రోజున యమునాతీర వాసము- చిత్రకూట ప్రవేశము.

6వ రోజున సుమంత్రుడు అయోధ్యకువచ్చుట-రాత్రి దశరథ మృత్యువు.

7వ రోజున కౌసల్యాదుల విలాపము- భరతునికై దూతలఁ బంపుట.

8వ రోజునుండి 12వ రోజువఱకు భరతుని అయోధ్య ప్రయాణము.

13వ రోజువరకు పారలౌకికకర్మ.

17 నాలుగు దినములు వనమార్గము బాగుచేయుట.

20వ రోజువరకు భరతుని వనప్రయాణము.

23వ రోజునుండి రామునిదగ్గఱ భరతుడు మూడురోజులుండుట.

27వ రోజునతిరిగి అయోధ్యకుపాదుకలతో వచ్చుట.ఇంకను మధ్యమధ్య రోజులు లెక్కింపగా మరల పాదుకలకు పట్టాభిషేకమువరకు 46 రోజులయ్యెను.

శ్రీరాముడు చిత్రకూటమున పదిన్నరమాసములుండెను. మొదటి సంవత్సరము ఇట్లు గడచెను. పిదప చిత్రకూటమును విడచి దండకారణ్యమును ప్రవేశించి ఋషుల ఆశ్రమములను చూచుచు గడపినవి పదిసంవత్సరములు, పిదప పంచవటిలో ఒకటిన్నర సంవత్సరములు గడపెను. ఈ విధముగ ఒకటి, పది, ఒకటిన్నర కలిసి పన్నెండున్నర సంవత్సరములు.

పన్నెండున్నర సంవత్సరము లయ్యెను. తరువాత పదుమూడవ యేడు కొంచెము మిగిలియున్న దనఁగా మాఘశుక్ల అష్టమినాఁడు "విందము" అను

పేరుగల ముహూర్తమున రావణుండు సీతను దొంగిలించుకొని పోయెను. 1౯ సంవత్సరముల 4 నెలలు.

జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాఁడు వాలి వధ జరిగెను.

కార్తీకశుక్ల పాడ్యమి వరకు సుగ్రీవుని పట్టాభిషేకాది కార్యములు.

నాలుగు మాసములు వర్షాకాలము గాన సీతాన్వేషణ జరగలేదు.

కార్తీకము చివర-సుగ్రీవునిపై లక్ష్మణు డాగ్రహించుట.

కార్తీకము చివరనుండి మార్గశీర్షము చివరవరకు సీతాన్వేషణము.

హనుమంతుడు మార్గశిర శుక్ల ఏకాదశిని లంకాప్రవేశము.

ఆ యర్థరాత్రి తుదకు సీతాదర్శనము.

ద్వాదశినాడు శింశుపా వృక్షము నుండి రావణ దర్శనము. సీతా సంభాషణము.

త్రయోదశినాడు అక్షాది వధ.

చతుర్దశినాడు బ్రహ్మాస్త్రముచే కట్టబడుట. లంకా దహనము.

మరల మహేంద్రాద్రి యందున్న వానరులతోఁ గలయికకు 5 రోజులు.

మార్గశిర కృష్ణ షష్టినాడు మధువన భంజనము.

అష్టమినాడు ఉత్తరఫలుని విజయాఖ్య ముహూర్తమున రామాదుల సేనాప్రస్థానము.

ఏడు రోజులలో పుష్య శుక్లపాడ్యమి వరకు సముద్రతీరమున స్కంధావారము.

పుష్య క్ల చవితికి విభీషణుని రాక,

పంచమికి సముద్రము దాటుటకై ఆలోచన.

పిదప నాలుగు దినములు సముద్రుని రాముడు ప్రార్థించుట,ప్రాయోపవేశము.

దశమికి సేతువు బంధించుటకు మొదలుపెట్టుట.

త్రయోదశిని సేతు బంధము పూర్తి

చతుర్దశికి రాముడు సువేలగిరి నెక్కుట

పుష్యపౌర్ణమి నుండి బహుళ విదియవరకుసైన్యము సముద్రముదాటుట.

తదియ నుండి దశమి వరకు సేనా నివేశనము.

ఏకాదశిని రావణుడు పంపగా శుకసారణులు వచ్చి రాము సేన చూచుట

ద్వాదశికి వానరసేనా గణనము.

త్రయోదశి నుండి అమావాస్య వఱకు రాక్షస సేనా గణనము

మాఘ శుద్ధ పాడ్యమిని అంగద రాయబారము

సీతకు రాముని మాయ శిరస్సు చూపుట

విదియ నుండి అష్టమి వరకు వానర రాక్షస యుద్ధము

మాఘ శుద్ధ నవమి రాత్రి ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగాస్త్రముచే బంధించుట.

దశమిని గరుత్మంతుడు వచ్చుట, నాగపాశ విమోచనము

ఏకాదశి, ద్వాదశులలో ధూమ్రాక్ష వధ

త్రయోదశి అకంపన వధ

చతుర్దశి నుండి మాఘ బహుళ పాడ్యమి వరకు యుద్ధము. నీలుడు ప్రహస్తుని జంపుట

చతుర్దశి నుండి పాడ్యమి వరకు రామ రావణుల యుద్ధము, రావణ మకుట భంగము.

పంచమి నుండి చతుర్దశి వరకు కుంభకర్ణునితో యుద్ధము, వధ

మాఘ బహుళ అమావాస్య యుద్ధ విరామము

ఫాల్గుణ శుక్ల పాడ్యమి నుండి చవితి వరకు నరాంతక వధ

పంచమి నుండి సప్తమి వరకు అతికాయ వధ

అష్టమి నుండి ద్వాదశి వరకు నికుంభ కుంభ యుద్ధము వధ

పిదప మూడురోజులకు మకరాక్ష వధ

ఫాల్గుణ శుద్ధ విదియ ఇంద్రజిత్తు యుద్ధము

తదియ నుండి సప్తమి వరకు ఓషధుల దెచ్చుటకు సంరంభము-యుద్ధ విరామము.

త్రయోదశి వరకు ఇంద్రజిత్తుతో లక్ష్మణుని యుద్ధము ఇంద్రజిత్తు వధ.

చతుర్దశి-యుద్ధ విరామము

ఫాల్గుణ అమావాస్య - రావణుని యుద్ధయాత్ర.

చైత్రశుద్ధ పాడ్యమి నుండి రామరావణ యుద్ధము

షష్ఠి, అష్టమి మహాపార్శ్వాది వధ

నవమి-లక్ష్మణుని మూర్ఛ, రావణ పలాయనము, ద్రోణపర్వతమును తెచ్చుట

దశమి - యుద్ధ విరామము

ఏకాదశి- ఇంద్రుడు రామునికి రథము పంపుట

ద్వాదశి నుండి బహుళ చతుర్దశి వరకు 18 రోజులు రామ రావణ యుద్ధము

చతుర్దశి- రావణ వధ

(మొత్తము 18 రోజులు యుద్ధ విరామము

మొత్తము 72 రోజులు యుద్ధము

అమావాస్య- రావణునికి సంస్కారము

వైశాఖ శుద్ధ పాడ్యమి- విభీషణుని పట్టాభిషేకము

తదియ- సీత అగ్నిప్రవేశము

చవితి- పుష్పక మెక్కి భరద్వాజాశ్రమమునకు వచ్చుట

షష్ఠి- నందిగ్రామములో భరతునితో కలియుట

వైశాఖ శుద్ధ నవమి శ్రీరామ పట్టాభిషేకము

శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి హిందూదేశ చరిత్రననుసరించి

-: అయోధ్యనుండి లంకకు రాముని ప్రయాణము :-

1. అయోధ్య నుండి ప్రయాగ - భరద్వాజాశ్రమము

2. భరద్వాజాశ్రమములో ఒకరాత్రి రాముడుండెను

3. భరద్వాజాశ్రమము నుండి చిత్రకూటము పది క్రోశముల దూరము. క్రోశము అనగా పదిన్నర మైళ్ళు

4. చిత్రకూటము దగ్గఱ మందాకిని నది యున్నది, అది నేడును గలదు. అక్కడ నుండి ఆగ్నేయముగా వెళ్లెను.

5. అత్రి యాశ్రమము. ప్రస్తుత రీవా ప్రాంతము నుండి దక్షిణసీమ వరకు ఇక్కడ అనసూయతో సీత మాటాడెను.

6. అత్రి యాశ్రమము నుండి దండకారణ్యము, దీని కుత్తరమున గంగ దక్షిణమున వింధ్య, పడమట, ఉత్తరవింధ్య అగస్త్యాశ్రమము, దక్షిణవింధ్య దక్షిణ కోసలము, విదర్భ, దక్షిణాపధిలో మలయాద్రి, దక్షిణమున ద్రవిడ, పాండ్యములు గలవు. తూర్పున ఉత్తర కళింగములు, ఆంధ్ర చోళములు గలవు (సిరగుజా ప్రాంతము)

7. కొంత దూరములో విరాధుడు కన్పడెను బిలాస్‌పూర్ కుఈశాన్యముగా నున్నది 15 మైళ్ళు,

8. ఇట శరభంగాశ్రమము కలదు ఇచ్చట శరభంగుడగ్నిలోఁ జొచ్చెను ఇచ్చటనే చంపబడిన మునుల యెముకల గుట్టలున్నవి ఇచ్చటనే రాక్షసులఁ జంపెదనని రాముడు ప్రతిజ్ఞ చేసెను

9. సుతీక్ష్ణాశ్రమములో రాత్రి యుండెను, ఇక్కడే కొండలు, నదులు అరణ్యములున్నవి, కొంతదూరములో పంచాప్సర స్సరస్సు గలదు, ధర్మ

భృతుడు దీనిని గూర్చిన కథలు చెప్పెను, ఇచట మాందకర్ణి తపస్సు చేసెను, విలాసపూర్, రాయపూర్, ల్లాలకు మధ్యగా నున్నది, ఇచటనే రామగిర్యాశ్రమము గలదు

10. పైయాశ్రమము నుండి దక్షిణముగా నాలుగు యోజనములలో (120) మైళ్ళలో అగస్త్యాశ్రమము గలదు యోజనమనగా 30 మైళ్ళు ఇది రాయపూరునకు దక్షిణముగా బస్తర సంస్థానమునకు ఉత్తరమున గలదు

11. అగస్త్యభ్రాతయాశ్రమమునకు అగస్త్యునియాశ్రమముయోజనము

12. అగస్త్యుని యాశ్రమమునకు రెండుయోజనములలోపంచవటి గలదు

13. గోదావరి యిక్కడనే గలదు. ఇక్కడనే పర్ణశాల నిర్మించుకొనిరి. భద్రాచల ప్రదేశము పర్ణశాలా ప్రదేశము. మహారాష్ట్రములో నాసిక పర్ణశాల ప్రాంతము గాదు

14. పంచవటికే శూర్పణఖ వచ్చినది. ఇక్కడనే ఖరాదులు చంపఁబడిరి. ఈ ప్రాంతమే జనస్థానము. వాల్మీకి వర్ణించిన శంబరపురము సంబలపూరు

15. సీతను రావణు డెత్తికొనిపోయిన తర్వాత రెండామడలలో నున్న భద్రాచలము దగ్గర గోదావరి దాటిరి ఇక్కనే జటాయు వుండెను అక్కడ నుండి పడమరగా నైరుతి దిశగా కొంతదూరముపెళ్లిన మరల జనస్థానము పిదప మూడు క్రోశములలో నున్నది

16. క్రౌంచారణ్యము నైజాము రాజ్యమునకు నైరుతిగా నున్నది ఇట నుండి మూడు క్రోసులు వెళ్ళగా కబంధుడు కనిపించి చెప్పగా పడమరగా పంపా సరస్సు చేరిరి పంప బళ్ళారి జిల్లాలో గలదు

17. హంపి- ఋశ్యమూకము, మాల్యవంతము కిష్కింధ ఇవి యన్ని యును హంపీ విరూపాక్షాలయము దగ్గరనున్నవి ఆనెగొంది దగ్గరఁ గొన్ని గొండలు గలవు

18. ఆ కిష్కింధ నుండి పర్వతాలు దాటిన రామేశ్వరము గలదు అక్కడే వంతెన గట్టిరి అక్కడ సముద్రముదాటి లంకకు వెళ్లిరి.

# -: అయోధ్యనుండి లంకకు మార్గము :-

ఉత్తరము.




దక్షిణము.

## —: విషయసూచిక :—

## అయోధ్యాకాండ

## -: దైవ గురు ప్రార్థన :-

నిత్య మనంత మనాద్యము
శ్రుత్యంత జ్ఞేయ మఖిల లోకాశ్రయమున్
సత్యస్వరూప మవ్యయ,
మత్యంతానందతత్త్వ మనయముఁ గొలుతున్.

తొలి నారాయణుఁ డాత్మ రూపమున నెందున్ క్షీరమట్లొప్పి లీ
లలకై ఆపయి పాలమీఁగడయటుల్ వ్యక్తాకృతిన్ బొంది, ని
ర్మల మాకాశము, నందుగాలి, యనలంబాపై, నటన్నీరు, అం
దిల అన్నంబయి జీవియై, వెలుఁగు ఆ యీశున్ సదా మ్రొక్కెదన్

బ్రహ్మపదంబునం దమృతవాహినియై విశదంబు నొంది ఆ
బ్రహ్మ ఋషిప్రశాంత విమలాశ్రమవాటి మెలంగి సత్కవి
బ్రహ్మల మోముఁదమ్ముల సరస్సులలో రసకేళిఁ దేలు ఆ
బ్రాహ్మి మదార్యసూక్తి ఘనపావనియై విహరించుఁ గావుతన్.

కవియై పండితుఁడై విమర్శకపదఖ్యాతాత్ముఁడై వక్తయై
వివిధగ్రంథకళావిధా కుశలుఁడై విజ్ఞానియై బోధక
ప్రవరుండై బహువాఙ్మయగ్రహణుఁడై వ్యాకర్తయై సంస్క్రియ
ప్రవరుం డౌ జనకున్ గురున్ దలతు శాస్త్రాభిజ్ఞు, నారాయణున్.

శ్రీ నారాయణశాస్త్రిని
జ్ఞానధురీణుని ననేకశాస్త్రజ్ఞుఁ గవీ
శానుని మతిమతియుఁ గొలిచి
జానుగ రామాయణసుధఁ జక్కఁగఁ గూర్తున్.

వ. అని యిష్టదైవత జనక గురులకు నమస్కరించి మరియు

తీయని కైతమావి నునుఁదిన్నని కొమ్మను గూరుచుండి క్రొం
దీయని గొంతుతోఁ జివురుతీయము లూరఁగ రామ! రామ! రా
మా! యని యక్షరామృతము లానుచు నయ్యమృతంబు లిచ్చు రా
మాయణగాత వాల్మికి మహాకవి కోయిలఁ బ్రస్తుతించెదన్.

సతతము రాముని చరితా
మృతమును వీనుల పుటముల హృదిఁ గ్రోలుచునే
మతిఁ దృప్తిని పొందని యా
మతియుతు వాల్మీకి ననఘు మతిమతి తలతున్.

వైదిక సంహితాటవుల బాటలు దీర్చి యజ్ఞశాలలన్
వేదిక లాశ్రమా లమృతవీధులు చక్కఁగ దిద్ది యందులో
పాదము లుంచలేనిజనపంక్తికి మేడలు పూవుఁదోఁట ల
ష్టాదశ రీతి నంతరులు సల్పిన శిల్పిని వ్యాసు మ్రొక్కెదన్.

సకలాంధ్రోర్వికి రమ్యవాఙ్మయపు భిక్షం బెట్టు ధన్యాత్మునిన్
సుకవిన్ నన్నయఁ గొల్చి, యందములతో శోభిల్లు వాక్చాతురి
న్సకలంబున్ తనసొమ్ము చేసిగొని దానా లిచ్చు నాతిక్కయ
జ్వకు జోహారు లొనర్తుఁ దత్పదము లేశం బైన సిద్ధింపఁగన్.

ఆచరణలోన రచనలో ననుభవమున
తన బ్రతుకు మహాభాగవతంబు గాగ
భాగవత మొండెఁ దనలోని బ్రతుకుగాఁగ
బ్రతికి బ్రతికించు పోతన పదవి నడతు.

త్యాగము చేసి స్వార్థము, పరార్థమె స్వీయ శరీర మంచు నా
త్యాగము సర్వమున్ భగవదర్పణబుద్ధి నొనర్చి ధన్యులౌ
త్యాగయ పోతనాది కవితల్లజు లీభువి నేకొలందిగా
నో గనవత్తు రట్టి పురుషోత్తమవృత్తమె నిల్పు లోకమున్,

ఒక్కొకనివద్ద నొక్కొక యుచితగుణము
గర్భితం బయి యుండును గాన నేను
అఖిల కవి గుణ గ్రహణ పరాయణుండ
నయి జోహారువు లర్పించెద నందఱకును.

ఎవరు సుకవులో కుకవులో యెవరికెఱుక
ఎవరికిని వారె సుకవులై, రితరులెల్ల,
కుకవులవుదురు: కుకవుల సుకవులుగను
అందఱను జేసి మ్రొక్కుటే నాదుమతము,

ఎంద ఱెందరో యిది మథియించి రనుచు
మనము మాత్రము నిపు డూరకొనుట యేల
అంత లంతలు యత్నము లాచరింపఁ
దుదకు నందఱ కమృతంబు దొరకెనొక్కొ.

వ. అని మనమునఁ దలపోసి

తీయని తేనెలాని రుచి తీయన సుంతయు జాఱకుండఁ గొం
దీయని పూవుఁదేనియలు తెచ్చి యొసంగెడి తేటివోలె నే
నీయెడ మౌని వాల్మికి కవీశుని వాగమృతంబు గ్రోలి యా
తీయన సుంతయున్ జెడనితీరున నీయఁగ సాహసించితిన్.

అన లీ రామకథే రసామృతము లింపారంగఁ జిందించు; స
ద్రసపారీణుఁడె యైన సత్కవిముఖాబ్జంబందు వెల్వడ్డచో
సిసలైనట్లుగ గాక యెట్లగును వాసిన్ రక్తి యా ్తి యిం
దసలా ము ్తి రసంబులన్ జిలుకు నాధన్యుండు వాల్మీకియే.

పాయక యా కవిత్రయము పంచమవేదము భారతంబు భ
ద్రాయితమూర్తి పోతన బుధాదృత భాగవతంబు నా
ప్యాయితఁ దీర్చి తెన్గునకె యందము తెచ్చిరి యట్లె నేను రా
మాయణమున్ మలంచి తెనుగందము గూర్చగ సాహసించితిన్.

తొలుతనుండి చేదోడు వాదోడు నగుచు
చాలవిధుల నాపత్ని సుశీల తీర్ప
అదన నరసింహమూర్తి మేనత్త కొడుకు
చూడ నా గ్రంథములు వెలుగుచూడగలిగె.

వివిధ కృతులఁ బత్ని సుశీల విమల కమల
చర్ల బుద్ధనారాయణశాస్త్రి. విదుల
మృదుల యను నాదుసుతు లాంధ్రులెఱుఁగఁ దెనుఁగు
సలిపితిని చర్ల గణపతిశాస్త్రినేను.

ముద మిడి సద్గుణములచే
విధిగా కుడిభుజములవలెఁ బ్రియులగు తనయుల్
విదుల మృదుల కృతి రథసా
రథు లయి కనఁ దీర్చినాఁడ రామాయణమున్.

తెల్లని వస్త్రముఁ దాలిచి
చల్లని చందురుద్యుతియు భుజంబులు నాల్గన్
మెల్లఁ బ్రసన్న ముఖము గల
చల్లని హరిఁ దలఁతు విఘ్నశాంతికి నెపుడున్.

దేవేశుఁడు మొదలు సకల
మౌ విబుధులు నెల్లపనుల ప్రారంభములో
ఏ విభుఁ గొలిచి కృతార్థులు
గా వెలసిరొ యాగణేశుఁ గరముం గొలుతున్.

ఎందెందు రాము గుణములు
విందుగ వినఁబడుచు నుండు వీనులకెపుడున్
అందంపె యశ్రు లూరెడు
కందోయిని గేలు మోడ్చు కపివరుఁ గొలుతున్.

గణపతి

# రామాయణసుధ

## అయోధ్యకాండ

### —: రాముని ప్రజారంజనము :—

భరతుఁడో మాతులుని యింటి కరుగుచుండి
నిత్యశత్రుఘ్ను శత్రుఘ్ను నీడవోలె
నొంటి విడువని తమ్ముని వెంటఁ గొనియు
నశ్వపతి మేనమామ గృహాన నుండె. 1

ఆతఁడు సత్కరించి సుతునట్టుల స్నేహముతోడఁ జూడఁగా
భ్రాతను తమ్ముఁ బ్రీతిమెయిఁ బాలన లాలన చేయఁ దృప్తులై
మాతులు నింటనుండియును నాటికినాటికి వృద్ధుఁ దండ్రి నెం
తో తలపోయుచున్ దశరథున్ మది మెత్తురు దేవునింబలెన్. 2

రాజగు దశరథుఁడును దూరమున నున్న
భరత శత్రుఘ్నులను నింద్రవరుణ సముల
నెపుడు స్మరియించుచును, మేని కిసలవెడలు
నాల్గు బాహులవలెఁ బ్రియుల్ నలుగు రుంద్రు. 3

పురుషశ్రేష్ఠులు పుత్త్రు లందఱును సొంపున్ ప్రేమ పెంపార న
ల్వురు నత్యంతమురాజు కిష్టులయినన్ ముఖ్యంబుగా వారిలో
మరియున్ జ్యేష్ఠుఁడు రాముఁ డిష్టుఁడె యగుం బ్రాణిప్రజంబందు నా
హరివోలెన్ గుణవత్తరుం డగును నెయ్యం బార వీక్షించినన్. 4

మదమత్తుండగు రావణున్ దునుమగం బ్రార్థించు దేవాళిచే
మదిఁ గోరంబడి మర్త్యలోకమున జన్మన్ గాంచెశ్రీవిష్ణువు
గ్రదురీక్ష్యం బగుతేజ మొప్పుసుతుచేఁ గౌసల్య శోభన్ గనెన్
బుధముఖ్యుం డగునింద్రుచే నదితియుం బోలెన్ సదా ప్రీతయై. 5

అసుతుఁడున్ సురూపి యయి యప్రతిముం డయి యీసు లేనివాఁ
డై సుగుణాళిచే దశరథాత్మజుఁడే యన మీఱి వీరుఁడై
యేసమయంబులం దయిన నెంతొ ప్రసన్నతఁ బూని మెత్తనౌ
బాసల నాడు, నాడుచున్ జవా బిడు నేపరుసంబు లేకయే. 6

ఏయుదౌ మేలు సుంత యొనరించిన నాయొకటే గని మెచ్చి మోదిలున్
ఏయపవి నూఱుకీడు లొనరించిన నెంచఁడు యాత్మవంతుఁడై
ఏయెడ శీలవృద్ధులను వృద్ధులఁ జిన్నల జ్ఞానవృద్ధులన్
బాయక మాట లాడును శుభాస్త్ర సుశిక్షణ వేళ నేనియున్. 7

అనఘుఁడు బుద్ధిమంతుఁడు ప్రియంవదుఁ డెప్పుడుఁ బల్కుఁ దీయఁగన్
కనఁగనె పల్కరించుఁ బలుకం డనృతంబు మహాస్వవీర్యమున్
గనుగొని విస్మయంపడడు, ఖ్యాతుఁడు పెద్దలఁ బూజచేయు నిం
దెనయు ప్రజానురంజకుఁడు, నెప్పుడుగూడఁ బ్రజానురక్తుడున్. 8

దయ గలవాఁడు, నల్కఁదలఁ దన్నినధీరుఁడు, దీన హీనులన్
దయఁ గనువాడు, నిత్యశుచి ధర్మవిదుండును, విప్రపూజకుం
డయి తను, వంచి క్షాత్త్రమున నాధృతిఁ జూపెడివాఁడు, శుద్ధకీ
ర్తియె తగ స్వర్గలాభమును దెచ్చు నటంచును నమ్ము నెంతయున్. 9

శ్రేయ మొప్పని పనిన్ జేయనే చేయడు,
హిత విరుద్ధకథల కేగఁ డెపుడు
వాచస్పతివలెఁ బైపై యుక్తులను మించు
వ్యాధియె దరిరానిప్రాయ మొందు

మంచివక్త కడుభాసించు దేహము వాఁడు,
దేశకాలంబులఁ దెలియు వాఁడు
జగమునందుఁ బురుషసారము గనువాఁడు,
స్రష్టయొక్కనిఁ దీర్చు సాధురతుడు

క్షోణిపతి పుత్త్రుఁ డుత్తమ గుణయుతుండు
వెలిఁదిరుగు ప్రాణము, గుణాలఁ బ్రియతముండు
సరిగ విద్యలు గొని వ్రతస్నాతుఁ డయ్యె
శాస్త్రగతి సాంగవేదాల సార మెఱిఁగె, 10

శరముల నస్త్రాల జనకుని మించెను
శుభవంశమున నుండు జొచ్చి వరలె
సాధు వదీనుఁడు సత్యవాక్కు ఋజువు
ధర్మార్థ దృష్టిజ ధర్మ యుతుడు
ధర్మ కామార్థ తత్త్వజ్ఞుండు స్మృతిమంతు
డనుపమప్రతిభాసమగ్రుఁ డతడు
లౌకిక సమయాచరణాల దక్షుఁడు
దిట్ట గంభీర హృది గలవాఁడు

గుప్తమైనయాలోచనల్ గొన్నవాఁడు
సర్వ సాహాయ్యములతోడ జరుగు వాఁడు
రాఘవుల క్రోధహర్షా లమోఘమెపుడు
త్యాగ సంయమముల కాల మతఁడె యెఱుఁగు. 11

దివ్య విహారాలఁ దీర్చు శిల్పంబుల
యర్థవిభాగాల యవధు లెఱుఁగు
ఏన్గుల గుఱ్ఱాల నెక్కియు వశపర్చు
నిఖిల ధనుర్వేదనిధుల మించు

అతిరథ శ్రేష్ఠుఁడై యాక్రమించును గొట్టు
సైనికవ్యూహ విశారదుండు
క్రుద్ధులౌ దేవాసురులకు సైచఁగరాని
వాడు మాత్సర్యగర్వముల గనడుఁ

ఎట్టి ప్రాణినైన నవమానింపఁ డెపుడు
కాలమునకెపుడు వశంబు కానివాఁడు
ఇట్టి శ్రేష్ఠగుణంబుల నెసఁగు నిట్టి
రాముఁ డభిరాముఁడు గుణాభిరాముఁ డలరు. 12

ఓర్పుచే ధరిత్రిని బోలియుండు నెపుడు
బుద్ధిచే బృహస్పతి వీర్యమునను నింద్రుఁ
డఖిలజన కాంతము లగుగుణాళిచేత
అంశువులచేత రవిబోలె నతఁడు వెలుఁగు. 13

ఇట్టి గుణములఁగూడి యెదురుకొనఁగ
రాని విక్రమముండి విరాజమానుఁడైన
రామునిని మేదిని వరించె, నీమహాగు
ణాభిరాముని దశరథుఁ డరసె తలఁచె. 14

## దశరథుఁడు రాముని యువరాజుఁ జేయఁ ప్రజలతో నాలోచించుట

నేను బ్రతికుండ రాఘుండు నృపతి యెట్టు
లగునొ యను ప్రీతి నాహృది నగుచు నుండె
నేను బ్రతికుండ నీభువి సూను రాముఁ
బ్రియతము నభిషేకించి దర్శింపఁ గలనె. 15

భువనములు వృద్ధిపొందంగ నెప్పుడును గోరు
సర్వ భూతాలపైఁ గడు జాలి పడును
మహిని వర్షించుచుండెడి మబ్బు పోలె
విశ్వమందును నాకంటె బ్రియతరుఁడు. 16

యమునితో నింద్రుతోడ వీర్యమున సాటి
బుద్ధిలో బృహస్పతిని నెప్పుడును మించు
ధైర్యమున పర్వతం బటు దనరుచుండు
గుణములను నన్ను మించిన ఘనుఁ డితండు. 17

అన్ని విధములచేత నీయఖిల భువిని
నెప్పు డధివసించి తగు నాయీతనూజు
నీవయసులోన నభిషేక మొనయఁజేసి
స్వర్గ మెప్పు డైనను నేను బడయఁగలనె. 18

వ. అని దశరథుం డాలోచన చేసి 19

అన్యనృపులకు దుర్లభ మైన యిట్టి
యపరిమేయ లోకోత్తర మైన వివిధ
గుణము లున్న సుతుని మంత్రి గణముతోడ
నిశ్చయించియె యువరాజు నెఱపఁ దలఁచె. 20

పూర్ణేందుంబలె మోము గల్గిన మహాత్ముం డైన యారాము సం
పూర్ణప్రేమయె స్వీయశోకముమదిన్ బోగొట్టు నంచున్ ప్రజా
పూర్ణశ్రేయసుకై స్వప్రియముకై పూనున్ సుతుం డంచు త
త్పూర్ణ ప్రేమముచేత భక్తిని సుధర్ముండై పడెన్ తొందరన్. 21

నానాపురవాసుల మఱి
జానపదులఁ గూడ వేఱె సరి రావించెన్
భూనాథులను వసుంధర
లోని ప్రధాను లగువారి త్రుటి రప్పించెన్. 22

తొందరయు నగుటవల్లనే
ముం దిఁక ప్రియవార్త వింద్రుపో యని మదిలో
నం దలచి కేకయుని, జన
కుం దగ రావింప లేదు కోసలపతియున్. 23

వచ్చిన వారిని తగు నటు
మెచ్చి వివిధభూష లిచ్చి మెయి భూషితుఁడై
చొచ్చి ప్రజాపతివోలెన్
మెచ్చుచు గడుఁ బూజ చేసి మేకొని ప్రజలన్. 24

పరబలముల నడఁచిన భా
సురపతి కూర్చుండఁ గూరుచుండిరి నృపతుల్
నరపతి యేర్పఱచిన భా
సురాసనములందుఁ గూరుచుండిరి ప్రీతిన్. 25

వినయముగ నెదురు గూర్చుం
డిన వసుధాధిపులచేత నిజపౌరులచే
జనపద వాసులచేతన్
జనపతి యలరె సుతులచేత శుక్రుడువోలెన్. 26

## దశరథుని అభిప్రాయమును రాజులపరిషత్తు అభినందించుట

పిదప సర్వమౌ పరిషత్తుఁ బిలిచి రాజు
దివ్య దుందుభి ధ్వనిఁ బ్రతిధ్వనించి
మధుర గంభీరమ యుఱుము మబ్బువోలె
మహితము హితమై ముద మిడు మాట పలికె. 27

రాజ్యలక్షణ యుక్తము రంజకమును
సరసమౌ స్వరానఁ బతి భూవరుల కనియె
ఎఱుఁగుదురు తమ, రీరాజ్య మింతవఱకు
పుత్త్రుఁబోలె నేలి రిటు మాపూర్వనృపులు. 28

ఏను నిక్ష్వాకు నరపతు లేలినట్టి
సౌఖ్య యోగ్య జగతి మేలు సలుప నెంతు
పూర్వుల పథం బనుసరించి పోయినాఁడ
నే యథాశక్తి ప్రజఁ గంటి నిద్రవీడి. 29

సర్వ లోక హితంబులు సలుపు తనువు
శ్వేతమగు ఛత్రపున్ నీడఁ జివికిపోయె
గడిపి వేలేండ్లు, బ్రతికి దీర్ఘాయువులును
సడలి పోయిన మెయికి విశ్రాంతి వలతు. 30

ఏనృపు ప్రభావాన సేవింపఁ బడిన
అవిజితేంద్రియులకును మోయంగ రాని
బరువె యౌలోక ధర్మాల బరువు మోసి
అలసి పోయితి విశ్రాంతి వలతు నయ్య. 31

ఆత్మజుఁ బ్రజాహితము చేయ నాజ్ఞ చేసి
దగ్గఱనె యున్న యీద్విజ దిగ్గజాల
యనుమతిని పొంది యీరాజ్యమును వహించు
బాధ్యతలనుండి విశ్రాంతి పడయ దలతు. 32

జ్యేష్ఠసుతుఁడు సర్వగుణాలఁ జెందు నన్ను
రాముఁ డింద్రాభుఁడు పరపురాలఁ గెల్చు
చంద్రుబలెఁ బుష్యతారతో సరిగఁ గలిసి
ధార్మికుడు యౌవరాజ్య మొందంగఁ దలతు. 33

లక్ష్మి యొప్పారు లక్ష్మణాగ్రజుఁడు ధరకు
మిగుల ననురూపనాథుఁడై మేలు చేయు
నాథుఁ డతఁ డౌటెడఁ ద్రిలోకి కాంతయును గూడ
శ్రేష్ఠనాథుండు గలదియై చెన్ను గాంచు. 34

క్షోణి దీని నీ శ్రేయస్సుతోనె కలిపి
ఆసుతునియం దునిచి గతవ్యథుఁడ నవుదు
నాకిది తగునేన్, సరియేని నాతలంపు
మీర లొప్పుడు, చేతునా వే, ఇదేని. 35

అది విమర్శించి చూడ నాకైతె ప్రియమొ
కాని హిత మింకొకటి యున్నఁ గనుఁడు మీరె
చూచు మధ్యస్థుల యితరాలోచనంబొ
కూడి శోధించుచో నధికోపకారి. 36

అని నరపతి వచియింపఁగ
విని యభినందించిరి పృథివీపతులున్
* ఘనవృష్టి గలుగు మేఘుని
గని కేకలిడెడు నెమిళ్ల కరణిని మిగులన్. 37

అధరిత్రిని కంపించునటు చేయు
ప్రజల గుంపులయుద్ఘోష వాద మట్లు
ప్రమదమునఁ జేయు నుత్సాహ వాక్కు లడర
స్నిగ్ధ మగుప్రతిధ్వనులును చెలఁగె నచట. 38

ధర్మ మర్థముఁ దెలిసిన ధరణివరుని
భావమును దెల్సి ముఖ్యులున్ బ్రాహ్మణులును
జానపద నాగరులతోడ సంప్రదించి
వృద్ధుఁ డగుదశరథునితో నిట్టు లనిరి. 39

---

* ఈ వర్ణనను కాళిదాసు అనుకరించెను.

## రాముని గుణములను బ్రాహ్మణులు మెచ్చుకొనుట

"నృపతి ! చాల వేలేం డ్లున్న వృద్ధపతివి
జ్యేష్ఠు యువరాజుగా నభిషిక్తుఁ జేయు
మేము రఘువీరుఁ డగురాముఁ డేనుగెక్కి
శ్వేత మగుఛత్రమూన వాంఛింతు మెలమి". 40

మదికిఁ బ్రియ మైనవారి యామాటలు విని
తెలియ నటులుండి తెలియఁగఁ బలికె నిట్లు
ఏమి నావాక్కు విని యేన రాముఁ బతిగఁ
దీర్పఁ గోరుదు, రనియు సందేహ మొదవె. 41

"ఏమి నేధర్మముగ రాజ్యమేలుచుండ
నాసుతుఁడు యువరా జౌట నరయ నెంత్రె"
అని నృపతి పల్క వారంద అనిరి యిటుల
అధిప ! నీసుతుఁ డధికకళ్యాణగుణుఁడు. 42

దేవ ! దేవసముండును ధీయుతుండు
నైన నీపుత్త్రు సర్వగుణాల వినుము
అవి ప్రియము లానంద దాయకము, లవ్వి
యేవియో చెప్పెద మిపుడు నృపవరేణ్య ! 43

సత్య బలి రాముఁడు గుణాల శక్ర సముఁడు
అంద టిక్ష్వాకువులకంటె నధికుఁ డధిప !
రాముఁ డనఘుఁడు ధర్మపరాయణుండు
రాముఁడు కనె సాక్షాత్తు ధర్మమును శ్రీని. 44

చంద్రుండటు ప్రజాసుఖదాయి, క్షమను ధరయె
తెలివి గీష్పతి, సాక్షాత్తు బలిమి వజ్రి,
సత్య సంధుఁ, డుత్తమ శీలి, క్షాంతుఁడు, వశి
ఈర్ష్య లేని వాఁడు, కృతజ్ఞుఁ, డిష్టశముఁడు. 45

మృదువు స్థిరబుద్ధి భవ్యుఁడు ప్రియవచుండు
సుశ్రుతు లగు బ్రాహ్మణుల శుశ్రూష చేయు
కానఁ గీర్తితేజ మతుల మైన వయ్యె
అసుర సుర నరులందు సర్వాస్త్ర వేది. 46

అఖిల విద్యావ్రత స్నాతుఁ డమలగుణుఁడు
విమల గాంధర్వుఁడును సాంగ వేదవేత్త
అమలకులుఁడు సాధువు భరతాగ్రజుండు
ఇష్ట ధర్మార్థులౌ విప్రు లతని గురులు. 47

ఊరికొఱ కేని పురి కేని పోరు చేయు
లక్ష్మణునితోడ నరిగి గెల్వకయె రాఁడు
రణమున మరలి యేన్గుపై రథముపై నొ
చేరి హితుఁ డట్లు పౌరులన్ క్షేమ మడుగు. 48

సుతుల నగ్నుల శిష్యుల సతుల భటుల
వరుస పెట్టి యడుగుఁ దండ్రి స్వసుతుల బలె
"శిష్యులు కొలుతురె క్రియలు చేయు చుండ్రు
కద" యనుచు మమ్మడుగు రాముఁ డదన నెపుడు. 49

ప్రజలు కష్టపడు నపుడు వగచు మిగుల
ఎల్ల యుత్సవాలఁ బిత యట్లుల్లసిల్లు
హితుఁడు సత్యవాది సుధన్వి వృద్ధసేవి
ముందె చిఱునవ్వు నవ్వి యెప్పుడును పల్కు. 50

శ్రేయసులఁ జక్కఁ గలుపు, విశ్లేష విముఖి
సరిగ నుత్తరోత్తరయుక్తి గురుల గురువు;
మోమునకు నంద మిడును కన్బొమల తీఱు
వెడద కనులెట్టి సాక్షాత్తు విష్ణువితడు. 51

శౌర్యమున విక్రమంబున వీర్యమందు
రాముఁడు సమస్త లోకాభి రాముఁ డయ్యె
ప్రజల నెట్టులు పాలింపవలెనొ యెఱుఁగు
ఇంద్రియముల రాగము లాగ నీయఁ డెపుడు. 52

ఒకడె త్రైలోక్యమును గావ నొప్పియుండు
నొక్క యీభూతల మ్మొక లెక్క యేమి
రామునికిఁ గ్రోధమే ననుగ్రహము గాని
కలుగుచో నెన్నడు నిరర్థకంబు కాదు. 53

చంపఁ దగు వారి మానక చంపితీరు
చంపదగని వారలను గోపింపడెపుడు
సంతసించె నా కడుఁ బ్రయోజనము కూర్చు
అట్టివానిని గాంచి ప్రహర్షమొందు. 54

శాంతములు ప్రజాకాంతములెంతొ ప్రీతి
సంతరించు ననంత గుణాంకముల
రాముడు వఱలెఁ గిరణాల రవి విధాన.
నిట్టి రాము గుణారాము నిల వరించె. 55

నీయదృష్టముచేత నీశ్రేయమునకె
వత్స రాముఁడు నీగర్భఫలమె యయ్యె
మహిత మారీచ కాశ్యప బ్రహ్మవోలె
నీయదృష్ట పుత్త్రగుణాల నిండినావు. 56

దేవ రాక్షస గంధర్వ దివ్యనరులు
పడయు బల మాయు వారోగ్య భాగ్యములను
ధీరుఁ డగు రామునికి గల్గఁ గోరుచుంద్రు
పురిని రాష్ట్రాన వెలిలోన వరలు ప్రజలు. 57

స్త్రీలు వృద్ధుల్ సుతులు సంజావేళలందు
ఆ యశస్వి రామునికయి యఖిలసురల
ప్రార్థనలు చేయుదురు వారి ప్రార్థనములు
నీదు దయ నయాచితముగ, నెఱయుఁ గాక. 58

రాముని నిందీవరశ్యాము భూమి సోము
శ్రీదు యువరాజుఁ జేయఁ జూచెదముగాక
అట్టి దేవదేవోపము నఖిల హితుని
ఎల్ల హితము కొఱ కభిషేకింపవలయు 59

ఆపరిషత్తునన్ జనులునంజలి దమ్ములు మోడ్చులెంచుచున్
భూపతి స్వేష్టమున్ హితముఁ బొల్చినయట్టుల నెంచి పల్కె "నా
హా! పరితోష మెంతఘనమై తగె, నాయతుల ప్రభావమే
మీ! పరితుష్టిఁ గాంచితిరె జ్యేష్ఠసుతున్ యువరాజుఁ జేయఁగన్. 60

అని వారిన్ ప్రతిపూజ చేసి యిటు వారాలించుచుండన్ వసి
ష్ఠుని నావిప్రుల వామదేవుఁ గని యిటుల్ రాజు వాక్రుచ్చె, నో
యనఘుల్! శ్రీకర చైత్రమాస మిది పుణ్యంబౌ, వనం బెల్ల వి
చ్చెను, ఈరాముని యౌవరాజ్యమునకై చేయుం డికన్ సర్వమున్. 61

వ. అని రాజు చెప్పి యూరకుండ జనులు పెద్దపెట్టున ఘోషములు చేసిరి. ఆజనఘోషము శాంతింపఁగా నారాజు ముని శ్రేష్ఠుఁడైన వసిష్ఠునితో నిట్లనియె. ఓభగవానుడా! రాముని యభిషేకమునకు ఏమి సామగ్రి కూర్చవలెను, అదె యంతయు ఆజ్ఞాపింతువుగాక! అని చెప్పఁగా ద్విజ సత్తముఁడైన వసిష్ఠుడు కృతాంజలియై యెదుట నున్న ఆ రాజుల నిట్లాదేశించెను. 63

బంగారు మొదలైన పలురత్నములు బలుల్
సర్వౌషధులు తేనె సర్పిసులును

శుక్ల మాల్యంబులు శుక్ల మౌపేలాలు
నమల వస్త్రంబులు నాయుధములు

చతురంగ బలము గజంబులు మంచివి
శ్వేతనూ ఛత్రము చామరములు

శ్వేత వ్యజనమును శ్వేత ధ్వజంబును
నగ్ని వర్చస శత స్వర్ణఘటము

లా పసిండి కొమ్ముల యెద్దు వ్యాఘ్రచర్మ
మివ్వి యన్నియు నిఁక నన్య మిష్టి లోన
అవసరం బయి యుండునో యవ్వి యన్ని
క్షితిపు నగ్నిగృహము దరిఁ జేర్చవలయు. 63

అంతిపురాన సర్వపురమందును గల్గిన యన్ని ద్వారముల్
ఎంతయుఁ జక్క, మాల లలరించి సుగంధము పూసి వాసనల్
దొంతర గట్టు నయ్యగరు ధూమములన్ పఱపించి యన్నముల్
వింతవి క్షీరముల్ పెరుగు పేర్చుఁడు విప్రులు నూఱు వేలకున్. 64

ద్విజవరుల సత్కరించియు తెల్లవాఱ
రేపె నేయి పేలాల్ దధి వృద్ధికాఁగ
దక్షిణల నీయవలె రేపె తపనుఁ డుదయ
మంద స్వస్తివాచనములు సలరవలయు. 65

బ్రాహ్మణులఁ బిలువుండు వరాసనములు
నేర్పఱచుఁడు జెండాల నెల్లెడలఁ గట్టుఁ
డెల్ల రాజమార్గములందు నీళ్లు చల్లి
యఖిలము నలంకరింపుఁడు నందమొలుక. 66

తాళములు గైకొని గణికల్ లీల మెఱయు
నధిప గృహము రెండవ కక్ష్య నమరవలయు
గుడులఁ జైత్యాల నన్నముల్ కుడువఁ దగియు
దక్షిణలు గొనువారు సిద్ధార్థు లవుత. 67

పొడుగు ఖడ్గాలు, శుచివస్త్రములును దాల్చి
సిద్ధులై క్రమబద్ధులై చేరి భటులు
విమల శుభమహారాజాంగణమును జొచ్చి
యుండ్రుగాక సర్వమును గనుగొండ్రుగాక. 68

శుభమౌ నట్లెటు వామదేవుఁడు వసిష్ఠుం డాజ్ఞ గావించి దు
ర్లభ మైనట్టిదె లేక యుండునటు నిర్వర్తించి సర్వంబు, నా
విభుతో సర్వము నిట్లు చేసినటు లావేదించి ప్రీతిన్ ద్విజ
ర్షభులున్ రాముని నిష్ఠతో మిగుల హర్షంబొంది వర్తింత్రటన్. 69

ఒగి నా ప్రాచ్యు లుదీచ్యులున్ మఱి ప్రతీచ్యుల్ దాక్షిణాత్యుల్ సుఖే
చ్ఛగఁ గూర్చున్న నగాంతవాసులుమ మ్లేచ్ఛాచార్యులున్ వన్యులున్
తగు సామంతులు గొల్చిరా దశరథున్ శక్రున్ సురల్ పోలె, నో
లగ మం దానృపుఁ డొప్పె దేవతలలో రాజిల్లు నింద్రుం డటుల్. 70

వ. అంత నింతలో

ప్రాసాదంబుననుండి రాజు కనియెన్ రామున్ రథశ్రేష్ఠ మ
ధ్యాసీనున్ సుతు ఖ్యాత పౌరుషుని గంధర్వాధిపాభిఖ్యు బా
హాసత్త్వాధికు దీర్ఘ బాహువును చంద్రాస్యున్ ప్రియాకారు ను
ల్లాస భ్రాజితు మత్తకుంభిగమనున్ రాజత్కళా భాసితున్. 71

రథమునుండి శీఘ్రంబుగ రాము దింపి
ఆసుమంత్రుఁడు ప్రాంజలి యగుచు నపుడు
తండ్రిదగ్గఱకుఁ బోవు తనయు రాము
వెనుక వెనుకనె పోవుచు ననుగమించె. 72

ప్రథిత కైలాసశిఖరంబువలెఁ దనర్చు
నృపతి ప్రాసాదమును వడి నెక్కి రాముఁ
డంజలి ఘటించియు సుమంత్రుఁ డనుసరింప
వెళ్ళి పేరు చెప్పుచుఁ దండ్రికాళ్ళ మ్రొక్కె. 73

మ్రొక్కి యొకప్రక్క చేతులు మోడ్చి యున్న
ప్రియసుతుఁ గని యంజలియందు ప్రేమఁ దీసి
కొని దరికిలాగుకొని బిగ్గఁ గుచ్చికౌఁగ
లించుకొనియె దశరథుఁడు నృపతివరుఁడు. 74

అతనికయి మణిస్వర్ణ భూషితము యైన
శుభవరాసనము పిత కూర్చుండఁ జూపె
రాముఁ డపుడందుఁ గూర్చుండి రాణమీఱె
మేరుగిరి నెక్కి రవి, ప్రభన్ మీఱి నట్లు. 75

చంద్రుచే గ్రహనక్షత్ర శారదాభ్ర
మట్లు, రాముచే నాసభ యలరి వెలిగె
అంత నాప్రియసుతు నద్దమందుఁ దన్ను
పగిదిఁ గని పుత్త్రవంతులన్ వరుఁగఁ దలఁచె. 76

దశరథుఁడు చిఱునగ వొప్పుతనయుఁ బిలిచి
పలికెఁ గాశ్యపుఁ డింద్రుతోవలెను రామ !
సదృశయగు జ్యేష్ఠసతియందు సదృశుఁడవయి
పుట్టితివి నాకు, గుణములన్ బొల్చినావు. 77

జనులన్ నీవును నీగుణాలవలనన్ జక్కంగ రంజించితే
కనుకన్ బొందుము యౌవరాజ్యపద మింకన్ బుష్యయోగంబునన్
గుణవంతుండవు సద్వినీతుఁడవ యెందున్ నీస్వభావంబుచే
తనె, యైనన్ హిత మాడుదున్ గుణులమీఁదన్ గల్గుస్నేహంబుచే. 78

నీవింకన్ వినయంబు పొందవలయున్ నిత్యంబు నీవింద్రియో
ద్ధావేగంబును కామకోపజనితంబౌ చెడ్డ యభ్యాసముల్
ఆవర్జించి జయింపఁ గావలయు ప్రత్యక్షాల్ పరోక్షాలు నౌ
వ్యావృత్తుల్ మది నాక్రమించుఁ గనుకన్ వర్తిల్లు జాగ్రత్తగన్. 79

మఱి మంత్రుల్ మొదలైన యీప్రకృతులున్ మన్నించి రంజింపఁజే
యు రుచిన్ నీయెడఁ బ్రేమచూపుఁ బ్రజ; కోశాయుధాగారముల్
నిరతంబున్ కడు వర్ధిలంగ వడి యత్నింపన్వలెన్; ప్రీతితో
పరిపాలించెడి రాజుపైని ప్రకృతుల్ వర్తింత్రు సంతృప్తులై. 80

కని యెవఁ డిటు భూమిని నే
లునొ కడునను రక్తతోషులుగ జనులుం, ద్రా
తని సఖు లమృతముగొని సుర
గణ మటు, నందింత్రు: పంచి కడు నినుఁ, జనుమీ. 81

అన విని రాము ప్రియసఖులు
చని కౌసల్యకు సమగ్రసంగతి తెలుపన్
విని కౌసల్య ప్రియము చె
ప్పినవారి కిచ్చెను పసిఁడి వివిధ మణులావుల్. 82

మ్రోలన్ మ్రొక్కియు దండ్రి పంప రథ మారోహించి యందంద పౌ
రాళుల్ పూజయొనర్ప రాముఁడు గృహంబన్జేగఁ పౌరాళి యా
ధాలాభేష్టము పొంది నట్టులయి రాజాజ్ఞన్ స్వగేహాలు హ
ర్షాలాపంబుల నాడుకొంచుఁజని యారాధింత్రు దైవంబులన్. 83

ప్రజతోపాటుగ మంత్రులన్ స్వగృహములన్ పంపించి యారాజు తా
నిజ మాలోచన చేసి నిశ్చయవిదుం డైయె మఱిన్ నిశ్చయం
బె జవం బొప్పఁగఁ జేసెఁ "బుష్య మదిరేపే రేప రాముండు నీ
రజతామ్రాక్షుఁడు యౌవరాజ్యమున మేల్ పట్టాభిషిక్తుం డగున్. 84

వ. అని నిశ్చయము చేసి రాజు దశరథుఁడు సూతుఁ డగు సుమంత్రుని రావించి "రాముని మరల నిచ్చటికి తీసికొని రమ్ము" అనఁగా అతఁడు రాముని తీసికొని వచ్చుటకు రాముని గృహమునకు పోగా ద్వారపాలురు "రాముని మరలతీసికొనిపెళ్ళుటకు సుమంత్రుఁడు వచ్చె" నని తెలిసికొని రామునకు విన్నవింప నతండు శంకాస్పదుఁడై వచ్చిన సుమంత్రునితో నిట్లనియె. "నీవు మరల వచ్చిన పని యేమి పూర్తిగా చెప్పుము" అనఁగా "రాజు నిన్ను జూడఁ గోరుచున్నాఁడు, ఇది విని వెళ్లుటకుగాని మానుటకుగాని మీరే ప్రమాణము (మీ చిత్తము)" అని సుమంత్రుఁడు చెప్పఁగా విని రాముఁడు తొందరగా రాజును జూచుటకు రాజభవనమునకు పెళ్లెను. అంత రాముఁడు వచ్చినట్లు దశరథుఁడు విని ఏదో చెప్పఁగోరి గృహములోనికి ప్రవేశ పెట్టించెను. అపుడు శ్రీమంతుడైన రాఘవుఁడు ప్రవేశించుచు దూరమునుండియె నమస్కరించి ప్రాంజలియై రాజునకు చూచెను. రాజును నమస్కరించుచున్న రాముని లేవఁ దీసి కౌగలించుకొని రమణీయమైన యొక యాసనమును జూపి కూర్చుండబెట్టి యిట్లనెను. 85

ఏను చిరాయువై బ్రదికి వృద్ధుఁడనైతి నభీష్టభోగముల్
వేనకు వేలుగా నమభవించితి, నన్నము భూరి దక్షిణల్
మానక పోసి యజ్ఞశతమానము చేసితి, గంటి నిష్టులా
సూనుల, నందు నీవొ మఱి క్షోణినె సాటియు లేనివాఁడవున్. 86

ఇచ్చితి, నిష్ట లెవ్వొ యొనరించితి, నధ్యయనం బొనర్చితిన్
హెచ్చి సుఖాలు గంటిని, పితౄణము దేవ ధరాసు రర్షి దా
నోచ్చఋణాలు దీర్చి యనృణుండను నైతిని, నీమహాభిషే
కొచ్ఛమహోత్సవం బొకటి గాకయు లేదికఁ జేయఁదగ్గదిన్. 87

ఈనాఁడో కలలో సుదారుణములౌ వెన్నో యనిష్టంబులే
కానన్ వచ్చుచునుండె, నేపిడుగు లేకన్ గొప్ప యుల్కల్ పడెన్
నానక్షత్రము రాహు సూర్య కుజులన్ స్తంభింప నౌనంచునే
దీనిన్ జ్యోతిషికుల్ వచించి రిది యెంతే దారుణంబే యగున్. 88

తఱచయి యీనిమిత్తములు తారసిలన్ నృపుడొందు మృత్యువున్
మఱి యెదొ ఘోర మాపదనొ మానక పొందును గాన రామ! యే
వఱకును నాదు మానసము పొడయి పోవక తిన్న నుండు, నా
వఱకె మహాభిషేకమును బైకొను ప్రాణులబుద్ధు లస్థిరల్. 89

ఇప్పుడె వచ్చెఁ జందురుఁడు, నింకను బుష్యమికంటె ముందుగన్
జొప్పడు నాపునర్వసులు చూడుము పుష్యమి రేపె యిద్దియున్
తప్ప దటంచు జ్యోతిషులు తద్దయుఁ జెప్పిరి, పుష్యమందెటున్
దప్పక చేసికొమ్మి యభిషేకము, నన్ త్వరపెట్టుఁ జిత్తమున్. 90

నేను యౌవరాజ్యంబున నీకురేప
వడిగ నభిషేకమును జేయువాఁడఁ గాన
నేఁడు మొద లీవు భార్యతో నియతి నిశను
నుపవసించి దర్భలశయ్య నొగిఁ బరుండు. 91

నీ సుహృదులు ప్రమత్తులై నిన్ను నేఁడు
నెల్లెడలఁ గాచుచుండి వీక్షింత్రు గాక
ఈవిధంబులొ కార్యంబు లెప్పు డగునొ
అప్పుడే చాల విఘ్నముల్ తప్ప కగును. 92

ఎంతవఱకైతె భరతుండ యీపురంబు
నొగిని దూరదేశమునందునుండి రాఁడొ
అంతలోనె నీయౌవరాజ్యాభిషేక
మేమి మిగులకుండ నగుట నా మతంబు. 93

ఇంక మఱియైతె సుజనప్రవృత్తియందు
యెపుడు నీభ్రాత భరతుండు నెసఁగుచుండు
కనికరము గల్గి యింద్రియాలను జయించి
యన్న రాము ధర్మాత్ముఁడై యనుసరించు. 94

అయినను నరులచిత్తంబు లస్థిరంబు
లై మసలుచుండు నియ్యది నామతంబు
ధర్మమందును నిత్యమై దనరు సుజన
చిత్తము సరిగాఁ జేసి భాసించు చుండు. 95

అనుచు మఱియును నీఁక రేప తనరఁ బోవు
నీదు నభిషేకమున రమ్ము నియతి" ననుచు
అనుమతింపఁ దండ్రికి మ్రొక్కి యంత రాము
డధిపు డాడిన యుషేక మాత్మఁ దలఁచి. 96

స్వగృహమున కేగి వెంటనే బయులుదేఱి
తల్లి యంతఃపురమునకు మెల్లఁ బోయి
అచట నియతితో క్షామంబు నమరఁ దాల్చి
మౌనమున గుడిన్ శ్రీఁగోరు మాతఁ గనియె. 97

అచటకు సుమిత్ర లక్ష్మణుం డంత క్రితమె
చేరిరి ప్రియమౌ రామాభిషేక వార్త
వినఁగ సీత రప్పింపఁబడెను మఱింక
నపుడు కౌసల్యయెు నిమీలితాక్షి యయ్యె. 98

ఆ సుమిత్ర లక్ష్మణుఁడును నవల సీత
యనుసరింప పుష్యమి సుతు యౌవరాజ్య
మంగళాభిషేచనమును మదిని దలఁచి
పరమపురుషుఁ బ్రాణాయామపరతఁ గొలిచె. 99

అట్లు నియతి ధ్యానించెడి యామె దరిసె
రాముఁ డామె కనింద్యకుఁ బ్రణతి చేసి
హర్షపెట్టుచు ననె "నన్ను నమ్మ; తండ్రి
ప్రజల నేల నియోగించె రాజ్యమందు. 100

రేపె నాకభిషేకమౌ నృపతి నాజ్ఞ
సీతకూడ నాతోపాటు రాతిరింక
నుపవసింపవలయు నని యపుడు ఋత్వి
జులు నుపాధ్యాయులును తండ్రి పలికినారు. 101

చేయుబోవు రేపటి యభిషేకమందు
నింక నేమేమి యోగ్యమో యివ్వి కూడ
మంగళములు సీతకు నాకు మాన కిపుడె
యమ్మ ! చేయింపు మమ్మ !" నీ వనఁగ నపుడు. 102

ఎంతకాలంబునుండొ కాంక్షించుచున్న
పలుకు వినియైతె కౌసల్య పలికె నిట్లు
రామ ! నాయన ! చిరమింక బ్రదుకు నీదు
శత్రులగు జ్ఞాతులెల్ల నాశంబు గనిరి. 103

ఇంక నీవు శ్రీతోఁగూడ నెల్ల యపుడు
ఈ సుమిత్ర నానందాల నిందె తేల్చు !
పుత్త్ర ! నీవు కళ్యాణ నక్షత్ర నుందు
నాదు గర్భాన జన్మించినావు సుమ్మి. 104

నీవు నీ సద్గుణంబుల నీదు తండ్రి
దశరథుఁ గడు నారాధించి దనరినావు
పుండరీకాక్షుఁ డౌమహాపురుషు నందు
గలుగునాక్షమ యింక నమోఘంబ యయ్యె. 105

ప్రథితు లిక్ష్వాకురాజుల రాజ్యలక్ష్మి
అందుచేతనె సుత ! నిన్ను నాశ్రయించు"
అనుచు ననఁ దల్లి, నగి రాముఁ డనియె, నడఁగి
ప్రాంజలియయి కూర్చుండిన లక్ష్మణునికి. 106

"లక్ష్మణా! నీవు నాతో నీధరాతలంబు
సర్వమును పరిపాలింపు సౌఖ్య మొప్ప
నీవు నాలోననుండియు నేగుదెంచు
రెండవదగు నాత్మవు నిన్ను శ్రీ వరించె. 107

ఓయి సౌమిత్రి! యిష్టమై యుండి యున్న
యఖిల భోగాలు రాజ్యంబు ననుభవింపు
జీవితంబును రాజ్యంబు నేవియైన
నేను నీకోసమే కోరుచున్నాను సుమ్ము". 108

అనుచు లక్ష్మణుతోఁ బల్కి జననులకును
వినయమున మిక్కిలి యభివాదనము చేసి
యింక సీత కనుజ్ఞ యిప్పించి ప్రేమ
స్వగృహమున కంత రాముండు త్వరగఁ జనియె. 109

చేయఁబోవు రేపటి యభిషేచనమున
రామునికిని సందేశము ప్రేమ నొసఁగి
ఆవసిష్ఠుఁ బురోహితు నటకుఁ బిలిచి
యా దశరథమహారాజు ననియె నిట్లు. 110

శ్రీయుఁ గీర్తియు రాజ్యంబు చెందు కొఱకు
ఓయి భగవంత! "వధువుతో నొగి వ్రతంబు
నెనయు కాకుత్స్థుని నుపవసింపఁ జేయు"
మనఁగ నట్లు యని వచించి యంత త్వరగ. 111

స్వయముగ మంత్రవేత్త భగవానుఁడు నైన వసిష్ఠుఁ డప్పుడే
రయమున బైలుదేరి యట బ్రహ్మరథంబును నెక్కి సువ్రతుం
డై యయిన రామునే యుపవసింపఁగఁ జేయఁగఁ బోయి స్వచ్ఛమై
మెయి లటు తెల్లనౌ భవనముం గని చొచ్చెను మూడు కక్ష్యలన్. 112

వచ్చు వసిష్ఠుగాంచి కడుభక్తిని రాముఁడు సత్వరంబుగన్
మెచ్చియు గౌరవింపఁదగు మేటిమహర్షిని గౌరవింపఁగా
వ్వచ్ఛ గృహంబునుండి దిగి బ్రాహ్మరథోర్వికి సంభ్రమంబుగన్
వచ్చి వసిష్ఠు దింపి భవనంబున లోనికిఁజేర్చె నంతటన్. 113

వ. వసిష్ఠుఁడు రాముఁడు చూపిన మహార్హమగు నాసనంబునఁ గూర్చుండి వినయంబుగ నమ్రుఁడైన రామునితో మాటాడి యనుగ్రహించి ప్రియార్హుఁడైన రామునితో నిట్లనెను. రామా! నీతండ్రి నీయెడ ప్రసన్నుఁడై యున్నవాఁడు. నీవు యౌవరాజ్యమును పొందగలవు. నీవిప్పుడు సీతతో ఉపవాస ముండుము. ప్రొద్దుట రాజు నీకు యౌవరాజ్యమున, యయాతిని నహుషుడువలె ప్రీతితో నభిషేకింపఁగలడు. అని చెప్పి సీతతోఁగూడ రాముని మంత్రకోవిదుఁడైన వసిష్ఠుఁడు ఉపవాసవ్రతము చేయించి రాజగురువు రామునిచే నర్చించఁబడి కాకుత్థ్సునికి అనుజ్ఞ యిచ్చి రాముని భవనమునుండి స్వనివాసమునకు వెడలెను. అపుడు రాముఁడును ప్రియంవదులైన స్నేహితులతోఁ గూర్చుండి వారు గౌరవింప వారి కంతట అనుమతి యొసఁగి స్వభవనము ప్రవేశించెను. 114

నదులున్ వారులు పొంగి ఘోషలిడ నానందాన నామందిరం
బరయన్ మత్తిలి కూయుపక్షులగణం బారావముల్ చేయగా
మురిపెంబై విడు కెంపుఁదమ్మి కొలనింబోలెన్ విరాజిల్లె, ముం
దర వీక్షించె వసిష్ఠుడున్ జనుల నిండౌ రాజమార్గంబులన్. 115

జనబృందములు చేరి స్థలములు చాలక
రాజమార్గముల నాక్రమణ చేయ
కౌతూహలముతోడఁ గూడు ప్రజోర్ముల
ఘోషంబులు సముద్రఘోష నడఁప
తుడిచి నీళ్లులు చల్ల నడివీధులను లేచి
చాల యెత్తిండ్ల జెండాలు పిలువ

తొలి విచ్చు పూదండ తోరణంబుల నిండి
విశత నగరి స్వాగతము లిడఁగ

స్త్రీలె కాక యాబాలగోపాల మెలమి
నెపుడు తెల్లవాఱునా యని తపనుఁ గనఁగ
చేరి రామాభిషేకంబు కోరుచుండు
జనుల కండ్ల నయోధ్యయె కనఁ దొడంగె. 116

ఆ జనముల సంబాధమౌ రాజ పథిని
వ్యూహములు కూర్చుచున్నాఁడు వోలె నవుడు
యా వసిష్ఠ పురోహితుఁ డల్ల నల్ల
నెల్లెడలఁ జూచుచును రాజగృహము చేరె. 117

చెలువు లీను తెల్లని మబ్బుశృంగ మటుల
నెసఁగు ప్రాసాదము నధిరోహించి యతఁడు
స్వర్గపతితోడఁ నా బృహస్పతియు వోలె
క్ష్మావరునితో ఋషివరుండు కలిసికొనియె. 118

వచ్చి వసిష్ఠ బ్రహ్మర్షి మెచ్చి చూచి
నరపతి త్వరగ రాజాసనమ్ము వీడి
యా వసిష్ఠుఁ బ్రశ్నింపఁగ నప్పుడతఁడు
నిఖిలమును జేయఁబడెనని నృపతి కనియె. 119

ఉర్వీపతితోడ నచటఁ గూర్చుండి యున్న
యాఖిల సభ్యులు కడు వినయంబుతోడ
తమతమదు నున్నత వరాసనములనుండి
చటకునన లేచి ఋషి పూజ సలిపినారు. 120

పిదపఁ గులగురువు వసిష్ఠు డనుమతింప
నెల్ల జనముల నట విసర్జించి యపుడు

నృపతి యంతఃపురము ప్రవేశించె త్వరగ
స్థవిర మృగరాజు శైల కందరముఁ బోలె. 121

నిండు వేషభూషల స్త్రీలు నిండియుండు
నింద్రు మందిరమటు సాటి యెఱుఁగరాని
భవనమును వెలిగించుచున్ ప్రభువు చొచ్చె
సంకులిత తారకాభ్రమున్ జంద్రుఁడట్లు. 122

ఇఁక బురోహితుఁ డింటికి నేగినంత
స్నానమాడి రాముండు మనస్సు నిలిపి
వ్రతనియత విశాలాక్షియౌ పత్నితోడ
హృదిని నారాయణుని నుపాసించె భక్తి! 123

విధివిధానముతోడ హవిస్సు పాత్ర
నతఁడు శిరమునందాల్చి యప్పుడింక
దీప్తమగు నగ్నిలో మహాదేవుకొఱకు
అజ్యమును హోమమునుజేసి నతిగ శ్రద్ధ. 124

తమకు శ్రీ కావలెనని స్వాంతమునఁ గోరి
వేల్చి మిగిలిన హవిస్సునే వేభుజించి
అటులె దేవు నారాయణుని ధ్యానమందు
నిలిపి దర్భాసనమ్మున నిలిచె శ్రద్ధ. 125

సీతతోఁగూడ మౌనమున్ స్వీకరించి
మానసంబును నియమించి క్ష్మాపసుతుఁడు
శ్రీమహావిష్ణుమూర్తి వేంచేసియున్న
దేవతాలయమందు నిద్రించె నెలమి. 126

జామొకటె మిగిలిన రాత్రిసమయమందు
మేలుకొని సమస్తంబైన మేడనపుడు

చెలువులీనఁ సింగారింపఁజేసి యతఁడు
సూత మాగధ వందుల స్తుతుల వినియె. 127

మొదటిసంధ్య నుపాసించి హృదియు నిలిపి
జపముచేయుచు హరిని శిరసా వహించి
విమలమై నక్షౌమమును సంవీతపఱచి
యెల్లమంత్రాలు ద్విజులు పఠింప వినియె. 128

మధుర గంభీర పుణ్యాహ మంత్రఘోష
వాద్యముల ఘోషచేఁ బ్రతిధ్వను లొనర్ప
ఆ యయోధ్యాపురంబెల్ల వ్యాప్త మగుచు
నెల్ల ప్రజల మేల్కొల్పె నిద్రింపనీదు. 129

సీతతోడ రాముఁ డుపవసింప వినియు
సర్వమగు నయోధ్యాప్రజ సంతసించె
పిదప రామాభిషేకమ్ము వృత్తమెల్ల
విని పురి నలంకరించిరి వేగ నంత. 130

తెలిమబ్బుల్ శిఖరంబులట్లు చెలువౌ దేవాలయాలందుఁ బల్
నలువీథుల్ మొగలందుఁ జైత్యముల నానాట్టాల కాలందికన్
పలువస్తుల్‌గల పెన్బజారులఁ బురప్రాసాద శృంగాలపైఁ
బలుజెండాలు పతాకలున్ వెలసి యాహ్వానించు సర్వప్రజన్. 131

ఒకచోట నటులెల్లఁ బ్రకటరీతులఁ దమ
యెల్లనాట్యము ప్రదర్శించుచుండ
ఒకచోట నర్తకుల్ సకల నృత్యంబుల
జనుల కాహ్లాదంబు జరపుచుండ
ఒకచోట గాయకు లుజ్జ్వల గానాల
శ్రావ్యంబుగా విందు సలుపుచుండ

ఒకచోటఁ గథకులు నుత్సవ గాథలు
చెప్పి యుత్సాహంబు చేయుచుండ. 132

ఒక్కచోటఁ బ్రోగయి జను లులుకుచుండ
జనులు బృంద బృందాలయి చనుచుఁ దిరుగ
ఏ కడలఁగాని రామాభిషేక కథలు
చెలఁగి చేతురు రామాభిషేక వేళ. 133

బాలురును నాడుచును గృహద్వారములను
చెప్పుకొనుచుండ్రు రామాభిషేక కథలు
పూలకొమ్మలు, నగరు ధూపాల తావు
లెల్ల రాజపథుల నింపిరెల్ల ప్రజలు. 134

అందు వేలుగులకై సందుగొందులందు
కలుగు నిశిశంక దీపవృక్షముల నిడిరి
పురమలంకరించిరి ప్రజ పొంగి రాము
యౌవరాజ్యాభిషేకము నభిలషించి. 135

సభల నలువీధిమొగలను సంఘములుగ
చేరి జనులు రాజును ప్రశంసించి రపుడు
"ఏమి ! యిక్ష్వాకుకులరాజు నీతఁడెఱింగి
వృద్ధుఁడౌట సుతు నభిషేకించు ననుచు. 136

జనులలోఁ బరాపరములు గనెడి మనదు
రాముఁ డిప్పటికిని యువరాజయయ్యె
మన సుదృష్టంబు పండెడిం బ్రభువుచేత
మన మనుగ్రహింపఁబడితి" మని వచింత్రు. 137

మదిని గర్వింపఁ డిసుమంత నదయుఁ డితఁడు
ప్రాజ్ఞుఁడును ధార్మికుఁడు భ్రాతృవత్సలుండు
రాఘుఁ డనఘుఁడు మనల స్వభ్రాతలట్లు
స్నేహమున ప్రేమమునను వీక్షించు నెపుడు. 138

ఈ దశరథుఁడు చిరము జీవించుఁగాక
ఇతఁడు ధర్మాత్ముఁ డనఘుఁడ యితని దయనె
అల్ల రాఘవు డభిషిక్తుఁడై వెలుంగు
ఘనపు టుత్సవమును చూచు దినము వచ్చె. 139

ఇట్లు జనములు తమలో వచించుచుండ
రామునభిషేకము విని దూరములనుండి
రామునభిషేకమును జూడ రయము వచ్చు
చూపరుల నిండెఁగడు నయోధ్యాపురంబు. 140

క్షణము క్షణము పెరుగు జనౌఘముల ఘోష
వినబడియెఁ జెవుల్ గింగురుమనఁగ వేగ
బిట్టుపర్వాల లహరులు కొట్టుకొనఁగ
ఘోష ఘోషించు వారధిఘోష వోలె. 141

## —: మంధర కైకకు దుర్బోధ చేయుట

ఏడనో పుట్టి కైకేయికూడ నుండి
జ్ఞాతిదాసి మంధరయు నున్నట్టులుండి
యూరకేమియు ననుకొనకుండ చంద్రు
వలెఁ గళలిడు ప్రాసాదము పైకినెక్కె. 142

నీళ్ళుచల్లిన రాజమార్గాలు నలరి
చక్కగాఁ బఱచిన పూలసరులఁ దనరి
అందము లలంకరించిన యా యయోధ్య
నింక మంధర ప్రాసాద మెక్కి చూచె. 143

శ్రిత పతాకలచేతఁ జెలువు జెండాలచే
హర్మ్యభాగంబులు నలరుచుండ
స్వేచ్ఛాపథంబుల చెలువులఁ జెన్నారి
తల స్నానమాడు పౌరులు చరింప
మాల్యమోదకములం బాణుల ధరియించి
ద్విజవరులు నభినందించి నెగడ
సర్వవాదిత్రాలస్వనముల మ్రోగి
నమరెడి గుడుల ద్వారములు మెఱయ

జనులలరి పొంగ బ్రహ్మఘోషములు పఱల
ప్రబల గజరాజు, లెద్దులు ఱంకెలేయ
నలరు నా యయోధ్యను జూచి యప్పుడెంతొ
మంధర కడునాశ్చర్యంబునొందె మదిని. 144

అట్లు సంతోషమునఁ గన్ను లుల్లసిల్ల
తెల్లనౌ పట్టుపుట్టంబు మెల్లఁ దాల్చి
దగ్గఱనె యున్న ధాత్రిని దరిసి యపుడు
ప్రశ్నచేసెను మంధర ప్రస్ఫుటముగ. 145

ఏమి విధి కోరి మోదాన నిట్లు ప్రజకు
రామమాత యీ కౌసల్య ద్రవ్య మొసఁగు
నరులు కేరింత కొట్టుచుండిరి యుదేత
నృపతి ముదముతో పనులు చేయించునేల. 146

వ. అని యడుగుటయు-

మెండు సంతోషమున మేనె నిండిపోయి
పట్టికిఁ దన కడుపును పగులుచుండ
రామునికి శ్రీలు పట్టు వార్తలను గూర్చి
కుబ్జ మంధరతో ధాత్రి కొసరి చెప్పెఁ. 147

"ఇంక పుష్యమి నల్క జయించు- ననఘు
రాఘవుని రేప యౌవరాజ్యమందు
నృపతి దశరథుఁడు నభిషేకింప నెంచె"
ననుచు ధాత్రి కుబ్జకు చెప్పె నపుడు వేగ. 148

వ. అపుడు మంధర రోషముతో కైలాస శిఖరము వంటి ప్రాసాదము నుండి దిగి కోపము తన్నుఁ దగులపెట్టుచుండ పాపమును దర్శించునదియై గబగబ పోయి పరుండియున్న కైకేయితో నిట్లనెను. 149

లెమ్ము జడురాల ! యింకను నిద్రించుచుంటి
కొంప మునిఁగె భయము ముంచుకొనుచు వచ్చె
అకట ! కష్టంపు వరద గొట్టుకొనిపోవు
నిన్ను నింకను తెలిసికోనేర వైతి. 150

మహి ననిష్టురాల ! సుభగం మన్యురాల !
ఏమి సౌభాగ్యమున నిన్ను నీవె మెత్తు
వెల సౌభాగ్యమును నీది యిల చలంబు
నది ప్రవాహము వేసవినాటఁ బోలె". 151

ఇట్లు ఘోషించి పాపపుదృష్టి గలుగు
కుబ్జ యిట్లు చెప్పఁగఁ గైక కుమిలిపోయి
కుబ్జతోఁ బల్కె "మంధరా ! కుశలమెగద
వ్యగ్రముఖి! నిన్ను కడు దుఃఖవతిగ నెంతు". 152

మధురముగ నిట్లు కైకేయి మాటలాడ
మాటకారి మంథర యలి మండిపోయి
యింక దుఃఖించి కైకేయిహితము కొఱకు
వ్యథితయై రాముఁ జెడఁగొట్ట పలికె నింక. 153

"దేవి మాప శక్యముగాని నీ వినాశ
మెంతయో యిప్పు డేర్పడె నేల కనవు
ఈ దశరథమహారాజు నిపుడె రాము
యౌవరాజ్యాభిషిక్తుఁగా నలరఁజేయు. 154

నే నగాధమౌ భయమునన్ దిగఁబడితిని
దుఃఖ శోకాలతోఁగూడి తోఁచ కేది
వహ్నిచేఁబోలె దహియింపఁబడుచు నుంటి
నీ హితమె కోరి వచ్చితి నీదు దరికి. 155

నీవు బాధపడిన నెంతొ నేను గూడ
బాధపడుదుఁ గైకేయి ! నా పలుకు వినుము
నీవు వృద్ధిపొందఁగ వృద్ధి నేను గాంతు
నిందులో సంశయమ్ములే దింత కూడ. 156

నీవు నృపతివంశమున జన్మించినావు
మఱి యదియెకాదు నృపతికిన్ మహిషి వీవు
రాజధర్మములోని యుగ్రత్వ మీవు
నింక నిపుడైనగాని గ్రహింప వేల. 157

కరము ధర్మమాడును, మోసగాఁడు భర్త
చేరి తీయఁగ మాటాడు దారుణుండు
నీ వమాయకురాలవు నిజమె యెంతు
వంచుచేత నమ్మకపు ద్రోహంబు చేయు. 158

సమయమది వచ్చినపు డేది సలుపవలెనొ
అదియె చేయు, ఈ యోదార్యనర్థకమ్ము
అన్ని లాభాలు మాత్రము ననవరతము
అట్టి కౌసల్యకే పోయి యంటఁగట్టు. 159

తఱిసె దుష్టాత్ముఁడగు భర్త భరతు నెప్పుడొ
బంధువుల దగ్గఱకుఁ ద్రోచివైచె నింక
ప్రభువు ముళ్లు తీసి యిచె రాజ్యమందు
ఎల్లి యుదయాన రాము స్థాపించుఁ జుమ్ము, 160

పడిగ నొడిచేత మఱి త్రాచుపామువోలె
పతియునియెడు వాడుకచేత వైరి యిపుడు
క్షేమ మభిలషించెడి తల్లిచేతఁ బోలె
బాల ! నీచేఁ బరిహరింపఁబడియెఁ జుమ్ము. 161

బదులుచేయు కుపేక్షింపఁబడిన యరియు
సర్పమునుగాని యెటులేది సలుపుచుండు
రాజనుచుఁ బిల్వఁబడు దశరథునిచేత
కొడుకు నీవును గావింపబడితి రట్లె. 162

తీయఁగా బొంకి మఱి చెడ్డ చేయుచుండి
సతతము సుఖోచితమగు రాజ్యమ్మునందు
రామునిసె నిలబెట్టెడి రాజుచేత
సపరివారంబుగ నీవు చంపఁబడితి. 163

కనుక కైకేయి ! యీకాలమున నొనర్పఁ
దగిన నీ హితమును వేగ తగ నొనర్పు
సుతుని నిన్నును నన్నును నతిగ వడిగ
కావు మాశ్చర్యపడి యటు కనెదవేల". 164

అటు పలుకు మంథర మాట లాలకించి
నిండు పండు మొగమునఁ బరుండియుండి
శరదృతువునందు చంద్రుని చాయపోలె
ప్రమదమునఁ బొంగి యపుడు పైకి లేచి. 165

అప్పు డత్యంతమానందమంది కైక
మిగుల నాశ్చర్యమునఁ బొంగి యెగిరి లేచి
ఒక్క మంచి భూషణము మెడనుండి తీసి
వడిగ మంథర చేతిలో పడఁగ వైచె. 166

అంగనలలోన నుత్తమ యైన కైక
యట్లు కుబ్జ కాభరణము నలరి యిచ్చి
నమ్ర కంధరయైన మంథరను జూచి
యిటులు మెల్లగఁ గైక వచించె నంత. 167

"ఓసి ! మంథర ముందర వాసితోడ
ఎంత ప్రియమైనవార్త వచించినావు
ఇట్టి పరమప్రియము చెప్పినట్టి నీకు
ఇంకనేమి గొప్పదిచేతు నిపుడు చెప్పు. 168.

అట్టి రామునందు భరతునందుఁగాని
ఏమియు విశేషమును నిరీక్షింప నెపుడు
నృపతి మన రాముని నభిషేకించుచుంట
నధికముగ నేను సంతుష్టురాల నైతి. 169

ఇంతకుమించి నాకుఁ గడు తృప్తిని గూర్చెడి దేమి మంథరా !
ఎంతటి మంచిమాట వినిపించితి విప్పుడు నన్ను నీవలెన్
సంతసపెట్టువా రెవరు చక్కని వార్తను దెచ్చినందుకున్
ఎంతటి కాన్కయైన సరియే, మతి కోరు మికేమి యిత్తునో. 170

మంధర కైకమాటలకు మండి వగర్చి యసూయచెంది యా
నందముతోడఁ గైకయిడు నాభరణాల్ పడవైచి చెప్పె నీ
చందమ యజ్ఞురాల ! యిటు సంతస మొందఁగరానిచోట ని
ట్లెందుకు పొంగు, కూలితివి యెంతటి దుఃఖమహాబ్ధి మధ్యలో. 171

మది నవ్వాగక వచ్చుచున్నది కడుంబాధన్ విచారించుచున్
ముదముంబొందుట చూడ, నింతవ్యసనంబున్ బొందియో దుర్మతీ
ఎది హర్షంబిడుప్రజ్ఞ; యా సవతియే యీ పుత్రు రామున్ గనెన్
ఇదిగో వీడరికాఁడె మృత్యువలన న్నెతెంచు వృద్ధింబలెన్. 172

రాముతోపాటు భరతుండు రాజ్యమునకు
నమరి సాధారణంబుగ నర్హుఁడగుట
భరతువలన రాముని కెపు భయమె యనుచు
తలచి వగతు భయము భీతువలన కలుగు. 173

లక్ష్మణుండౌ మహాధన్వి రాము నెపుడు
నెల్ల విధములచే నాశ్రయించి యుండు
అట్లె శత్రుఘ్నుఁడు భరతు నాశ్రయించె
సరిగ రాముని నెపుడు లక్ష్మణుఁడువోలె. 174

దగ్గఱగుజన్మ వరుసచే తగుట వలనఁ
గూడ భరతునిదే రాజ్య మేడనైన
చిన్నవారికో రాజ్యంబు చేరు క్రమము
చాల దూర మమాయకురాల ! కైక ! 175

క్షత్ర చారిత్ర్యమునఁ బ్రజ్ఞ కలుగువాఁడు
సమయమునకుఁ దగినయట్లు జరుగువాఁడు
ప్రాజ్ఞుఁడౌ రామువలన నీవట్టి కిపుడె
భయము సమకూరునని యెంచి వణఁకిపోదు. 176

చాల సౌభాగ్యవతియె కౌసల్య యెపుడు
ఆమెసుతుఁ డింత యౌవరాజ్యమునఁ గాదె
అమర రేపె గాయా ద్విజో త్తములచేత
ఇట్లు పుష్యమిని నభిషేకింపఁబడెడు. 177

ఇటుల చాల మహా ప్రీతి నెనసి మిగుల
తనదు ద్వేషులు పోయినారనుచు నమ్మి
పొంగిపోయి కౌసల్యను వంగి వంగి
చేతులొగ్గి దాసిగ నుపాసింతుగాని. 178

నీవెకనుక మాతోపాటు నీ సపతికి
దాసివగుచు వంగి సలాము చేసితేని
నీమదికివచ్చు పుత్త్రుఁడున్ రామునికిని
దాసుఁడై వంగియె సలాముచేసి పోవు. 179

రాము పట్టపుస్త్రీలు హర్షంబు పొంది
యలరి పొంగిపోవుదురు నీవలన నీదు
భరతుఁడు క్షయంబుగన నీకుఁ గరముకూర్చు
కోడళుల పాట్లు దేవుఁడౌవాఁడె యెఱుఁగు. 180

ఈవిధంబుగ నత్యంతమెంచి మెచ్చి
పలుకుచున్నట్టి మంథరన్ జెలఁగి చూచి
దేవి కైకేయి రాముని దివ్యమైన
గుణములనె మాటిమాటికి కొసరి పొగడె. 181

---

* ఇది మంథర వాక్యము. హాస్యము చేయుచు నిందకై యిట్లు స్త్రీలు అని బహువచనము వాడెను. కోడలులు అన్నదికూడ పరిహాసమునకె. అందుచే రామునికి ఎక్కువ భార్యలున్నారని తలచరాదు.

"రాముఁడు కృతజ్ఞుడు గురువుల్ వంచి నారు
సత్యవాది ధర్మజ్ఞుఁడు శౌచపరుఁడు
రాజునకు జ్యేష్ఠపుత్త్రుఁడు తేజమొప్ప
నతఁడు యౌవరాజ్యమునకు నర్హుఁ డగును. 182

భ్రాతలను భృత్యులను తండ్రివలెఁ గరంబె
యా చిరాయువు పాలింపనయినవాఁడు
ఎందుకే కుబ్జ ! యింతగాఁ గుందుచుంటి
వహహ ! రామాభిషేచన మాలకించి. 183

పురుషవరుఁడు భరతుఁడు రామునికి నూఱు
వత్సరములు గడవఁగ నవశ్యమపుడు
తాతతండ్రుల రాజ్యంబు ప్రీతిఁబొంది
చక్కఁగాఁ బరిపాలన సలుపుఁగాదె. 184

అందుచే నీవు మంధర ! యభ్యుదయము
పరమకళ్యాణ మెపుడొ ప్రాప్తంబు కాగ
మునుపు నిప్పుడున్ ముందుగాఁ బోవుచుండ
ఎందుకే కుబ్జ ! యింతగాఁ గుములుచుంటి. 185

రామునికి రాజ్య మబ్బినట్లె న నెంతొ
అంతె భరతునికిని రాజ్య మబ్బినపుడు
తన్ను రాముఁడు సెట్లుగాఁ దలచుకొనునొ
భ్రాతలనుగూడ నట్లె తలంచుకొనును. 186

అంత కైకేయి వచనంలాలకించి
మంధరయొ కడు దుఃఖంబు పొంది కుమిలి
వేడి నిట్టూర్పు నిట్టూర్చి వ్రేలఁబడుచు
అపుడు కైకేయికిరీతి నరసిచెప్పె. 187

"ఓ యనర్థ దర్శిని ! మౌర్ఖ్యంబునొంది యిట్లు
నిండు శోకాల వ్యసనాల నిండిపోయి
దుఃఖసాగరమునఁ గ్రాలి తూలి మున్గు
నిన్ను నీవిప్పుడు తెలియనేరకుంటి. 188

రఘుకులస్థుల పుత్త్రుఁడౌ రాఘవుండు
రాజుగా రేప యికఁ గాఁగలండు కాన
నరగ కైకేయి ! రాజవంశాననుండి
యైతె భరతుండె పరిహాసార్హుఁ డగును. 189

రాజులు సుతులందఱిఁగూడ రాజ్యమందు
అట్టిపెట్టరు సుమి ఓసి ! యాడుదాన
ఒక్కవేళ నట్టులఁ బెట్టియుంచు నెడల
చాల గొప్ప యన్యాయంబు జరిగితీరు. 190

కనుకనే జ్యేష్ఠపుత్త్రునందు ననె కైక !
పార్థివులు రాజ్యతంత్రముల్ వడగ వేతు
రిది నిజము గుణాఢ్యులునైన యితరులందుఁ
గూడ స్థాపింత్రు విమలాంగి ! చూడు మిపుడె ! 191

కాని యీ నీసుతుఁడు దిక్కులేని యట్లు
రాజసుఖముల నుండియు రాజకులము
నుండిగూడఁ బూర్ణముగ భగ్నుఁడె యగును
ఓసి ! ఘన పుత్రవాత్సల్య మున్నదాన. 192

నేనా నీకొఱకే వచ్చినాను కాని
నన్ను నీవుమాత్ర మెఱుఁగ కున్నదాన
విపుడు సవతి వృద్ధినిపొంద నింక నీవా
యివ్వదగినటు కాన్క నాకిచ్చుచుంటి. 193

కంటకములేని రాజ్యంబు గాంచి రాము
డిపుడు నీసుతు భరతుని నింక విధిగ !
నరసి దేశాంతరమ్మొ లోకాంతరమ్మొ
తప్పకుండఁ బంవగలఁడు తన్వి ! వినుము. 194

బాలుఁడుగనుండఁ గనె నీవు భరతు నెపుడొ
మేసమామ యింటికిని పంపించినావు
అతిదరిగ నున్న యెడల సౌహార్ద్రి మెపుడు
స్థావరములఁగూడ జనించి స్థానమొందు. 195

అంత శత్రుఘ్నుడునుగూడ ననుగమించి
యోలి భరతునితోఁగూడ నుండిపోయె
ఎటులు రాముని లక్ష్మణుం డెనసియుండె
నట్లె భరతుని శత్రుఘ్నుఁ డాశ్రయించె. 196

ఒక్క చెట్టును వనజీవు లొక్కసారి
కొట్టఁ దగియుండె నద్దానిఁ గొట్టకుండ
ముళ్లదుబ్బులు చుట్టును మొలచి పెరిగి
చెట్టుఁ గొట్టక విడిపించినటులు విందు. 197

రామునిన్ లక్ష్మణుండును రక్షచేయు
లక్ష్మణుడుఁగూడ రాముని రక్షచేయు
వార లిద్దఱకున్న సౌహార్ద మెపుఁడు
నశ్వినీదేవతల కట్లు ఖ్యాతమయ్యె. 198

కనుక లక్ష్మణునికి రాము డనయ మెపుడు
నెట్టి పాపమైనను నాచరింపఁబోడు
కాని రాముఁడైతె భరతుపైని పావ
మాచరించును నిదియె ఖాయంబు సుమ్మి. 199

ఇందుచే నీసుతుఁడు రాజగృహము నుండె
వనికిఁబోవుట మంచిది యని తలంతు
నాకు తోఁచె నిట్టి సలహా నీకుఁగూడ
నిదియె హితమని యెంతుఁ జింతింపు మదిని. 200

భరతుఁడె కనుక ధర్మంబువలన నివుడె
పిత్ర్యమగు రాజ్యమొందుచో వేగనిపుడు
జ్ఞాతి పక్షంబునుగూడ సకలమైన
శ్రేయసునుగూడఁ దప్పక చేరు నిజము. 201

సుఖములం బొందఁదగిన నీ సూనుఁ డింక
రామునకు సహజంబైన ప్రబల రిపువె
రాజ్యసంపద వర్ధిల్లు రామువశత
నెట్లు భరతుఁడుండును రాజ్యమెల్లఁ బోయి. 202

వనిని సింహవ్యాఘ్రమునుండి పొంచి దాగి
యున్న గజయూధపముఁ బోలియున్న నీదు
సుతుని భరతుని నెచటనో చూడకుండ
దాచి రామునుండియుఁ బ్రోవఁదగుదు వీవ ! 203

నీవు సౌభాగ్యవతినంచు నిండు దర్ప
మొంది ధిక్కారమును చేసియుంటివి గద
సవతియైయున్న యా రామజనని యిప్పు
డా కసిని దీర్చుకొనకుండ నాగఁగలదె. 204

ఇటు రత్నాకరపత్తనాద్రితతితో నింపారు నీ ధాత్రి ని
చ్చట రాముం డెపుడైతె పొందె నపుడే సర్వావమానంబు లొం
దుట తథ్యం బిక నీవునీదు భరతుండున్ నష్టమైపోక యిం
కెటొ రాముండును పోవునట్టి సెరవున్ వీక్షింపవా భామినీ. 205

వ. అప్పు డది విని కైకేయి క్రోధముచేత మండి మొగ మెఱ్ఱపడ దీర్ఘ
ముగా వెచ్చ నిట్టూర్చి మంథరతో నిట్లనెను. 206

"ఇపుడే యిచ్చటనుండి కానలకుఁ బంపింతున్ వడిన్ రామునిన్
ఇపుడే నిల్పెద వేగమే భరతు నేనీ యౌవరాజ్యంబునన్
చెపుమీ యెట్టి యుపాయమేని భరతున్ జెందంగ నీరాజ్య మిం
కిపు డెట్లైనను రాముఁడున్ పడయురా దీరాజ్యమున్ మంథరా! 207

వ. అని యిటు కైకేయీదేవి చెప్పిన మాటలు విని పాపపు దృష్టి గలిగి
రాముని ప్రయోజనము పాడుచేయుఁ దలచిన మంథర యపుడా కైకతో
నిట్లనెను. 208

సరియే మంచిది యొక్క నీభరతుఁడే సామ్రాజ్య మెట్లొందు నీ
వర యున్ జెప్పెద విస్మరించితివి లేకన్ జ్ఞప్తియందున్న నే
నెఱిగింపన్ వినగోరుచుండితివొ, యైతే విన్ము యోచించుమీ
సరె నేఁజెప్పినదానినిన్ విని విమర్శంజేసి వర్తింపుమీ. 209

అపుడీ మంథర వాక్కులెల్ల విని యింకా కైక సొంపైన పా
నుపునందుండి రవంత లేచి పలికెన్ గోపంబుతో "మంథరా!
చెపుమీ యెట్టి యొపాయమేని భరతుం జెందంగ నీ రాజ్య మిం
కెపు డెట్లైనను రాముఁడో పడయురా దీ రాజ్య మావంతయున్. 210

వ. అని యిటు కైకేయిదేవి చెప్పిన మాటలు విని పాపపు దృష్టి కలిగి
రాముని ప్రయోజనము పాడుచేయుఁ దలచిన మంథర యపుడు కైకతో
నింకను నిట్లనెను. 211

మును దేవాసురు లెంతొ ఘోరపు రణంబున్‌చేయ రాజర్షులన్
గొని నీతో సురరాజు సాయమునకై క్షోణీధవుండేగె ద
క్షిణగా, నక్కడ దండకాటవిని వార్ధిన్ జై జయంతం బనన్
ఘనమౌ నట్టి పురిన్ తిమిధ్వజుఁడనన్ రాజుండి యేలెన్ ధరన్. 212

అతనిన్ శంబరుడండ్రు వాఁడు శతమాయావేది దైత్యుండు దే
వతలన్గెల్చి సురేంద్రుతో మిగులఁ దీవ్రంబౌ ననిన్జేయ నా
క్షతులై కూలినవారి సుప్తులను స్వేచ్ఛన్ రాక్షసుల్ చంప సం
తతమై యుద్ధము ఘోరమై జరగెఁగా తత్కాలమందున్ గదున్. 213

అసురులును శస్త్రములచేత నపుడు కొట్ట
తన్మహాయుద్ధమున రాజు దశరథుండు
మూర్ఛఁబడె: స్మృతి లేకపోవు పతిని
నీవు తప్పించి రక్షించినావు గాదె. 214

అందుకును రాజు ముదమొంది యపుడు నీకు
రెండు వరముల నిచ్చె నా రెండు వరము
లిష్టమైనప్డు కోరెద నిత్తుగాని
యనుచు నంటివి సరి యట్లె యనియె పతియు. 215

ఇదియు నీవును మఱచినా, విడియె నీవు
మున్ను చెప్పితి, నీ స్నేహమునసె నేను
జ్ఞాపకం బుంచుకొంటిని కైక! మొదట
రాము నభిషేక సామగ్రినే మరల్చు. 216

ఆ వరము లిప్డు కోరుమి నీవు వినుము
భరతుడే యౌవరాజ్యంబు పడయు టొకటి
పదియు నాల్గేండ్లు రాముఁడు వనికిఁ జనుట
రెండవది: ఇటు వరములు రెండు కోరు. 217

పదియు నాల్గేండు రాముఁడు వనికి పోవ!
ప్రజల భావంబెఱిగి వారి వశముచేసి
వారియెడ స్నేహమును జూపి పాలనంబు
చేయ పుత్త్రుడు రాజ్యాన స్థిరుడె యగును. 218

అశ్వపతిపుత్రి ! కోపగృహంబు నిపుడె
చొచ్చి వట్టి కటికనేల చూచి యచట
మాసిపోయిన వస్త్రంబు మఱి ధరించి
పండుకొనియుండి పడియుండు పైకి గనకు. 219

అతఁడు వచ్చినన్ వానిపై పసలు గనకు
వానితో నేమి మాటాడవలదు సుమ్మి
భువిని శోకముతోఁగూడ మివుల పొగిలి
పార్థివుని చూచి యేడ్చుచు పడియె యుండు. 220

ఈవు సర్వదా భర్తకు నెంతొ ప్రియువె
ఇందులో నింత సందేహ మేమిలేదు
నీకొఱకు మహారాజు నిరత మింక
అగ్నిలోనైనఁ బడ సంశయంబు పడడు. 221

కోపము నీకుఁ గూర్ప శక్తుండుగాఁడు
నీవు కోపపడఁగ నిరీక్షింపలేడు
నీకు ప్రియమును గూర్పగా నిరతమతఁడు
వేగ ప్రాణాలపైనను విడిచిపెట్టు. 222

మణులు హారాలు బంగారు నగలు మఱియు
నమ్మ మెప్పైన రత్నాలు కుమ్మరించు
ఆ దశరథమహారాజు మీదఁ జిమ్మ
కాని యావంత వానిపైఁ గాంక్షగొనకు. 223

నృపతి నీవు చెప్పిన వాక్య మింత కూడ
ఎపు డతిక్రమింపగ సాహసింపలేఁడు
ఓసి మందమతి ! తెలివి నొందినావె
నీదు సౌభాగ్యబల మట్టి నేర్పు గలది. 224

ఏమి దేవాసుర రణాన నృపతి నీకు
ఇచ్చెదనని వాగ్దానము నిచ్చినాడొ
ఓ మహాభాగ ! జ్ఞాపకం బొనరఁజేయు
ఆ మహాప్రయోజనము నిన్నేమి విడదు. 225

ఎప్పుడైతే స్వయముగ నిన్ నృపతి లేపి
వరము లిచ్చితి కోరుకో వరము లన్న
నప్పుడే మహారాజును తప్పవటుల
శపథములచేత నొప్పించి యపుడెకోరు. 226

పదియు నాలుగు వత్సరాల్ వనికినేగ
రాము నిటనుండి పంపుము గ్రహణగల్గి;
భరతుడో సర్వధరణికి ప్రభువు కాఁగ
నీవు గట్టి యేర్పాటు గావింపు సరిగ. 227

పదియు నాల్గేండ్లు రాముండు వనికినేగ
కొమ్మలు వెడలి మొదలునుగూడఁ బెరుగ
బాగుగా పాతుకొని వ్రేళ్లుపట్టి మిగుల
కోరు స్థిరపడి తర్వాతగూడ నుండు. 228

దేవి ! రాముని నడవికి నీవు పంపు
దానినే నీవు కోరుమి తథ్యముగను
అందువల్లను నీకు పర్వార్థములును
నింక సిద్ధించు నిది సత్య మిదియు నమ్ము. 229

ఇటులు రాముఁడు నడవికి నేగినంత
అతఁడొ యరాముఁ డయిపోయి యణఁగిపోవు
ని భరతుఁడొ శత్రులఁ జంపి నిరత మింక
వేగ విశ్వంభరకు రాజు కాఁగలండు. 230

ఎంత కాలంబునకు రాముఁ డింక నిటకు
వనమునుండి క్రమ్మఱి వచ్చు నింత
లోన లోపైని నీ సుతు డోపినంత
వ్రేళ్లుపాతుకొని స్థిరత వెలయుఁగలఁడు. 231

చక్కఁగా సర్వమనుజుల సంగ్రహించి
స్నేహితులతోడ నాత్మతోఁ జెలఁగియుండు
సాధ్వసము వీడు పతి లొంగు సమయ మిదియ
రాము నభిషేక సామగ్రినే మరలుచు". 232

ఇపు డనర్థ మర్థముగ గ్రహింప మలచ
నప్పు డా కైక మెచ్చియు నతిగ నమ్మి
గూనిదాని వాక్కున నాడు గుఱ్ఱి మట్టు
లాకసమున కెగిరి యుసె నచ్చెరువడి. 233

"గూనిదానరో గొప్పగా గొప్ప వాక్కు
చెప్పు నిన్న వమానింప క్షితిసె నీవు
బుద్ధిచే నిశ్చయమ్ముల సిద్ధపఱచు
కుబ్జలందుసె శ్రేష్ఠపై కూడ నుంటి. 234

నీవె నా విషయమ్ముల నిత్య ముండి
హితము కోరెడిదానవు నీవె సుమ్ము
కుబ్జ! రాజు గావింపఁగఁ గోరు కోర్కె
నేను తెలిసికొనక పోయినాను జుమ్మి. 235

కుబ్జ లెప్పుడును వికృతాంగులుగ నుంద్రు
వంకరకె వంకరలు నేర్పు పాపమతులు
నీవొ యటుగాక తామరపూవు వోలె
గాలికిని వంగి ప్రియముగాఁ గానఁబడెదు. 236

చూడు నీ ఱొమ్ము భుజములంజొచ్చి యాగె
ఱొమ్ము మూపుల దాకను క్రమ్మి పెరిగె
పొట్ట సన్నమై క్రిందికిపోయె, మంచి
బొడ్డుగలిగె ఱొమ్మునకు సిగ్గు పొందెనేమొ. 237

పిఱుదులివి నిండె చోటేది పెఱుగుటకును
నీదు పాలిండ్లు పొగరుతో నిండిపోయె
నీ మొగము స్వచ్ఛ చంద్రుండై తెఱసి వెలిగె
ఓసి! మంధర! యందాలరాశి వీవు. 238

బొడ్డు క్రిందిభాగమొ నున్న గడ్డఱాయె
మొలను బిళ్లల మొలత్రాడు చెలువు లీను
పిక్కలో బాగు మోకాళ్ల నెక్కి సాగె
వింటె రెండుకాళ్లనుగూడ నొంటె కాళ్లె. 239

నీవు మంధర! యందాల నిడుద తొడల
తెల్ల పటుపుట్టము దాల్చి మెల్లగాను
నా యెదుట నిటు లటులును నడుచుచుండ
రాజహంసిక పోలిక మోజు గాంత్రు. 240

అసుర రాజైన శంబరునందు నెట్టి
వేలకొలది మాయలు నుండె వెదకి చూడ
నవ్వి యన్నియు నింకను నవని యందు
మన్నవన్నియు నీయందె యొప్పుచుండె. 241

అదియె నీఱొమ్ము పెనుదిమ్మ అదియె పెరిగి
రథపు ముక్కునుబోలె దీర్ఘమయి నీదు
మతులు క్షత్రవిద్యలు మాయ మర్మములకు
అన్నిటికి నిది కోశాగారమై వెలుంగు. 242

భరతుఁడును యౌవరాజ్యంబు పడయ నె
వనమునకు రాముఁడో వేగచనిన పిదప
మెఱుగు బంగారు మాలిక నెఱయుదిర్చి
నీడు పెనురొమ్ము దిమ్మపై నెఱయు గూర్తు. 243

దివ్యమగు నీదురొమ్ము పెన్ దిమ్మమీఁద
మేలి బంగారుమాలిక లీల వైచి
మేలి గంధపుఁ బూతలు చాలపూసి
బాగుగ నలంకరింతును ప్రజలుపొగడ. 244

పందెమునకుఁ జంద్రుఁబిలిచి వందెమేయు
సాటిలేని మొగముగల బోటివగుచు
శత్రువులముందు గర్వంబు సారమెఱుగ
లీలఁ ద్రిప్పుకొనుచు విహరింతుగాని. 245

అన్ని యాభరణంబుల నెన్ని దాల్చి
కుబ్జ లేతెంచి నీ యడుగులకు మడుగు
లొత్తుచును చాలసేవింత్రు మెత్తగాను
సర్వదా నాకు శుశ్రూషలు సలుపునటులు. 246

ఇటు కైకేయిచేత స్తుతింపఁబడుచు
జన్నపుటరుగుపై నిప్పుజ్వాలవోలె
క్రమమగు పాన్పుపై సోలు కైకకపుడు
నమ్ర కంధర మంధర నయతఁబలికె. 247

"ఓసి! కళ్యాణి! కైకేయి యురికిపొమ్ము
జలము పోవఁ గట్టినగట్టు ఫలితమేమి
లెమ్ము కైకేయి! కోపగృహము పతికి
చూపుమింక నాలస్యము చూపబోకు. 248

అతుల ప్రోత్సాహపఱపఁగా నరిగి కైక
కుబ్జతోపాటు చేరి యా కోపగృహము
ఆ విశాలాక్షి సౌభాగ్య భావగర్వ
మూని వేలకొలఁది హారముల త్యజించి. 249

దివ్యమగు శుభభూషలు తీసివైచి
పసిడి మేనున నొప్పు నా పద్మనేత్రి
కుబ్జపలుకులకు వశమై కోపగృహము
దరిసి కటికనేలఁ బరుండి దాసికనియె. 250

నేను చచ్చితిని కుబ్జ! నృపతికిటులు
నీవు వచియింపఁగలవు లేయింక మీద
వనమునకు రాముఁడంత చనిన పిదప
భూతలంబును భరతుండు పొందగలడు 251

నాకుఁ బసిడితోఁగాని రత్నములతోడఁ
గాని విందుభోజనముతోగాని పనియె
యింకలేదు రాముఁడభిషేకింపఁబడిన
నిదిగొ నాజీవితమునంత మెనసిసట్లె. 252

వ. పిదప కైకేయి యిటుచెప్పగా విని మరియు మంథర ఆ రాజ మహిషితో మిగుల నుద్రేకము పెట్టు వాక్యములతో భరతుని తల్లికి హితమును రామునికి అహితము గలుగు మాటలుచెప్పి యిట్లనియె. రాముఁడే గనుక రాజ్యము పొందినచో నీవు నీ కుమారునితోగూడ పరితాప మొందగలవు. కనుక నీ కొడుకు అభిషేకింపబడునట్టు ప్రయత్నింపుము అని యిటు కుబ్జచే మాటి మాటికి వాగ్బాణములచేఁ గొట్టఁబడి చేయి గుండెపై నుంచుకొని కోపించి ఏమి నాయందు ఆసక్తి కల రాజు నాకనిష్టము చేయునాయని యాశ్చర్యపడి మాటి మాటికి కుబ్జతో నిట్లనెను. ఓసి కుబ్జా! నేనిటపై నుండి యుపవాసమునకైనఁ బోయినటు తెలిసికొందువులే. లేక రాముఁడడవికిపోఁగా భరతుడైనను సమృద్ధ

కాముఁడై రాజ్యమునైనను పొందఁగలడు రాముఁడే కనుక అడవికి వెళ్ళనిచో పాన్పులుగాని, మాలలుగాని, చందనముగాని, కాటుక, నీళ్ళు, భోజనమును గాని తీసికోను. అసలు జీవింపనే జీవింపను. అని కైక యిట్లు దారుణముగాఁ జెప్పి సర్వాభరణములను పాఱవైచి చాపయైనను లేని కటికనేలపై పరుండెను అపుడు. 253

అతిగఁ గోపతమస్సుచే నాదరింపఁ
బడిన మోము గలిగి పరాభరణములను
తీసి విమనస్కయౌచు క్షితీంద్ర పత్ని
ఉడువు లడఁగ తమము గప్పు వ్యోమమయ్యె. 254

దుష్టురాలైన మంథర దుష్టబోధ
యంత కైకేయి బాగుగా నాలకించి
విషముపూసిన శరముచే విద్ధయైన
కిన్నరాంగన వోలెను క్షితిఁ బరుండె, 255

సలుపవలసిన కృత్యంబు చక్కగాను
మనసుచే నిశ్చయించియు మానవతియు
మంథరకు విచక్షణయై సమస్తమపుడు
తగినరీతి నివేదించె తత్క్షణంబు. 256
ముందు మంథరవాక్యాల మోహమంది
దైవ వంచితయై నిశ్చితమ్ము చేసి
త్రాచుపామటు బుస్సని తరుణి వెచ్చ
నతిగ నిట్టూర్చి సుఖమార్గ మందఁ దలచె. 257

అర్థకామ మంథర మిత్రురాలు పిదప
కైక నిశ్చయంబును విని కరము ప్రీతి
పొందినది యౌచు తన కార్యములు ఫలింప
సిద్ధి పొందినటు తలంచె చిత్తమందు. 258

అవలఁ జిత్ర మాల్యములు దివ్యాభరణము
లన్ని తీసివైచుచుఁ గైక యవని వేయఁ
దిసివేయఁబడి భువిపై దీప్తిచెందె
నాకసమున నక్షత్రములట్టు లపుడు. 259

కోపగృహమున మాసిన కోకఁదాల్చి
పగలచే నొక్కజడనె గట్టిగను కట్టి
నేలఁబడియున్న కైక యావేళఁ దనరె
క్షీణబల యౌచు పోలిన కిన్నరి వలె. 260

ఆ దశరథసార్వభౌము రామాభిషేక
మాచరింప నాజ్ఞాపించి యట నమాత్య
మంత్రులఁ బురోహితుల స్వమందిరముల
కనిపి స్వనివాస భవనంబు కరిగె నపుడు. 261

ఇంక రామాభిషేకంబు నెసఁగు ననుచు
అనుకొనుచు నీప్రియము ప్రియురాలు కైక
యెఱుగఁ జెప్పుటకై యంతఃపురము చేరి
అచట కైక శ్రేష్ఠగృహంబు నరసి యంత. 262

చిలుకలు నెమిళులు చెన్నారు హంసలు
క్రౌంచపక్షులు కూడి మించియుండ
వాద్యాల నాదముల్ పరగి విందులు చేయ
మరగుజ్జు కుబ్జలు తిరుగుచుండ
తేనెల పొదరిండ్ల దివ్యచిత్ర గృహాల
చంపకాశోకముల్ నింపివైవ
కొమ్ములన్ వెండితో కొమరు బంగారుతోఁ
గూర్చిన వేదికల్ తీర్చి యుండ, 263

నిరతము విడు పూవుల పండ్ల తరువు లమర
దిగుడు బావులన్ భక్ష్యాల దివ్య మగుచు
కొమ్మ వెండిబంగారు టాసనమ్ము లమరు
విలువగల నగలను నిండు వేశ్మదరిసె. 264

వ. అటు దశరథమహారాజు కైక మందిరమున రాహువు విడిచిన చంద్రుడు తెలిమబ్బుల యాకసమును బోలెం బ్రవేశించి యందు కొమరుం బాన్పునం బ్రియురాలు కైక లేకుండుటను జూచి కాముకుండై రతిక్రీడలందేల దయితయగు భార్య కనంబడమి విషాద మొందెను. ఇదివఱ కెప్పుడును దేవి కైక యదనుతప్పి యుండలేదు. రాజు శూన్యమైన గృహమునుగాని ప్రవేశింపలేదు. అంత ఇదివఱకు వలె దేవిని స్వార్థ లాభమును గోరు నవివేకురాలి నిగా నెఱుంగక యక్కడనే యున్న ప్రతీహారి నడుగ ఆమె భయముతో చేతు లొగ్గి, దేవా ! దేవి మిగుల కోపించి కోపగృహమువైపు పరుగిడినది, అని వచింప రాజు మనస్సున బాధచెంది యింద్రియములు వ్యాకులమయి తిరుగు చుండ ఇంకను మరల విషాదము పొందెను. 265

త్రెంపి క్రిందనువేయు తీవియు పోలెను
మెసను జాఱిన యప్సరసయు పోలె
పడిన దేవతవోలె వణకు కిన్నరిపోలె
మహి భ్రష్టయై పడ మాయవోలె
బోయవాండును వేగపోయియు వలలున్
నదిమి బంధించిన హరిణిపోలె
వేటకాండు వనాన విషపు బాణంబున
న్గొట్టిన యాడునేనుగును పోలె

తగని కటికనేలం బరుండి పొగులుచున్న
పాపసంకల్పం గమలాక్షి భార్యం దరుణి
భీతితో పాపమేలేని వృద్ధుండై న
రాజు గజరాజువోలెం గరాన స్రొకె. 266

—: దశరథుఁడు కైకను కోపకారణమడుగుట :—

వ. మఱియు నామెను చేతులతోఁ దాకి తట్టుచు నిట్లనియె. 267

నీ మది కోప కారణము నే నెఱుఁగన్ ! ప్రియ ! యెవ్వరైన నీ
కేమి యొనర్చినారె యెవరేనియు నిన్నవమానపర్చిరా
యేమిటి నేను దుఃఖపడ నేటికి దొర్లెదు దుమ్ములోన నీ
క్షేమమె చూతు, నుంటివి యికేల పిశాచము పట్టినట్లుగన్. 268

కుశలుల్ వైద్యులు నాకడన్ గలరు యోగ్యుల్ తుష్టు లవ్వారు నిన్
కుశలన్ జేయఁగలారు, రోగమెదొ నాకున్ జెప్ప నేదేని నీ
కు శుభం బేనొనగూర్తు నప్రియము నీకుంజేసెనా యెవ్వఁడేన్
కుశలంబొందెదుగాక యేడువకు నీకున్ శోష గాకుండుతన్. 269

ఏ యవధ్యుని వధ్యుఁ గావింపవలెనొ
వధ్యు నెవ్వని విడిపింపవలెనొ చెప్పు
ఏ దరిద్రుని ధనికుఁ గావింపవలెనొ
ఏ ధనికు దరిద్రుగను గావింప మనెదు. 270

నేను నావారు నీ వశం బైనవారె
నీ యభీష్టము పోగొట్ట నేఁ దలంప
నాదు జీవిత మిచ్చియున్ నీదు సుఖము
చేయఁగోరుదు నీ కోర్కె చెప్పు మేదొ. 271

నీ బలమెదొ తెల్పియు శంక నీకదేల
త్వత్ప్రియ మొనర్తు నీ సుకృతంబు తోడె
ఎంతవఱకు సూర్యుని రథం బేగుచుండు
నంతవఱకు నా వసుమతి వ్యాప్తమయ్యె. 272

సింధు సౌవీరము లను ప్రాచీన భువులు
ప్రకట దక్షిణాపథిని సౌరాష్ట్రములును
మాగధాంగ వంగముల్ మత్స్యములును
ఆ సమృద్ధములును కాశి కోసలములు. 273

అందు పుట్టిన ద్రవ్య మజాదికంబు
ధనమొ ధాన్యమొ కోరు మేదైనఁగాని
ఎదియు నెది నీవు కోరుదో యదియు నదియు
కోరు కైకేయి ! లేలెమ్ము కుందనేల. 274

ఎట్టి భయమేని వచ్చిన నిప్డె తీర్తు
మంచును రవివోలె త్రుటి నడఁచివైతు"
అనుచు నోదార్పఁ దేవి నా యప్రియంబు
తెలుప నెంచి పతి నింక బాధింపసాగె. 275

వ. అంత ఆ దశరథుని మాటలు విని కాముని శరములచే గొట్టబడి కాముని వేగమున కవశుండైన రాజుతో కైకేయి ఈవిధముగా దారుణవాక్కు పలికెను. 276

నీ వపకార మేది యొనరింపవు సన్నపమానపర్చలే
దీవును వేరు, నాకు ప్రియ మిప్పుడ నీ వొనరింపఁగావలెన్
నీవు ప్రతిజ్ఞచేయు మొనరింపఁగ నీకు నభీష్ట మైనచో;
నీవొనరింతువేని వచియించెద, నా ప్రియమైన కోరికన్. 277

అన మహారాజు కైకేయి నలసి పైకి
కొంచెము చిఱునగవు నవ్వి కురులు దువ్వి
క్షితిని బడియున్న యామెను చేతిలోకి
తీసికొని కామి యాతఁడు తెలిపె నిట్లు. 278

ఏమె సౌభాగ్యగర్వితా! యెఱుఁగ వీవు
నాకు నీకంటె ప్రియుఁడౌ జనంబె లేరు
మనుజవరుఁడైన రాముకన్నను ప్రియుండు
ఈ జగతి నెవ్వఁడును లేఁడ యెఱుఁగు మీవు. 279

అట్టి గెల్వ శక్యముగాక యధికుఁ డగుచు
జీవితముకంటెఁ గూడను శ్రేష్ఠుఁ డయిన
దొర మహాత్ముఁడౌ రామునితోడె సుమ్ము
ఏది మదిని కోరుచుంటివో యదియె కోరు. 280

ఏ మనుజున్ క్షణంబుగనకే నిఁక జీవితము నిల్పలేనొ యా
రామునితోడె యొట్టె మఱి రమ్మొనరించెద నీదు కోరికన్
ఏ మనుజున్ మదీయతనువిచ్చి సుతాదుల నిచ్చికొందు నా
రాముని తోడె యొట్టె మఱి రమ్మొనరించెద నీదు కోరికన్. 281

భద్రురాల! నా యీ హృది బాగుచూడ
ఓసి! కైకేయి! ననుగాంచి యుద్ధరింపు
ఏది మంచిగా నీకును నిపుడు తోచు
అదియె యోచించి చెప్పుము న్యాయరీతి. 282

నీ బలమెదొ తెల్సియు శంక నీ కదేల
త్వత్ప్రియ మొనర్తు నీ సుకృతంబు తోడె
అనఁగ నట్టి మదిగలిగి యతని తలఁపు
కాంచి పక్షపాతములేని కరణిఁ దోప. 283

సంతసిలి కైక ఘోరమై చాల కష్ట
మగుచు దుర్వచంబగు తన యాశయంబు
నింటికిని వచ్చు నంతకు వంటిదగుచు
బాధ కలిగింప నీ రీతి పలికె కైక. 284

క్రమముతో నొట్టుపెట్టి వరం బిడితివి
దీని నగ్నిలోనగు ముప్పదియును ముగురు
దేవులింద్రుడుగాక యాదిత్య శశులు
నిన్ను గ్రహములు రేపవల్ వినునుగాక. 285

దిశలు గంధర్వ దైత్యాఢ్య దివ్యజగతి
రాత్రిచరములు భూతముల్ సకలమైన
గేహ దేవతలిక నన్యదేహ ధరులు
విమలమౌ నీదు వాక్యము వింద్రుగాక. 286

సత్యసంధుడు తేజస్వి శ్రద్ధ గలుగు
ధర్మపరుఁడు నైనట్టి యీ దశరథుండు
చూడుడిదె నాకు వరమిచ్చుచుండె నిపుడు
మీరలందరు తగ వినుండయ్య సురలు. 287

అని మహాధన్వియౌ రాజు వినుతపఱచి
స్థిర మొనర్చి కామవిమోహకరము వరద
మైన వాక్యమున్ కైక యనంతరంబ
బాగుగా నిట్టులని విన్నంబలికె నపుడు. 288

—: కైక వరములు కోరుట :—

* జ్ఞాపకము తెచ్చుకొనుమోయి క్ష్మాతలేంద్ర!
మున్ను దేవాసుర రణాన నిన్ను వైరి
ప్రాణములతోడ విడిచి యీ పట్టునందు
పరువు లెత్తింప తప్పించి త్వరితగతిని. 289

---

* అసలు కైకేయి వివాహకాలమున కైకకు పుట్టినవానికి రాజ్యమిచ్చినఁ గాని నేను నీకు నాకుమార్తెను ఇవ్వనని కైకయరాజు తెలుపఁగా అపుడు దశరథుఁడిటులు అనుకొనెను. అసలు నాకు ఇదివరలో కొడుకులే

అపుడును నీవు నాచేత నాజియందు
సరిగ రక్షింపఁబడితివి క్ష్మాతలేంద్ర !
అతిగ జాగ్రత యత్నింప నరసి నాకు
రెండు వరముల నిడితివి ప్రీతిగలిగి. 290

వ. అప్పుడు ఆ వరములు అవసరమైనపుడు గై కొందునని నీదగ్గరనె నిక్షేపముగా నుంచితిని. ఓ సత్యసంగరా ! అవి యిచ్చెదనని ప్రతిజ్ఞచేసి యివ్వకపోయినచో నీచే అవమానింపఁబడి నా జీవితమును విసర్జించెదను. అని పలికి కైకేయిచేత వాఙ్మాత్రముచేత స్వవశము చేసికొనఁబడి మృగము పాశమును వలె ఆత్మవినాశనమునకై బంధింపఁబడెను. ఇదివర కిచ్చిన యా రెండు వరములను నిపుడు కోరెదను. అవి యిప్పుడే చెప్పెదను వినుము. రామునికై సంకల్పింపఁబడిన యభిషేక సామగ్రిని ఉపయోగించి నా భరతు

---

కలుగలేదు. ఒకవేళ కైకకు కొడుకులు కలిగినచో మంచిదే. ఒకవేళ కౌసల్యకు సుమిత్రకు కొడుకులు కలిగినచో పెద్దవాడు రాజుగా నుండ వలయునను మా వంశాచారమును కైకకొడుకు అంగీకరింపవచ్చును. సాధారణముగా మా వంశములో పుట్టినవారు ఉత్తములుగా నుందురు. అని యనుకొని "పట్టాభిషేకసమయే భవేయుం స్మారితోహ్యహం! త్వయా వాఽన్యే నభూపాల తథా చేత్కరవాణ్యహం! ఇత్థం ప్రతిజ్ఞామకరోత్ ఆహితాగ్రణీర్నృపః (ఉమాసంహిత) పట్టాభిషేక సమయమందు నీవు గాని యితరులుగాని నాకు జ్ఞాపకము చేసినచో అట్లే చేసెదనని ఆ హితాగ్నులలో అగ్రణీయయినరాజు చెప్పెను మఱి యిప్పుడెవరును ఆ సంగతి జ్ఞాపకము చేయలేదు దశరథునికి జ్ఞాపకముండకపోవచ్చును. ఒకవేళ జాపకమున్నను భరతుడు మంచివాడుగాన అన్నపట్టాభిషేకము భరతుఁడంగీకరించునని యనుకొనవచ్చును. భరతుఁడు మంచివాఁడే కాని మనుష్యుల బుద్ధులు అస్థిరములని యనెను. మంథరగూడ ఈసంగతి జ్ఞాపకముచేయలేదు. ఇదేకనుక జ్ఞాపకము చేసినచో రాముని వనవాసపు షరతు ఉండదని తలచి శంబరాసుర యుద్ధసమయమందు ఇచ్చిన రెండువరములు జ్ఞాపకము చేసెనేమొ.

నికి అభిషేకము చేయుము. ఆ రెండవ వరముచేత రాముఁడు నార చీరలు
చర్మము జడలు ధరించి తాపసుఁడై దండకా వనము నాశ్రయించును గాక.
భరతుఁడు కంటకములులేని యౌవరాజ్యమును పొందునుగాక. ఇదే నా పర
మాభీష్టము. ఇప్పుడే రాముడు వనమునకు పోవుచుండ నేను చూడవలయును. 291

రాజరాజువై యిఁక సత్యరతుఁడ వగుము
కులము శీలము జన్మనుగూడఁగావు
ఇహ పరాలలో నుత్తమ మీ హితంబు 292
అనుచు సత్యవాక్కులు తపోధనులె యంద్రు.

—: దశరథుని చింత—నింద :—

వ. పిదప దశరథమహారాజు కైకేయి పలికిన దారుణవాక్యములను విని 293
చింతించి యొక ముహూర్తకాలము మిగుల తపించిపోయెను.

ఏమి యిది కలయొ చిత్త
వ్యామోహమొ లేక భూతమది పట్టెనొకొ
నా మానసి కోపద్రవ 294
మేమో స్పష్టమ్ముగ వచియింపగఁ జాలన్.

అని చింతించి సుఖంబు పొందక విభుండా కైక వాక్యాలచే
తనుకొట్టంబడి సంజ్ఞ పొంది బహు చింతాక్రాంతుఁడై దీనుఁడై
వనటన్ బెబ్బులిగన్న లేడివలె నైపై నేలఁ గూర్చుండి వె 295
చ్చను నిట్టూర్చి మంత్రబద్ధమగు పెన్సర్పంబువోలెన్ బడెన్.

అకటా! ఛీ యని యల్కఁబల్కి పడి మూర్ఛాక్రాంతుఁడై సౌఖ్యమెం
దక చైతన్యము పోవఁ జాలవడికెన్ సంజ్ఞన్ మదినిఁబొంది ని
ల్వక దేహంబు దహించువాఁడు వలె నల్కన్ బొందికై కేయితో
వికలాత్ముండయి పల్కె నిట్టులను పృథ్వీనాథుఁ డప్పట్టునన్. 296

"ఓసి నృశంసురాల! కలుషోత్కటశీల! కులప్రణాశినీ!
చేసెను నీకురాము డెది: చేసితినే యెఁదియేని నీకు నిన్
వాసిగఁ దల్లి పోలెఁ గడుభక్తిని రాముఁడు సేవ చేసెనే
చేసినయట్టి రామునిక చేతువనర్థము లేటి కీపనుల్. 297

జ్ఞానము నాది గట్టితినఁ జట్టున నల్లని త్రాచుఁ బోలికన్
నేనిటు నాక్షయంబునకె నిన్నిటఁ జేర్చితి నా గృహంబునన్
ఈ నరలోకమెల్లఁ గమనించియె రాముని మెచ్చుచుండ నా
సూనుని కెట్టినేరమును చూపి త్యజింతును నిష్ఠ సద్గుణున్. 298

నేను గౌసల్య సుమిత్రఁగాని విడుతు
రాజ్యలక్ష్మినైన నరయు విడుతు
పోని నాజీవితముఁగాని పోద్యజింతు
రాముఁ బితృవత్సలుని వీడ నేమి విడను. 299

జ్యేష్ఠసుతుఁ గని ప్రీతి యెంతెంతొ గలుగు
రాముఁ గనకున్న స్మృతిపోయి బ్రతుకె యుడఁగు
అరుకఁ బంట నీళ్ళను వీడినైన జనము
బ్రతుకు; రాముఁడు లేక నే బ్రదుకలేను. 300

ఓసి పాపిని! విడు నీ దురుద్యమంబు
తలను నీ కాళ్ళ ధరియింతు దయను గనుము
ఏమి యిటు లెంత దారుణ కృత్య మీవు
ఎటుల నాలోచనము గావించినావె. 301

భరతు ప్రియాప్రియంబులను బట్టియు నీ వెది లోనసెంచితే
కరమదె యట్టులేయవుత గానియు జ్యేష్ఠసుతుండు రాముడో
యురయుఁగ ధర్మరీతి సుతులందఱికంటెను జ్యేష్ఠుడంచు నీ
వరసి ప్రియంబుగాఁ బలికినట్టివి పైపయి నాదు ప్రీతికే. 302

కాని యిపుడొ రామాభిషేకంబు వినియె
యెంతొ దుఃఖసంతప్తవై యెంతొ నన్నుఁ ద
పింపజేయుదు వీ శూన్యగృహమునందు
భూత మెదొ పట్టె బరవశభూత వైతి. 303

దేవి! యిక్ష్వాకు కులమున నీవలననె
యీ మహానర్థమెటుల ప్రాప్తించె నకట!
న్యాయమెుప్పు రాముపయి నన్యాయ మిట్లు
విపృతమై నీదు మదిని సంభవించె నోసి. 304

వెనుక నీ కయుక్తమును విప్రియము గాని
ఓ విశాలాక్షి! గావించియుండ లేదు
కాన నిటు భరతాభిషేకంబు కొఱకు
రామునిటు చేతువని నమ్మరాని మాట. 305

తొలుత మహాత్ముఁడౌ భరతుతోడుత రాముఁడు నాకుఁ దుల్యుడన్
పలుకుల నెన్నియో కథలఁ బల్కితె యట్టిమహాత్ము రాము ని
ట్టుల పదునాలుగేండులు నెటుల్ వని కంపఁగ నిష్టమయ్యెనో
చిలుకలకొల్కి! భీరువ! పచింపుము నీమది దేనిఁ గోరెనే. 306

అతి సుకుమారు ధర్మవిధృతాత్ముని రామునిఁ గానకంప నీ
మతి యిపుడెటు లిష్టపడెనే యతి దారుణురాల! రామునిన్
అతి సుగుణాభిరాము నిను నన్నిట నెప్పుడు సేవచేయు నా
మతియుతు సూనునా యిటుల మానక కానకు పంపెదో ప్రియా! 307

అనయము రాముఁడే భరతుకంటెను నీకిటు పూజచేయు నీ
దినమున రామునిన్ భరతు మానిని ! యేమి విశేష మెంచవే
నినుమది సేవలోను గమనించుటలో మఱి గారవంబులో
గనివిని చేఁతలో నెవఁడె గట్టిగ రామునికంటెఁ గొల్చెనే. 308

వేవురు స్త్రీలలో బ్రదికి వెన్కనెయుండుచుఁ గొల్చువారిలో
నేవిధినెట్టి మాటయును నేమఱుపాటున వాదు పల్కనే
దేవి ! సమస్తభూతములఁ దెల్పి ప్రియంబిడు బుజ్జగించు తా
నేపయినన్ విశుద్ధ హృది నేర్పడఁ బల్కును రాముఁ డెప్పుడున్. 309

జగముల సత్యము చేతన్
తగ దీనులయిన జనులను దానము చేతన్
స్వగురువుల సేవ చేతను
ప్రగుణి ధనుసుచేత రిపుల రాముఁడు గెలుచున్. 310

సత్యము దానము తపమును
నిత్యము త్యాగంబు మైత్రి నిజశుచి ఋజుతల్
స్తుత గురుసేవ విద్యయు
అత్యంతము నిల్చి రామునందు ధ్రువంబౌ. 311

ఆ మృదు హృదయుని యెడలన్
ఏమె యీ దేవసముఁ డయిన ధృతమతి యందున్
ఈ మహి ఋషితేజసు నెడ
రామునియెడఁ బాపమీవు ప్రకటించెదవే. 312

ప్రియవాది రాముఁ డెపుడ
ప్రియమును లోకులకుఁజేయ వినను స్మరింపన్
ప్రియ ! అట్టి రాముని క
ప్రియ మెటు చెప్పెదను నీకుఁ బ్రియమొనరింపన్. 313

ఎతనికడ నోర్పు త్యాగము
నెతనికడఁ దప మహింస నిఁక సత్యంబో
ఎతనికడ సత్య ధర్మము 314
లెతనికడఁ కృతజ్ఞత యును నితఁడే గతియో,

:— దశరథుఁడు కైకను బ్రతిమాలుట :—

ముసలిని కాలము చెల్లిన
పసుపను శోకింపఁదగిన వాఁడను కరుణన్
పసఁ జెడి వగచుచు నుంటిని 315
కసి విడి జాలిగ ననుగని కావుము కైకా !

మదపతి ! నాలుగు జలధులు
తుది గల ధర నేది యేది దొరకంగలదో
అది యది యర్పించెద నీ 316
మది కోపము సోకకుండ మసలెదు గాతన్.

ఇంకను నీ కిదె దండము
కొంకక నీ కాళ్ళుపట్టుకొందును కైకా !
కొంకక శరణిడు రాముని 317
కింక నను నధర్మ మెనయు కిటఁ జనుఁగాతన్.

అనుచు దుఃఖించి యేడ్చుచు నార్తిహొంది
స్మృతియె లేకుండఁబడియు ఘూర్ణిల్లుచుండి
శోకజలనిధి యంతును జూడగోరి 318
మరిమరి బ్రతిమాలు పతితో మగువయపుడు.

## —: కైక కోపించి పలుకుట :—

ఇంకనుగ్రురాలయి కైక యిటులననియె
"వరములిచ్చి పశ్చాత్తాప పడెదె రాజ!
ఎంతొ ధార్మికుఁడ" వటంచు నీధరిత్రి
డప్పుకొట్టి చాటుకొనెదె డంబకాఁడ. 319

చూచి రాజర్షులందఱు చుట్టుచేరి
కైక నిను యుద్ధమునఁబెంతొ కాఁగాచె
దానికేమి చేసితివని తఱచి యడుగ
నపుడు వారికేమనెదు ధర్మాత్మ! రాజ! 320

"ఎవతె దయచేత నేను జీవించియుంటి
ఎవతె నన్నురక్షించి పోషించుచుండె
అట్టికైకేయి కిడుమాట వ్యర్థపఱచి
సౌఖ్యముగ నుంటివని చెప్పసాహసింతె. 321

ఇప్పుడే వరములనిచ్చి యింకనీవు
మాటలను తప్పిపలుకుచు మసలుచుంటె
ఇట్టి పాపంబు గావించి యింక నీవు
నీదు పూర్వులకపకీర్తి నెఱపుచుంటె 322

చంపఁదలచు డేగకు శిబిచక్రవర్తి
పావురముకై స్వమాంసమున్ పంచియిడఁడే
అంధుఁడగు విప్రునికి తనయక్షులిచ్చి
యా యలర్కుఁడు సద్గతినందలేదె. 323

అయోధ్యకాండ (12వ సర్గ)

దేవతలకు మున్నిడిన ప్రతిజ్ఞ తలఁచి
సాగరము తల్లిగట్టు హెచ్చదుగదోయి
పూర్వపురుషుల వృత్తాంతమును స్మరించి
మాటతప్పకు మన్వ తమ్ముఁ బలుకవలదు. 324

ఓరి దుర్బుద్ధి! ధర్మంబు నుత్సృజించి
ఇంకనీవు రామునభిషేకించి మీఁద
సంతతంబును మహిషి కౌసల్యతోడ
నెంతొ హాయిగ రమియింప నెంచుచుంటె. 325

ధర్మమొ యిది యధర్మమో తనరుఁగాక
సత్యమొ యిది యసత్యమో జరుగుఁగాక
నీవు నాకేది వాగ్దానమిచ్చినావొ
దానికేమియు నిసుమంత తప్పరాదు. 326

ఈ వెనుక రామునభిషేకింతువేని
నీవు కనులెత్తి కనుచుండ నీకెయెదుట
ఇప్పుడే విషము త్వరగనిదిగొ త్రాగి
మృత్యువును పొందఁగలదాన నృపవరేణ్య. 327

ప్రజలు చనుదెంచి మ్రొక్కగ వారి యంజ
లిని నలరి రామమాత గైకొనుచునుండ
ఒక్కరోజైనఁ గంటినా యుర్వినాథ!
ఆ కనుటకంటె మృతియె శ్రేయస్కరంబు. 328

రామునడవికి బంపు కార్యంబు తక్క
ఇంక దేనిచేనైన సంతృప్తిపడను
పట్టి భరతుతో నాతోడ నొట్టెసుమ్ము
సర్వ సర్వంసహానాథ! సార్వభౌమ. 329

ఇంత మాత్రమెయని కైక యిక ముగించి
ఏడ్చుచున్న రాజుకు జవాబీయకుండె
అంత రాముని వనవాస, మట్టి భరతు
రాజ్య మీయుశోభనవార్త రాజువినియు. 330

క్షణము వ్యాకులేంద్రియుండయి కైకతోడ
ఏమియును మాటలాడక నృపతివరుఁడు
అప్రియములాడు ప్రియురాలి నదిమెపనిగ
ఱెప్పపాటువేయక చూచె ఱిచ్చపడుచు. 331

పట్టి హృదినిజీల్చు పిడుగువంటి ఘోర
వాక్కువిని కూలి దేవిశపథము నిశ్చ
యోక్తి తలఁచి రామ! యని నిట్టూర్చి యపల
మొదలు నఱికిన వృక్షంబువోలెఁ బడెను. 332

చిత్తము నశించిపోవు నున్మత్తుడట్లు
రోగమై పరీత్యముగల రోగివోలె
మంత్రమున తేజముడుగు పెంబాము వోలె
ఆ దశరథమహారాజు నట్టె యుండె. 333

అపుడు దీనుఁ డాతురుడునై యనియె రాజు
అర్థమువలెతోఁచు ననర్థమైనదిదియు
నెవరు నీకుపదేశించిరే పిశాచ
మైనఁ బట్టినా యిట్లు సిగ్గయిన గొనవు 334

బాలవైన నీకిట్టి దుశ్శీలమెపుడు
మునుపు చూచి యుండగలేగు గనంగనిపుడు
ఏమియిది విపరీతమై యెసఁగెనెట్లు
చెప్పుమాలోచనముచేసి యొప్పుమీఱ. 335

భరతునికి రాజ్యమును రామ
మిట్లు కోరుటకెది సంభవించె నీకు
ఇట్టి మనుజుని గూర్చి నీహృదయమందు
ఎందువల్లఁ గాని భయంబె యిటులు గలిగె. 336

భర్తకును లోకమునకును భరతునికిని
ప్రియము గావింప మదిని భావింతువేని
నన్నసత్యవాదిగఁ జేయునట్టి యిట్టి
దుష్టభావంబు లోనుండి త్రోసివేయు. 337

ఓ నృశంసురాలా! క్షుద్రమైనదాన
పాపసంకల్పురాల! పాపాత్మురాల!
ఎందుకే నాపయిని రామునందునిటులు
శోకకరమపరాధము చూతువేమి. 338

రామువిడిచి యా భరతుడు రాజ్యపదవి
ఎటులనైన నేమాత్రము నెనయఁబోఁడు
రాముకంటెను భరతుండు రమ్యగుణుఁడు
ధర్మపరుఁడని నేనెప్డుఁ దలఁచుచుందు. 339

అడవికిం బొమ్మనుచు నేనునతనిఁబలికి
రాహుచే మ్రింగబడినటు రాముఁజూచి
ఏమి వెలవెలపోయెడి రాముమొగము
నెటులుగనువాఁడ మదియుండి యిప్పుడకట. 340

సుహృదులిటు నిశ్చయించిన సుకృతమైన
యట్టి నాబుద్ధి నేయిపుడందఱుండ
పరులచేతను హతమైన బలమువోలె
తల్లక్రిందైన నామాట తలఁతువెటులు. 341

ఏమి బాలుడా యైక్ష్వాకుఁ డీతఁడు చిరము
నింకనిప్పుడున్ రాజ్యమేలించె ననుచు
దిక్కు దిక్కులనుండి యేతెంచినట్టి
భూమిపతు లింకముందు నన్నేమి యంద్రొ. 242

వృద్ధులు బహుశ్రుతులు గుణాలెన్నొ గలుగు
నృపతు లెపుడైతె ఆరాముఁడేడి యనుచు
ఎన్నొ ప్రశ్నలు వేయుచు నన్ను మిగుల
నందురో యప్పుడేమి నేఁ బందునింక. 243

కైక బాధింప రాముని గానకిపుడు
పంపితినని సత్యమ్ము నేబలుకునెడల
అయితె రామాభిషేక మాచరింతు
ననెడి నాపలుకు నసత్యమగునుగాదె. 244

విపినములకును రాముఁడు వెళ్ళినంత
ఇంక నన్నును కౌసల్య ఏమియనునొ
ఇట్టియప్రియ మామెకు నేనుచేసి
ఏమి బదులు చెప్పఁగలాఁడ నిప్పుడకట. 245

ఇటు కౌసల్యయునేగుదెంచి యెపుడైతే ప్రీతితో దాసురా
లటు పెండ్లామటు చెల్లెలటు సఖియట్లా తల్లియట్లెంచి మి
క్కుటమౌ సేవలుచేసెనో యపుడు నీకున్ గోపమౌనంచునే
నటు వీక్షింపను సత్కరింపఁదగుభార్యన్ సత్కరింపన్‌గదే. 246

ప్రియయయు ప్రియకామ ప్రియపుత్ర ప్రియ మెపలుకు
అట్టియామెను మన్నింప కిట్టి నిన్ను
సత్కరించుట వ్యధగూర్చుఁ జాలనిపుడు
వ్యాధి పెంచఁ దిన్న యుపథ్య వస్తువట్లు. 247

రామునికినిజేసిన యపకారంబుఁ జూచి
అడవికి నేనుచేయు ప్రయాణమెంచి
ఈ సుమిత్ర కనులఁదిలకించి యింక
నెంతొ భయపడి నను విశ్వసింపఁ గలదె. 348

నేను నిప్పుడిచట మరణించుటయును
రాముఁడు నరణ్యపదవి నాశ్రయము పొందు
టనెడి యెండ్రప్రియంబులు వినిన సీత
నింక నయ్యయో నేను వీక్షింతునెట్లు. 349

అకట! వైదేహి ననుగూర్చి వ్యథలు గొనుచు
ఎంతొకుమిలి ప్రాణముల క్షీణింపఁజేయు
హిమగిరిప్రాంత దేశానసెటకొ చనిన
కిన్నరునికయి కుమిలెడి కిన్నరివలె. 350

ఘోరవనికి రాముడు బైలుదేఱ నపుడె
కాంచిమైథిలి కన్నీరు కార్చుచుండ
బాలకాలంబు జీవంబు సరిగ నిలిపి
బ్రతుకుటకు నెంతమాత్రము వాంఛచేయ. 351

ఇకనీవిప్పుడు రాజ్యమున్ విధవవై యేలింతుగా పుత్తృచే
సుకమైయొప్పి విషంబుకల్ప వికృతిన్ జూపించు కల్లున్బలెన్
సకలోర్విన్ సతివైన నిన్ను సతిగా స్థాపింతు గానంబుతో
మెకమున్ వ్యాధుఁడువోలెఁ జెడ్డనుడులం బెంపారినన్ జంపితే. 352

పెలది సుఖమునకై పుత్రు విక్రయించు
నన్నునార్యు లనార్యుఁగా నెన్ని మిగుల
కల్లుత్రాగిన బ్రాహ్మణు కరణి నిపుడు
ప్రకటముగ నిందగావింత్రు బాటలందు. 353

ఇటుల నీ చెడ్డపనుల సహించుచుంటి
ఎంత నాదుకష్టమక్కట! యెంతబాధ
గతపు జన్మలో చేసిన కలుషమట్లు
ఇట్టిదగు మహాబాధ ప్రాప్తించెనకట. 354

పాపురాల! చిరంబిట్లు పాపినగుచు
నెసఁగు నాచేత నీవు రక్షింపబడితి
జనుల బంధించునట్టి పాశంబుఁ బోలె
తెలివితక్కువవల్ల నిన్ దెచ్చుకొంటి. 355

నేను నీతోడగూడఁ గ్రీడించుచుండి
మృత్యుదేవతగ నిను గ్రహింపనైతి
బాలుడొంటిఁగేలను త్రాచుఁ బాముఁబోలె
చేతితో నిను నకట! స్పృశించినాను. 356

ఆ మహాత్ముడౌ తనయుని రామునిటులు
ఈ దురాత్ముఁడు పితృహీనుఁగా నొనర్చె
ఇట్టినన్ను నీలోకంబు లెట్టులైన
నిందచేయఁగఁదగు, దానికేను తగుదు. 357

ఎవఁడు స్త్రీకయి ప్రియుఁడైన యిట్టిసుతుని
వనికిఁ బంపించుచున్నాఁడొ వాడు నకట!
ఎంత మూర్ఖుడో మఱియును నెటులు నెంత
కాముకుడొ యీ దశరథుఁడు క్ష్మాపుడంద్రు. 358

ఇదివఱకె వ్రతంబులచేత జదువుచేత
గురులచే బ్రహ్మచర్యచే క్రుంగి చిక్కె
భోగమనుభవింపదగు ముఖ్యకాల
మందు మరల మహాకష్టమయ్యెనకట. 359

పనికివెళ్లుమని సుతుతో ననినయంత
అట్లె నడవికి వెళ్ళెదనను గాని
తనయుఁడును నేనుచెప్పిన దానికెపుడు
బదులుచెప్పుట యెఱుఁగడు త్వరగవెళ్లు. 360

వనికి వెళ్ళుమని సుతుతో పలికినంత
ఒకవేళను ప్రతికూలమొక్కటనిన
దానిచే నాకు కడుఁబ్రియం బౌనుగాని
వత్స రాముఁడారీతిగఁ బల్కఁడెపుడు. 361

ప్రకట శుద్ధ భావము గల రాము డై తె
ఇట్టి నా భావ మెఱుఁగనే యెఱుఁగ డిపుడు
వనికి వెళ్లని యతనితో ననిన యంత
అట్లె యడవికి వెళ్లెద ననియె చెప్పు. 362

రాముఁడే కనుక నిఁక నరణ్య మేగ
సర్వ లోకంబునకు తిరస్కార మగును
ఎన్నటికిని క్షమింపఁగరాని నన్ను నపుడె
యముని గృహమును నను మృత్యు వదియె చేర్చు. 363

నేను చనిపోవ రాముండొ కాననుండ
నాకు ప్రియమౌ నితరుల కొనర్తు చెడుగు
నన్ను రాముఁ గౌసల్యను నందనులను
వదలి దేవి సైచఁగలేక పడయు నన్నె. 364

దేవి కౌసల్యను సుమిత్రదేవి నింక
ముగురు పుత్రులతోపాటు విగుణరాల !
నన్ను దారుణం బైనట్టి నరక మందుఁ
జిమ్మి పొఱఁగవైచి సౌఖ్యమ్ము పొందు. 365

క్షోభ పెట్టఁగరానిదై గుణగణాల
సత్కరింపఁగబడుచు శాశ్వత మయి
నాకు రాముని కేమి స్థానంబు లేని
యట్టి యిక్ష్వాకు భువి క్షోభపెట్టి యేలు. 366

రాముఁడు వనుల పాలయి బ్రదికియుంట
భరతునికె కనుక ప్రియుమై పరగెనేని
అమరలోకంబునందు నున్నట్టి నాకు
నీదు భరతుండు శ్రాద్ధమున్ జేయవలదు. 367

అమరలోకంబునకు నేను నరిగినంత
జనవరేణ్యుఁడౌ రాముండు వనుల నుండ
హా ! యనార్యురాల ! యమిత్రురాల ! కైక !
నీదు కోరిక నెఱవేఱ నెఱిసుఖింపు. 368

అట్టి నీవు విధవరాల వగుచు నిపుడు
సుతునిచే భువి నేలించుచుందు గాక
నీవు రాజపుత్రివి యను నిండు పేర
నా గృహానఁ బ్రవేశించినావె యకట ! 369

నాకు నపకీర్తి యతులమౌ లోకమందు
నాకు నవమానము ధ్రువమౌ లోకమందు
పాపికింబోలె నాకును లోకమందు
సర్వభూతాలలోఁ దిరస్కార మవుత. 370

తురగములపై రథాలపై కరులపైని
మాటిమాటికి విహరించు మనుజవిభుఁడు
వత్స రాముఁడు ఘోరమౌ వనములందు
నెట్లు పాదచారిగ సంచరింపఁగలఁడొ. 371

ఎటులన్ భోజనవేళ కుండలము లెన్నే దాల్చి పల్ వంటవాం
డ్రిటు లట్టుల్ గని వేచియుండి త్వరగా నేముందు నేముందటం
చట శ్రేష్టంబగు పంటకంబులిడ నాహారించు రాముండు తా
నట చేదై వగరై కషాయముగు వన్యాహార మెట్టుల్ తినున్. 372

విలువౌ పట్టు దుకూలముల్ మెయిని ఠీవిన్ దాల్చి దుశ్శాలువల్
వలెవా టొప్పంగ చక్క వేసికొనుచున్ వాహ్యాళులం దేలు ము
ద్దుల రాముం డెటు కావిబట్ట లొడలన్ దోపించి జాల్ ముండ్లు బె
డ్డలతో నిండిన వట్టిదౌ కటిక నేలన్ వాసమున్ జేయునో. 373

రాముని వన గమనం, బీ
భూమిని భరతునభిషేకమును నను నుగ్రం
బౌ మాటలు నివి గనఁగా
నే మనిషివౌ యూహ కంద విట్టివి యెటులౌ. 374

ఇసి ! స్త్రీ లెంతటి నింద్యలు
మసిఁ బూయుచు మారెడుఫల మటు చేతురు వీ
రసలే స్వార్థ లిటు సమ
స్త సతులుగా రౌక భరతునితల్లియె యిటులౌ. 375

ఓ యనర్థ భావుకురాల ! ఓ మదర్థ
తాపకరణ నిశ్చయురాల ! పాపురాల
స్వార్థపరురాల ! హితమును సలుపునట్టి
రాము నేడు నాకయి యనిష్ట మేమి కనెదు. 376

కష్టములు పడు రాముని గనినయంత
పితలు తమ కుమారులు వీడివేయుచుంద్రు
ప్రేమగల భార్యలును విసర్జింత్రు పతుల
పూర్ణ మైనజగత్తు నిప్పులను గ్రక్కు. 377

దేవతల కుమారుఁడువోలె దీప్తిచెంది
కడు నలంకరించుకొని నాకడకు వచ్చు
రాముఁ గనుచు మోదింతు దర్శనముచేత
కనియు మరలను పూర్ణయౌవనుఁడ నౌదు. 378

వెలుగు సూర్యుండు లేక ప్రవృత్తి కలుగు
మొత్తకున్న మేఘముచే ప్రవృత్తి కలుగు
ఇచటనుండి పెళ్లెడి రాము నిటులఁ జూచి
మనుజు డెవఁడున్ మనఁడని నా మనసు చెప్పు. 379

అహితురాలి ఘాతకురాలి నసఖురాలి
మృత్యుదేవతఁ బోలె నా యింటియందు
ఒడిని విషపుఁ బామును బోలె నుంచుకొంచు
సరిగ మోహాన డానిచేఁ జంపఁబడితి. 380

నేను రాముఁడు లక్ష్మణుండేని లేక
భరతుఁడో నీదు సాయాన ధరణి నేలు
పురిని రాష్ట్రమున్ బంధుల కరముఁ జంపి
శత్రువులకుఁ బ్రహర్షము గూర్చి సఫల పథముఁ. 381

ఓసి ! వ్యసనప్రహారిణీ ! ఓసి దుష్ట :
ప్రేమ విడనాడి యిట్టుల ప్రేలుచుంటి
ఎందుకని నీ మొగమునుండి యిపుడు నీదు
పండ్లు వేల ముక్క లగుచుఁ బడవొ క్రింద. 382

ఎపుడు నే కష్టమగు మాట యెటుల ననఁడు
పరుషముల నాడుటే రాముఁ డెఱుఁగఁ డెపుడు
ఓసి ! యభిరామవాదిని ! యుత్తమగుణి
రామునందు దోషములు పల్కంగ నేల. 383

కుములు మండుము నశియించు కుంది చావు
వేలకొలఁది ముక్కలయి యీ నేలఁ గూలు
నీ సుదారణ వాక్యము నేను చేయ
కేకయ కులపాంసని ! చేయ నీ కువాక్కు. 384

కత్తివంటిదానవు తీయఁగా వచింతు
దుష్టభావవు స్వకుల ప్రణష్టి కరివి
అప్రమవు ప్రాణ మానస హంత్రి వీవు
బ్రతికియుండుట కే నిష్టపడను దేవి ! 385

నాకు బ్రతుకె లేదింక నానంద మెట్లు
ఆత్మజుఁడె లేడు నా రతి యన్న దేది
నాకు నహితము గావింపఁబోకు దేవి !
తలను నీ కాళ్లు దాల్చెద దయను చూడు. 386

దిక్కులేనివాని వలె రాజు దేవురించు
చెంతొయగు స్త్రీనిమిత్తపుఁ జింతచేత
దేవి చాపిన రెండు కాళ్లే వి గనక
ఆ తురుండట్లు పడిపోయె నంఘ్రులందె. 387

స్త్రీలకు-మ్రొక్కఁగూడని' ధరిత్రిఁ బరుండఁగరాని రాజు పు
ణ్యాలు నశించి దేవ భువనంబున నుండియు క్రిందబడ్డ భూఁ
పాల యయాతివోలెఁ బడు పార్థివుఁజూచి యనర్థ కై క స్వా
ర్థాలిఁక తీరకుండి భయపాటున గోరిక తీర కిట్లనెన్. 389

ఓ మహారాజ ! నీవివు డుత్తమ వ్ర
తుండ వని ధర్మ సత్య వ్రతుండ వనుచు
చెప్పఁబడుచుంటివే నాకు నెప్పుగిదిని
వరము నీయక తప్పించి తిరుగఁగలవు. 380

అనుచుఁ గైకేయి పలుకంగ నప్పు డిటుల
ఆ దశరథమహారాజు సనియె నల్గి
నేను చనిపోవ రాముండు కాన కేగ
ఓ యనార్య ! కోరిక తీర హాయి నుండు. 391

స్వర్గమున రాము క్షేమంబు ప్రశ్న చేయ
దేవతలతోడ నేమని తెలుపువాఁడ
రాము వనికి బంపియును స్వర్గాధివాసు
లాడు నిందల నేనెట్టు లరయఁగలను. 392

కైక ప్రీతికై రాముని గాన కిపుడు
పంపితి నని సత్యంబు నేఁ బలుకునెడల
అయితె రామాభిషేకము నాచరింతు
ననెడి వాపలు కనృతంబె యగును గాదె. 393

సుతులు లేని నే నెన్నియో వెతలు పొంది
ఈ మహాబాహు సుతుఁగంటి నెట్లు విడతు
శూరుఁడు కృత విద్యుఁడు క్రోధవైరి జేత
యయిన రాముని నడవికి నంపగలనె. 394

రాముని నిందీవర సు
శ్యాముని నాజానుబాహు నభిరాము జనా
రాముని మహాబలు నెటుల
నేమని ఘోరంపు వనికి నిపు డంపగలన్. 395

సుఖములకుఁ దగినవాఁడు న
సుఖములకుం దగనివాడు శోకము గనకే
సుఖియై రాముం డుండఁగ
సుఖినై వేఁ జూడఁగలుగు శుభమౌ నాకో. 396

ఏమియు వ్యథ పొందఁ దగని
రాముఁడు వ్యథపొందకుండ రాజిలు నపుడే
నేమఱి స్వర్గము పొందిన
నా మది సౌఖ్యంబు గనును నాకమునందున్. 397

ఓ నృశంసురాలా ! పాపయుక్తురాల !
కయిక ! సత్యపరాక్రముఁ డయిన రాము
విప్రియంబుతోఁ గూడను వేగముగను
ప్రియము నాకుఁ గూర్పంగ గోరెదవు నీవు, 398

నా కపకీర్తి లోకుల ననంతముగా నతులంబుగా నగున్
నా కవమానమున్ ధ్రువమె నన్నిఁక నిందలు చేతురంచు రా
జీ కరణిన్ భ్రమించి విలపించుచునుండ స్వవంశ్యనిబాధ జూడగా
లేకయొ క్రుంగిపోయె రవి రేయియు నల్లబడెన్ వ్యథన్ బలెన్. 399

అంత రాజు దుఃఖంబుచే నార్తు డగుచు
మిగుల విలపించుచుండ యామినియు నెంతొ
చంద్ర మండలమున ప్రకాశంబు గనియు
చింతచేఁ బోలె నేమి రాజిల్లదయ్యె. 400

వృద్ధుడౌ దశరథుఁడు శోకించి కుమిలి
వెచ్చ నిట్టూర్పు యార్తుఁడై వెతఁ జిక్కి
ఆకసముపైపు కన్నుల నాన నిలిపి
మిగుల విలపించె వగల పొగిలి. 401

ఓసి ! రాత్రి! నక్షత్రాల నొగి వెలుంగు
నీవు తెల్లవాఱవలవ దిట్లె యుండు
ఇదిగొ నీకు దోసిలియొగ్గి యిదె వచింతు
భద్రురాల ! నాయందు దయన్ వరలఁజూపు. 402

పోనిలే సత్వరంబుగ పొమ్ము రాత్రి
ఘృణయె లేక క్రూర యగు కైకేయి నిపుడు
చూడగా నిష్టపడలేను సుంత కూడ
దానివల్ల నెగద మహాతాప మయ్యె. 403

అని కైకేయికి దోసిలొగ్గి యపుడే యారీతి వాక్రుచ్చి యిం
కను కైకేయి కనుగ్రహంబు కలుగంగాఁ బల్కె "భద్రాంగి ! స
జ్జన వృత్తంబుననుండి నీవయని విశ్వాసంబుతో నున్న దీ
నుని నాయుస్సె గతించు భూపతిని నన్నున్ దయన్ జూడుమీ, 404

ఇదె సుశ్రోణిరో ! శూన్య చిత్తుఁడను నే నీరీతి వాగ్దానమున్
విదితంబౌ గతిఁ జేసితిన్, సుహృదయం బేపార నీ వుంటి వి
య్యదనన్ నన్ను ననుగ్రహింపు మసితాపాంగి! భవద్దత్తమై
యిదె రాజ్యంబును రాముఁడేలుతను నీకెంతో యశం బయ్యెడున్. 405

నాకు నీ రామునకును నీ లోకమునకు
గురువులకు నీ భరతునకు గురునితంబ !
ఓసి చారుముఖేక్షణ ! ఓసి కైక !
ఈ ప్రియంబు గావించి రక్షింపు మిపుడె. 406

అని యీ రీతి విశుద్ధభావుఁ డయి దుష్టావేశభావంబు గ
ల్గిన కైకేయికి, నశ్రుపూర్ణుఁ డగు నా పృథ్వీశుఁ డా తామ్రవీ
క్షణయౌ కైకకుఁ జెప్ప, చిత్ర కరుణార్ద్రాలాపమున్ సర్వమున్
వినియున్‌గూడ నృశంసురాలు పతిదౌ విజ్ఞప్తి త్రోసెన్ వెసన్. 407

భూమిపతి మరల మరల మూర్ఛ పడియు
ప్రియ యదుష్టయౌ కైక యప్రియము లాడ
కొడుకును వనికిఁ బంపుట గూర్చి తలఁచి
కుమిలి వ్యథితి తప్పి నేలపైఁ గూలఁ బడియె. 408

ఆ మనస్వి భూపతి యిట్లు వ్యథలఁ గుమిలి
నిడుద యూర్పు లూర్చుచునుండ నిశయె పోయె
వందిమాగధుల్ పాడియుఁ బాడి లేప
మేలుకొనఁడు లేవండు భూమీశుఁ డపుడు. 409

సుతుని శోకంబుచేఁ గూలి స్మృతియె దప్పి
ధరణిపైఁ బడి చేష్టలు దక్కి యున్న
ప్రభువు నైక్ష్వాకుతోడ నా పాపురాలు
కైక యీ రీతి మఱి శంక లేక పల్కె. 410

తిన్నగ వర మిత్తు నని ప్రతిజ్ఞ చేసి
ఇడక పాపము గావించి యిపుడు నీవు
ఉర్వితలమున నిటు పడియుంటి నేల
నీ ప్రతిజ్ఞ తీరుచుకొని నిలువు మిపుడు. 411

సత్యమె వరధర్మం బని
నిత్యము ధర్మాత్ము లంద్రు నిశ్చయముగ నా
సత్య ప్రతిజ్ఞ చేపి య
సత్యము గావించు నీకు సరి బోధింతున్. 412

సత్యమాడి డేగకు శిబిచక్రవర్తి
పావురముకై స్వతనువును పంచి యిడఁడె
అంధుడగు విప్రునికి తన యక్షు లిచ్చి
యా యలర్కుఁడు సద్గతి నందలేదె. 413

దేవతలకు మున్నిడిన ప్రతిజ్ఞ తలఁచి
సాగరము తల్లిగట్టు హెచ్చదు గదోయి
పూర్వపురుషుల వృత్తాంతమును స్మరించి
మాట తప్పకు మనృతముం బలుకవలదు. 414

సత్యమొక పదమె బ్రహ్మము
సత్యంబున ధర్మమెపుడు సరిగా నిలుచున్
సత్యమె యక్షయపు శ్రుతులు
సత్యంబగు వాక్కుచేత సద్గతి కలుగున్. 415

నీ మది ధర్మమె యున్నన్
నీమము మీరకయె సత్యనిష్ఠను జనుమీ
నా మది వరము ఫలించును
నో మహితమతి ! వరమిచ్చి యొందుమి యశమున్. 416

నీవో ధర్మము కోఱకున్
గావింపుము సత్యనిష్ఠ నా ప్రేరణచే
నీవు వనికి రాముఁ బనుపు
మీ వాక్కను ముమ్మఱు వచియించితివి సుమీ. 417

నీ విటులఁ జేయకున్నచో నీదు ముందె
ప్రాణము త్యజింతునని శంక వదలి కైక
పలుక విని- బలి వామను వాక్కు తప్ప
లేని యటు-రాజు తప్పుకోలేకపోయె. 418

హృదయ ముద్భ్రాంతమైపోవ వదన మెంతొ
వెలవెలంబోవ రాజును నిలిచిపోయె
చక్రమునకుఁ గాడికి మధ్య జరగలేక
నిలిచిపోయి బండెద్దువలెను నపుడు. 419

వ్యాకులంబైన లోచన ద్వయముతోడ
చూడలేని వానివలెనై క్షోణిపతియు
ఎటులో కష్టముగా ధైర్యమెంతొ పడసి
తనువు నిలఁబెట్టుకొని కైక కనియె నిట్లు. 420

అగ్ని సాక్షిగా మంత్రపూర్వాంతికముగ
ఎట్టి నీ పాణి గ్రహియించి యొసఁగినానొ
అట్టి పాణి నీసుతుఁ బాపాత్మురాల!
ఇదిగొ నిపుడే నీతో విసర్జించినాను. 421

దేవి నిశయెల్ల గడవగ తెల్లవాఱె
సూర్యుడుదయించు వేళను నార్యగురులు
నన్ను నభిషేకమునకయి విన్నవింప
త్వరగనిటకు తొందరపెట్టి వచ్చియుండ్రు. 422

రాము నభిషేకమునకు నేర్పఱచఁబడిన
సర్వ సామగ్రి గైకొని సత్వరముగ
చచ్చిపోయిన నాకయివచ్చి రాముఁ
డింక నీళ్లువదులుఁగాక యీక్షణాన. 423

అకట! రామాభిషేకాన కడ్డుపడితి
కాన ఓ యశుభాచార! కలుషురాల
సుతునితోఁగూడ నీవు నాపితరకర్మ
చేయ నీళ్లువదలరాదు చేయరాదు. 424

మునుపు మోదంబుతోఁ బొంగుజనుల ముఖము
చూచి నేఁడు హర్షముపోవ గ్రుక్కి మిగుల
సడలి తలవంచుకొని దిగాల్పడియె యున్న
జనులముఖము మరలనేఁ గనగలేను. 425

అట్టులామహాత్ముండగు నధిపుడెంతొ
చింతఁ గుములుచు పలుకుచు వంతఁబొగుల
చంద్ర నక్షత్రములతోడ సరసమగుచు
మెల్లఁ బుణ్యనిశ తుదకుఁ దెల్లవాఱె. 426

కలుషమగు నాచరణకల్లు కైక యపుడు
మాటనేర్పరియై రోషమగ్న యగుచు
మరలక్షోణినాథునిపైని విఱచుకుపడి
పరుషమైనట్టి వాక్యంబు పలికెనిట్లు. 427

శూలములవంటి మాటలు చూచిగ్రుచ్చి
ఏమి యనుచుండితివి రాజ! యేల యింక
సులభముగ రాముఁ బుత్రుని బోటకిపుడు
త్వరగ రావింపఁదగుదువు ధరణినాథ. 428

నాసుతుని రాజ్యమున స్థాపనంబు చేసి
వనికి రాముని నిపుడె పంపివైచి
నాకు సవతెలేకుండ యొనర్చి నీవు
క్ష్మాప! కృతకృత్యుడవయి కాగలవు సుమ్ము. 429

కొరడా చెళ్లనిపించ దెబ్బతిను మేల్ గుఱ్ఱంబటుల్ కైకచే
చులుకై ఱువ్విన సూటిపోటు నుడులన్ జొప్పించి యాడ్వంబడన్
ధరణీనాథుండు కూలి యిట్లనె "ననున్ ధర్మంబె బంధించెనా
యెఱుకల్ పోయెను జ్యేష్ఠు రామునన‌ఘున్ వీక్షింపఁ గాక్షించెదన్. 430

వ. అంత నక్కడ

ఇఁక నారాతిరి తెల్లవార రవిపైకెక్కన్ బవిత్రంపు భూ
మికి నక్షత్ర సుహృన్ముహూర్తమును సామీప్యంబు చెందంగ నం
తకె శ్రేష్ఠుండు వసిష్ఠమౌని తనఛాత్రశ్రేణితో సర్వ యా
జ్ఞిక సామగ్రినిదెచ్చి యాపురిప్రవేశించెన్ శుభంబేర్పడన్. 431

తుడిచి నీళ్లులు చల్లనడరు రాజపథాలు
జెండాలెగురు మేడలుండి యలర

రకరకపుఁ బూవులొచల్ల వివిధమౌ
మాలలు గల తోరణాలు తనర

పొంగి గంతులు వైచు పురజనంబుల నిండి
సంపన్నమైన బజార్లుమీఁద
అట మహోత్సవముల వ్యాకులంబై యుండు
రాముకై యుత్సుకుల్ పఱచుచుండ.

చందనాగురు ధూపాలు చల్లి కప్పు
నాపురందరపుర మట్టులలరి మించు
నాపురినిదాటి భూపతి యంతిపురము
గుణగరిష్ఠుడైన వసిష్ఠుఁ డెనసిచూచె 432

రకరకపుఁ బక్షులవి కూసి రవము చేయు
నగరజానపదులుచేర బ్రాహ్మణులును
యజ్ఞవిదులు సదస్సులు నచటఁజరుగ
నంతిపురిఁజొచ్చి జనసమూహమును గడచి. 433

వ. ఆ వసిష్ఠమహర్షి పరమప్రీతుఁడై ప్రవేశించి రాజసింహుని సచివుఁడును ప్రియదర్శనుడునగు సారథి సుమంత్రుఁడు గృహమువెడలి వచ్చుచుండ ద్వారమునఁజూచి యతనితోనిట్లనెను. నేనిక్కడకు వచ్చినట్లు త్వరగా రాజుతోఁ జెప్పుము ఇవిగో సముద్రములనుండి తెచ్చిన గంగోదక ఘటములు రెండు సిద్ధముగా నున్నవి. అభిషేకమునకై మేడి భద్రపీఠము తేబడినది. అన్ని[illegible]లు, గంధములు, వివిధ రత్నములు, తేనె, పెరుగు, నేయి, పేలాలు, దర్భలు, పువ్వులు, పాలు, అందమైన ఎనమండుగురు కన్యలు, మత్తగజము, నాలుగుగుఱ్ఱాల రథము, శుభమైన ఖడ్గము, ఉత్తమమైన ధనుస్సు, నరులతోఁ గూడిన వాహనము, చంద్రునివంటి గొడుగు, రెండు వింజామరలు, బంగారు పాత్ర, పసిడిగొలుసులు కట్టిన మూపురముగల తెల్లనియెద్దు, నాలుగుకోరలు గలిగి మహాబలముగల సింహము, సింహాసనము, పెద్దపులి చర్మము, ప్రజ్వలించు అగ్నిహోత్రము, సర్వ తూర్యములు, వేశ్యలు, అలంకరించుకొన్న స్త్రీలు, ఆచార్యులు, బ్రాహ్మణులు, పవిత్రమైన గోవులు, మృగములు,

పక్షులు, శ్రేష్ఠులైన పౌరజానపదులు, వర్తకులు, ఇంకను నితరమైన ప్రియ మాడు జనులు, రాముని యభిషేకమునకై రాజులతోపాటు కూర్చుండి యుం డిరి. కాని రాజును ఇంకను నేను చూడనైతిని. సూర్యుడుదయించెను. పగలు ఉదయమున పుణ్యమైన నక్షత్రయోగమున రాముడు రాజ్యము పొందవలెను. అని మహాత్ముడై నవసిడు చెప్పవిని సూతుడు నృపతి శ్రేష్ఠుని స్తుతింప రాజనివేశమును ప్రవేశించెను. అపుడు రాజుప్రియముకోరు ద్వారపాలురు అదివరకేలేచిన రాజునకు సమ్మతుడై వయసుచేత తనువుచే మంత్రముచేతను వృద్ధుడైన సుమంత్రుని అడ్డగింపనేరరైరి. అంత సుమంత్రుడు దరికేగి రాజు మదిలోనున్న యవస్థను తెలియక పరమ సంతోషముతోఁ గూడిన వాక్కు లతో ప్రాంజలియై రాజునభినందింప సాగెను. 434

ఇంద్రసూతుఁడు మాతలి యిట్టివేళ
బాగుగా నింద్రుఁబొగడ దేవాధిరాజు
అఖిలదానవులను గెల్చెనటులె నేను
గూడ నిన్నిప్పుడే మేలుకొలుపుచుంటి. 435

సాంగములయిన వేదముల్ సకలవిద్య
లాత్మభువుఁడైన బ్రహ్మను నఖిలగతుల
బోధపఱచి ఖ్యాతంబయ్యె భూతలేంద్ర
యట్లె నిన్ మేల్కొలుపుచుంటి నవధరింపు. 436

లెమ్ము త్వరగ మహారాజ! లెమ్మురాజ!
అఖిల మంగళకార్యంబు లాచరింపు
తనువుచే వేషభూషలఁ దనరుమోయి
తటిని మేరువునుండి భాస్కరుఁడువోలె. 437

చంద్రరవులు కాకుత్స్థ! వైశ్రవణశివులు
ఇంద్ర వరుణాగ్నులు జయమర్పింత్రుగాక
పుణ్యమగు రాత్రిచనె పనుల్ పూర్తియయ్యె
క్షితిని మేల్కొని పనుల్ చేయుమిపుడె. 438

రామునభిషేక సామగ్రి రానెవచ్చె
వర్తకులు పౌరులంజలుల్ పట్టియుండ్రు
ఈ వసిష్ఠుఁడు ద్విజులతో నేగుదెంచె
క్షితిప! శాసింపు రామాభిషేకమునకు. 43

అనుచు సార్థకంబుగ సూతుడనునయమున
పలుక విని రాజునింకను వ్యథలఁ గ్రుంగి
శోకరక్తాక్షుఁడై పల్కె "బాకువంటి
వాక్కుచే మర్మములఁ గోసివైతువింక. 44

అప్పుడు సుమంత్రుఁడా దీనమైనమాట
వినియుఁగడు దీనుఁడగురాజు గనియునింక
నట్టికరుణ దృశ్యంబును నరయలేక
దోసిలొగ్గి యచటనుండి తొలఁగిచనియె. 441

ఎప్పుడైతె స్వయంబుగ నృపతి ఏమి
దైన్యమునఁ బల్కలేకయుఁ దరిగియుండె
అపుడు మంత్రాలు దెలిసినయట్టి కైక
యాసుమంత్రుని తోడుత ననియెనిట్లు. 442

"ఓయి సుమంత్ర! రాముని ప్రియోత్సవ ముత్సుకుఁడై తలంచుచున్
రేయి సమస్తమున్ నిదురలేకయె జాగరముండి రాజు న
త్యాయితమౌ శ్రమన్బడలి యాగక నిద్రకు లొంగియుండె నీ
వేయిఁక రాముసద్యశుని నిప్పుడె తెమ్మిటు శంకలేకయే. 443

అది కళ్యాణపు మాటయంచు మదిలో *నాలోచనన్జేసి స
మ్మదముంబొంది మహీశు శాసనమునం బైల్దేరి వేగన్బదే
ఇదె కైకేయియు తోఁచు రామునికిటన్ బట్టాభిషేకంబుకై.
యిదె ధర్మాత్ముఁడు పిల్వబంచె స్ఫుటమందేగెన సుమంత్రుఁడికన్. 444

సాగరమధ్యలో హ్రదము చాడ్పునఁబట్టన మధ్యలో శుభం
బౌగతిఁ బొల్చునంతిపురమందున నుండి సుమంత్రుడేఁగి దూ
రాగతులైన జానపదులన్ నృపపంక్తి ప్రజాసమూహమున్
వేగమె ద్వారమందు గనిపెట్టుకయున్న ధనాఢ్యులన్ గనెన్. 445

వేదపారగుల్ రాజపురోధసులును
నైన బ్రాహ్మణులారాత్రి యటనెయుండి
దరినెయుండువారలు రాజుదరినె మిగుల
నుండవచ్చి యచ్చోటనె యుండిరపుడు. 446

పౌరముఖ్యు లమాత్యులు ప్రముఖ జనులు
సేనముఖ్యులు రామాభిషేకమహము
మోదమునఁజూడఁ గాంక్షించి ప్రోగుపడియు
వచ్చి యచ్చోటనుండిరి ప్రమద మొప్ప. 447

సూర్యుఁ డుదయింప బుష్యమీ చొచ్చియుండ
రాముఁడు మును జన్మించు కర్కటక లగ్న
మందు రామాభిషేకంబు సంత జరప
నా ద్విజేంద్రులు కల్పించి యమరినారు. 448

వ. సభయందు బంగారపు పూర్ణ కుంభములు సిద్ధమై యున్నవి. భద్రపీఠము అలంకరింపబడినది. మెఱయు పులి చర్మము రథముపై చక్కఁగా నేఱవబడినది. గంగా యమునల పవిత్ర సంగమము నుండి జలము తీసికొని రాఁబడినది. ఇతరమైన పుణ్యనదులు, కూపములు, సరస్సులు తూర్పుగా ఊర్ధ్వముగా, అడ్డముగా ప్రవహించు నదులనుండి, సముద్రములనుండి జలము తీసికొని రాఁబడినది. తేనె, పెరుగు, నేయి. పేలాలు, దర్భలు, పువ్వులు, పాలు తేఁబడెను. అందమైన యెనమండుగురు కన్యలు, మదగజము, వెండి బంగారముల జల కుంభములు, క్షీర కుంభములు, తామర పుష్పలతో, నల్ల కల్వలతో ఘటములు నిండి యున్నవి. చంద్రాంశువులవలె వికాసముగలిగి తెల్లని రత్న

ములచే నలంకరింపబడిన వింజామరము రామునికి సిద్ధముగానున్నది. చంద్ర మండలమువలెఁ దెల్లని అభిషేకమునకు సిద్ధమైన గొడుగు, తెల్లని గుఱ్ఱము, తెల్లని యెద్దు అక్కడ ఉన్నవి. వాదిత్రములు వందిమాగధులు సిద్ధముగా నుండిరి. ఇక్ష్వాకువుల రాజ్యాభిషేకము ఎట్లు చేయఁబడెనో అట్లే యిదియు జరుపఁబడును. 449

ఇట్లు కల్పించు వస్తువు లెల్లఁ గూర్చి
రాజవచనంబు వల్లను బ్రాహ్మణులును
వచ్చి యట రాజుఁగాంచక ప్రశ్నచేసి
"ఎవరు మముగూర్చి యెఱిగింత్రు నృపతి కిపుడు. 450

ఉర్విపతి కనఁబడఁ డర్కు డుదయమయ్యె
శ్రీయుతుఁడగు రాముని యభిషేకవేళ
"సిద్ధమైనది" యని వారు చెప్పుచుండ
అచటి నృపతులకు సుమంత్రుఁ డనియె నిట్లు. 451

"ఏను రాజాజ్ఞ రాము రప్పింప త్వరగ
పయలుదేఱితి, మీరలో పార్థివునకు
నిష్టు లిటు రామునికి విశేషించి మఱియు
నిష్టు లధిపాజ్ఞ మీ సుఖ మెఱుఁగనెంతు. 452

వృద్ధుఁడైన రాజెందుకు నిటకు రాఁడొ
దాని హేతు విపు డడిగి త్వరగ వత్తు
అని పురాణవేత్త సుమంత్రుఁ డపుడు వేగ
అంతిపురము దగ్గఱకు తా నరుగుదెంచె. 453

* తురగములుటాగ రథముపై నరపతిగృహ
మటు ప్రవేశించియు సుమంత్రుఁ డధిపు కులము
మొదటినుండి స్తుతించి యా భూపు శయ్య
దరికి చని తెర యడ్డుగ నరిగి పొగడె. 454

చంద్రరవులు కాకుత్స్థ ! వైశ్రవణ శివులు
నింద్ర వరుణాగ్నులు జయమర్పింత్రుగాక
పుణ్యయగు రాత్రి చనె పనుల్ పూర్తియయ్యె
క్షితిప ! మేల్కొను తగుపనుల్ చేయుమయ్య. 455

బ్రాహ్మణులు సైన్య ముఖ్యులు వర్తకులును
వచ్చి నీ దర్శనము నభివాంఛ చేతు
రధిప ! మేల్కొమమని మెచ్చి సుమంత్రుఁ
డధిక మంత్రజ్ఞుఁ డన లేచి యధిపుఁ డనియె. 456

"రాము రావింపుమని చెప్ప నీమె నీకు
నేల నా యాజ్ఞ నిరాకరించినావు
నేను నిదురింపనే లేద యిపుడె రాము
నిటకు రప్పింపు"మని ప్రభు విడియె నాజ్ఞ. 457

అని మరల రాజు చేసిన నాజ్ఞ నపుడు
సరె సుమంత్రుఁడు విని శిరసావహించి
యింక నెక్కువ ప్రియమగు నిపుడ యనుచు
నిలిచి రాజగృహమునుండి నిష్క్రమించె. 458

---

* తుర్ అన్నది గాయత్రీ బీజాక్షరము

రాజపథము జెండాలచే రాజిలంగ
హర్షమందుచు చూచుచు సూతుఁడరిగి వేగ
వినుచు రామాభిషేకపు వివిధ కథలు
కనియెఁ గైలాస సమము రాముని గృహంబు. 459

కడు నింద్రు నిలుఁబోలి ఘనకవాటముగల్గి
నూఱు వరండాల మీఱి యుండి
స్వర్ణప్రతిమలతో ప్రథితమై పూర్ణమై
రత్న విద్రుమపుఁ దోరణము లొప్పి
శారద జలదాల సరస కాంతులతోడ
వెలసి మేరుగుహల వలెఁ జెలంగి
మణుల మాలికలొప్ప మంచిముత్యా లొప్పి
చందనాగరు పొగల్ విందు లొసగి

సురభిగంధాల మలయాఖ్య గిరిని బోలి
సారస మయూర నాదాల సరస మగుచు
రమ్య వృక శిల్పముల చిత్ర లలిత మగుచు
రాము ప్రాసాద మెంతయో రమ్యమయ్యె. 460

మేలికాంతుల మదిఁగనుల్ మిగుల లాగి
అర్క శశి తుల్యమై కుబే రామరేంద్ర
సదన సమమై వివిధ పక్షి సంకుల మయి
మేరు శృంగముఁబోల్ రాము మేడఁ గనియె. 461

దోసిలిడు జానపదులతో భాసిలుచును
ప్రకట రామాభిషేకోత్సవమును జూడ
మొగములెత్తి కుబ్జ, కిరాత ముఖ్యులరయ
నలరు రాము మేడ సుమంత్రుఁ డరసి చొచ్చె. 462

అచట రాజగృహము పై పెయురుగుదెంచు
సైన్యములఁజూచి రమ్య కక్ష్యలను గడచి
అంతిపురిఁ బ్రజామోద వాక్యముల వినుచు
బహుమతులు తెచ్చు ప్రజ గల ద్వార మరసె. 463

ఉబ్బమబ్బున్ గిరినిబోలి యొప్పియున్న
ప్రథిత శత్రుంజయ మ్మను పట్టపేన్గు
గుఱ్ఱములఁ బూన్చు రథ మేనుగులను దాటి
వల్లభామాత్యులను సూతవరుల గడచె. 464

వ. మఱియు నా సుమంత్రుఁడు

ఇంద్రకూటాచల జలదహితమె యయిన
శ్రేష్ఠ మందిర సుందర శిల్ప రమ్య
మైన రాము సద్మము చొచ్చె నడ్డఁబడక
యిఁక మణిగణాఢ్య వార్ధిని మకర మట్లు. 465

ఆ సుమంత్రుఁడు జనులతో వ్యాప్తమైన
యంతిపురి ద్వారమునుదాటి యచటి కక్ష్య
చేరి వింత్ల వీటెలఁ దాల్చి చెవులఁ గుండ
లము లమరి శ్రద్ధఁ గనుయువకాళిఁ గనియె. 466

వ. కాషాయములఁ దాల్చు వృద్ధులును, వేత్రములు ధరించిన కంచుకులును అటకు వచ్చిన సుమంత్రుని జూచి సంభ్రమముంబుగఁ దమ తమ యాసనంబులనుండి లేచి నిలబడి యుండగ అపుడు దక్షుడై వినయంబు గల సూతపుత్రుఁడు వారితో త్వరగావెళ్లి రామునికి చెప్పుడు 'సుమంత్రుడు ద్వారమున నున్నాడు'. అని చెప్పఁగా వారు ప్రభువునకు ప్రియము చేయగోరి భార్యా సహితుండయి యున్న రామునితో శీఘ్రముగా జెప్పిరి. అంత ద్వారపాలురు నివేదించినది విని తండ్రి యంతరంగమును దెలిసికొని ప్రియము తెలిసికొను కోర్కెతో ఆ సుమంత్రుని అక్కడకే రాముండు రప్పించెను. 467

అర్థయున్ వైశ్రవణుండు వోలెఁ దగి దేహాలంకృతుం డౌచు బం
గరు పర్యంకమునందు దువ్వలువపైఁ గాలూని పెన్ పంది నె
త్తురు రంగొప్పియు పల్సువాసనలు విందుల్ చేయు గంధాలచే
పరిలిప్తుండగు రాము మ్రొక్కి కరముల్ వంచెన్ సుమంత్రుం డొగిన్. 468

అటులన్ ప్రాంజలియై సుమంత్రుఁ డనె "శయ్యన్ హాయి నిద్రింతె నీ
కిట వాహ్యాళి సుఖంబె"యంచు సుఖమున్ పృచ్ఛించి వాక్రుచ్చె ముం
గట నిన్ జూడదలంతు రామహిషియౌ కైకేయి మీ తండ్రి యి
చ్చట నాలస్యము చేయకుండఁ జను కౌసల్యాసుతా ! రాఘవా ! 469

అని సుమంత్రుఁడన బురుషవ్యాఘ్రుఁ డంత
సీత మన్నించి యిట్టులు చెప్పె యపుడు
దేవి నాకయి దేవుఁడున్ దేవి కలిసి
ధ్రువమయాలోచనము చేయుదురు నిజంబు. 470

అధిపు నుద్దేశ మెఱిఁగి ప్రియంబు చేయ
నెంచి నాకయి నృపుఁ బ్రోత్సహించుచుండు
తల్లి కైక హర్షించి హితంపు వాంఛ
నాదు నర్థకామముల నొనర్ప నోపు. 471

వాకు నర్థకామముల నొనర్పఁ గోరు
నీ సుమంత్రు దూతగను పంపించియుండు
అచట నిటువంటి పరిషత్తు నమరి యుండు
నట్టి దూతయె యిపు డిట కరుగుదెంచె. 472

తప్పకయె నన్ను భూపతి తామసిలక
యౌవరాజ్యాన నభిషేక మాచరించు
సరియె మంచిది యటనుండి యరిగి వేగ
నృపతివరేణ్యు నిపుడు వీక్షించువాఁడ, 473

ఇమ్ముగా నీవును పరివారమ్ముతోడ
సుఖముగా నుండు మింకను సుఖము గనుమి
అనఁగ భర్తృసమ్మానిత యైన సీత
వేగ పతిని ద్వారముదాక సాగనంపె. 474

వ. అట్లు పంపి సీత రామునకు మంగళవాక్యము లిట్టు లాడదొడఁగె. 475

బ్రహ్మ యింద్రునకుంబోలె రాజు నీకు
ద్విజులచే సేవితంబయి వెలయుచున్న
రాజసూయాభిషేకమున్ బ్రథిత రీతి
నాచరించెడు గావుత మంద అరయ. 476

దీక్ష పూని వ్రతంబు విధిగ వహించి
శుచివయి మృగాజినము దాల్చి శోభనమున
హరిణశృంగమున్ ధరియించి హస్తమందు
నెసఁగు నిను జూచి నేను భజింతుఁగాక. 477

పూర్వదిశ యందు వజ్రి నిన్ బ్రోచుఁగాక
దక్షిణపు దిక్కున యముండు రక్షచేయు
వరుణదేవుండు నిను పడమర బ్రోచు
నుత్తరదిశను కుబేరుండు నోముగాక. 478

అనుచు సీత శుభము ధ్యాన మాచరించి
అనుమతింప మంగళ వేషమును ధరించి
ఆ సుమంత్రునితోఁ గూడ నపుడు రాము
డా నివేశమునుండియు వరిగె నంత. 479

గిరిగుహనున్న సింహము నగేంద్రమునుండియె నిష్క్రమించున
ట్లరిగి యతండు ద్వారమున నంజలిబద్ధుని గాంచి లక్ష్మణున్
త్వరగతి మధ్యకక్ష్య కడఁ దన్గను మిత్రులఁ బల్కరించియూ
దరినె చరించు వర్థులకు దండము పెట్టియు మెచ్చి యంతటన్. 480

వీతిహోత్ర సమమై వెండితోఁ జేసిన
పులిచర్మపరచిన వెలుగులీని
ఉరుమువోలె ధ్వనించు, నుజ్జ్వల మణిహేమ
భూషితమౌచును పొలుపులీని
ప్రభచేత గన్నుల వడిగ నాకర్షించు
సూర్యవర్చసువోలె చొప్పులెసఁగ
పెన్నగున్నలఁబోలి యెసగు గుఱ్ఱములొప్ప
ప్రథితేంద్రుడెక్కిన రథముబోలు

అరదమును వేగముగ నరవ్యాఘ్రుడెక్కి
బాగుగనుఱుము మబ్బటు ధ్వనియొనర్ప
వరమహేంద్రమునుండి చందురుఁడు వోలె
స్వగృహముననుండి రాముఁడు బయలుదేఱె. 481

ఛత్రచామరములు సౌమిత్రివేయుచు
రథమెక్కి భ్రాతకు రక్షగూర్ప
రథమువెంటఁ బ్రజ కోలాహలమును జేయ
తురగముల్ గిరులట్లు కరులునడువ
ముందుముందుగ చందనాగురు భూష
లలరు ఖడ్గధనుర్ధరులు చరింప
వాదిత్ర శబ్దముల్ వందిమాగధ నుతుల్
తగ శూర సింహనాదమ్ము లడర

స్త్రీ లలంకరించుకొని కిటికీలనుండి
మేలు కోరుచు ముత్యాలు పూలు చల్ల
రాముకై ప్రియమును గోరి ప్రమద లెల్ల
హర్మ్యములనుండి యాశీస్సులాడి రిట్లు. 482

"రామ ! కౌసల్య పుత్త్రి ! పిత్త్ర్య రాజ్యంబు
గనిన నిన్నెంతగ జనని మెచ్చు

రామ హృత్ప్రియ సీత సీమంతినుల కంద
ఱకు నెంత మాన్యగఁ బ్రథిత యగునొ

మును సీత యెంతటి పుణ్యంబు చేసెనో
సోము రోహిణి వలె రాముఁ బొందె

ఇట్టి రాముఁడు సీత యొసఁగు నయోధ్యలో
ఈ మన మెంత యదృష్టవతుల

మనుచు ప్రాసాద శిఖరాల నిటుల నటుల
సంచరించుచుఁ దనుఁ జూచు సతుల నుడులు
చెవుల విందులు గావింప మివుల వినుచు
రాముఁ డేగెను రాజమార్గంబు వెంట. 483

వ. ఇట్లు సౌధంబులనుండి వాక్కులతో స్తుతింప భూమిమీద నున్న
జనులు నమస్కారంబులు చేయుచుండ. 484

ఈ రాముడేగద నృపతి ప్రసాదాన
విపుల రాజ్యశ్రీని వేగ పొందు

ఈ రాముఁడేగద శాసింపగ మనమెంతొ
పూర్ణకాములమౌచు పుణ్యు లౌదు

మీ రాముఁడేగద యీ ప్రజ లాభంబు
పొంద నీరాజ్యంబు పొందఁగలఁడు

ఈ రాముఁడే రాజ్య మేలఁగ రాజయి
యుండ నింతయుఁ గష్ట మొందకుండు

మనుచు నటకువచ్చియు లోకు లాడుకొనెడి
కథల వినుచును, పురజనుల్ కరము పొంగి
తన్నుఁగూర్చి పల్కతిఁ బల్క తాను వినుచు
రాముఁడేగెను రాజమార్గంబు గుండ. 485

తురగంబుల్ సకిలింప మత్తకరు లెంతో ఘీంకరింపన్ పుర
స్సరులై స్వస్తిక వందిమాగధు లిఁకన్ శ్లాఘింప నాదంబులున్
మొరయన్ పై శ్రవణుండువోలెఁ జని యేన్గుల్ స్యందనంబుల్
పురవాసుల్ గల రత్నరాసుల బజారుల్ గాంచె రాముం డటన్. 486

వ. అపు డా రాముఁడు రథ మెక్కి స్నేహితులు పొంగి సంతోషించు
చుండ జెండాలతోనిండి విలువగల యగురువత్తులు పొగలు వ్యాపింప నానా
విధములగు జనులతో వ్యాకులమై యున్న నగరమును చూచెను. అచట
మేఘములఁ బోలిన తెల్లని మందిరములుగల రాజమార్గ మంతయు మధ్యగా
అగురు పొగలతో ఉత్తమ గంధములతో నిండెను. రాజ మార్గములందు పట్టు
వస్త్రములతో కౌశేయములతోఁ గట్టిన చాందినీలయందు చిల్లులు చేసి కట్టఁబడిన
ముత్యాల సరుల జాలరులును ఉత్తమ స్ఫటికములు దట్టమై వ్రేలాడుచుండెను.
ఆ రాజపథము దేవపథమువలె తక్కువ యెక్కువ వెలగల భక్ష్యములతో నొప్పా
రెమ. అందు నాలుగు వీథులు మొగసాలలు పెరుగు, అక్షతలు, హవిస్సు,
పేలాలు అగురు పొగలు చందనములు నానావిధ మూల్యములు ఉపగంధ
ములు సొగసులీనుచుండెను. అందు మనుష్యులు అనే కాశీస్సు లిచ్చుచుండిరి.
ఇవన్నియును చూచుచు వీరందరిమాటలను వినుచు రాముడు పోవుచుండెను.
మరియు 487

"మును ముత్తాతలు తాత లేగిన పథంబున్బట్టి పాలింపు నా
యన ! నీవి ప్లభిషేకమున్ గని జనం బర్చించి లాలించి పా
లన గావింపుము నీదు తాతలవలెన్ రంజింపు సౌఖ్యంబుగా
మని మేముందుము నీవు రాజవయి రామా ! యేలు పూర్వుల్ వలెన్. 488

రాముఁడు రాజ్యమందు యువరాజయి చక్కగ రాజమార్గమం
దేము గనంగ నేగునెడ నింతియె చాలును భోగభాగ్యముల్
మేమిక నేమి కోరమిట మేమును గోరము స్వర్గభోగముల్
మే మభిషేక మొక్కటె వరింతుము వద్దిక మాకు నేమియున్. 489

వ. ఇట్లివి యింక నితరంబులును సుహృదుల వాక్యములు రాముఁడు
వినియు నుదాసీనుఁడై యుండెను. 490

ఆతని నెంచకుండ హృదయంబును, గన్గొనకుండ గన్నులున్
ఆతలికిన్ మరల్పఁడెవఁడైనను, రాముడు దూర మేగినన్
ఆతని నేతలంచుఁగను. నాతని నెవ్వడు చూడఁడో యతం,
దేతని చూడఁడో యతఁడు హీనుఁడు స్వాత్మయుదూఱు వీనినిన్. 491

నాలుగు వర్ణంబులలో
చాలిన యా వయసుఁబట్టి సర్వుల దయతో
నేలు మహాత్ముఁడు కావున
నే లీలను రాము నమసరింతురు జనముల్. 492

నలువీథుల మొగలను దే
వుల పథములఁ జైత్యములను పుణ్యాయతనం
బులను ప్రదక్షిణము గొనక
సులువుగఁ జనె రాజకులము క్షోణిపసుతుఁడున్. 493

తెలి కైలాసపుశృంగమట్లు నిలుపై తెల్పా విమానాలటుల్
పలుప్రాసాదపు శృంగముల్ గగనమున్ వ్యాపింప రత్నాల కూ
ర్పుల క్రీడాగృహముల్ మనోజ్ఞమయి చెల్వుల్ నింప దేవేంద్రునా
నిలయుం బట్లు వెలుంగు తండ్రి గృహమున్ జేరెన్ వడిన్ రాముఁడున్. 494

అతఁడు విలుకాండ్రు కాచు కక్ష్యలను మూటి
గుఱ్ఱములతోడ దాటి తక్కుగల రెంటి
కక్ష్యలను పదాతి యగుచుఁ గడచి జనుల
నెల్లర మరల్చి శుద్ధాంతగృహము చొచ్చె. 495

ముదమున రాముఁడు భూపతి
సదనముననే తండ్రిదరికి జన, జనములు చూ
చెద రా రాముని రాకను
పదెపదె చంద్రోదయమును వారధివోలెన్. 496

కడువడి నెండిపోయిన మొగాన శుభాసనమందు దీనుఁడై
తడఁబడి కూరుచున్న తన తండ్రిని కైకనుగాంచి తండ్రికిన్
అడుగుల మ్రొక్కి నమ్రుడయి యాపయి కైకకు శ్రద్ధతోడనే
యడుగుల మ్రొక్కి రాముఁ డట నంజలి యొగ్గి యటుల్ నిలంబడన్. 497

రామయటంచుఁ బల్కి కనులన్బడు నీళ్ళఁ గలంకఁ బాఱి యిం
కేమియు దీనుఁడై కనుటకేని వచించుటకేని చాల కే
యే మరుమాట లేని పితృయిట్టి యపూర్వపు రూపుగాంచి యా
రాముఁడుగూడ భీతిలెను త్రాచును త్రొక్కినవాని పోలికన్. 498

గురువై క్షోభము పెట్టరాని దయిత్యమున్ క్షోభించు సంద్రం బటుల్
కరమున రాహు మ్రింగు సూర్యు డటు కల్లల్ పల్కు మౌనీంద్రు నా
కరణిన్ వాడిన యింద్రియాల మిగులన్ గష్టంబుచే స్రుక్కి ప
ల్మరు నిట్టూర్చుచు తాప మొంది వ్యధితుండౌ రాజు నీక్షించియున్. 499

ఊహకు నందరాని పితయుత్కట శోకముఁగూర్చి యెంతయో
ఊహలుచేసి పర్వముల నుబ్బిన సంద్రమటుల్ కలంగుచున్
తాహృది నెంచె "నేమి పిత నన్నభినందన చేయఁ డల్గియున్
నాహిత మెప్పుడాడు క్షమ, నన్గని యిప్పుడు కుంద నేటికిన్. 500

డీనుఁడువోలె రాముఁడు మదిన్ గడుఁ గ్రుంగి విషణ్ణవక్త్రముస్
బూనియుఁ గైక కిట్టులనె "మున్నెపుడైనను నేరమేమి య
జ్ఞానము చేతఁ జేయఁగద, నా పితయేటికిఁ గోప మొందెనో
దానిని నీవు చెప్పుమిఁకఁ దండ్రిని నీవె ప్రసన్నుఁ జేయుమీ. 501

ఏమితఁడప్రసన్న హృదియైనను వత్సలుఁడై గనున్ వనున్
ఏమి వివర్ణవక్త్రుడయి ఏటికి దీనతనాకుఁ జెప్పడే
ఏమిది మేనఁగాని మదినేన్వ్యధ బాధలు పెట్టదేగదా
ఏమిది నాకుఁ జెప్పడిటులెప్పుడు సౌఖ్యము దుల్లభంబయో. 502

మనదు ప్రియదర్శనుఁడగు కుమార భరతు
సందుగాని శత్రుని యందుగాని
తల్లులయెడఁగాని యెపుడెదైనఁగాని
నేను జేసియుండనుగదా, దానితెలుపు. 403

విను మహారాజు సంతోషపెట్టకుండ
నుండలేదుగదా; లేక తండ్రిమాట
చేయకుంటినా కోపమున్ క్షితిపతికిని
పలిపిక్షణమేని జీవంబు నిలువఁగోర. 504

తనదుజన్మ యెవ్వని మూలముననె యయ్యో
నని నరుండెవ్వఁడు తెలిసికొమనొ వాఁడు
అట్టి ప్రత్యక్ష దైవంబునందు నెట్లు
అనుకూల్యంబుతో నుండ కవనినుండు. 505

అనఘుఁడీపిత యభిమానమందిగాని
మరియు రోషానఁగాని యేపరుషమైన
నవఁగలేమగద యతని మవసిదేల
కలఁతచెందెను జననిరో! తెలియఁజెప్పు. 506

సరిగాదేవిరో! చక్కఁదెల్సికొన వృచ్ఛన్‌జేయు ఈ నాపయిన్
కరుణన్‌జూపి వచింపు మీవరకు నెన్నండేనియున్ లేనటుల్
ధరణీనాథుఁడపూర్వమై తగువికారం బేనిమిత్తంబుచే
పొరసెన్ దెల్పుమటంచు రాముఁడు మహాత్ముండిట్లు ప్రార్థింపగన్. 507

అపుడేమాత్రము సిగ్గులేక స్వహితంబై ధృష్టమౌనట్లు తా
నపుడే మాటను చెప్పవచ్చునొకొ లేదా చెప్పరాదొ యటం
చపుడేశంకయులేక కైకయనె "రామా! రాజొయల్లండు లే
దిపుడేకష్టము,. లోననేదికలదో తెల్పండుత్వద్భీతిచే. 508

ప్రియమౌనేకిపు డప్రియంబు తెలుపన్ లేకుండుటన్ మాటయే
దియు నోటన్ మెదపండు. నాకునితడేదిచ్చెగదో దాని నే
దియు శంకింపక చేయుతప్పకు వరంబీరాజు మున్నిచ్చియర్పించి యి
చ్ఛయె లేకుండి యెవండొ మూర్ఖుఁడట పశ్చాత్తప్తుఁడౌ నేడిటుల్. 509

నాకు వరంబునిత్తునని నాడని నేఁడు నిరర్థకంబుగా
ఈకడనన్ని నీళ్లు చననిప్పుడు సేతువుకట్టనెంచు రా
మా! కడు ధర్మమూలమిది ప్రాజ్ఞులునంద ఔతెంగినట్టిదే
నీకయి నాపయిన్నలిగి నీపితసత్యము వీడకుండుతన్. 510

భూపతి చెప్పెమాట శుభమో యశుభంబొ యొనర్తునంచునీ
వీపయిఁజెప్పితేని యదియెల్లయు నేనయితేవచించెదన్
భూపతిమాట వ్యర్థమయిపోవక యుండెడునట్లు చేసితే
నీవయి నేనెచెప్పెదను నీతఁడొ నీకిటు చెప్పడేమియున్. 511

వ. అని యిటులు గైకేయి చెప్పఁగావిని రాముఁడు చాలవ్యథపడి ఆ
దేవికి రాజుసన్నిధియం దిట్లనె. 512

అహహా! సీ! యిటుదేవి! యిట్టినను నీవాయిట్లు వాక్రుత్తు, వీ
రహి వాక్రువ్వఁగ నీకునర్హమగునే, రాజేది వాక్రుచ్చినన్
ఇహముంజూడక యగ్ని లోబడుదు భక్షింతున్ విషంబేని నా
డు, హితుండౌ పితచెప్పెనాయుదధియందున్ దూకుదున్నిప్పుడే. 513

కనుక కౌంకకదేవి! యీక్షణమెచెప్పు
క్ష్మాపతికి నేదియిప్పు డభికాంక్షితంబొ
ఇదె ప్రతిజ్ఞను నేనుగావించుచుంటి
రాముఁడెప్పుడు రెండుపల్కండు సుమ్ము. 514

ఇటుల ఋజువుగ నిజము వచించుచున్న
రమ్య సుగుణాభిరాముడౌ రాముతోడ
అనునార్యురాలైన కైకేయియపుడు
ములికివలె దారుణంబైన పలుకువలికె. 515

మునుపు దైవాసురరణాన ములికితీసి
యేనుగావ నీపితవరాలిచ్చె రెండు
ఒకటి భరతాభిషేక మింకొకటి రామ!
* దండకాటవికీవిప్డె తరలిచనుట. 516

నిన్ను నీదుతండ్రిని సత్యనిష్ఠులుగను
చేయఁదలతువేని పురుషశ్రేష్ఠ! వినుము
జనకుమాటప్రకారము సలుపుమాజ్ఞ
నీవు పదునాలుగేండ్లు వసింపుమడవి, 517

* దండుడను నిక్ష్వాకుపుత్రుడు శుక్రాచార్యపుత్రికను బలాత్కరింపబోగా నీపురి అడవియగునని శపించెనదె ఈ **దండకారణ్యము.**

నీకొఱకుఁ గూరిచిన యభిషేకవస్తు
లిక భరతు నభిషేకింప నెసఁగుఁగాక
విడిచి యభిషేకమును గావి జడలుఁ దాల్చి
పదియు నాల్గేండ్లు దండకావని వసింపు. 518

సకల మణుల రథాశ్వ గజాల నిండు
ప్రథిత కోసలపతి ధరన్ భరతుఁ డేలు
నిట్టి దైన్యానఁ గుమిలి దుఃఖించు మొగము
నెసఁగు భూపతి నిను నిరీక్షింపలేఁడు. 519

రఘుపుత్రా ! యిపుడీవు చేయుము మహారాజప్రతిజ్ఞన్ గరం
బఘముల్ వోవఁ దరింపఁ జేయు నృపతిన్ దివ్యానర్ఘ సత్యాన నం
చు ఘనంబౌ పరుషాలు కైక పలుకన్ శోకార్తియేనోక దా
రఘురాముల్; సుమహానుభావు నృపునిన్ బాధించె పుత్రవ్యథల్. 520

దుష్టులను జంపు రాముఁడు కష్టకరము
మరణతుల్యమునౌ కైక మాటలు విని
వ్యథపడక పల్కె మంచిది ప్రభువునాజ్ఞ
జడలు కావిబట్టలు దాల్చి యడవినుందు. 521

కాని యిదియైతె తెలిసికోఁ గాంక్షగలదు
ఎదురుకొనరాక రిపునడగించు రాజు
మునుపువలె నీసమయమందు ముందుగానె
యేల నన్నభినందింపఁ డేల కనఁడు. 522

నీవు కోపమొందకు దేవి ! నీదు ముందె
కావి జడలూని వనిఁబోదుఁ గనుము ప్రీతి
హితుఁడు గురువు పిత కృతజ్ఞుఁ డితని యాజ్ఞఁ
ప్రియము చేయనివాఁడనె వీడి శంక. 523

హృదిని ఈ యొకే వ్యథ నన్ దహించిపైచు
భరతునభిషేకమును గూర్చి పార్థివుండు
స్వయముగా తానె వచియింపవచ్చుఁగాదె
ఏల నాతోడఁ జెప్పఁ డిదేమి జనని. 524

భ్రాత భరతునికై నేనె స్వయముగానె
సోదరప్రేమ ప్రోత్సహించుటనె యిపుడె
సంతసమున జానకిని రాజ్యమును ధనము
నిష్టమగు ప్రాణములనైత మిత్తుఁగాదె. 525

ఇంకఁ జెప్పెడిదేమి యీ నృపతివరుఁడు
స్వయముగా విశేషించి జనకుఁ టీటుల
ప్రేరణముచేయగా నీదు ప్రియముకొఱకు
క్షితిపుని ప్రతిజ్ఞఁ జేయుమనె చెప్పవలెనె. 526

కనుక నోదార్చు సిగ్గిలు మనుజవిభుని
ఏల యిదియేమి యీతఁడు నేలపైని
తనదు రెండు కన్నులుఁగూడ నన్ను మంచి
భువిని నిట్టూర్చి మెల్ల నశ్రువులు విడచు. 527

వెళ్లుదురుగాక దూతలు విభుని యాజ్ఞ
మేనమామ గృహమునుండి యీ నిమిషమె
వడిగలుగు మేలిగుఱ్ఱాలపైని నెక్కి
వెంటనే మన భరతు రప్పింత్రుగాక. 528

ఇదిగొ నిపుడె యాలస్యమేమి లేక
ఏల పిత చెప్పెడని విచారింపకుండ
పదియునాల్గేండ్లు వనవాస మిదె యొనర్ప
చనుచునుంటిని దండకా వనమువకును. 529

వ. అని రాముఁ డనగఁ గైక యిట్లనెను. 530

సరియె యిటు లౌత దూతలు క్ష్మాపునాజ్ఞ
మేనమామ గృహమునుండి యీ నిముషమె
యేగుదురుగాక మేలిగుఱ్ఱాలనెక్కి వడిగ
వెంటనే నాదు భరతు రప్పించుటకును. 531

అరుగ నుత్సాహపడు నీవు నాలసింప
నర్హమేమియుఁ గాదని యనుకొనెదను
కనుక రామ ! నీవిటనుండి వనికి త్వరగ
నేగుటయె మంచిదని యిపుడేను తలఁతు. 532

సిగ్గుపడి రాజు స్వయముగఁ జెప్పఁ డెదియు
ఇటులనుకొనకు కొంచె మిదేది కాదు
ఓ నరశ్రేష్ఠ ! త్వరగ నీవేగి వనికి
ఇతని మన్యువీవే తొలగింతుగాక. 533

ఎంతవఱకును నీవును ఈ పురంబు
విడిచి త్వరపడి యడవికి వెడలిపోవొ
అంతవఱకును రాఘవ ! యట్టి తండ్రి
స్నానమాడఁడు తినఁడు నీళ్లని గొనఁడు. 534

వ. అంత

చూచి రాముఁడున్ గైక ప్రేరేచ మిగుల
వడిగ కంగారుపడి మూర్ఛపడిన పితను
లేవనెత్తి చబుకుతో నెగిరి పర్వెత్తఁ గొట్టఁ
బడు తురగమట్లు త్వరపడె వనికిఁబోవ. 535

అతిగ దారుణమై యప్రియంబు నైన
యట్టి యనార్యురాలి వచస్సు లాలకించి
వ్యథయె లేనివాఁడయి రాముఁ డాక్షణంబ
యిటులు కైకేయితోడ వచించె మిగుల. 536

నేను నర్థప్రధానుడను గాను దేవి !
ఋషులు లోకమందుండ వాంఛింప రెపుడు
నేను ఋషివంటివాడ నంచీవు తెలియు
ధర్మమందె కేవలము నాధారపడుదు. 537

అనఘుఁడైనట్టి తండ్రికేదైనఁ బ్రియమె
నేను చేయుటకు శక్యమైన యెడల
ప్రాణములనైన తృణముగా వదలివైచి
యదియు గావింతునని యింక యెరయు మీవు. 538

పితను హృదయపూర్తిగను సేవించు కంటె
జనకు వాక్పరిపాలన సలుపు కంటె
నాకు నింతకంటె మహాఘనంబైన
పుణ్యధర్మాచరణ మేది భువిని లేదు. 539

అనఘుడు పిత చెప్పకపోయినప్పటికిని
నీదు మాటనుబట్టియె నేనె యిపుడు
పదియు నాలుగైన సంవత్సరములు
విజన వనమున వసియింప వేగఁబోదు. 540

తండ్రికంటెను నధికార ముండికూడ
రాజునకు నీవు చెప్పిన రాణివైతి
విందుచే కైక నాయందు నింత కొంచె
మైన గుణముంట నాశింపవైతి నిజము. 541

అమ్మ కౌసల్యకడ సెలవంది మ్రొక్కి
అనుఁగు జానకిని క్షణంబె యనునయించి
యెంత త్వరలోనె వత్తునో యంతవరకె
అనుమతిడు పోదునిదె దండకాటవులకు. 542

ఇంక భరతుండు పితను సేవించునట్లు
ఇట్టి రాజ్యమున్ సరిగ పాలించునట్లు
తనుపఁ బూజ్యురాలిదియె కర్తవ్య మగును
ఇదె సనాతన ధర్మంబు సెల్లప్రజకు. 543

అపుడు రాముని వాక్యంబు లాలకించి
మిగుల దుఃఖంబుచే హతుండగుచు తండ్రి
శోకమున నశ్రువులు నాపలేక పైకి
బారుమని యేడ్చె గొప్పశబ్దంబు వెడల. 544

సంజ్ఞయే లేక పడియున్న జనకు నృపతి
చరణపద్మంబులకు మ్రొక్కి జరిగి పిదప
ఆ యనార్యురాలైన కైకేయికింక
కాళ్ళఁబడి మ్రొక్కె రాముఁడు ఘన యశస్వి. 545

అంత తండ్రికిన్ గైకకు నధికభక్తి
నమ్రుఁడయి రాముఁదు ప్రదక్షిణంబు చేసి
అట్టి యంతఃపురమునుండి యిట్టె వెడలి
యింక సుహృజ్జనంబులను దర్శించె నపుడు. 546

మెండుగా నశ్రువులఁ గండ్లు నిండిపోవ
నిండు క్రోధంబుచేఁ గడు మండిపోయి
వడిగ నా సుమిత్రానంద వర్ధనుండు
లక్ష్మణుండు రాము వెంటాడె ప్రాణమయుఁడు. 547

రాము నభిషేకమునకు నేర్పఱచఁబడిన
పూర్ణకుంభ ప్రదక్షిణమును చేసి
అచట దృష్టిఁ జరింపనీయకయె రాము
డల్ల కన్నుల తలవంచి మెల్లఁ జనియె. 548

రాము నా మహాలక్ష్మిని రాజ్య నాశ
కృత్య మింతేని తగ్గింపలేకపోయె
చొచ్చి లోకాభిరాముడౌ సోము కాంతి
ఈక యింతేని రాత్రి తగ్గింపనట్లు. 549

ఆ మహాటవిఁ జనఁగోరు రామునందు
రాజ్యమును పొందుమన విన్న రామునందు
చిత్తవిక్రియ యేమి వీక్షింపఁబడదు
అనయ మతిలోకుడగు వానియందుఁ బోలె. 550

శుభమౌ ఛత్రముసొంపుఁ జామరము లచ్ఛోటన్ నిషేధించి యా
నిభృతంబౌ రథమున్ త్యజించి జనులన్ స్వీయాత్మ సంబంధులం
దభయంబున్ వచియించి రాముఁడెదలో నార్తిన్ నిరోధించి స్వ
ప్రభుతన్ జూపి స్వమాత కప్రియము తెల్పన్ బోయె యుక్తాత్ముఁడై. 551

సత్యవాది శ్రీమంతుడు సత్త్వగుణుఁడు
హితుఁడునౌ రాము మోమున నే వికార
మైనఁ గనుగొనరి సమయంబునందు
అటు కులీనులు శ్రీమంతులైనవారు. 552

ఆ మహాబాహు వుచితమౌ నాత్మహర్ష
మెన్నఁడునుగాని తా విసర్జింపలేదు
అంశులీను శరత్కాల సుధాంశు లెపుడు
ప్వతనువందు తేజంబును వదలనట్లు. 553

ఎదుటఁగల సర్వజనముల
మధురంబగు మాటలాడి మన్నించుచు సౌ
హృదయుఁడు శ్రీరాముఁడు స
మ్మదమున జననీగృహంబు మసలక చొచ్చెన్. 554

తనలోని దుఃఖ మడఁచుచు
గుణములలో నన్నతోడఁగూడ సముండై
ఘన విక్రమంబుగల ల
క్ష్మణుఁ డన్నను ననుసరించి చనె లోపలకున్. 555

జననిగృహ మలరి చొచ్చియు
చనుదెంచిన యావిపత్తి సరిగాగనుచున్
కనఁడు వికారము రాముఁడు
కనె నా ప్రజనము విపత్తి కనుసనుచింతన్. 556

ఆ నరశ్రేష్ఠుఁడు నృపు గృహంబునుండి
మోమునందు నంజలియొగ్గి పోవుచుండ
స్త్రీల యంతఃపురమునందు కోలహలము
ఉహుళమగు నార్తనాదమున్ బయలుదేఱె. 557

ఎవ్వడు తండ్రి పంపింపకున్నను పోయి
యంతిపురికి నెల్లనగునో శరణు

ఎవడు పుట్టినదాది నెటుఁ దల్లి కౌసల్య
నరయునో యటు మమ్ము నరయువాఁడొ

ఎవఁడు పరుషమాడి యిఁకఁ గోపపెట్టినన్
విడిచి క్రుద్ధులను శాంతింపజేయు

ఎవ్వఁడు సర్వుల నెప్పుడు బంధులఁ
బోలెను ప్రేమతోఁ జాలఁజూచు

అట్టి రాముని లోకాశ్రయుంబ యైన
వాని విడు రాజు నిర్బుద్ధి బాధపెట్టు
అనుచు నెల్లరు మహిషులు నధిపు దూఱి
వత్సు లేని గోవులవలె వారు మనిరి. 558

ఆ మహీపతి యంతఃపురాంతరమున
ఘోరమౌ నార్తనాదము నాలకించి
పుత్రశోకంబుచేఁ గడుఁ బొగిలి పొగిలి
ఆసనంబందు లోలోనె యడఁగియుండె. 559

అప్తులవ్యథచే రాముఁడో యార్తిఁజెంది
ఎంతొ ఘీంకరించెడి ద్విరదేంద్రుఁడట్లు
బాహ్యమగు ప్రాణమైనట్టి భ్రాతతోడ
ప్రకటవశి తల్లి యంతఃపురంబు చొచ్చె. 560

వ. అట్లు రాముఁడు తల్లి యంతిపురము చొచ్చి యక్కడఁ గూర్చున్న వృద్ధుడైన పురుషుని పరమ పూజ్యుని నిలుచున్న వాలమంది యితరులను జూచెను. రాముని జూచి చూడఁగనే సమీపించి “విజయీభవ” అని జయ శబ్దముతో రాముని అభినందించిరి. అంత రాముఁడు మొదటి రెండు కక్ష్యలందు రాజుచే సత్కరింపబడిన వృద్ధులైన వేదసంపన్నులైన బ్రాహ్మణులను చూచి వారి కభివాదనముచేసి మూడవ కక్ష్యను ప్రవేశించి ముంముగల స్త్రీలను బాలురను ద్వారమును రక్షింప నాసక్తులగు వృద్ధులను జూచెను. వారు జయజయ శబ్దములచే వర్ధిల్లఁజేసి రామమాతకు రాముడు వచ్చినట్లు వెళ్లి నివేదించిరి. అపుడు 561

అపుడు దేవి కౌసల్యయు ధ్యానమందు
ఎల్ల రాత్రియును గడిపి తెల్లవాఱ
పుత్రు హితమునుగోరుచు నధికభక్తి
శ్రీమహావిష్ణుమూర్తిఁ బూజించె మిగుల. 562

అమలమైనట్టి పట్టుపుట్టమును గట్టి
హర్షమునఁ గడు వ్రతపరాయణయె యగుచు
మంగళంబగు కృత్యముల్ మఱియొనర్చి
మంత్రములతోడ నగ్ని హోమమ్ము చేసె. 563

అంత శుభమైన తనతల్లి యంతిపురము
చల్లఁగా రాముఁడును ప్రవేశమ్ముచేసి
అగ్ని హోత్రములో హోమ మాచరించు
తల్లి కౌసల్యను నయాన మెల్లఁజూచె. 564

దేవకార్యంబుకై యటు తెచ్చియున్న
పెరుగు పాలు నక్షతలు హవిస్సు శ్వేత
మాలికలును నుండ్రాళ్ళు పేలాలు *కృసర
పాయస సమిధల్ పూర్ణకుంభములఁ జూచె. 565

ధవళ మగు పట్టుపుట్టము దాల్చియుండి
వ్రతములఁ జిక్కి యిష్టదేవతకు నీళ్ల
తర్పణము లిచ్చుచుండిన తల్లిఁ జూచి
దరికిఁజనుదెంచి మ్రొక్కియు దరిని నిలిచె. 566

తల్లి నానందపెట్టు.నా తనయుఁ దల్లి
వచ్చి నిల్చిన కొంతసేపటికిఁ జూచి
వత్సమును నాడుగుబ్బమువలెను దరిసి
మోదమునఁ గౌగిలిడి తలన్ మూర్కొనియెను. 567

* కృసర=నూనెపిండివంట.

అరి కెదుర్కొనరానట్టి యా కుమారు
రాముఁ బుత్రవాత్సల్యంబు ప్రబలఁచూచి
ఒడిని కౌసల్య వాత్సల్య ముట్టిపడఁగ
ప్రియము హితమునౌనటుల నీరీతిఁ బలికె. 568

వృద్ధులును ధర్మశీలురు నింక మహాత్ము
లైనవారు రాజర్షులు నందునట్టి
యాయువును కీర్తి మన వంశమందుఁ బూర్వ
మందునుండి వచ్చిన ధర్మమొందుమయ్య. 569

పితను సత్యప్రతిజ్ఞు నృపేంద్రుఁ జూడు
ఇపుడె ధర్మాత్ముఁడొ యభిషేకించు నిన్ను
ననుచు నాసనమిడఁ దాకి యవల భోజ
నమునకును బిల్వ మ్రొక్కి సిగమర నిలిచె. 570

రాముఁడు స్వభావమువనె సమ్రత్వ మొంది
గారవంబుచేఁగూడను గ్రాళ్ల మ్రొక్కి
దండకారణ్యములకు ప్రస్థానమగుచు
తల్లి దరిసె యనుజ్ఞనొందగ వచించె. 571

దేవి! గొప్పభయము నేగుదెంచినట్లు
నిజముగ నెఱుంగ విపుడీవు నీకు జాన
కికిని లక్ష్మణునికి గొప్ప క్లేశమయ్యె
చనెద దండకాటవికి, నాసన మిదేల. 572

వనిని దర్భాసనము వేసికొనెడునట్టి
కాల మేతెంచెఁ గందమూలాలు పండ్లు
తినుచు మునివోలె నామిషమును త్యజించి
విజనవని పదునారేండ్లు విధిగ నుందు. 573

ఆ మహారాజు భరతుకై యౌవరాజ్య
మొసగుచున్నాఁడు నన్ను తాపసుని జేసి
దండకారణ్యమును పంపనుండె, విజన
వనిని వదియునాల్గేం డ్లుందు పండ్లు తించు. 574

వ. అని రాముండు చెప్పఁగా

వనిలోఁ గొడ్డలిచేతఁ గొట్టఁబడు సొంపౌ మద్దికొమ్మంబలెన్
వినువీథిన్ విడి కూలు నచ్చరవలెన్ వే కూలు కౌసల్య మా
తను, నేలంబడు నున్ననౌ ననఁటిబొందన్ బోలు మాతన్ వగన్
గనరానట్టి యనుంగుమాతను వడిన్ రాముఁడు వేఁదాలిచెన్. 575

ఇదివఱకు బండ్లు మోపించి వదలఁబడిన
యాడుగుఱ్ఱమువలె దొర్లి యట్లె తిరిగి
లేచి దీనయై దుమ్ముతో రాచు నొడల
తనరు తల్లి రాముఁడు చేతఁదట్టి తుడిచె. 576

సౌఖ్యములకుఁ దగియును నసౌఖ్యమొంది
కుములు కౌసల్య యచటనే కూరుచున్న
యా నరవ్యాఘ్రు రాముని గని వచించె
సుత సులక్ష్మణుఁడగు లక్ష్మణుండు వినఁగ. 577

నీవె గనుకఁ బుట్టకపోతివేని యింక
శోక ముండియుండకపోను, శోకమునకె
పుట్టితివిరామ ! గొడ్డునై (వంధ్యనై) పుట్టునెడల
ఇంతకన్న దుఃఖము ననుభవింపనుగద. 578

గొడ్డురాలికి మది నొక్కగోడె యుండు
నాకు సంతతె యేమియు లేకపోయె
అను మనస్తావ మొక్కటె వ్యధను గూర్చు
ఇంక నన్య మనస్తావ మేది లేదు. 579

పతియు పౌరుషంబుననున్న పట్టునైన
ఇదివఱకు నెన్నఁడును శుభంబేని గాని
సౌఖ్యమునుగాని గనలేదు సుతుని నిన్నుఁ
గనియుయునఁ గాంతునను నాశగొనియె యుంటి. 580

అవరలగు సవతుల వరనయ్యుఁగూడ
నీవు నడవికి రాఘవ ! యేగినంత
మర్మముల పొడ్చువారి రమ్యములుగాని
ములికివంటి మాటల వినవలసి యుండు. 581

స్త్రీలకింత కంటెను గొప్పక్లేశ మేది
నాదు వ్యథ విలాపమును నవంత మయ్యె
నీవు దరినున్నను నిరాకరింపఁబడితి
ఇంక నీవేగ నాయనా ! మృతియె ధ్రువము. 582

ఎప్పుడును భర్తచే గౌరవింపఁబడక
నేను సమనై నను పరనై నఁగాని
నమ్ము మెల్ల కైకపరివారమ్ముచేత
నెంతయో నేనయిటు నిగ్రహింపఁబడితి. 583

ఎవ రిదివఱకు నన్ను సేవించినారొ
లేక యెవరు నన్ను నమవర్తించినారొ
ఆ జనము నేడు కైకేయి యనుఁగు సుతుని
నరసి మాటాడనైన మాటాడ రింక. 584

నిత్యమును క్రోధమున నామె నిండియుంట
పరుషముగఁ బల్కు కైకేయి వదన మిపుడు
ఇట్టి దుస్థితిఁ బొందిన యేను నింక
ఎటులు వీక్షింపఁగలఁ జెప్పుమీ కుమార ! 585

నాదు దుఃఖము లెప్పుడు నాశమొందు
నింకననుచును నేను వీక్షించుచుండ
నీవు పుట్టినవాటిగ నేను గంటి
నిప్పటికి నాకు పదునేడు నేండ్లు గడచె. 586

ఇట్టి కష్టాలచేత జీర్ణించిచూడ
సవతులాడు దుర్వాక్కుల క్షయముకాని
శోకపు టపకారంబును చూచికూడ
సైపజాలను రాఘవ ! స్వల్పమైన. 587

పూర్ణచంద్రునివలె ప్రభన్ బొల్చుచున్న
నీదు మోమును కనులతో నేనుగనక
దైన్యమున నిండు బ్రతుకునఁ దనరి యింక
సడలి శోచ్యజీవితమును గడుపఁజాల. 588

ఇట్టి దుస్థితిలోనున్న యేను నిన్ను
యోగములచేత సుపవాస యుక్తిచేత
బహు పరిశ్రమముల చేత వ్యర్థముగను
దుఃఖములఁ బెంచితిని రామ దుఃఖములకు. 589

నీదు వనవాసము వినియు నాదు హృదిని
బ్రీలకున్నది యిది వజ్రసదృశము యేమొ
వర్షకాల మహానది వరఁద నీట
గరము తాకఁబడియు గట్టు కరగనటులు. 590

నాకు నిజముగ నింక మరణంబె లేదు
యముని లోకంబున నవకాశమును లేదా
శిశువు నీడ్వనేర్చు మృగిని సింహ మటులు
ఇపుడె యముండున్ నను హరింప నెంచకుండె. 591

ఇనుముతోడఁ జేసిన నాదు హృదియె స్థిరము
కాన భిన్నమున్‌గాదు ముక్కలును కాదు
ఇట్టివ్యథ మెయిన్ గుప్పిటంబట్టి యుంచె
రా దకాలాన మరణంబు రాదు ధ్రువము. 592

వ్రతములును దానములు యమూలై నఁగాని
ఇటుల వృథయౌట దుఃఖ మిదేదొ నవము
సంతతికొఱకుఁ జేసిన సత్తవమును
వృథయె చవిటిలోఁ బాతిన బీజ మటులు. 593

ఎవఁడయిన మహావ్యధను శుష్కించిపోయి
స్వేచ్ఛగ నకాలమరణంబు చెందెనేని
ఆత్మజుఁడవగు నిను వీడి యావు వోలె
నిప్పుడే నేను యమలోక మేగుదాన. 594

వృథయె నా జీవితమిఁక పూర్ణేందువక్త్ర!
అబలనగు నేను నిన్నును ననుసరింతు
వనికి నీతోడ వచ్చెద వినుము గోవు
ప్రేమచే వత్సను ననుసరించు నటులు. 595

చాల పొంగిన దుఃఖమున్ సైపలేక
ఎంతయో రాముఁగని విలపించె ముందు
ఖావిలోఁ గట్టు వ్యథలకు వగచె తల్లి
తఱిని బద్ధు పుత్రుఁగని కిన్నరియుఁ బోలె. 596

ఇటులు దీనయై కడు విలపించుచున్న
రామమాతఁ గౌసల్యను లక్ష్మణుండు
చూచి దైన్యము కొంచెమున్ జొఱక వడిగ
నపుడు కాలోచితమ్ముగ ననియె నిటులు. 597

రాముఁ డిప్పుడు స్త్రీమాటలకును లొంగి
సర్వమైన రాజశ్రీని క్షణములోన
విడిచి యార్యురాల ! వనికి నడుచు టనఁగ
కొంచెమును నాకును రుచింపకున్న దమ్మ ! 598

వికృత చిత్తుఁడు వృద్ధుఁడు విషయవశుఁడు
వనితచేఁ బ్రోత్సహింపఁగబడినవాఁడు
నృపతి కామాంధుఁడై తన్నె యెఱుఁగ డింక
ఏమి పలుకక యుండును నీ క్షణంబ. 599

రాష్ట్రమున నుండి దండకారణ్యమునకు
వాసముగ గెంటివేయఁగఁబడెడు నంత
యట్టి యపరాధమును జేసినట్లు గనను
అట్టి దోషము నేర్పడినట్లు లేదు. 600

వృద్ధుఁ గామాంధుఁడై యొడ లెఱుఁగకున్న
ధర్మహీనుని సిగ్గయినఁ దాకనట్టి
పొలతి వ్యామోహమునఁ బడిపోయినట్టి
జనకు నీ క్షణమందునె చంపివైతు. 601

వైరిఁగాని గెంటఁబడిన వానిగాని
ఎదుటఁగాని చాటునఁగాని యెచటఁగాని
ఇతనిపై దోషమును వచియించువాని
భువనముల నెప్పుడును చూడఁబోను సుమ్మి. 602

దేవసము ఋజుమూర్తి జితేంద్రియ మనస్కు
రిపులపైని బ్రేమను బ్రదర్శించు వాని
ధీరు ధర్మజ్ఞుఁ బుత్రు నకారణముగ
ఎవ్వరై నఁగూడను విసర్జింపఁగలరె. 603

మరలనిటు బాల్య భావముం బడసియున్న
యీ మహీపతి వాక్యంబు నెప్పుడైన
రాజకీయాలు తెలిసినవాడు పుత్రుఁ
డెవ్వఁడైనను హృదిని గావించుకొన్గా. 604

ఈ విషయమును మానవుఁ డెవ్వఁడేని
ఎంతలోనవయితె గ్రహియింపలేడొ
అంతలోన నాతోబాటు నింతరాజ్య
మీవుకై వసముగను గావించుకొనుము. 605

యమునివలె భయంకరుడనై యమరియుండు
ధనువు ధరియించి నీ పార్శ్వ ధరను నిలుచు
నావలన రక్షితుడవయి యున్నట్టి నిన్ను
నిపు డతిక్రమింపఁగజాలు నెవఁడు ధరణి. 606

నీకు నప్రియ మెవడైన నెఱపునెడల
ఈ యయోధ్యను పూర్తిగ నిప్పుడేను
వాడియైన బాణములను బఱపియెల్ల
నిర్మనుష్యగఁ గావించి నెగడువాఁడ. 607

భరతు పక్షమునం దున్న వారిఁగాని
లేక భరతునికి హితముల్ చేయువారి
నందఱను వీరిని వడి క్షయంబొనర్తు
ఎపుడు మెత్తని జను ధిక్కరించుచుంద్రు. 608

మవదు తండ్రి గనుక దుష్టజనుఁడె యైన
కైక ప్రోత్సాహమున వైరకారి యయిన
సంశయం బేమి లేకుండ సత్వరమును
నిపుడె వధియింపఁబడుత బంధింపఁబడుత. 609

గురువె యయ్యును పొగరెక్కి తిరుగునపుడు
ఏది కార్య మకార్యమొ యెరుఁగనపుడు
దారితప్పి యకార్యాలఁ బాఱునపుడు
ఆతనికి శిక్షచేయుట యర్హమగును. 610

ఓ బలాధిక ! యీతఁడా యే బలంబు
నెట్టి కారణంబును నాశ్రయించి చూచి
నీకె స్థిరపడియున్నట్టి యిట్టి రాజ్య
మేల కైక కీయఁగ సాహసించుచుండె. 611

ఇట్లు నీతోడ నాతోడ నెంతొ గొప్ప
వైరమును పెట్టుకొనియె యిప్పట్టునందు
భరతునకు రాజ్యలక్ష్మిని పట్టి యీయ
నుర్వీపతి కెట్టి సామర్థ్య మున్న దిపుడు. 612

భ్రాతయౌ రాముఁడనఁగ నా భావమందు
పూర్తి యనురాగమది తత్త్వమునకుఁ గలదు
ధనుసుతోడ సత్యముతోడ దానమునను
ఇటుల నిష్టాన నే నొట్టుపెట్టుకొందు. 613

రాముఁ డొకవేళ నగ్ని నరణ్యమునుగాని
ఇంక నిపుడు మానక ప్రవేశించునెడల
ఏనె మునుముందుగనె ప్రవేశించినటులు
తెలిసికొనుమమ్మ యియ్యది దేవి ధ్రువము. 614

అంధకారము నుదయించు నర్కుఁ డటులు
నీదు బాధఁ బోగొట్టు నాదు శక్తి
ఇపుడె దేవి నా శక్తి నీక్షించుఁగాక
యింక రాముఁడుఁ గూడ వీక్షించుగాక. 615

పితను వృద్ధుఁ గై కేయిపై ప్రేమ గలుగు
కృపణు బాలునివలె నుండి వృద్ధ భావ
మొంది గర్హితుఁడై యున్న యుర్విపతిని
ఇపుడె వాడిబాణముల వధించివైతు. 616

ఈ మహాత్ముఁడౌ లక్ష్మణు నిట్టి మాట
వినుచు నేడ్చుచుఁ గౌసల్య యనియె నిటులు
నాయనా ! లక్ష్మణు డెదియన్నాఁడొ వింటె
నీకు నిష్టమేని యిపుడు తెలుపు మిట్లె. 617

ఆ సవతి యధర్మపుమాట నాలకించి
వ్యథలఁ గుమిలెడి నను వీడి యరుగఁదగవు
ధర్మవిద ! ధర్మమందుండు ధర్మ మీవు
సలుపఁదలతె ధర్మముచేయు కొలిచి నన్ను. 618

స్వగృహమం దుండి గొప్ప తపంబుచేసి
జననిఁ గొల్చి కాశ్యపుడును స్వర్గ మరిగె
గౌరవముచేత నృపుఁ డటు గౌరవార్హ !
నేను నొప్పుకొనను వని కేగవలదు. 619

నిన్ను వీడి గోర సుఖముఁ జీవితమును
తృణము తిందు నీతోపాటె శ్రేయమిదియొ
వగచు నన్నిడి చనుదేని వనికి నీవు
విను బ్రతుకఁగోరఁ బ్రాయోపవేశ మందు. 620

అందుచే పుత్ర ! లోకవిఖ్యాతమైన
నరకము నిపుడె నీవు పొందఁగఁగలవు
అన్నదివతి సముద్రుడు మున్ను ధర్మ
మాచరించుటచే బ్రహ్మహత్య పొందె. 621

అటులు దీనయై విలపించు నాత్మజననిఁ
గాంచి రాముఁడు ధర్మయుక్తముగఁ బలికె
జనకు వాక్కు దాటఁగ నాకు శక్తిలేదు
వనికిఁ జనసెంతుఁ దలవంచి యనునయింతు. 622

పండితుఁడు వ్రతచారియౌ కండు ఋషియు
తండ్రి మాటచేతను గోవధంబు చేసె
మన కులంబునఁ దమతండ్రి మాటచేత
భువిని త్రవ్వి సాగరులు మృత్యువును గనిరి. 623

జామదగ్న్యుఁడగు పరశురాముఁ డడవిఁ
దండ్రిమాటచే రేణు కన్దల్లి నఱకె
ఇట్లె యింక దేవసముతో నెంతోమంది
యభయుడగు తండ్రినుడి చేసి రట్లె చేతు. 624

ఇటులు పితృనాజ్ఞ యీయొక్క యేనె కాదు
ఇదివఱకు చెప్పినటుచేసి రెంతోమంది
నేను నీకు భిన్నముగ నవీనధర్మ
మాచరింప ! బూర్వులదారె యనుసరింతు. 625

చేయఁ గర్తవ్యమే వేఱుచేయ నెపుడు
తండ్రిమాట చేసెడివాఁడు తగ్గిపోఁడు
తల్లికిటుచెప్పి యటు లక్ష్మణుని కనియె
ప్రథిత ధానుష్కవర్యుఁడు వాక్యవిదుఁడు. 626

లక్ష్మణా ! నీకు నాపైగలట్టి యట్టి
యుత్తమస్నేహ మెటనైనఁ నుర్విఁ గనను
నీ దురాసద తేజము నీదు శక్తి
నీదు విక్రమం బెరుఁగుదు నేన యెపుడు. 627

నాజనని దుఃఖము ఘనంబు నావ్యసనము
సత్యమును శమంబును సరిగ నీవు
తెలిసికొనకుండ నీరీతిఁ బలుకుచుంటి
నేనా సత్యశమముల వర్తించుచుంటి. 628

ధర్మమె జగతిని గొప్పది
ధర్మంబున సత్యమెల్ల ధరియింపఁ బడెన్
ధర్మంబు నాశ్రయించియె
నిర్మలుఁడగు తండ్రివాక్కు నిలుప వలెన్. 629

ధర్మ మాశ్రయించినవాఁడు తండ్రి మాట
తల్లి మాటను బ్రాహ్మణు నెల్ల వాక్కు
చేతుననుచు వాగ్దానముచేసి పిదప
వ్యర్థమెన్నండు గావింప వలనుపడదు. 630

వ. అంత

తండ్రియాజ్ఞ దాటఁగను శక్తుఁడఁగాను
తండ్రిమాటచేఁ గైక ప్రోత్సాహపఱచె
కావున ననార్యమగు క్షాత్రగతిని విడుము
ధర్మమొందు మల్గకు నా మతంబె గొనుము. 631

అనుచు సౌహార్దముననను లక్ష్మణుని బలికి
మరలఁ గౌసల్యకనె మొక్కి కరములొగ్గి
వనికిఁబోయెడి నను దేవి ! యనుమతింపు
వా బ్రతుకుతోడె చేయు పుణ్యాహములను. 632

ఇంక బ్రతిజ్ఞఁదీర్చి పురికి నేగుదెంతు
దివమువీడి మరల యయాతి దివికిఁబోలె
అమ్మ ! హృదిని శోకమునిల్పు మార్తిగనకు
తండ్రి నుడిచేసి వనినుండి తరలివత్తు. 633

నీవు లక్ష్మణుండు సుమిత్ర నేను సీత
తండ్రి నుడి చేయవలెఁ బూర్వధర్మ మిదియు
అమ్మ ! యిది యాపె ! హృది దుఃఖ మడరనీక
న్యాయమగు వనవాసంబు ననుమతింపు. 634

వ్యాకులంబును విహ్వలంబైన యిట్టి
రామువాక్య మాలించి మూర్ఛపడి యంత
మరల స్మృతిపొంది లేచి యా మాన్యదేవి
రాముతో వచియించె నీ క్రమముమీర. 635

సౌహృదయముచేత స్వధర్మ శక్తిచేత
నీకు పితయెట్లు గురువట్లె నేనుగూడ,
నీకు నే ననుమతియివ్వ నీవు నన్ను
మిగుల దుఃఖితన్ విడి వెళ్ల మేలు కాదు. 636

నీవు లేకుండ జీవిత మేల నాకు
ఏల లోకము సుధయేల యేల యమృత
మిందు నీ సన్నిధానంబె శ్రేయమగును
కలుగు నీ సర్వ జీవలోకంబుకంటె. 637

నరులచేత నుల్కలచేతఁ దఱుమఁబడుచు
శ్రేష్ఠగజము మార్గము బ్రవేశించునట్లు
జనని కరుణ విలాపంబు వినియు మరల
రాముఁ డప్పు డధికముగఁ బ్రజ్వలించె. 638

ఇంచుమించు స్మృతి మెలేక యుర్వి పడిన
మఱి తను వ్యథాప్రతప్తు లక్ష్మణుని బల్కె
ధర్మమందుండి మిగులఁగ ధర్మ్యవాక్కు
అప్పుడటుపల్కె రాముఁడే యర్హుఁడగును. 639

నీదు భక్తిని శక్తిని నేన యెపుడు
లక్ష్మణ! యెఱుంగుదుఁగద పూర్ణంబుగాను
కోరి నా యభిప్రాయము గనక యేల
వ్యధితు నను తల్లితోపాటు వ్యధితుఁజేతు. 640

అనుజ! ధర్మార్థకామంబు లఖిల జగతి
ధర్మఫలసంపదలకు నిమిత్తంబులగును
అట్టి మనుజునందవి యవశ్యంబు కలుఁగు
వశ్యసతి యంచు సుత ధర్మవాంచ లట్లు. 641

ధర్మ మర్థము కామంబు తనరనట్టి
నరుఁడు ధర్మసాధన ధర్మ మెఱుఁగవలయు
అర్థపరుఁడు ద్వేష్యుఁడగును నవనిపైని
కామపరతచూడఁ బ్రశస్తకరము కాదు. 642

గురువు రాజును పిత వృద్ధుఁ డల్గిగాని
ప్రమదమువఁ గాని కామంబువల్లఁ గాని
ధర్మకార్య మాదేశించి తగున యేని
దాని నేనృశంసుఁడు చేయఁబూనకుండు. 643

ఈ పితృప్రతిజ్ఞ నిఁక గావింపకుండ
మండుటకును నేనిపుడు శక్తుండగాను
మనల నాతఁ డాజ్ఞాపింప ఘను డతండె
దేవికిని భర్త గతి ధర్మమై వహించు. 644

ఇట్టి ధర్మరాజు భువి జీవించియుండ
మఱి విశేషించి తనదారి మసలుచుండ
దేవి నాతోడ నిటు బయల్దేఱు టెట్లు
ఇతర విధవరాలై యున్న యింతివోలె. 645

కనుక సేవనికేగుట కనుమతింపు
నాకు దేవి గావింపు పుణ్యాహములను
మది ప్రతిజ్ఞ పూర్ణముకాఁగ మరలివత్తు
నట్టి సత్యముచేసి యయాతివోలె. 646

కేవలము రాజ్యకారణ మావహించి
నిఖిల సంపద్యశము వెన్కనెట్టఁ జాల
జీవితము స్వల్పమైనదై చెల్లునపుడు
హీనధర నధర్మమునఁ గాంక్షింపఁజాల. 647

మనుజవరుఁడు మాతను బ్రతిమాలుకొనుచు
వీరుఁడై దండకవనికి వెడలఁదలఁచి
అనుజునకు ధర్మతత్త్వంబు నరయఁ దెలిపి
జననికి ప్రదక్షిణముచేసి చనఁదలంచె. 648

వ్యథచే దీనుఁడెయై విశేషముగ రోషావిష్ట చిత్తుండునై
మథనన్ బొందుచు నల్కవిచ్చుకనులం బామట్టులౌ లక్ష్మణున్
విధి సౌహార్ధముకల్గు భ్రాతనుప్రియున్ వీక్షించి ధైర్యంబునన్
మధియింపఁబడకుండి రాముఁడు ధృతాంత శ్శక్తుడెయిట్లనెన్.

మది రోషంబును శోకమాపికొని ధర్మంబూని ధైర్యంబుతో
ముదముంగాంచియు లక్ష్మణా! యిపుడె పూర్వావమానం బెదన్
వదలంజేయుము మున్ను నాకునిటులన్ రాజ్యాభిషేకంబుకై
యిదె చేకూర్చిన సర్వవస్తులు నివర్తింపంబడున్ గాపుతన్. 649

నాయభిషేకమున్ జరగనందుకు చింతిలు తల్లిదుఃఖముల్
పోయెడురీతి నీవిపుడుపూని కడుంగడు చేయగావలెన్
ఈయమదుఃఖమొంద క్షణమేని సహింపను, తల్లిదండ్రులం
దీయది బుద్ధిపూర్వకమొ నేనునెఱుంగ నబుద్ధిపూర్వమో. 650

నిత్యము పిత సత్యాత్ముఁడు
సత్యబలుండు పరలోకసంగతి భయమున్
అత్యంతము పొందనియటు
సత్యముగాఁ జేయవలయు సౌమిత్రియిఁకన్. 651

ఇట్టియభిషేకకర్మ మర్గింపఁబడక
యున్నచో తండ్రికిం దాపమొందఁ గలదు
నాదుసత్యము నెఱవేఱలేదటంచు
పితకుఁ దాపమౌనదియుఁ దపించునన్ను. 652

ఇఁక నభిషేక ముపసంహరించి మిగుల
త్వరగనేను నిచ్చటనుండి వనికిఁజనెద
నేను వనికేగినంతట నృపకుమారి
యిటఁ గృతార్థయగు నభిషేకింపు భరతు. 653

నేను నారబట్టలు తోలుపూనిదాల్చి
జడలు గుంపుగ ముడిచైచి సత్వరముగ
దండకారణ్యమునకిటనుండి పోవ
కైకకును మిగుల మనస్సుఖంబు గలుగు. 654

ఎవనిచే నిట్టిబుద్ధి గావింపఁబడియె
ఎవనిమీదను నామది యిటులునిలిచె
వానికింతయు బాధకూర్పంగఁ దగను
వేగెదనువనికాలస్య మింకవలదు. 655

రాజ్యమునభిషేకించు నారంభములకు
మరలనభిషేక కృత్యముల్ మరలుచుటకు
నా ప్రవాసమున కదృష్టమే ప్రధాన
కారణంబని యిపుడు లక్ష్మణ! గ్రహింపు. 656

నా యదృష్టమె కనుకను ఈయలంఘ్య
దైవనిర్ణయమును చేయఁ దలపదేని
నన్ను బాధపెట్టుటకు నన్నిగతుల
కైకకీయభిప్రాయంబు గలుగునెటులు. 657

ఎఱుఁగుదువుగాదె యోసౌమ్య! యిట్లునాకు
జననులయెడ భేదంబు లేదనెడు మాట
ఆమెకును నాయెడలఁ బుత్రునందుఁగాని
యిదివఱకెపుడేన్ భేదమీక్షించినావె. 658

నాదు నభిషేక కృత్య మణంచుటకును
నన్ను దండకారణ్యము ననుపుటకును
ననిన యాయుగ్ర దుష్ట వాక్యంబులకును
దైవమునకు వేఱొక నిమిత్తమును గనను. 659

ప్రకృతి సంపదతోఁగూడ వరలునదియు
అట్టి యుత్తమ గుణముల నలరు కైక
పతియెదుట నన్ బాధించు పలుకు లెటులు
పలుకఁగలదోయి పామర వనితనోలె. 660

ప్రకటమౌ బలమున్న దైవంబుతోడ
ఏ పురుషుఁడు పోరఁగ నుత్సహింపఁ గలఁడు
దాని గ్రహణము నిందు నేదైతె గలదొ
అదియు మన కర్మకంటె నన్యంబుగాదు. 661

దుఃఖ సుఖములు క్రోధ భీతులనుగాని
భవము నభవం బలాభ లాభములుగాని
అట్టివియు గొంచెమేని యేవైనఁగాని
అవి సమస్తము దైవకార్యములె సుమ్మి. 662

ఎంతొ యుగ్రతపసులైన ఋషులుకూడ
దైవశక్తిచేఁ బీడింపఁబడుచు మిగుల
నుగ్రమైన నియమముల నుత్సృజించి
కామకోపాల భ్రష్టులై గ్రాలుచుండ్రు. 663

ఎట్టి సంకల్పము నిటు గావింపకుండ
ఏమది హఠాత్తుగను ప్రవర్తించుచుండు
మొదలు పెట్టఁబడినదాని వదలఁజేయు
నదియెగద దైవకర్మమె యగును నెందు. 664

బోధపఱచెడి నీతత్త్వబుద్ధిచేత
ఆత్మచేత నాత్మమ నియమంబు చేయు
నాదు నభిషేకము క్షయించినప్పటికిని
నాకు పరితాప మింతయున్ గలుగదోయి. 665

ఇందుచే నింతయు పరితపింపవలదు
నను నిపుడె యీవును సరిగ ననుసరింపు
నాదు నభిషేక కృత్యమున్ సర్వ మిపుడె
సత్వరంబుగ నుపసంహరింపు. 666

ఇప్పు డభిషేకమునకయి యేర్పఱచిన
యీ సమస్త ఘటంబుల నెంచికూర్ప
తాపసవ్రత స్నానము తరుణమందు
ఎల్ల నుపయోగపడుఁగాక యింకమీఁద. 667

పోని రాజుల ద్రవ్యంబుతోనె కూర్చి
నిట్టి సామగ్రియంతయు నేల నాకు
స్వయముగా నేనె తెచ్చిన జలమె యిపుడు
నా వ్రతాదేశ దీక్ష నొనర్పంగలదు. 668

కనుక లక్ష్మణ ! యీ లక్ష్మి వ్యత్యయమున
నెంతమాత్రము సంతాప మెనయవలదు
రాజ్యమో వనవాసమో ప్రాప్త మవుత
వన నివాసంబె మన మహావైభవంబు. 669

ఇట్టి కర్మకు విఘ్నంబు లేర్పడంగ
నిపుడు పినతల్లి నతిగ శంకింపఁ దగదు
దైవమది గ్రమింగ నప్రియమే వచించె
నెఱుఁగుదువు దైవ మహిమంబు నిట్టిదనుచు. 670

అని రాముండు వచింపఁగా శిరసు నొయ్యన్‌వాల్చినట్లుండి ల
క్ష్మణుఁ డూహించుచు దుఃఖహర్షములకున్ మధ్యన్ మదిన్ నిల్పియున్
కనుబొమ్మల్ ముడివెట్టి కోపపఱపంగా బుస్సుబుస్సంచు పె
ట్టెనునున్నటి మహాభుజంగమటులుండెన్ బిట్టు నిట్టూర్చెచెన్. 671

కనగా శక్యముగాక బిట్టలుకచేఁ గన్బొమ్మ చిట్లించు ల
క్ష్మణు మోమల్గిన సింహ వక్త్రముఖులం భాసిల్లి మత్తేభమున్
తన తొండంబును త్రిప్పినటు కడు హస్తాగ్రంబు నాడించుచున్
తనువందడ్డము క్రిందవాల్చి మెడ యన్నన్ గ్రిందుమీఁదన్ గనెన్. 672

వ. అటు లక్ష్మణుండు చూచుచు నన్నతో నిట్లనియె. 673

కడుధర్మంబునకున్ విరోధమగు, లోకాలెంతొ శంకించునం
చెడఁదన్ కాలముకానిచోటఁ బడెదెంతే సంభ్రమంబీవు, ని
య్యెడ నీవంటి నిదానమున్నఘను డిట్లెట్టుల్ వచింపంగనౌ
ప్పెడు, దైవం బసమర్థ ధర్మమె యగున్ వీర్యంబె క్షాత్రంబగున్. 674

ఏమని కేవదైవమును నీవు ప్రశంసను చేయుచుంటి, విం
తేమని యిట్టి పాపువెడ నిప్పుడు ధర్మవిశంక చేతు, నీ
వేమహి ధర్మచర్మము ధరించిన పాపుల గుర్తెరుంగవా
యేమిది ధర్మమే కపటమెంచుచు గోడిడువారి స్వార్థముల్. 675

ఇదియె వారలు మది నిశ్చయింపరేని
ఇదివఱకు పూర్వమీ వరమిచ్చి యుండు
ఇపుడు ప్రస్తుతముఁగ, గోరు టెందుకొరకు
ఏదొ వంకనుపెట్టి బాధించు కొరకె. 676

దేనిచే నీమతియు రెండు తీరులయ్యె
ఎవ్వని ప్రసంగమున నీవె యిటు లిపుడు
మోహ మొందుచునుంటివో బుద్ధిమంత!
అట్టి ధర్మము నాకు ద్వేష్యంబె సుమ్మి. 677

ఏమి సర్వసమర్థుఁడ వీవె యిటులు
కైక వశమున వర్తించు క్షాత్రపరుండు
తండ్రి చెప్పినయట్టి గర్హితంబులైన
ధర్మదూరవాక్యము చేయఁదగుదు వెట్లు. 678

కిల్బిషమువల్ల నిట్టి యాక్లేశ మిపుడు
చేయఁబడె ననుగ్రహింపవే యిదెట్లు
అందుచే నాకు నెంతయో యార్తి గలిగె
నింద్య మీధర్మసంగమున వెలయుచుండె. 679

ఇటుల కామాంధులు గడు నహితులునైన
తల్లిదండ్రు లన్పేరుతో దనరుచున్న
నిత్యశత్రులౌ వారి యనిష్ట కార్య
మీవు తక్క నెవ్వాఁడు గావింపఁ గలఁడు. 680

అరయ ఈ తల్లిదండ్రుల యట్టి బుద్ధి
దివ్యమని నీవు తలపోసితేని యట్టి
దాని నీవుపేక్షింపఁగఁ దగుదు విపుడు
అది యుపేక్ష చేయమియు నాకనభిమతము. 681

పిఱికిపందలు విక్రమ విరహితులును
నెపుడు దైవమును ననుసరించుచుండ్రు
వీరులును నాత్మమును గౌరవించువారు
ఎన్నఁడును దైవము నుపాసింపబోరు. 682

ఇమ్మహి నెవండు పురుషకారమ్ముచేత
దైవ మతిశయింపఁగ సమర్థతను బొందు
నతఁడు దైవంబుచే విపన్నార్థుఁ డయ్యు
ఎన్నటికిని నాశంబును నెనయఁబోఁడు. 683

దైవబలమును పురుష సత్పౌరుషమును
ఇపుడు లోకము సరిగ వీక్షించుఁగాక
అనని దైవమానవుల బలాబలాలు
ప్రకటమగుఁగాక నేడు మత్పౌరుషమున. 684

ఇపుడు దైవమున్ పౌరుషమే జయించె
ననుచు జనములు బాగుగ కనుగొనెదరు
దేవి ! రాజ్యాభిషేకమున్ దైవ బలమె
గెలిచెననిగదా నీవు వీక్షించినావు. 685

అంకుశమ్ము వ్యాహారము నతిగదాటి
గొలుసులం ద్రెంపి మదియించి బలిమి పొగరు
కలిగి పర్వెత్తు గజమునువలెను నేను
పౌరుషంబున దైవమున్ వడి మరల్తు. 686

ప్రబలులైన సకల లోకపాలురేని
కల సకలమగు మూఁడు లోకములుగాని
నేడు రామాభిషేకమున్ నిలుపలేరె
యింక మన తండ్రిసంగతి యేమి చెప్ప. 687

ఎవ్వరైతె నీ వనవాస మిపుడు మిగుల
వారువారె సమర్థించి ప్రబలినారొ
వారె నేడ యరణ్యాలఁ బదియు నాల్గు
వత్సరంబు లుండఁగలరు పట్టి చూడు. 688

నేను నభిషేకమును వడి నిల్పివైచి
కొడుకు రాజ్యాభిషేకంబు కొఱకు ప్రబలు
తండ్రి యాశను నింక పినతల్లి యాశ
నీ నిమేషమునందె ఛేదించివైతు. 689

ఉగ్రమైన నా పౌరుష ముఱికి లేచి
ఎటులు వారి బాధకుఁ బ్రభవించి మించు
అటులు దైవబలంబు నీ యందునున్న
వను విరోధించి గెలుపగన్ జాలదిపుడు. 690

ఈవు ప్రజనేలి తుది వనికేగినంత
వేలయేండ్లేగ నీసుతు లేలఁగలరు
సుతులువలెఁ జూడ ప్రజనిల్పి సుడులపైని
మునుపు రాజర్షులటు వనిఁ జనుట తగును. 691

రాజ్యమందాశ రాజు చలాత్ముడౌచు
ధర్మమును చేయకున్న నీ ధరణి నేలు
నేను- గట్టు సంద్రమునటు- నీదు రాజ్య
మతిగాచి వీరుడనౌదుఁ బ్రతినచేతు. 692

ఇపుడు శుభ జలాల నభిషేకించుకొనుము
ఆ పనులకయి నీవు తయారుకమ్ము
రాజులందఱ వారించి రక్షసేయ
నే నొకండను చాలుదు నింకమీద. 693

ఈ భుజము లలంకారార్థ మేమి కావు
ధనుసు నియ్యది హస్తభూషణము కాదు
కత్తి భూష (కు×అ) కమ్ములు కావు కట్టెలకును
అన్ని యివి నాల్గు శత్రుక్షయంబు కొఱకె. 694

నాకు ననురూప శత్రువున్ గనను నేను
మెరపువంటి నా కత్తిచే *హరినె గెల్తు
కరి హయ నరుల తొండాలు కర శిరస్సు
లెల్ల నరకి దుర్గవముగ నిలను జేతు. 695

వ. మఱియు నా ఖడ్గధారచే నఱకఁబడి యేనుగులు మెరయుచున్న కొండలవలె మెరపులతోఁగూడిన మేఘములవలె రెండుగా భూమిమీదఁ బడును. పురుషుఁ నేను ఉడుము చర్మమును వ్రేళ్లకుఁ గట్టుకొని ధనుస్సు ధరింపఁగా పురుషుఁ డైనవాఁడు ఎవఁడు నాయెదుట నిలవఁగలఁడు. చాలబాణములువేసి ఒక మను

---

పివ: హరి=ఇంద్రుడు.

ష్యునిఁ జంపుటకాదు ఒక బాణముచేతనే చాలామంది మనుష్యులను నర తురగ కరి చర్మములను ఒకసారిగా గొట్టఁగలను. నీ ప్రభుత్వమును నృపతి ప్రభుత్వమును చూపఁగల నా యస్త్రప్రభావము ఇప్పుడుగదా అందరకుఁదెలియును. ఇప్పుడు చందనసారము పూసికొనుటకు కేయూరములు ధరించుటకు వసువులు విమోచనకు సుహృదుల పాలనకు అనురూపములైన యీ బాహువులు నేడు నీ యభిషేకమును విఘ్నముకలిగించువారిని వారించుటలో తగిన కార్యమును నెరవేర్పఁగలవు. చెప్పుము ఇప్పుడు ఏ శత్రువుల ప్రాణములను యశస్సును స్నేహితులను హరింపవలెనో ఈ వసుధయంతయు ఎట్లు నీ వశమగునో అట్లు కావించుటకై నా కాజ్ఞయిడుము. ఇదిగో నీ కింకరుఁడను ఎదుటనుంటిని" అని లక్ష్మణుడు పలుకగా 696

కంట నశ్రులు విడనాడి, కనుల దుడిచి
రఘుకులాబ్ధిచంద్రు డయిన రాముఁడనియె
"సౌమ్య ! పితృశాసనము శిరసావహించు
జనునిగా నన్నెఱుఁగు, మిదే సత్పథంబు". 697

తండ్రియాజ్ఞఁ బాలింప సిద్ధముగనున్న
రాము ధర్మిష్ఠుఁ గౌసల్య యీ రహిని బలికె
వ్యర్థఁగనని ధార్మికుఁడు దశరథుని సుతుఁడు
నిట్టినాబిడ్డ యెటు లుంఛవృత్తి బ్రతుకు. 698

ఎవని భృత్యులు మృష్టాన్న మిటు భుజింత్రా
వనినతడు వ్రేళ్ల పండ్లెటుల్ తినఁగలండు
గుణిని ప్రియుని రాముని రాజె వనికి బంప
నెవఁడు వినినమ్ము జనియింపదె వనికళుకు. 699

లోకుల కభిరాముఁడవైన నీకె రామ !
వనగమన మెందువల్ల సంప్రాప్తమయ్యె

ఆ యదృష్టమె యెల్లర కా ర్తియిడుచు
నఖిలలోకాల బలవంతమయ్యె నిజము. 700

మదిలో పుట్టియు నీయదర్శన మరున్మాత్రాన వర్ధిల్లుచున్
రుది తాలావ సమిత్కుశం బగుచు నశ్రుఖాజి హోమంబునై
వ్యధితాక్రోశన ధూమమై బహుళ నిశ్వాసశ్రమంబై గతి
వ్యథమై శోకపుటగ్ని వేసవిఁ దృణంబగ్నింబలెన్ గాల్చుఁబో. 701

అరుగు తన వత్సనావెట్టు లనుసరింప
దేను నీ వేగుచోటికే యేగుదెంతు
ననిజనని చెప్పవినిపురుషర్షభుండు
రాముఁ డతిదుఃఖ తల్లియౌ నామె కనియె. 703

కైక వంచింప నేనును కానకేగ
నీవును త్యజింప నిజము జీవింపఁ డతఁడు
ఇంతి భర్తను విడచుట యెంతొ క్రూర
మది మనసు చేతనైన నీ కనుచితంబు. 704

నాదు తండ్రి కాకుత్సుడిలాధినేత
ఎంతవర కీధరణిని జీవించియుండు
అంతవరకు శుశ్రూష చేయుంగవలయు
నదె సనాతనధర్మ మటంచుఁ దెలియు. 705

వ. అని రాముఁడు చెప్పగా శుభదర్శనయగు కౌసల్య అట్లే, యని ఎవరికిని క్లేశ మాచరింపని రామునిగని ప్రీతిపొంది యనెను. అపుడు ధనుర్ధరులలో శ్రేష్ఠుఁడగు రాముఁడు ఎక్కువ దుఃఖించుచున్న తల్లితో మరల నిట్లనెను. 702

పతి గురువు రాజశ్రేష్ఠుడు ప్రభువు నగును
నేను నీవు పితృాజ్ఞఁ గావింప వలయు
ఇపుడు పదియు నాల్గేండులు విపినమందు
ఎంతొ విహరించి నీ మాట నేను జేతు. 706

అట్లు రాముడు పలుకంగ నాలకించి
కనులు నీళ్ళులునిండగఁ గష్టపడుచు
సుతునియందలి వాత్సల్య మతిగ పొంగ
రామునితోనిట్లు వాక్రుచ్చె ప్రకటరీతి. 707

"ఈసపతులమధ్యను నేవసింపలేను
పితయుపేక్షచే నడవికి వెడలెదేని
ఇపుడె నను తీసికొనిపొమ్ము మృగినిబోలె"
అనుచు నేడ్చుతల్లికి రాముఁడనెను ధృతిని. 708

బ్రతికియున్న స్త్రీకిఁబతి దైవతము ప్రభువు
నీకునాకు రాజెప్పుడున్ విభుడెసుమ్మి
ధీయుతుఁడు లోకనాథుడునై యెసంగు
నాథుడుండ ననాథుల మౌదుమెట్లు. 709

వ్రతముపవాసముల్ సలిపిభామిని యెవ్వతె యుత్తమస్థితిన్
పతికనువర్తనన్ జలిపి బాగుగఁగొల్వదొ యాయెపాపయా
పతిని భజింప నింతిగను స్వర్గము, వేరని దేవుమ్రొక్కకేన్
పతిని భజించుటే వరమువైదిక లౌకిక ధర్మసమ్మతిన్.

వహ్నికార్యాలు సలిపి దేవతల వ్రతుల
బ్రాహ్మణుల పూజచేయు నా బాధ పోవ
ఇట్టి నా రాకఁ గోరుచు నెపుడు పతిని
గొల్చుచు నియతాహారవై సలుపు నియతి. 711

నేఁదిరిగిరాగ ఈ ధర్మనిష్ఠుఁడు పతి
బ్రదికియున్నచో నీ కోర్కె యిదియుఁ దీఱు"
అనుచు రాముఁడు పల్కఁగ నశ్రు లురల
వ్యాకులయగు కౌసల్య పుత్రార్తిఁ బలికె. 712

"నీ వన గమన స్థిరమతిన్ ద్రిప్పలేను
ధీర ! కాలమియ్యది దురతిక్రమంబు
అరుగు నాయనా ! నీవు నేకాగ్రమతివి
నీకు శుభమౌత, నీ రాక నే సుఖింతు. 713

ఈవును ప్రతిజ్ఞనుముగించి యిటకు రాఁగ
తండ్రి ఋణము తీరగనే ముదంబు గాంతు
ఈవు నా మాట కాదని యేగుచుంటి
విట్టి దైవ మలంఘ్య, మూహింపలేము. 714

'వెడలు మిపుడు మహాబాహు ! వెడలివచ్చి
నాయన ! ననుసామోక్తి నానందపెట్టు
జడలు నారబట్టలు దాల్చి సరగ నిపుడె
తిరుగవచ్చెడు కాల మేతెంచుఁగాక. 715

వనినుండ నిశ్చయించిన
తనయుని నారాముఁ జూచి తల్లియు సుమతిన్
అనె నిటులు పుణ్యాహ వ
చనములు గావింపఁ గోర్కె జతనము గొనుచున్ 726

అంత వెతవీడి శుచిజలం బాచమించి
మానవతి తల్లి రాము కళ్యాణమెంచె
వెడలు రఘురామ ! నిన్నాపివేయఁజాల
త్వరగ తిరిగి రమ్మోయి సత్పథిని నడువు. 717

నియతితో ప్రీతితో దేని నీవు గొలుతు
వట్టి ధర్మమె ప్రేమత మిట్ట నిన్ను
గుడులం జైత్యాల నెవరి మ్రొక్కుదువొ వారు
మునులతో పాటు నిన్ను రక్షింత్రుగాక. 718

వరమునకు విశ్వామిత్రుం డొసంగిన యస్త్రము
లెపుడు నిన్ గుణిని రక్షించుంగాక

పితృ మాతృ శుశ్రూష సతత సత్యనిరతి
చిరము నిన్ జీవింపంజేయుంగాక

సమిధలు కుశ పవిత్రములు వేదిక లాయ
తనములు స్థండిలాల్ మనుచుంగాక

గిరులు హ్రదమ్ములు తరులు పొదలు పక్షు
లురగముల్ సింహము లోముంగాక

సాధ్యవిశ్వదేవులు సురల్ స్వస్తి గూర్త్రు
భగవిధాతృ ధాత్రర్యముల్ స్వస్తి గూర్త్రు
శక్రముఖ దిక్పతులు పూష స్వస్తి గూర్త్రు
వత్సర ఋతు మాసాములు స్వస్తి యిడుత. 719

స్మృతియున్ ధైర్యము ధర్మమున్ గుహుండు ధాత్రీశుండు సప్తర్షిగీ
ష్పతులున్ నారదుండున్ దిశల్ గ్రహములున్ సంద్రంబు లాకాశమున్
క్షితి నక్షత్రము లంతరిక్షము నదుల్ సిద్ధుల్ వసుల్ సంధ్యలున్
దితిపుత్రుల్ సుఖమున్ శుభంబిడను రాదిత్యుల్ నినున్ బ్రోచుతన్. 720

వని సంహారము సేయు నీ కసురులన్ వన్యోగ్రసత్వంబులన్
ఘనమై రౌద్రములౌ పిశాచములనే క్రవ్యాదిచే నే భయం
బును లేకుండుత తేళ్ళు పచ్చ మశకంబుల్ దంశముల్ వానరుల్
పెను సింహంబులు నెగ్గలున్ పులులు పీడింపంగ లేకుండుతన్. 721

కొమ్ములున్నవి, ఋక్షముల్ కోరలున్న
యితర నరమాంస భక్షకులెపుడు నిన్ను
హింస చేయకుండుత నేను నింక పూజ
చేయ నెవ్వియు నిన్ను హింసింపకుండు. 722

శుభమౌత మార్గముల్ శుభమౌత వన్యముల్
బలము సిద్ధించుత స్వస్తి యగుత
క్షితి నంతరిక్షాన క్షతులు లేకుండుత
దైవ విప్లవములు పోవుఁగాక
అర్చితులై చంద్రుఁ డర్క యమ కుబేర
గురులు కానల హాయిగూర్తురు గాక
ఋషిమోము వెల్వడు నీమంత్రముల వహ్ని
శ్వసనుఁ డోముతను నాచమన వేళ

ఎల్లలోకాల పతి, బ్రహ్మ ఋషులు సురలు
కాననున్న నిన్ రక్షింత్రుగాక పుత్ర !
అనుచుఁ గౌసల్య మాల్యాల నర్చచేసి
స్తుతుల గందాలఁ గొల్చె దేవతలనెల్ల. 723

రాము మంగళముకై ప్రథితాత్మ విప్రుచే
విధి రీతి నగ్నిలో వ్రేల్వఁజేసి
తెల్లనిపూల్ నేయి తెల్లని యావాలు
సమిధలు దెచ్చి హోమములు చేసి
విధి నుపాధ్యాయుచే వ్రేల్పించి శుభముకై
బ్రహు హవ్యశేషము బలిగఁగూర్చి
మధుదధు లక్షతల్ మంచిపెరుగు గూర్చి
ద్విజులచే పుణ్యాహ విధు లొనర్చి

రాము మాత దక్షిణలిచ్చి బ్రాహ్మణులకు
వృత్ర వధలోన నింద్రుని కెట్టి శుభము
కల్గెనొ యా శుభము నీకుఁ గల్గుఁగాక
యనుచు మంగళవాక్యము లాడి యనియె. 724

అమృతము గోరిన యా గరుడుని కెట్టి
మేల్ గూర్చె వినత యామేలె యవుత
అమృతము మథియించునపుడు దైత్యులఁ జంప
నదితి చేసిన శుభంబవుత నీకు
అల త్రివిక్రమములఁ జెలరేగు విష్ణుని
కళ్యాణములు నీకుఁ గలుగుఁగాక
మంగళఋతువులు మహివార్ధులు జగతుల్
శ్రుతులు ద్వీపంబులు శుభము లిడుత

అనుచు పుత్రునితలనుంచి యక్షతలను
మేలి గంధముల్ రాముని మేనఁ బూసి
పరిగ సిద్ధార్థను విశల్యకరణి యనెడి
మూలికను రక్షకిడి మంత్రముల జపించె. 725

దుఃఖ వశవర్తినియె యయ్యు దుఃఖ మాపి
శుభముకై సంతసముపొందు చొప్పుచూపి
తల్లి కన్నీళ్లుల గద్గద స్వనాన
మాటచేగాక భావాన మంత్ర మనియె. 726

ఆగి తలవంచి మూర్ధ్నని కౌగిలించి
యా యశస్విని కౌసల్య యనియె నిట్లు
రామ ! నీ యిష్టమైన యర్థంబు దీక్ష
వరిగిరమ్ము యథా సుఖమైన యట్లు. 727

అఖిలార్థములు దీఱి యారోగ్యమున నయో
ధ్యను నిల్చి వధిరాగ గనెద నిన్ను
వ్యథలేగ ముదితాస్యనగు నేను నుదిత చం
ద్రునిబోలెఁ బురిఁజేరఁ గనెద నిన్ను
నెఱవేర్చి పితృతాజ్ఞ పురికివచ్చియు సభన్
సింహాసనం బెక్కు నిన్నుఁ జూతు
వనినుండి యిటువచ్చి బహు మంగళమ్ములన్
నను సీత సుఖపెట్టఁ గనెదనిన్ను

హరుడు మొదలైన దేవత లసురు లురగు
లెల్లఋషులు నాచేతఁ బూజింపఁబడుచు
చిరము వనినుండి వెడలు నీ క్షేమ మెంచి
నీ హితముఁ గోరుదురుగాక నిత్య మెలమి. 728

అనుచుఁ గాఱెడు కన్నీరు కనుల నిండ
మొదట పుణ్యాహవాచనమును ముగించి
జనని రాముని కటఁ బ్రదక్షిణము చేసి
యెడనెడను జూచుచుఁ గౌఁగిలించుకొనియె. 729

అటులు దేవి ప్రదక్షిణ మాచరింప
మాటిమాటికి మ్రొక్కియు మాత కాళ్లు
సహజ లక్ష్మిచే మిగుల ప్రజ్వలితు డగుచు
ఈ యశస్వి రాముఁడు సీతయింటికేగె. 730

వ. అపుడు రాముఁడు నరులతోనిండిన రాజమార్గము విరాజిలఁజేయుచు గుణవంతుఁడుగాన జనుల హృదయములను మథించువాఁడువలెనై యుండెను. వైదేహియు తపస్వినియు నగు సీత అభిషేక విఘ్నవార్తను వినినది కాదు గావున రాముని యౌవరాజ్యాభిషేక వచనముగూర్చి తలపోయుచు దేవపూజాది

కార్యములు స్వయముగ నెఱవేర్చి కృతజ్ఞురాలయి మదిని సంతోషముతో రాజ దర్మముల నెఱింగినదై రాజపుత్రు డగు రాముని రాకకై నిరీక్షించు చుండెను. అంత 731

మెండు ముదమొందు జనులతో నిండియుండి
తగ నలంకరింపఁబడిన తన గృహంబు
మనసు కుదియించు సిగ్గుతో తనమొగంబు
వంచికొని రాముఁడును ప్రవేశించె నపుడు. 732

ఇటుల వగచెంది వ్యాకులితేంద్రియుఁ డగు
తనపతి నెగిరి వణకుచు గనియెఁ సీత
ఆమెఁగని ధార్మికుఁడు రాము నాత్మనున్న
వంతయాగక నటఁబైకి బయలుపడియె. 733

వెలవెలపోయి ముచ్చెమట విచ్చుగ పోయగ స్రుక్కు మోముతో
కలఁగిన రాము సీతకని గ్రక్కున చిత్తము కుందఁబల్కె ని
ట్టుల నియేమి యో ప్రభు ! యిటుంటి, బృహస్పతి దేవతాకమై
యలరెను పుష్యతార, ద్విజులం దభిషేకము, కుందుదేటికిన్. 734

నూఱు శలాకలొప్పి తెలి నున్ నుఱుగుంబలె పొల్చు ఛత్రమున్
నీ రుచు లీను మోముపయి వీ భటులెందుకు పట్ట. రేల వే
మారులు వేలజేకులు సుమారగు తామరపువ్వుఁబోలు నీ
చారుముఖాన హంస శశి సౌహృదచామరముల్ వెలార్చరో. 735

వంధిమాగధ సూతు లత్యంత హృష్టులై
యెంచి మేల్ పొగడఁ గన్పించరేల
మూర్ధాభిషిక్తమౌ మూర్ధానఁ బెరుగుఁ దే
నెను వేదరత విప్రులు నుమపరేల

ప్రకృతుల్ సదస్యులు పౌర జానపదులు
నింక నిన్ను ననుసరింపరేల
బంగరు కింకిణీల్ వఱలు నాల్గు హయాల
పుష్యరథము ముందు పోవదేల

లక్ష్మణుఁడు పూజ చేయఁ గార్మబ్బుకొండ
వంటి యేనుగు నీముందు పఱపదేల
వీరప్రియదర్శన ! వసింపిమీరు నీదు
భద్రసింహాసనము చుట్టి భటులు రారె. 736

తఱిని నభిషేకమింత సిద్ధముగనుండ
మోము నీదేల పెలవెలపోవు నిపుడు
మోదమింతయుఁ గన్పట్టదేమి వీర !
యనుచు విలపించు సీతతో నాతఁ డనియె. 737

సీత ! పూజ్యుఁడౌ నా తండ్రి యీ తరుణమె
నను నరణ్యమున వసింప ననుపుచుండె
"ఓ కులీన ! ధర్మజ్ఞురాలా ! కరంబు
శ్రద్ధవిను నాకెటు వనవాసంబు వచ్చె. 738

తండ్రి సత్యప్రతిజ్ఞుఁడు దశరథుండు
రాజు తల్లి కైకకు మున్ వరంబులిచ్చె
ఆమె యభిషేక మిది సిద్ధముగుచునుండ
ప్రోత్సహించి నా పితను ధర్మువున్ గెలిచె. 739

పదియు నాల్గేండ్లు దండకవనిని నేను
యౌవరాజ్యాన భరతుండు సలరఁబనిచె
నే విజనవని కేగుచు నిన్నుఁ జూడ
నిప్పుడిటకు వచ్చినవాఁడ నిద్రిగహింపు. 740

భరతుసమీపమందు ననుఁబట్టి ప్రశంసను జేయ కెప్పుడున్
పురుషులు వృద్ధినున్నపుడు పొంగి సహింపరుగా పరస్తుతుల్
భరతునిముందు నా గుణములన్ స్తుతియింపకు నన్ను మిక్కిలిన్
స్మరణయొనర్పకే యతని సన్నిధి, దన్మతిఁబట్టిపోవుమీ. 741

మునుపటి యౌవరాజ్యమును భూపతి యాతనికిచ్చెఁగాన నా
తని కనుకూలవై నడచి తద్దయు నాతఁ డనుగ్రహింపఁగన్
చను! పయిగా నృపుండతఁడు, నా పితృనాజ్ఞను పూర్తిచేయగన్
చనెదను కానకిప్పుడు, మనస్విని వై స్థిరబుద్ధినుండుమీ. 742

ఏను మునుల్ వసించు వనికేఁగగ నీవును పూజ్యురాల ! క
ళ్యాణి ! వ్రతోపవాసముల రాజిలి ప్రొద్దుట: దైవతార్చనల్
తోనె యొనర్చి యా దశరథున్ నృపుఁ దండ్రినిగాంచి మొక్కి దుః
ఖానఁ గృశించు మాతఁ గడుగారవముంచియు మ్రొక్కు ధర్మతన్. 743

పిదపన్ దక్కిన మాతలందు ప్రణయప్రేమాదరా లుంచు నా
మది ఈ మాతలు నందఱొక్కటె, మనఁబందున్ విశేషించి యుం
దుఁదగన్ భ్రాతగ పుత్రుగా భరత శత్రుఘ్నుల్ గనందగ్గ వా
రిదిగో చూడుము నీదు ప్రాణముల కెంతే ప్రీతులౌదుర్ ప్రియా ! 744

భరతుని కెప్పు డప్రియము భావమునన్ దలపోయరాద, యా
భరతుఁడె రాజు దేశమును వంశమునేలు ప్రభుండు నెప్పుడున్
ధరణిపతుల్ సుశీలములఁ దత్సమయోచిత యత్న పద్ధతిన్
గరమున పూజచేయ దయగాంచెద రల్గెద రట్లు గానిచో. 745

అహితము చేయుచో వృపతు లౌరసపుత్రులఁగూడవీడి స
న్నిహితుల శక్తులౌ జనుల నిత్యము తాము గ్రహించుచుందు రీ
గృహముననుండి నీ వనుసరింపుమి యా భరతక్షితీశు, ధ
ర్మహిత ! వనంబుఁ బోదు ప్రియ ! మార్కొన కేరిని విన్మ నానుడుల్. 746

అని రాముండు వచింప సీత ప్రియురాలాత్మప్రియాలాపయున్
ప్రణయానన్ మదిఁ గ్రుద్ధురాలగుచు భర్తన్ బల్కె నీ రీతి, "నే
మని వాక్రుచ్చితి వింత తేలికతనంబా నిశ్చయంబిద్ది నీ
వనుమాటల్ విన రామ ! నాకుఁ బరిహాసాలంబ మయ్యెంగడున్. 746

* ఇది వీరుల్ బహుశాస్త్రవిదులౌ పృథ్వీశపుత్రుల్ వచిం
పఁదగున్ వాక్యముకా, దనర్హమ యశఃపాత్రంబు నీ వన్నదే
మది కశ్రావ్యము, యార్యపుత్ర ! పితలున్ మాతల్ సుతుల్ భ్రాతలున్
వధువుల్ స్వప్రియపుణ్యరాశిఁదినుచున్ భాగ్యా లుపాసింత్రికన్. 747

పతి భాగ్యంబులనైతే
సతియొక్కతె పొందుచుండు సతతం బిపుడున్
పతి భాగ్యము వనమగుట, నృ
పతి యాజ్ఞయిడి నటులయ్యె వనినుం డనుచున్. 748

---

పాఠాంతరము:

* ఇది వీరు లస్త్రశస్త్రక
విదులౌ రాజన్య సుతులు వినఁదగినదికా
దిదియొ యనర్హము నయశః
ప్రదమిది కనరానిది సుమి ప్రస్ఫుట జగతిన్. 749

పితయును మాతయు భ్రాతయు
సుతుఁడును స్నుషయును తమతమ సుకృతము తించున్
మతిఁ దమతమ భాగ్యంబుల
సతత ముపాసించుచుంద్రు జగతీతలిలో. 750

* పతి భాగ్యంబులు నైతే
సతి కొకతెకు వచ్చుచుండు సతతం బిపుడున్
పతి భాగ్యము వని కనుకన్
పతి భాగ్యమయిన యరణ్యవసతియు వచ్చెన్. 752

సతులకు పతియే గతియగు
పిత గాఁడు సుతుండు గాడు విను-తానుంగా
దతిగా ప్రేమించుచు నా
యితపడు తల్లి యునుగాద యిహపరములలో. 754

చొరఁగారాని వనమునకు
త్వరగ నిపుడు బయలుదేఱి తరలెద వేనిన్
అరిగెదను నీకు ముందుగ
ధరణి నలగద్రొక్కుచు పథి దర్భలు ముళ్లున్. 755

త్రాగ మిగులు నీటిని బలె
వేగమె రోషము నమర్ష విషయము విడిచే
బాగుగ నన్నుఁ దీసికొనుచు
నేగుము నాయందు పాపమేది లేదు సుమీ. 756

---

పాఠాంతరము:

* పతి భాగ్యంబులనైతే
పతి యొక్కతె యనుభవించు సతతం బిపుడున్
పతి భాగ్యము వని గనుకన్
పతిచే శాసింపఁబడితి వనిఁ జనుమనుచున్. 753

మేడల శిఖరము నుండుచు
తోడి విమానంబులందు తిరుగఁ జనుచున్
కూడియు నాకాశమ్మున
ఏదను పతికాలినీడ యే విశేషంబా. 757

పితచేత మాతచేతను
సతతము వివిధ సమయములఁ జనియెడి రీతుల్
అతిగా నేర్పఁబడితి నే
గతిని నడుపవలెనో చెప్పఁగాఁ బనియేలా. 758

చొఱగా శక్యముగాక పూరుషగతుల్ చూడంగలేకుండి యె
న్నొరకాల్ జంతులనిండి పెద్దపులులుం దోడేళ్లు నున్నట్టి దు
శ్చరమౌ కానను తండ్రిమేడనటు వాసంబుందు ముల్లోకమం
దరుదౌ భోగములేని కోరఁ బతిపాదాబ్జాలె సేవించెదన్. 759

నిను సేవించుచు బ్రహ్మచర్యమునె యెంతేఁబూని క్రొంబూఁదేనెవా
సనలన్ ముమ్మరమౌ వనంబులను నీ సౌహార్దమొప్పన్ ముదం
బున వాహ్యాళులఁ దేలెదన్ మిగుల, నీవున్ లోక సంరక్షచే
యను, శక్తుండవు, నాదుమాటయొక లెక్కా నీకుమానప్రదా! 760

నీతోఁ గానలకేగుదెంచెదను నిందేమాత్రమున్ సంశయం
బేతోపింపదు చిత్త, మింకనను మర్లింపంగ శక్యంబు గా
దే, తీరా వనికేగి నిన్నును శ్రమంబేఁ బెట్టుదేమో యటం
చైతే నీవనుకోకు హాయిగను, పండ్లా వ్రేళ్లు తిందున్ సదా. 761

నదులన్ గొండలఁ గొండకాల్వలనరణ్యాలింక-రాయంచలన్
ముదముంగూర్చుచు నీటికోళ్లధ్వనులన్ వ్యాపించి క్రొందామరల్
గుదులై విచ్చగఁ బావిఁజిమ్మెడి కొలంకుల్ చూచి హర్షించి యా
యుదకాలన్ జలకేళిఁదేలెద మనంబుప్పొంగ నీతోడనే. 762

ఇటు వేలేండ్లను నూఱుగాని మది హాయిన్ నిన్నటంగూడి ము
చ్చటగా గడ్పుచు నన్ను నేనెమఱతున్ స్వర్గంబునందేని యె
చ్చట నిర్వీడిచరింపఁ గానియెడలన్ చావే శరణ్యంబు ని
న్నిటు ప్రార్థించెడు నన్నుఁ దీసికొని పొమ్మీ భారమేఁగా నెటున్. 763

అని దుఃఖించి యనన్యభావయగుచున్ యాచించు వైదేహినిన్
గని యారాముఁడు ధర్మవత్సలుఁడు నుగ్రంబౌ నరణ్యంబునం
దు నివాసంబుగ నుంట కష్టమనుచున్ యోచించి యత్యంతమున్
వనికిన్ గైకొని పోవరాద యనుచున్ భావించి తానిట్లనెన్. 764

సీత ! నీవు కులీనవు ధర్మరతవు
ఇట సుఖముగ ధర్మము నాచరింపు మెపుడు
వనిని చాలదోషములుండెఁ గను హితేచ్ఛ
వనవసతిఁగూర్చి నీమతి వదలిపెట్టు. 765

గిరిగుహలంబుట్టి గిరిగుహలందుండు
సింహాలు మిగుల గర్జించుచుండు
స్వేచ్ఛ గర్వించి క్రీడించుచు మృగములు
నిను శూన్యమునఁజూచి నిత్యమురుకు
మదపుటేనుంగులు మసలి దాటగరాని
వరదబురద నదుల్ పాఱుచుండు
పొదల ముళ్ళులనిండి యుదకులె లేకుంట
వనకుక్కుటము లార్వఁబథములడరు.

"రాలుటాకు పాన్పులరేల ప్రాలవలయు
పడినపండ్లతో రేపవల్ గడుపవలయు
కడుపులో కాళ్లునిచి శక్తికలిమి వస్తు
లుండి కావిబట్టలు జడలూనవలయు. 766

పితరుల కిష్టదేవతల కతిథులకు
ఎప్పటికిని పూజ తప్పరాదు
మూడుపూటలనెప్డు మునిగి స్నానములాడి
మెలగి నియమముల మీరరాదు
ఏరితెచ్చినపూల నెపుడాశ్రమౌ విధిం
బలిపూజవేదిని మానరాదు
దొరికిన మట్టుకెదో యెదొ యాహారము
చూడవలెఁబడి కూర్చుండరాదు.

పెనుతుఫాను లంధతమసాలును భయాలు
వీనికిని తోడెయాకలి, పైనితేళ్ళు
పాములిటునటు దారిలోఁ బట్టిక్రమ్ము
మిడతలీగల దోమల నుడువవలెనె. 767

ద్రుమముల్ ముళ్ళవి, దర్భలో మిగుల సూదుల్ మేనొగ్గానింబడున్
యమముందాలిచి క్రోధలోభములు మాయంజేసి దుస్సాధమౌ
శ్రమముం బొందుచు తాపసవ్రతము దీక్షన్బూన నెట్లొప్పు స్వ
ల్పము భీతిన్ గనరాద, యిట్టివనికేలావత్తు చాలింపుమీ. 766

వ. అని మహాత్ముఁడైన రాముండు వనవాస క్లేశములఁగూర్చి చెప్పి వనమునకు తీసికొనిపోవుట కేమాత్రము నంగీకరింపకపోవుట చూచి సీత చాల దుఃఖపడి యశ్రుులురాల రామునితో నిట్లనె.

—: సీత వనమునకు వచ్చెదనని రామునితో అనుట :—

వనవాసంబునకేవి దోషములుగా వర్ణించి తీవవ్వి యే
గుణముల్ సుమ్మి గజాలు సింహములు వల్వ్యాఘ్రముల్ జంతువుల్
వనినింకేవెవి యున్నవో యవియు సర్పంబుల్ నినుం గ్రొత్తవా
నిని వీక్షించి భయానఁబోవు, భయమున్ వీక్షించి యెల్లన్ జనున్. 767

జనకునాజ్ఞచే వనికీవు చనఁగవలయు
జనకునాజ్ఞ, నే నీడనై చనఁగవలయు
నీ వియోగంబుచేతను నేనురామ!
యిందె జీవితంబు విసర్జింపవలయు. 768

నీ సమీపమునందును నిలుచు నన్ను
సురల ప్రభు వోజసుండును దరియలేడు
వెంట పతిలేనియింతి జీవింపలేదు
వేఱెయిట్టిది పూర్తిఁ జూపించినావు. 769

పోనిలెమ్మింతయేల విప్రుల ముఖాన
"వనిని నేనుండగావలె" ననుచు వింటి
లక్షణమెఱింగి యాద్విజవక్త్రముల వినిఁగు
నిత్యము వనవాసోత్సాహ నిరతనైతి. 770

వననివాసాజ్ఞ నేఁబొందవలసి యుండె
కనుక ప్రియ! నేను నీతోడ వనికివత్తు
వారియాజ్ఞచే నీవెంట వనికివత్తు
అట్టి తఱియిది, సత్యవాక్కగుత ద్విజుడు. 771

వ. వనవాసములో ఏయే దుఃఖములుండునో వానినన్నిటిని ఎఱుఁగుదును. అవి జితేంద్రియులు కానివారె యనుభవింతురు. నేను కన్యనై తండ్రి యింటనుండఁగా సాధువృత్తురాలగు భిక్షుణివల్ల తల్లియెదుట ఈ సంగతి విం టిని. వనవాసమును గూర్చిన నా కోరికను అనేకములుగా విన్నవించి నిన్ను ప్రసన్నుని జేసికొంటిని. వనవాసమునుగూర్చి నీవును అనుమతి యిచ్చితివి. పరాక్రమవంతమైన వనవాస పర్య నాకు రుచించును. ఓ పరిశుద్ధాత్ముఁడా! నీ ప్రేమచే భర్తననుసరించి గతకల్మషనగుదును. భర్తయెనాకు దైవము. చని పోయినప్పుడుగూడ నీతో శుభసమాగము కలుఁగుఁగాక. చనిపోయి నప్పుడును నీళ్ళతోనెవతె యెవనికి సమర్పింపబడునో ఆమె స్వధర్మమునుబట్టి అతనిదే యగునని యశస్వులగు బ్రాహ్మణుల పవిత్రశ్రుతిని వింటిని. సుజనుల ప్రవర్తన గలిగి పతినుండే వ్రతముగలిగిన నన్నేల వనికిఁదీసికొనివెళ్ళవు? నీ సుఖ దుఃఖములలో సమభాగురాలనుగదా ఇట్లు దుఃఖముతో నిండియున్న నన్నే గనుక నీవే తీసుకొనివెళ్లనిచో మృత్యువును పొందుటకై విషము మ్రింగుదును అగ్నిలోఁబడెదను. జలములో బడెదను. అని యిట్లు బహువిధముల బ్రతిమాలుచున్నను ఆ మహాబాహువగు రాముఁడు తీసుకొని వెళ్లుటకు సమ్మతింపలేదు. అపుడామైథిలి కన్నులనుండి వెలువడు కన్నీటితో భూమిని తడుపుచుండ రాముఁడును ఆమెను ఆమెనిర్ణయమునుండి మరలించుటకై బింబోష్ఠియగు నామెను ఓదార్చు చుండ ఆమె మానక వనవాసమునకెపోవ నిశ్చయించుకొని, 772

—: సీత రాముని ఆక్షేపించి పలుకుట :—

జనకజ మిక్కిలి వణఁకుచు
చనవునఁ బ్రణయంబుచేత సఖ్యముచేతన్
ఘనమగు నభిమానముచే
ననఘుండగు పతిని రామునాక్షేపించెన్. 773

మగవేషము వేసిన
మగువగఁ బితతెల్సికొనక మానిని నన్నున్
మగటిమియెలేని నీకిడి
యెగిరెను నల్లుండవనుచు నేమనుకొనెనో. 774

తపియించు సూర్యునందటు
లు పరమతేజస్సు రామునిలోపల లేదా
యిపుడున్ గనుమను నజ్ఞా
నపు లోకమువాక్కులవి వినఁగ నన్పృతములే. 775

ఏమని విషాదమ్మొందెద,
వేమెందుకని భయము జనియించెను నీలో
రామా! యనన్యపర న
న్నీ మాడ్కివిడి వనికేగ నిపుడెంచితివే. 776

పతిని-ద్యుమత్సే నప్రియు
సుతుండయిన సత్యవంతుఁ జౌరవను గూడన్
వ్రతమూని నీడవలెఁ జను
సతి సావిత్రినిగ నన్ను సరిగాఁ గనుమీ. 777

మనసునసైన నను నెన్నడుఁ
గనఁగా లేదన్యపురుషుఁగను నినుదక్కన్
అనఘా! రాఘవ! నీతో
జనుదెంతుఁ బరకులటనటు చనుమనియెదవే. 778

స్వయముగనేనో భార్యను
పయిగాయువతిని చిరంబు వఱకున్న సతిన్
ప్రియురాలిని * శైలూషుని
నయమున నన్యపురుషులకు నన్నిడఁదలతే 779

---

ననుదీసికొనియు వెళ్లక
వనికివే బయలుదేఱ ప్రయత్నింపకు మీ

* శైలూషినస్తు శైలూషా జయాజీవాః కృశాశ్వినః (అనియర్థము)
భార్యవలన జీవించువారు శైలూషులు అనియర్థము

ఎతనికి హితమిదు మంచిదా
యెతనికొఱకునన్ను నావనెంచితివోనీ
వతనికె వశ్యుండ వగుమి
యతనికె నీవిక విధేయుడగుమీ యనఘా 780

ననుదీసికొనియు వెళ్లక
వనికీవే ఒంటులుదేఱఁ బ్రయతింపకుమీ
వనవాసంబౌతపమో
ఘనమగు స్వర్గంబౌనాకుఁగద నీతోనే 781

వనిలో నీవెను వెనుకను
చనుచును నుండగ విహారశయ్యలఁబోలెన్
వనమార్గంబుల నాకెది
యునునేమి పరిశ్రమంబు నొదవదుసుమ్మీ 782

కుశజెల్లు ముళ్లదుబ్బులు
సిసలై యింక ముళ్లుగలుగు చెట్టులునున్నన్
పసతో త్రొక్కెద నీతో
ససలౌతోల్దూదిమీద నట్టులరామా! 783

ఆపెనుతుపానువల్లను
నీపెనుదుమ్ము వడిలేచి యెటులన్ క్రమ్మన్
ఆపెనుదుమ్మే యుత్తమ
మౌపూసిన మంచి గంధములగు రమణా! 784

వనముల లోపలఁదిరుగుచు
తనువుబడలి సడలనెపుడు తగ పండెద నా
నునుఁబచ్చని పచ్చికబయ
లునకంటెనురత్న కంబళులు సుఖమౌనే 785

ఆకులో దుంపలో పండ్లో
ఏ కొంచెమొ గొప్పొ తెచ్చియిచ్చిన నపుడే
నాకదియమృత రసంబగు
మేకొనితిందును నది యదెమెయికి హితంబౌ 786

ఆయా ఋతువులలోనా
ప్యాయముగలభించు పూలుపండ్లును తినుచున్
హాయిగనుందును తండ్రిని
మాయమ్మను గృహముగాని స్మరియింపనుగా 787

ఆకాననమున నెప్పుడు
నాకిష్టముగాని దెదియుయినం జూడవులే
నాకయి నీకొదవదులే
శోకము, భరియింపరాని సుదతిగనుండన్ 788

నీతోనుండుటెస్వర్గము
నీతో నేనుండకుంట నిరయంబగు,నీ
రీతిగదెలిసికొని మిగుల
ప్రీతిని నీతోఁగూడ నన్ను వెసఁగొనిపొమ్మీ 789

అనితరభావను నను మే
కొని నీవేగనుక తీసుకొనివెళ్ళవ,యీ
క్షణమే విషమ్ము భక్షిం
తునుగాని ద్విషునకు లొంగి తొత్తయియుండన్ 790

తరువాతఁగూడ నాకున్
ధర నీజీవితమును దగనె తగదికమీఁదన్
పురినిటు విడివనికేగిన
మరణంబే శరణమయగు మఱివరమదియే 791

ఈ దారుణ దుఃఖాబ్ధిని
నీదనొక ముహూర్తమేని సహింపన్
ఈ దశఁబడు నాల్గేండులు
నేవరిదుఃఖాల మునిగియే నెటులుందున్ 792

అనిశోకంబునఁదప్తురాలగుచుదైన్యానన్ విలాపించి వే
దన నాయాసము పొందిమీఁదఁబడి భర్తన్ గౌఁగిటంగ్రుచ్చియం
గన రామోక్తులవిద్ధయౌచు విషదిగ్ధంబైన బాణాల దం
తినివోలెన్ధృతభాష్పము-న్నరణియగ్నిన్బోలె విడ్చెన్గడున్ 793

కమలముల నుండి పడుస్ఫటికములఁబోలి
యువనిజనయనంబులనుండి యశ్రులురలె
జలమునుండి కోసియు దీయు జలజమట్లు
శశినిబోలుమోమెండె భాష్పమ్ముచేత 794

స్మృతియె లేనటు పడియుదుఃఖించుచున్న
జనకజ నటుకవుగలించుకొనియు రాము
డపుడు బుజ్జగించుచు దుఃఖమరుగనపుడు
నిట్టు లోదార్చుచును ప్రీతినెసఁగియనియె 795

దేవి! నినుదుఃఖపెట్టి ప్రాప్తించునట్టి
స్వర్గమునుగూడ నెప్పుడు వాంఛచేయ
నాకునింతేని భీతి యున్ మాటలేదు
సకల గతుల స్వయంభువునకునుబోలె 796

ఓశుభానన! నీమనుద్దేశమేమొ
నేనెఱుంగక వనవాసమీవుచేయ
నిష్టపడలేకపోయితి నెప్పుడైన
నిన్ను రక్షించు సామర్థ్యమున్నఁగాని 797

జానకీ! నీవువనిని నాతోనివాస
మాచరింపఁబుట్టిన దానవౌట
నిన్ను విడనాడియెట్టులన్ వెళ్ళఁగలను
ఆత్మయుతుఁడు కీర్తి విడలేనటులనిపుడు 798

సజ్జనులు మున్ను ధర్మమున్ సలిపినారు
అడవియేన్గు నుక్కును బోలుతొడలదాన!
యేనొయాధర్మము ననుసరించుచుంటి
నను–సువర్చల రవిఁబోలె–ననుసరింపు 799

చండి! నేవనికేగకె యుండలేను
సత్యయుతమైన పితృవాక్యసాగనంపు
తల్లిదండ్రుల వశమౌట ధర్మమెపుడు
దానిదాటి జీవింప నుత్సాహపడను 800

మనయధీనము గురుపితృమాతృసేవ
దేవతల మెప్పెటులుఁబరాధీన మెందు
నింకపితృమాతృ గురుసేవ కీర్తిలోకి
కెన శుభము లేవు కాన పూజింతురుజనులు 801

త్యాగము, తగు దక్షిణగల
యాగము దానమును సత్యమభిమాసంబున్
ఏగతి బితృహితసేవకు
బాగుగఁదుల్యములుగావు స్వర్గముగాని 802

ధనధాన్యంబులు స్వర్గము
తనయులు విద్యలుసుఖాలు తగు, గురుచిత్తం
బు ననుసరించినచో. నిం
కనుదుర్లభ మేవికావు కమ్రాపాంగి! 803

దేవీ ! మాతాపితృగురు
సేవాతత్పరమతులయి వెలఁగు మహాత్ముల్
దేవులలోకము, దేవుల
దేవుని లోకము నితరములు తిన్నగగాంతుర్. 804

అనఘుఁడగు సత్యపథమునఁ
జనిమెడి పితృదేవు డేదిశాసించునో దా
ని ననుసరింపఁగఁ గోరెదఁ
దనుగాత్రి ! సనాతనమగు ధర్మంబదియే. 805

వనమున నేను వసించెద
నిను నేమను ననుసరింతు నిశ్చయమిది చే
కొని తీసికొని చను మనఁగ
మును వే వలదంటి నట్టి బుద్ధియు పోయెన్. 806

అనఘ ! మదిరాక్షిరో ! యనవద్యాంగి ! భీరు ;
నను నిఁక సహధర్మచరివై యనుసరింపు
నాకు వంశంబునకు తగినట్టి గొప్ప
నిశ్చయంబును నీవిప్డు తెలిపినావు. 807

ఓశుభ్రశోణి ! వనినుండ సుచితమైన
కర్మచేయుము, నిన్ను విడి స్వర్గమునుగోర
కోరు ద్విజులకు మణులు, భిక్షుకులకన్న
మిడుము సత్వరంబుగ నాలసింపవలదు. 808

వెలగల భూషణంబులును వింతయి యందములైన వస్త్రముల్
పొలుపగు నవ్వి క్రీడలకుముం దుపయోగమునొందు నవ్వియున్
చెలువగుబండ్లు పాన్పులును చేరిచి విప్రులకిచ్చి మీద భృ
త్యుల కిడుమంచు చెప్ప ముదమొందియు నిచ్చె సీతయున్. 809

వ. ఇట్లు సీతతో రాముఁడు చెప్పఁగా విని లక్ష్మణుఁడు కన్నీటిచే నాకులం బయిన మోముతో దుఃఖ మాపుకొనలేక యన్న కాళ్ళను గట్టిగాఁ బట్టుకొని మ్రొక్కి సీతతోడను మహావ్రతముఁబూని రామునితోడను నిట్లనెను. 810

మృగసంచారముగల్గు కాననలకు మీరే పోవుచుండ్రేని నే
నిఁగనిందుండునె నేనువత్తు ధనువెంతేఁదాల్చి ముందేగెదన్
మృగయూథంబులు పక్షులున్ ధ్వనులుగావింపంగ నాలించుచున్
వగలేకన్ వరవన్యసీమ విహరింపన్వచ్చు నాతోడుతన్. 811

కోరను సురలోకంబును
కోరను నమరత్వమేని కోరను ధరణిన్
కోరను లోకైశ్వర్యముఁ
గోరను నీవుండకున్నఁగోరిక లెవియున్. 812

అని, సౌమిత్రి వనాలకుం జన ధృఢంబౌ నిశ్చయంబూని నం
త ననేకంబగు సాంత్వవాక్యములచేతన్ భ్రాత వారించినన్
గనకే యిట్లనె మున్నె నాకిట ననుజ్ఞంజేసి నీ విప్పుడే
మని వారించెద వెందుకై వనికి వద్దంచుంటివో చెప్పుమీ. 813

అని ముందేచనఁబోయి దోసిలిడుచున్ ప్రార్థించు వీరాగ్ర్యు ల
క్ష్మణునిన్గన్గొని రాముఁడిట్టులనియెన్ సౌమిత్రి ! స్నిగ్ధుండ. వే
మనెదన్ సత్పథినున్న వీరుఁడవు ధర్మాత్ముండ విష్టుండ విం
దనయంబున్ వశివైన భ్రాతవు బహిఃప్రాణంబు మిత్రుండవున్. 814

నరె నాతోవనికీవు వచ్చెదవు కౌసల్యన్ సుమిత్రన్ మఱె
వ్వరు నిన్వీడి భరించువారు చెపుమా ! పర్జన్యుఁ డుర్విన్ బలెన్
నిరతంబున్ ప్రజకిష్టముల్ గురియుచున్ క్షేమంబు కాంక్షించునా
ధరణీనాథుఁడా కామపాశములచేతన్ జిక్కెఁగా లక్ష్మణా ! 815

మరి కైకేయియొ యడ్డులేనిదయి సామ్రాజ్యంబుచేఁబూని, వం
దురి బెంగన్‌బడియున్న యానవతులన్‌గూర్చుండఁ, బోషించునే
భరతుండో యువరాజయై కయిక నిర్బంధించి యాడింపఁగా
స్మరియింపంగలఁడే సుమిత్రనిఁకఁ గౌసల్యన్ మదిన్ లక్ష్మణా !

కని యెన్నండతడెంచియే స్వయముగాఁగానీ, మహీశున్ బ్రస
న్ననిగావించియొ గాని మాతృశుభమున్ యోచింపు నే నీకుఁ జె
ప్పినటుల్ చేయుమి, యట్లు చేయుటెడ నీవేభక్తి నాయందు చూ
పినవాం డౌదువు, ధర్మవేత్త ! గురుసేవే గొప్పధర్మంబగున్. 817

ఇటు సౌమిత్రి ! యొనర్పు నాకొఱకు నిం కిట్లస్మద్వియోగంబు పొం
దుటచేతన్ మనతల్లి సౌఖ్యమెటుపొందున్ జూడుమీయంచుఁ దా
నిటులన్ మెత్తనిమాటలాడుచును వాక్యజ్ఞుండు రాముండు చె
ప్పుట నాలించియు వాక్యకోవిదుఁడ యప్డున్‌జెప్పె సౌమిత్రియున్. 818

—: లక్ష్మణుడు రామునితో అడవికి వచ్చెద ననుట :—

నీ తేజస్సునెచూచి యా భరతుఁడున్ నీ తల్లి నాతల్లినిన్
బ్రీతిన్ శ్రద్ధగ జాగ్రతన్ గనుచు నర్చించున్‌గదే, యిందు నే
రీతిన్ జూచిన లేదు సంశయము నింతేన్, లేక గర్వించి రా
జై తీరా కనఁడో వధింతు ఖలుఁ దత్సంబంధులన్ లోకమున్. 819

ఏ కౌసల్యకు స్వేచ్ఛతోడ పనియోగింపన్ వివాహాన నీ
లోకంబందునె వేయి యూళ్లరణ మాలోకించి తండ్రిచ్చెనో
యా కౌసల్యయొ నన్నుఁబోటి ప్రజ వేలైనం భరించున్ మరీ
నాకున్ దల్లికి నామె కావలసినంతన్ బోయు లోటామెకా. 820

నన్ను ననుచరుఁగాఁజేసి కొనుమి రామ
ఇందువిపరీతమైనది యేదిలేదు
నేఁగృతార్థుండ నాదును నీకునిపుడు
నీవు యోజనంబునుగూడ నిండితీఱు 821

శరములతోఁగూడ ధనువును జక్కఁదాల్చి
గునపమును బట్టి భుజముపైఁ గూర్చియుంచి
నీకు మార్గము చూపుచు నియమమొప్ప
ముందు ముందుగ నేనింకఁ బోవువాఁడ. 822

ఫలముల్ దుంపలు కానలో దొరకు నేవైనన్ సరే తెత్తు మీ
రలతై లంబుల సానులందును షికారై వెళ్లవచ్చున్, దినం
బుల మేల్కొన్నపు డింకరేల నిదరంబోవంగ నేనెప్పుడున్
నిలుచుండంగలవాఁడ నెల్లపనులన్ జేయన్ గడు శ్రద్ధగా. 823

అని సౌమిత్రివచింప నీ నుడులకున్ హర్షించి రాముండు ల
క్ష్మణుతోఁ బల్కెను "లక్ష్మణా ! సరియె యింకన్ నీవు వేగన్ సుహృ
జ్జనులన్ దోడ్కొనివచ్చి యా జనకు యుజ్ఞంబందు సంప్రీతితో
ననఘుండౌ వరుణుండు నాడిడిన దివ్యాస్త్రంబులం దెమ్మిటన్. 824

వ మరియు వరుణుం డిచ్చిన రౌద్రంబులైన రెండు ధనస్సులను అక్షయతూణీరంబులను సూర్యునివలె స్వచ్ఛమైన బంగరు పిడిగల రెండు ఖడ్గములను ఆచార్య గృహమున సత్కరించి యిచ్చిన యాయుధమును శీఘ్రముగాఁ దెమ్ము అని రాముఁడు పలుకఁగా విని లక్ష్మణుఁడు స్నేహితులకడ సెలవంది యిక్ష్వాకుగురువును జేరి యా యాయుధములను గ్రహించి మ్యాల్యములచే నలంకరింపఁబడిన యాయుధములన్నింటిని రామునికిఁ జూపింప రాముఁ డిట్లనెను. లక్ష్మణా ! సరియైన కాలంబున తెచ్చి వచ్చితివి. నే నిపుడు నా దగ్గఱనున్న ధనమును తపస్వులైన బ్రాహ్మణులకు నీతోపాటు సమర్పింతును, ఇక్కడ గురువులందు భక్తితోనున్న ద్విజ సత్తములకును మనలఁబట్టి

జీవించువారికిని ధనములిచ్చెదముగాక మఱియును ద్విజులలో శ్రేష్ఠుడును వసిష్ఠపుత్రుఁడును నగు నార్యుఁడునైన సుయజ్ఞుని త్వరగా దీసికొని రమ్ము. ఇంకను ఇతరులైన శిష్యులైన ద్విజులను పూజించి వనమునకు బయులు దేఱెదము. 825

వ. "అని రాముడు వచింప విని యక్కడనే యున్న యూర్మిళ తన ప్రియభర్త సంగతి పూర్తిగా నెఱింగినది కావున నేమాత్రము వికారము పొందక ముఖముచేతనే తన సమ్మతి చూపెను." (ఇది యనువాదకుని భావము)

—: రాముడు గురుశిష్యాదులకు దానములు చేయుట :—

పిదప లక్ష్మణుఁడు శుభంబు ప్రియము నైన
యన్న యాజ్ఞ గ్రహించి సుయజ్ఞు గృహము
చొచ్చి యగ్నిగృహమునకు వచ్చి యచట
నున్న యా సుయజ్ఞుని మొక్కి యొగి వచించె. 826

సఖుడ! రమ్ము దుష్కర కర్మ సలుపు రాము
గృహమునకును సంధ్యను నుపాసించి యతఁడు
లక్ష్మణునితోడఁ జని యంత లక్ష్మితోడఁ
గలలఁదేలు రాముగృహంబు గాంచిచొచ్చె. 827

అంత రాముఁడు వేదజ్ఞుడౌ సుయజ్ఞు
నర్చితంబైన యగ్నిని నటు ప్రదక్షి
ణంబు సీతతోఁగూడ నొనర్చి వసిఁడి
యుంగరములు కుండలములు నతనికిచ్చె. 828

పసిడిసూత్రాలు మణులును వలయములును
మురువు కేయూరములు నన్యములు నొసంగి
సీత ప్రేరేప రాముండుచెప్పె "సౌమ్య!
సరులు రశనను సీత నీ సతికినిచ్చె. 829

పసిఁడిగొలు సంగదములు శుభంబులైన
చిత్రకేయూరములు సఖ! సీత యిచ్చె
రత్నరాజి పర్యంకమున రమ్యమైన
యాస్తరణమిచ్చె మీయింటి కమరఁజేర్చె. 830

నాకు శత్రుంజయుంబను నాగ మెపుడొ
మామయిడె వేలనాడెముల్ మరల దాని
నిచ్చుచున్నాఁడఁ గొనుమన మెచ్చి రాము
సీతనిఁక లక్ష్మణు నతఁ డాశీర్వదించె. 831

అవుడు రాముడవ్యగ్రుఁ బ్రియంబులాడు
లక్ష్మణునిబల్కె నింద్రునిన్ బ్రహ్మవోలె
భ్రాత! అగస్త్యుఁ గౌశికు బ్రాహ్మణోత్త
ములను బిల్చి వారలను తృప్తినొందజేయ. 832

నీళ్లచే సస్యమునుబోలె నీవు మిగుల
రత్నములచేత వారి కర్చనలు చేయుః
వారి రావించి వెండిచే పసిఁడిచేత
వేలయావులన్ దృప్తిగావించి కొల్వు. 833

తల్లి కౌసల్య కాశీస్సు లెల్లనిచ్చి
కొల్చు తైత్తిరీయాచార్యుఁ గూర్చు విప్రు
వేదవిదు యానములచేత వివిధవస్త్ర
ములను దాసులచేఁ దృప్తికలుగఁ గొల్వు. 834

సూతుఁడగు చిత్రరథుఁ డార్యుఁ డాతఁడెంతొ
సముయమునుండి యున్నట్టి సచివుఁ డతని
వెలగలుగు రత్నములచేత వలువ లిడుట
చేత ధనపశుగో సహస్రేచ్ఛఁ గొలువు. 835

మరి కఠకలాపులును దండమాణవులును
గలరు, వారు స్వాధ్యాయశీలులయి యేమి
చేయుక యలసులై స్వాదుశీలు లగుచు
గొప్పవారును నర్చింపఁ గొలువనుంద్రు. 836

వారికెనుబది మణిపూర్ణ వాహనముల
నెడ్లు రెండువేల్ వ్యంజన కృత్యములకు
నెనగ పెసలు లోనగు వస్తులను నొసంగి
వేలగోవుల మఱియు నిప్పింపుమోయి. 837

జనని నిట బ్రహ్మచారిణీ సంఘ మెపుడు
కొలుచు, వేర్వేఱ వేయి వారలకు నిమ్ము
జనని కౌసల్య దక్షురాల్ సంతసించు
నెటుల నటద్విజాతులను పూజింపుమిపుడు. 838

వ. అని రాముఁడు చెప్పఁగా లక్ష్మణుఁడు స్వయముగా రాముఁడు చెప్పిన ప్రకారము బ్రాహ్మణులకు కుబేరునివలె ధనమిచ్చెను. అంత నక్కడ కన్నుల నీరొలుకఁ జూచుచున్న యుపజీవులకు ఒక్కొక్కరికి చాల ద్రవ్యము ఉపజీవనమునకై యిచ్చి లక్ష్మణుని గృహమును నా గృహమును పూర్వ మెట్లు శూన్యము గాకుండునట్లు సేవించిరో యట్లే మేము తిరిగి వచ్చువఱకు మీరు కనిపెట్టికొని యుండుఁడు. అని పలికి గోడుగోడున దుఃఖించు పరిజనులకుఁ గోశాధ్యక్షునిరప్పించి ధనము తెమ్మని యాజ్ఞాపించెను. అట్లు తెప్పించిన ధనము గొప్పకొండగాఁ గనిపించినది. అపుడాధనము లక్ష్మణుతోఁకూడ వారికిని ద్విజులకు చాల వృద్ధులకు దీనులైనవారికి ఇప్పించెను. అంత 839

—: కఱ్ఱ విసిరినంతవఱకుగల గోవులు త్రిజటునకు దాన మిచ్చుట :—

అపుడు గర్గవంశస్థుఁడు వరుణవర్ణుఁ
డైన త్రిజటుఁడను ద్విజుఁడొప్ప నాతఁ డుంఛ
వృత్తియును గునపము నాగలియును పాఱ
వాల్చియుండు, వృద్ధుడతండు వార తరుణి. 840

ఆమె దారిద్ర్యమున బాధలందుచుండి
పిల్లలను దీసికొనుచును వెడలి తనదు
భర్తతోఁ బల్కె గునపము పాఱ విడిచి
ధర్మవిదు రాముఁగను మేదొ ధనము దొరకు. 841

అనఁగ నతఁడు భార్యపలుకు లాలకించి
కప్పుకొనరాక చిరిగిన కావినెటులొ
చుట్టఁబెట్టి రాముఁడెయున్న చోటికేగి
వారికాసి యచ్చటవేచి తటినిచూచు. 842

అంగిరసు భృగున్ దీప్తితో సరిమించు
నా త్రిజటుని ప్రజాసమూహమున నెవఁడు
ఆపలేని యైదవకక్ష్య కరుగువఱకు
నంత త్రిజటుఁడు రామునికనియె నిటుల. 843

నిర్ధనుఁడ బహుపుత్రుఁడన్ నృపతిపుత్ర
హే యశస్వి ? యుంఛమున జీవించువాడ
వనమునం దెపుడుందు నన్గనుము దయను
అనఁ బరిహసించి రాముఁడా యతనికనియె. 844

"లెక్కలేని గోవులలోన నొక్కవేయి
కూడ నిడలేదు, దండంబుతోడ నెంత
నఱకు విసరఁగలవొ యంతవఱకుగలుగు
ధేనువుల నీవ యింకఁ బొందెదవు సుమ్ము. 845

అప్పుడతఁడు శాటి నడుమునందు వడిగ
చుట్టఁబెట్టి నిలఁబడి చూచిచూచి
వెసబలముకొద్ది దండమువిసర, సరయు
దాటి వేలావులను నెద్దుదరిని బడియె. 846

అతనిఁ గౌఁగలించుకొని ధర్మాత్ముఁడైన
రాముఁడో గోవులఁ ద్రిజటాశ్రమమునకును
సరయుతటినుండి గొల్లలన్ సరిగఁబంపి
తెచ్చునటుచేసి వానికిం దెలిపెనిట్లు. 847

గార్గ్య! నాపైని కోపంబు కనుపఱపకు
నీ బలంబు చూచుటకునై నేను నిపుడు
ఇటుల పరిహాసమును నొనరించినాడ
ఇంక నీవేమి ధనము వాంచింతొ చెప్పు. 848

నిజముగాఁ జెప్పుచుంటిని నీకు నిందు
ఏమి బలవంతమును లేద యీ ధనంబు
మీ ద్విజులకు దానముచేయు నాకు.
ప్రీతి కీర్తి బాగుగ నార్జింపఁబడును. 849

అపుడు త్రిజటమహాముని యావులన్ని
కైకొని ప్రమోదమొందియు కడుయశస్సు
బలముకలుగ నాశీస్సులుపలికి చనగ
రాముఁడున్ సుహృజ్జనుల కర్థముగ నొసఁగె. 850

ద్విజులు మిత్రులు భృత్యులు దీనజములు
భిక్షకులు నెవ్వరైనను నాక్షణంబ
తగిన కాన్కల ధనముల దానములను
తృప్తిపొందని వారలు లేరులేరు. 851

అట్లు రాముఁడు ధనము బ్రాహ్మణులకును
నిచ్చి పితఁజూడ సీతతో నేగెనపుడు
జానకి యలంకరింపఁ బుష్పాలమాల
లిడిన వారియాయుధము లెంతొవెలిఁగె. 852

ఏఁడంతస్తుల మేడలెక్కి సదనా లెత్తైన సౌధంబులన్
గూడన్‌జేరి ధనాఢ్యులైన ప్రజ ప్రోగుల్‌ప్రోగులై శూన్యులై
చూడన్‌సాగిరి, నేల గాలినడకన్ సొంపుల్ విసర్జించి తో
డ్తోడన్‌బోయెడి రాము సీత మునుముందున్ బోవుసౌమిత్రినిన్. 853

ఇరుకై బాటలు చోటులేక జనమెంతేనిన్ హతోత్సాహశీ
లురునై చూడఁగ మేడగోడ గుడు లారోహించి పల్ రీతులన్
పురివాసుల్ పురినున్న జానపదులున్ పూబోండ్లు సర్వప్రజల్
దురదృష్టాత్ములమంచు మొత్తుకొని యిట్లున్‌బల్కినా రేడ్చుచున్. 854

వేనిని జతురంగసేనలున్ గొల్చునో
యాతనిన్ దమ్ముఁడె సీతకొల్తు?
ఎవ్వడైశ్వర్యాల నెసఁగి యర్థుల కర్థ
మిడెవాఁడు నిజముకై యడవి కేగు
ఎవతె భూమినిపైని నీక్షింపరానిదో
యామెఁ బాంధులు చూడ నవనినడుచు
ఎవతె చందనముల నెంతొ శోభిల్లనో
యామె వానల నెండ నలసి వణకు

ఆ దశరథునోటఁ బిశాచమాడెనేమొ
లేనిచోఁ బ్రియసుతు నెటుల్ కాన కనుపు
విగుణుఁడగుపుత్రుని గెంటివేయులేడె
నడత నఖిలార్చ్య సుతుఁద్రోసె నడవికెటు. లు 855

శ్రుతమున్ శీలము శాంతి దాంతి దయ యక్రూరత్వ మీ యాఱు సం
తతమున్ రాముని శోభపెట్టు గనుకన్ రాముండు బాధల్గనన్
క్షితిసర్వుల్ కడుబాధ బొందెదరుగా గ్రీష్మంబునన్ నీరముల్
క్షతిపొందన్ జలజంతువుల్ వ్యథలచే నాశంబొందు నారీతిగన్. 856

జగతీనాథుఁడెయైన యాఘనుఁడు కష్టాలొంద సర్వంబు నె
వ్వగలన్బొందును మూలమున్నఱుక పూల్ పండ్లిచ్చువృక్షంబు కూ
లుఁగదే, మానవధర్మసారము నృపాలుండీతఁడేమూలమౌ
నిఁగ పుష్పంబులు కొమ్మలాకులు ఫలాలీయన్యలోకుల్గదా 857

ఇదిగో లక్ష్మణుఁడట్టులీసతులతో నీబంధుమిత్రాళితో
పదుడింకన్ మనరాముతోఁ జనుదమీప్రాసాదముల్ క్షేత్రముల్
మదనోద్యానములన్ గృహంబుల తృణంబట్టుల్ విసర్జించియా
యదనన్ రామునితో సమానసుఖదుఃఖావేశులై యుందమె 858

గనులన్నింటిని పెల్లగించిగృహభాగంబుల్ పడంగొట్టియున్
ధనధాన్యంబులుతీసికొంచును సమస్తంబుల్ హరింపించి దే
వునిగుళ్ళన్త్యజియించి దుమ్మువడిదేవుల్ పోవపాడౌనటుల్
దనరంజేయఁగమూషికంబులకు నాస్థానంబులై పోయెడున్ 859

జలముల్లేకయువంటయింటి పొగలున్జల్లారి వాకిళ్లు తు
డ్పులులేకన్ బలియాగమంత్రక జపంబుల్ హోమముల్లేకపా
త్రలుభగ్నంబుయి క్షామమట్లుమనచేత్యక్తంబులౌగేహంబుల్
గలదై యున్న యయోధ్య! బాడడుపురిన్ గై కేయిపాలించుతన్ 860

మనయారఘురాముండున్
మనమునుత్యజియించినట్టినగరమువనమౌ
మనయారఘురాముండున్
మనమును వసియించుకాననంబుపురంబౌ 861

మనభయమున పాములుపుట్టలనుత్యజించి
పక్షిమృగములు చఱియల వదలివైచు
మనభయమున సింహగజాలు వనులవిడువ
వనముపురమగు పురమును వనమెయవుత 862

తృణముతిను మృగములు మాంసమును తినియెడి
పాములును పండ్లుతినియెడి పక్షులుండి
పురి వనముకాగనిటఁగై కభరతుడుండు
వనులవిహరింతు రికరాముఁడును జనంబు 863

అటు నానాప్రజమాటలన్ వినుచులోకారాముఁడౌరాముఁడం
తట చిత్తంబున సుంతయున్గలతచెందంబోకకై లాసను
స్ఫుటశృంగంబటులున్న తండ్రిభవనంబున్ జొచ్చియేన్గుంబలెన్
దిటవొప్పన్ జనివీరులున్ నతులిడన్దీనున్ సుమంత్రున్గనెన్ 864

అచటనార్తులౌ జనముల నరసికూడ
నార్తిలేకుండ పరిహాసమాడువాఁడు
వోలెనై తండ్రిఁగనఁగోరి నుందెతండ్రి
యాజ్ఞవిధిగఁజేయఁదలఁచి యరిగెత్వరగ 865

మరలదుఃఖించుచున్న సుమంత్రుఁజూచి
లోనికింబోవుటకై తండ్రియాజ్ఞ కొనఁగ
ద్వారముకడనే నిల్చియుఁబలికెనతడు
"హేసుమంత్ర! నారాకెఱిగింపుపితకు" 866

కనిరాముండనువన్ సుమంత్రుఁడు వ్యథన్ గాలుష్యపూర్ణేంద్రియుం
డునునై వేచని నిఃశ్వసించు నృపు ఘూళుల్ గప్పు నిప్పట్లు నీ
ళ్లనులేనట్టి కొలంకటుల్ గ్రసితసూర్యుండట్టులున్నట్టి యా
యనఘున్, రామునినెంచువానిఁగనిజై యంచాడెభీతిన్ వగన్ 867

"ఇదిగో ధీరుఁడు నీసుతుండు ద్విజమిత్రామాత్యభృత్యాళికిన్
స్వధనంబుల్ కడుఁబంచి పెట్టి సఖులన్ సర్వాప్తులన్ జూచి వా
రిదరిన్ వీడ్కొనిచూచినిన్, వనికిపైత్తేరంగ ద్వారంబు పృ
క్ష్మధరానాథ! గ్రహించు, వచ్చి నిలిచెన్ గన్గొమ్ము మేలయ్యెడన్ 868

అతఁడోరశ్ములచేత సూర్యుడటు సర్వారాధ్యరాజద్గుణుం
డతడో వీరుఁడు సత్యమేపలుకు ధర్మాత్ముండు గాంభీర్యసం
గతినంభోధియె, యాకసంబువలెఁ బంకంబంటు కోరానివాఁ
డతఁడే సత్యపరాక్రముండు కనుమీయా నీసుతున్ రామునిన్ 869

వ అనిసుమంత్రుఁడుపలుక నాదశరథమహారాజిట్లనెను. ఓసుమంత్రా!
యిక్కడనున్న నా భార్యలందఱను రావింపుము వారందఱిఁచేజుట్టి
కొనబడి నేను రామునిఁజూడఁగోరుచున్నాను. అనియనఁగా సుమంత్రు
డు అంతఃపురముదాటియే ఆ కాంతలందరితో "ఆర్యలారా! మిమ్ములను
రాజు ఆహ్వానించుచున్నాడు రండు ఆలస్యముచేయకుఁడు" అని
చెప్పఁగా వారందఱును భర్తశాసనము తెలిసికొని యామూఁడు వందల
యేబదిమంది యెఱ్ఱని లోచనములుగల ప్రమదలు కౌసల్యను చుట్టుకొని
మెల్లఁగా ధృతవ్రతలై వచ్చిరి. అంత భార్యలు వచ్చినట్లుచూచి రాజు
సుమంత్రా! నాపుత్రుని రావింపుము అనఁగా సుమంత్రుఁడు రామ
లక్ష్మణులను సీతతో తీసికొనివచ్చి రాజుదగ్గఱకు అభిముఖుఁడై వచ్చు
చుండెను. అపుడు దూరమునుండియెదోసిలి పట్టుకొని వచ్చుచున్న
పుత్త్రునిజూచి వెంటనే స్త్రీజనములు చుట్టుకొనలేచి యెగిరిపడి వేగముగా
రాముని కెదురుగఁబరునెత్తి దుఃఖార్తుడై ఆ పుత్రుని సమీపింపకుండనే 870
భూమిపై మూర్ఛిల్లిపడిపోయెను.

అపుడట్టుల్ స్మృతిలేనివాఁడు వలెదుఃఖావిష్టుఁడై నేలఁబ
డ్డపితన్ రాముఁడు లక్ష్మణుండు వడిగాలంఘించి పైకెత్తఁజూ
చి పడంతుల్ కడువేలమంది పయికేడ్చిన్నెడ్చిహారామ!రా
మ!పితంజూడుమటుంచుగాజులు క్వణింపన్ జుట్టునన్ముట్టిరే. 871

వేగ రామలక్ష్మణు లంతఁ గౌఁగిలించు
కొనుచు గ్రుచ్చి యేడ్చుచు సీతకూడ నేడ్వ
శయ్యఁ జేర్చిరి, రాముఁడో స్వల్ప మాగి
స్మృతిని గను దుఃఖహితుఁ దండ్రి నెఱిఁగి పలికె 872

ఓ మహారాజ! సెలవిమ్ము ప్రేమఁ జూడు
అందఱకు మాకు నీవె సర్వాధిపతివి
దండకారణ్య మేగు నాదండ చూచి
వే గ్రహించి క్షేమమున ననుగ్రహింపు 873

వినక సౌమిత్రి వెంటాడె ననుమతింపు
వనికి సీతకూడను నన్ను ననుసరించు
ఎన్నొ సరియైన హేతువు లెంచి మాన్ప
రాక మానరై రీ సీత లక్ష్మణుడును. 874

మానరక్షక! శోకంబు మాని యిపుడె
నన్ను సీతను లక్ష్మణు నయము మీఱ
నందఱకు మాకు సెలవిచ్చి యనుమతింపు
ఆ ప్రజాపతియు ప్రజలకటులనింక 875

ఇటు లని యనుజ్ఞకై నిరీక్షించుచున్న
రాముతోఁ బల్కె నీరీతి రాజు వేగ
మున్ను కైకకు వరమిడి మోహపడితి
నిగ్రహించి నన్నె యయోధ్య నృపతి వగుము 876

ఇటుల రాజన మ్రొక్కి వచించెఁ బితకు
వాక్యవిధుఁడు రాముఁడు ధర్మభర్తృవరుఁడు
రాజ! వేయేండ్లకును పృథ్విరాజ వీవె
యేనొ వని నుందు నిన్నుఁ బొంకింపనేల 877

పదియు నాల్గేండ్లు విహరించి వనులరాజ!
ప్రతిన తీర్చి నీపదములఁ బడుదు "ననగ"
వంత నేడ్చుచు సత్యాన బద్ధుఁ డగుచు
కైక ప్రేరేపనంతట క్ష్మాపుడనియె. 878

నాయనా! మేలు వృద్ధికై పోయిరమ్ము
శుభముగా జాగ్రతగ పోవు మభయమొందు
సత్యమూర్తి వయిన ధర్మనిత్యుఁ డయిన
నిను మరల్ప శక్యము గాదు నిజము రామ. 879

నేఁడె యిప్పుడె నాయనా! నేటిరాత్రి
యన్నివిధముల నీ విపు డరుగ కయ్య
ఒక్కరోజైన నిను జూచుచుండియైనఁ
గూడ మంచి చేసికొనిన వాఁడ నౌదు 880

జనకు నన్నును జననిని గనుచు నుండి
ఇప్పు డీరాత్రి యిటనే వసింపు మీవు
ఎల్ల కోర్కెలఁ దృప్తి పొందింపఁ బడుచు
నీవు రేపు తగినవేళ కేగఁగలవు. 881

ప్రియములను నీవు నిపుడు నాప్రియముకొఱకు
విడిచి విజనవనమునకు వెళ్లుచుంటి
విందుచే నీవు దుష్కరకృత్యములను
ఎల్ల విధములు నే డాచరించుచుంటి 882

ఈ యదో నాకు ప్రియముకా దోయి పుత్ర!
వినుము సత్యముతో మెట్టుపెట్టుకొనెద
బూది కప్పిన నిప్పునుబోలియున్న
మోసకత్తెయౌ స్త్రీచేత మోసపడితి. 883

నావలన నెట్టి మోసము నీవుగనితొ
దాని దాటుటకై నీవు తలఁచుచుంటి
నాదు కులశీల వృత్తము నాశపఱచు
కైక నన్నిటు ప్రేరేచెఁ గనుము పుత్త్ర! 884

నాకు నీవు జ్యేష్ఠసుతుఁడ వౌకతమున
పితను ననృతపాప మనుభవింపకుండ
ప్రోచి సత్యవంతుఁగఁ జేయఁ బోవుచుంటి
వీయ దాశ్చర్యకరము కాదోయి పుత్త్ర! 885

ఆర్తుఁడై పల్కు తండ్రి వాక్యముల వినుచు
దీనుఁడై రాముఁ డాఖ్రతతోనె పలికె
నేఁడు గను లాభమును రేపు వేడొసంగు
నిచటనుండి పోవుటె యెల్ల యెడల వరము. 886

రాష్ట్రమును జనుల్ ధనధాన్యరాసు లొప్పు
నిలను నే వీడితి భరతుఁ డెనయుఁగాక
వనికిఁ బోయెద నను బుద్ధి చనద యిపుడు
వరద! ముదమొంది కైకకు వరము లిడితి {87

అవి సమస్తము నిచ్చి సత్యాత్ముఁ డగుమి
నేను నీయాజ్ఞ నేనన్న దానిఁ బట్టి
పదియు నాల్గేండ్లు వనచారిపదవి నుందు
ఇక విమర్శ వద్దు భరతు కిండు భువిని. 888

కోరుట లే దీరాజ్యము
కోరుటలే దాత్మసుఖము కోరను ప్రియమున్
ఓరఘుసుత! నీయాజ్ఞా
భారము నే మోయువాఁడ ప్రమదముతోడన్ 889

నీదు వ్యధ పోవుగాక గన్నీరు విడుము
ఎదురుకొన రాని వార్ధి క్షోభింప దెపుడు
నేను రాజ్యము సుఖమును నిట్టిసీత
నెల్లకోర్కెల్ దివము జీవ మేను గోర. 890

నీవు సత్యుఁడవై యుంట నే వరింతు
అనృతుఁడవ యౌచు నుండ నేనాశపడను
నేను సాక్షాత్తు సత్యముతోను మరియు
నీసుకృతముతో నొట్టునిడితినిపుడె 891

ఓ ప్రభూ! యొక్క క్షణ మేని నుండఁ జాల
మాను శోక మోర్చు మిఁక నేమార్చులేదు
అడవిఁ జను మని కైకచే నడుగఁబడితి
చనెద నంటిని చేతు నీ సత్యవాక్కు 892

దేవ! యేమాత్రమును బెంగ నీవు పడకు
కడుఁ! బ్రశాంతమౌ హరిణముల్ కరము తిరుగ
వివిధపక్షులు కూయుచున్ విందు చేయ
మేము వనములలో విహరింతుమయ్య. 893

తండ్రియె దైవము తండ్రీ!
తండ్రియె దైవముల కెల్ల దైవము తండ్రీ!
తండ్రియె దైవం బంచును
తండ్రియు వచియించు వాక్కు తప్పక చేతున్ 894

పదియు నాల్గేండ్లు గడవ పార్థివేంద్ర
మరల నారాక చూతువు మాను చింత
నీవె కన్నీళ్ళు గుక్కెడు నీజనంబు
కావఁదగువాడ, వేల వికారపడెదు. 895

పురమున్ రాష్ట్రము శైలకాననభువుల్ పూర్ణంబుగా వీడితిన్
భరతుం జెంద, నివెల్ల నీఁబడుత, నేఁద్వ్యచ్ఛాసనం బిప్పుడే
పరిపాలించుచుఁ జాలకాల మయినన్ బాటించి సేవించెదన్
నరపాలా! యెది నీవు చెప్పితి వదే నాయిష్ట మట్లయ్యెడున్ 896

ఇఁక శిష్టుల్ మదిసమ్మతించు భవదీయేచ్ఛన్ బలెన్ నాకు నే
సకలంబైన యభీష్టకామములలో స్వాంతంబు వర్తింప దీ
విఁక నాకై వ్యథ యెంతమాత్ర గనకోయీ! నిర్మలాత్మా! భవ
త్సకలాజ్ఞల్ మది నాకు నెప్పుడు శిరోధార్యంబు శోధింపఁగా 897

నిన్ను నసత్యమం దునిచి నేను సుఖంబును సర్వరాజ్యమున్
మిన్నను జానకిన్ బ్రిదుకు మేలగు కామము లెన్ని గాని యిం
దెన్నను, పండ్లు వేళ్ళు భుజియించుచు శైల నదీ సరస్సులే
యెన్నియొ చూచి హాయి విహరింతును నీవిఁక తృప్తి పొందుమీ 898

ఇటులన్ బల్కెడు పుత్త్రుఁ గౌగిలిని నెంతే గ్రుచ్చి దుర్వారసం
కటమున్ బొందిన రాజు దుఃఖమున నింకం గూలి చైతన్యమున్
మటుమాయంబయి పోవ మూర్ఛపడియుం బాన్పందు కూలన్ బడన్
కట! కన్నుల్ కనలేవు మేను కదలంగాబోద యప్పట్టునన్ 899

ఒక కైకేయియె తక్కఁ దక్కుజన మయ్యో యయ్యొ యంచున్గడున్
ఒకటేయేడ్పులనేడ్చికూలఁబడియేయుండన్ సుమంతు
ల్వకమూర్ఛంబడిపోయె నంతిపుర మెల్లన్ నిండ హాహాకృతిన్
వికలంబై పడ నేడ్పు తక్క నిఁకనేవేనిన్వినరావటన్ 900

అటుపయి వెంటనే శిరసు నట్టిటు త్రిప్పుచు మాటిమాటికిన్
కటకట లాడి యూర్చుచు దిగంబడి చేతను చేయి గొట్టుచున్
పటపట దంతముల్ కొఱికి ప్రక్కలఁగన్నులు నెట్టిపాఱ వె
న్కటిమెయి రంగుపోవఁగినుకన్ గడుధిక్కృతుఁడై సుమంత్రుఁడున్ 901

దశరథుచిత్తమున్ గనుచుఁ దప్పక కైక హృదంతరంబు పల్
నిశితశరాలఁ బోల్నుడుల వ్రీల్చుచు నామె సమస్త మర్మముల్
కొసగల వాక్యవజ్రముల గుచ్చుచు బద్దలు కొట్టునటులన్
వెస నిటుపల్కె నందఱును వీనులు దొప్పలు చేయుచున్ వినన్ 902

ఏనీనాథుని బాపురాల వయి నీవిటుల్ విసర్జించితో
ఆనీనాథుఁ డెవండొ తెల్సికొనితే తంపు కైకేయి! ఈ
క్షోణిన్ స్థావరజంగమాఖిల జగత్ క్షోణీంద్రుఁ డీవట్టినీ
యీనాథున్ వ్యథ పెట్టి నీసలుపుమష్కృత్యంబు నీపాటిదే 903

గెలువన్ శక్యముగాని యింద్రుఁడొ కలంగింపంగ రానట్టియా
జలధో గెంటఁగరానిశైలమొ యనన్ శాసించునీభూపతిన్
పలు కష్టంబుల పాలుచేసెడి మహాపాపాత్మురాలా నినున్
దలఁతున్ దేవి! పతిఘ్నిఁగాఁ జివరకు వంశఘ్నిఁగా నెంచెదన్ 904

పతి నవమానింపకు మతి
నితఁడే భర్తయు వరంబు లిచ్చెడువాఁడున్
పతి నీ కీదశరథుఁడో
పతిమతి సుతకోటికంటె ఎన్నికి వరమౌ 905

జనపతి చనిపోఁగానే
తనయులు తమవయసుఁబట్టి ధర నేలుదురే
జనపతి యాయైక్ష్వాకుఁడె
జనపతియై యుండుఁగానఁ జంపుదు వేలా. 906

సరె భరతుఁడు నీపుత్త్రుఁడు
నరపతి యగుఁగాక మేము నగరనివాసుల్
అరిగెదము రాముతోనే
భరతుఁడునీవేలుకొనుఁడుపాడగుపుడమిన్ 907

నీ రాజ్యములో బ్రాహ్మణు
లేరును హానంబు చేయ నెంచరు సుమ్మీ
ఆరీతిగ నీవు దురా
చారపుఁ గర్మలనె యెపుడు సలిపెదు గావన్ 908

ఇటువంటి నీనడత గన
నిటు లాశ్చర్యంబు నెంతయుఁ గలుగున్
ఇటువంటి వీవు చేయఁగ
నెటు లీభూమాత వీ్రల కిటు లున్నదియో. 909

సుజనులు బ్రహ్మర్షులచే
సృజియింపంబడి ప్రజ్వలించుచు భయమున్
సృజియించు శాపము భయము
సృజింప దేల యిటు రామునేచెడుసతికిన్. 910

సరుఁ డెవఁడు మావి చెట్టును
నఱకియు మఱి వేప చెట్టు నరకఁడొ వాఁడున్
సరె పాలు పోసిపెంచునొ
మఱివాఁడును పొందఁ గలదె మధురఫలంబుల్. 911

నీవంశమ్మున నున్నది
పోవునె నీతల్లి కున్న పోలికె నీదిన్
ఆవేపనుండి తేనియ
లేవేళ నయినఁ గురియునె యిది యెఱిఁగినదే. 912

నీమాత పెంకిపట్టును
నేమును విన్నామ యింక నిది యెఱుఁగుదుమున్
ఏమౌనియొ నీతండ్రికి
తా మున్నొక గొప్పవరము దానము చేలెన్. 913

ఆవరముంబట్టియె యే
జీవుల రుతమైనఁ గాని క్షితిపతి యెఱుఁగున్
కావున తిర్యగ్జంతుల
యావాక్కుల భావము మఱి యతనికి తెలియున్. 914

ఘనవర్చసు గల భూపతి
తనశయ్యఁ బరుండియున్నతఱి నొకనాఁడున్
వినె నొకచీమ రుతమును
విని యారుతభావ మెఱిఁగి వికవిక నవ్వెన్. 915

"జనపతి తను గని నవ్వెను"
యని యనుకొని నీదు తల్లి యలిగెను, మృతికై
నిను గని నవ్వను, వరమునఁ
విని చీమలభాష నగితిఁ బ్రియ !" యనెఁ బతియున్. 916

అని పతి యన సౌమ్య ! యదియె
వినెద ననగ నీదుతల్లిఁ విభుఁ డనె దేవీ !
విను నేనె గనుక నిది వి
న్పినచో వాకు మరణమగు నిశ్చయ మిదియే. 917

అపుడో నీతల్లియె నీ
దు పితయయిన కేకయునకు తొరగ వచించెన్
నృప ! బ్రతుకు లేద చావుము
యిపుడె తెలుపునన్నుఁ బరిహసింపవయేనిన్. 918

ప్రియ యటు చెప్పఁగ విని కే
కయపతివరమిచ్చి నట్టిఘనుఁ డగుమునికిన్
ప్రియ యన్నమడులు తెల్పఁగ
దయఁ గని యాసాధు వనియె ధరణీపతితో. 919

"ఇపు డామె చావనీ క్షితి
నృప , కననీ యెంతమాత్ర మెఱిఁగింప కనన్
నృపుఁడు ప్రశాంతాత్ముం డయి
యపు డమ్మనువిడి కుబేరు డటు విహరించెన్. 920

పాపాత్మురాల ! యిటులే
పాపులు చరియించునట్టి పథమున రాజున్
పాపపు పట్టుదల గలుగు
వాపగిదిన్ జేయుచుంటి వ్యామోహముచే. 921

లోకులను నీప్రవాదము
నాకున్ సత్యముగఁ దోచ నై వదిసుమీ
లోకమున సుతులు తండ్రిని
నీ కూతుళ్లింక ననుసరింతురు తల్లిన్. 922

ఇటు లీవు కాకు, విభుఁ డని
నటులన్ గావింపు మిప్పుడైనను కైకా !
ఇటు పతి యిచ్ఛ భజింపుమి
యిటు లీజనములకు నీవ యగుదువు శరణున్. 923

పాపు లెవరొ ప్రేరేచగ
పాపపు భావంబు పొంది పాప మొనర్తే
ఏపాపమనని సురసము
నీపతి నీలోకభర్త నిటు చెడిపెదవే. 924

సరదాకె ప్రతిజ్ఞ సలిపె
వరుండు శ్రీమంతుఁడు శతపత్రదళాక్షుం
డరవిందాక్షి ! యిపుడీ
నరపతి యనఘుండు నీకొవర్పఁడ యెదియున్. 925

లక్షణవంతుని జ్యేష్ఠుని
రక్షకుని వదాన్య దేవి ! ప్రాణిజగంబున్
రక్షించు ఘను స్వధర్మను
రక్షకు నభిషిక్తుఁ జేయు రాము సుకర్మున్. 926

ఒకవేళ గనుక రాముం
డకలుషుఁడె పితను త్యజించి యడవికిఁ జనెనేన్
సకలజగంబుల నీకున్
ప్రకటముగ దారుణాపవాదమె గలుగున్. 927

రాముఁడె రాజ్యం బేలుత
నీమదిని మనోవ్యథ చన నిజమగు సుఖమౌ
రామునికంటె నికొక్కఁడు
నేమీ పురినుండి నీకు నెటుక్షముఁ డగునే. 928

రాముడు యువరాజుం గని
యీమనదశరధుఁడు రాజఋషి పూర్వకథల్
క్షేమముకై తలచుకొనుచు
నీమముగా పనికిఁ బోవు నిజకార్యకుఁడై. 929

అని సాంత్వనముగ, వాడిగ
జను లెల్లరు వినుచునుండ సరిగ సుమంత్రుం
డనుచుఁ గడు క్షోభపెట్టెను
వినతాంజలియై మఱిమఱి పెట్టెను క్షోభన్. 930

ఆమెయొ క్షోభిల దేమీ
యేమాత్రము దుఃఖ మొంది యెద మెదలదుగా
ఆమె ముఖపు రంగింతయు
నేమాత్రము మార్పు చెంద దెటులును నపుడేన్. 931

విపుల మగుకనుల నశ్రులు
విపులతఁ బడ నిఃశ్వసించె వెస సూతునితో
నపు డిక్ష్వాకు కులీనుఁడు
నృపతి యనె మరల ప్రతిజ్ఞ నీరస పెట్టన్. 932

చతు రంగం బగుసైన్యముల్ మణులతో సంపూర్ణమై శీఘ్రమై
సుతు రామున్ వనయాత్రకై యనుగమించుంగాక నాయాజ్ఞచే
అతిసౌందర్యవతుల్ విలాసినులు రూపాజీవలున్ కోటికిన్
పతగావెత్తిన వర్తకుల్ సుతుని సైన్యం బందగింపన్ వలెన్ 933

ఎవరైతే మన రాముఁ బట్టి యను జీవింపగ నున్నారో యిం
కెవరైనన్ సరె వేరితో మిగులఁ గ్రీడించున్ గదో రాముఁ డా
యువక శ్రేణికి చాల నిచ్చి యట నాయోజింపు మేల్
వివిధాస్త్రంబుల విచ్చి నాగరుల నిందిష్టేనియోగింపుమీ 934

వనచరు లేగుదేఱఁగ వనంబుల నేస్గుల లేళ్ళఁజంపుచున్
వనములలోని తేనియల బాగుగఁ దాగ్రివుచు రాజ్యమున్ దలం
పునగననీక యుండుతను, మొత్తముగా మనధాన్యకోశమున్
ధనములు నేఁడు నిర్జనవనంబునఁ బుత్రుని జెందుఁగావుతన్ 935

అనయము పుణ్యదేశముల యజ్ఞము చేయుచు నిష్టదక్షిణల్
ధనము లొసంగి విప్రులకుతాపసులన్ గని హాయి మీరగా
వనముల నుండుతన్ సకల వస్తులతోడత రామునంపుమీ
మనభరతుండొ రాజ్యమును మానకపొందియయోధ్యనుండుతన్ 936

అని దశరథుఁడు చెప్ప భయాన నలికి
ముఖము సెండిపోవ స్వరంబు మూఁతపడఁగ
కైక రాజున కభిముఖియై కరంబు
పొక్క వెలవెలపోవు మోమున వచించె 937

సారమే లేని సురఁబోలె సార మెల్ల
చనిన పిప్పని భరతుండు గొనఁడు సాధు
అనుచు సిగ్గు వీడియుఁ గైక యనఁగ రాజు
నిడుద కను లున్న కైకతో నుడివె నిట్లు 938

మఱి యనార్య! యహితురాల ! బరువు మోయ
నను నియోగించి యేలహింసనునొసర్తు
విదివఱకె యన్ని విడనాడి యేగువనికి
అనుచు నడ్డగింపక యిప్పు డడ్డెదేల. 939

అటులనల్క మండిన మాట లాలకించి
యంగనయుఁగైక రెట్టించి యలిగి పలికె
"నీకులజు నసమంజునిన్ జ్యేష్ఠపుత్త్రి
సగరు డడ్డగింపఁడె యట్లె చనెడునితడు. 940

కైక యిటు పల్క ఛీ యని క్షాపుఁ డనియె
జనము సిగ్గొందె నామెయో కనద యేమి
అపుడు శుచి రాజునకు నిష్టుఁడైన యట్టి
యాయమాత్యుఁడౌ సిద్ధార్థుఁ డనియె నిటులు. 941

దార్లలో నాడుకొనెడికుమార్ల నపుడు
నెత్తుకొనిపోయి యసమంజుఁడీసడించి
దుష్టమతితో సరయువులోఁ ద్రోసి మిగుల
నగుచు కేరింత కొట్టి యానంద మొందు 942

వాని పనిఁ జూచి పౌరులు జానపదులు
క్రుద్ధులై రాజుతోడఁ బల్కుదురు నిటుల
"రాష్ట్రవర్ధన! యసమంజు రక్షసేయు
లేద మమ్మైన రక్షింపు నృపతి!యనంగ 943

రాజు వారితో ననె నేల త్రాసమిటులు
చాత్తురన నాత డాడుమాసుతుల నెల్ల
భ్రాంత చిత్తుఁడై సరయులో పాఱవైచి
మౌఢ్యమున నవ్వి యానంద మందుచుండు. 944

అనఁగ రాజంత ప్రజకుఁ బ్రియంబు చేయ
అహితుఁడగు పుత్త్రు త్యజింప నతని
భార్యతోపాటు గను పరివారములను
రథము నెక్కించి గెంటించె బ్రతుకువఱకు 945

అతఁడొ పాఱ బుట్టను బూని యద్రులందు
దుర్గములఁ గనుచు దిశల నిర్ణయించి
తిరుగుచును పాపకర్ముఁడై వఱలె నిటులు
ఆసగరుఁడు పుత్త్రు విడె ధర్మాత్ముఁడగుచు 946

ఎట్టి పాపము నితఁడు గావించె ననుచు
నడ్డగింపఁబడును ! రాము, దశరథుఁడింక
ఏ యవగుణమున్ రామునం దెపుడు గనము
ముఱికి శశి కట్టు చెడుగు రామునికి నరుదు. 947

కాని దేవి ! నీవైన నేదైనఁ జెడుగు
రాముదరిఁ జూచితేన్ చెప్పు భ్రాంతి విడచి
ఎందుకని రాముఁ డిపుడు గెంటింపఁబడెను
ఎట్టి దోష మున్నను సంశయింపవలదు. 948

చెడుగె లేనట్టి వానిఁ ద్యజించుటయును
మంచి పథిఁ బోవునరు విసర్జించుటయును
ధర్మమును నిరోధించుటన్ దప్పకుండ
ఇంద్రతేజసుఁ గూడ దహించివైచు. 949

కాన చాలింపుమీ, రాము శ్రీని నణంచి
నందువలన నీకేమైనఁ బ్రాప్త మగునె
లోకమువలనఁగూడను నీకు కైక
ఘోరమౌ నపవాదు రాకుండఁ జూడు. 950

అంత సిద్ధార్థువాక్యము నాలకించి
రాజె యాయాసపడిన స్వరంబుతోనె
శోకమునఁ గ్రుంగిపోయిన వాక్కుతోడ
నప్పు డాకైకతోడుత ననియెనిట్లు. 951

ఇంక సిద్ధార్థు వాక్కు మన్నింప వైతి
నాదుహితము గాని పోనిలే, నీహితంబు
గాని యెఱుఁగక యున్నావు హీనపథిని
పోయెదవు, కుచేష్టయు సాధు హేయ మెందు. 952

ధనమును రాజ్యము సుఖమును
తృణముగ విడి రాము ననుసరించెద నిపుడే
జనపతి యగు భరతునితో
ననయు మనుభవింపు రాజ్య మానందముతో. 953

అప్పు డాయమాత్యుని వాక్కు లాలకించు
రాముఁడు వినయుజ్ఞుఁ డయి నమ్రంబులైన
వాక్యముల నాదశరథభూపాలుతోడ
పలికె నీరీతి తత్త్వంబు ప్రకట పడఁగ. 954

ఎల్ల భోగభాగ్యముల త్యజించి వైచి
వనిసె దొరకు వస్తులతోనె బ్రతుకుచుండ
వస్తు సంబంధము విడు నావంటివాని
కనఘ ! జీవయాత్ర ధనాలపని యదేమి. 955

ఎవడు మదపుజేన్గును దాన మిచ్చి వైచె
మెడ గొలసుకై పేరాశ పడునె యేమి
వారణోత్తమంబును నిట్టె వదలి వైచి
ఎవని కైనను గొలుసుపై నిచ్ఛ యున్నె. 956

సజ్జనులలోన శ్రేష్ఠుడా జగతినాథ !
కనుక నవియెల్ల భరతుని కనుమతింతు
ఇంకనాకు సేనలతో! బనేమిగలదు
నాకు నారబట్టలు తెత్తు?గాక యిపుడె. 957

—: రామునికి నారబట్టలు కైక తెచ్చి యిచ్చుట :—

పదియు నాల్గేండ్లు వనినుండవలయు నాకు
గుసపమును బుట్ట నికతెండు చనుడి యనగ
స్వయముగాఁ గైకయే నారబట్ట లిచ్చి
జనసభను సిగ్గువిడిచి "కట్టుకొనుమి" యనియె. 958

ఆసరవరుండు కైకకరాన నుండి
రెండు నారబట్టలును పరిగ్రహించి
మేలి సన్నబట్టల నవలీల విడిచి
మునులు ధరియించు బట్టల ఘనతఁ దాల్చె. 959

అలరి లక్ష్మణుఁడును మేలివలువ లుడిగి
తాపసుల బట్టల గ్రహించెఁ దండ్రిముందె
పట్టు వల్వ దాల్చిన సీత కట్టుకొనఁగ
లేడివలఁ బోలె- చీర దర్శించి హడలె. 960

సీత రవంత భావమున సిగ్గిలు చున్నటు కై కనుండి ముం
జేతను నారచీరఁ గొని చిత్తమదెంతొ కలంగఁ గన్నులం
దాతటి నీరునిండ సతియౌ తనధర్మమెఱింగి ధర్మమున్
ప్రీతిగఁజూపనెంచి యనె వేగఁ గుబేరుని బోలు భర్తతో 961

మునులును నారఁబట్టలును మోదముతో నెటు కట్టుకొందురో
యని యట నేర్పులేని జనకాత్మజ పల్మరు మోహ మొందుచున్
మునికొని సున్నితంపుమెడ మొద్దగు బట్టను చుట్టఁబెట్టుచున్
గనుచును నుండిపోయె నిపుణత్వములేనిదియౌచు సిగ్గుతో 962

తటుకున వచ్చి ధర్మమును దాల్చెడి వారలలోన మిన్నయౌ
పటుమతి రాముఁ డాత్మసతి వల్దను చున్నను నారచీర వే
చటకున లాగి పట్టునుచల్వకుఁ బైనె స్వయంగాఁ గరం
బిటు నటుత్రిప్పి కట్టె నట నింతులుతల్లులు తండ్రి చూడఁగన్ 963

సీతకు నారబట్ట యెటో చేతయి నట్టులు త్రిప్పి త్రిప్పియే
దో తగఁ గట్టురాముఁగని తొయ్యలు లంతిపురంబు నశ్రులెం
తో తడుపంగ నిట్లని రయో సుకుమార! మనస్వినిన్ బ్రియన్
పూతను సీతఁ దీసికొని పొమ్మని నీకును నాజ్ఞ లేదుగా, 964

జనకుని యాజ్ఞ నీవు ప్రజసందడె లేనటు శూన్యమౌ వనిన్
చనుమికఁ బోని సీత నయినన్ గని మేమును జీవితాలువే
యు నుసఫలంబు చేసికొనుచుందుము, తమ్ముడు తోడు నీడగా
వనిఁ జనుఁ మీ సుమంగళి తపస్వుల యట్లు వసింప లేదటన్ 96

నాయన! మాదుప్రార్థన వినందగు, ధర్మపరుండ వైననీ
వో యిటనుండి నిష్టపడ,వుంచుము జానకి నైన నంచనన్
ఆయెడ నట్లెతుల్యగుణ కామెకుఁ జీరను గట్టఁజూచి కై
కేయికి నావసిష్ఠుఁ డనెఁ గిన్కను, సీతను నాపి యుంచుచున్ 966

పథము నతిక్రమించు కులపాంసని! యోసి కుబుద్ధి!కైకయీ!
యధిపుని మోసగించి తగునట్టుల హద్దుల నీవా యుండు, వే
విధమునఁ గాని కానలకు వెళ్ళదు జానకి, రాము నాసనం
బధివసియించి యేలు ధర, యన్నిట భార్యయె యాత్మభర్తకున్ 967

మరి వని కేగునా యిటులె మైథిలి, రామునితోడ మేమిదే
యరిగెద, మీపురం బుటులెయుందఱతోడనెవచ్చు, భృత్యులున్
పరిజనులున్ స్వరాష్ట్రమును వచ్చును, నాభరతుండు తమ్ముఁడున్
మరలక నారబట్టలను మై ధరియించి వసింతు రన్నతో 968

ఇంకజను లెల్లఁబో వఁ దరులే తుద కుండిన శూన్యమౌధరన్
ఒకతెవె యేలిదుదుష్టవయియుండుము రాముఁడు రాజుగాని యా
సకలధరిత్రి కాన యగుఁజూడుము, రాముడె యున్న కానయే
సకలధనాఢ్యయై తనరుచక్కని రాజ్యమ యౌను పాతకీ! 969

ఈయుని రాజ్యమున్ భరతుఁడేలుట కర్హుఁడుగాఁడు రాజుకే
యాయనఘుండు పుట్టునెడ ఈఖలురా లగు నీకు పుత్త్రుఁడై
యీయెడ నుండఁగాఁ దగఁడు యీవెగరంగులవింకమింటికిన్
ఈయఖిలాన్వయం బెఱుగు నీభరతుండొ యొనర్పఁడన్యముల్ 970

కొడుకున కీవురాజ్యమును గోరుచుఁజూడవ యప్రియంబునే
కొడుకుకుఁజేయుచుంటి నని,కూళరో రామునివెంటఁ బోక యె
వ్వఁడు నిటనుండఁబోఁ డిపుడె పక్షులు పాములు జంతువుల్ పశుల్
వెడలుట నీవె చూచెదవు వృక్షము లెత్తి ముఖాల లటేగనున్ 971

కనుక దేవి! మేలగు నాభరణము లెన్నొ
కోడలికి నిమ్ము చీరను వీడు మిపుడె
ఈమె కీనారచీర విధింపఁబడదు
అని వసిష్ఠుఁడు వారించె నపుడు చీర 972

రామునికి నొక్కనికె యీయరణ్యవాస
మీవు కోరి యుంటివి కేకయేశుపుత్త్రి!
కనుక నీమెయొు ప్రతినిత్యమును నలంక
రించుకొనియె రామునితో వసించుఁగాక 973

వాహనములతో ముఖ్యసేవకులతోడ
చుట్టు కొనఁబడియే రాజసుతయుఁ జనుత
ఈవు వరము కోరునపుడు నేవికూడ
ఈయఖిలవస్తుల మినహాయింపలేదు 974

అప్రతిమ మహిమ గలుగు నావసిష్ఠ
గురువు సటు చెప్పుచుండఁగ నరసి సీత
ప్రియపతికి నిష్టమును నాచరింపఁ దలఁచి
నారచీరనుండియును వెన్ మరలలేదు. 975

నాధుఁడు గల యాసీత యనాధవోలె
నారచీరను కట్టుకొనంగ నపుడు
ఓదశరథ! నీవున్న లేకున్న నేమి
ఛీ! భవజ్జీవిత మని యేడ్చిరిజనంబు 976

ఆధ్వనులచేత దుఃఖితుం డగుచు రాజు
వేఁడి నిట్టూర్పు నుస్సంచు విడిచి మరియు
సువిది తేక్ష్వాకు వంశ్యుఁ డు స్రుక్కి కుమిలి
భార్య యగుకైకతో నంత పలికె నిటులు 977

అతిసుకుమారియు బాలయు
సతతము సుఖములకుఁదగిన జానకి యెటులో
మతిగన వనికిన్ తగ దని
మతిమంతుడు నాగురువును మానక చెప్పెన్ 978

ఈతపస్విని జనకరాజేంద్రుపుత్రి
చిన్నయుపకార మెవరికేన్ చేసె నొక్కొ
ఏల యిటు నారబట్ట ధరించి యిపుడు
ప్రజలలో తాపసివలె నిస్సంజ్ఞ యయ్యె 979

సీత నారబట్టలను త్యజించుఁగాక
ఇటు ప్రతిజ్ఞను నేనాచరింపలేదు
నృపతి పుత్రి యధేచ్ఛగా నేగుఁగాక
సకలరత్నాలు గైకొని చనెడు గాక 980

బ్రతుకఁ దగని నేసెట్టిఘోరప్రతిజ్ఞ
ఇప్పు డిటు నింద్యముగ నాచరింపలేదు
ఈవు బాల్యమునుండె గావించుచుంటి
వదె నను దహించుఁదనపుప్పెవెదురునటు. 981

రాము డెదియేనియు ననుకూలంబుకాని
దొక్క వేళను గావించి యుండెనేని
అధమురాల! యీసీత యూవంతమైన
నీకు నపకారంమును చేయునీవు కంటె 982

లేడివలె విచ్చుకన్ను లున్న మృదులశీల
యీమనస్విని జానకి యిపుడు నీకు
ఎట్టి యపకారమైన గావించె నొక్కొ
యిట్టి సూచన యైన వీక్షించినావె 983

అలరి లక్ష్మణుఁడును మేలివలువ లుడిగి
తాపసుల బట్టల గ్రహించెఁ దండ్రిముందె
పట్టు వల్వ దాల్చిన సీత కట్టుకొనఁగ
లేడివలెఁ బోలె- చీర దర్శించి హడలె. 960

సీత రవంత భావమున సిగ్గిలు చున్నటు కై కనుండి ముం
జేతను నారచీరఁ గొని చిత్తమదెంతొ కలంగఁ గన్నులం
దాతఱి నీరునిండ సతియౌ తనధర్మ మెఱింగి ధర్మమున్
ప్రీతిగఁజూపనెంచి యనె వేగఁ గుబేరుని బోలు భర్తతో 961

మునులును నారబట్టలును మోదముతో నెటు కట్టుకొందురో
యని యట నేర్పులేని జనకాత్మజ పల్కరు మోహ మొందుచున్
మునికొని సున్నితంపుమెడ మొద్దగు బట్టను చుట్టఁబెట్టుచున్
గనుచును నుండిపోయె నిపుణత్వములేనిదియౌచు సిగ్గుతో 962

తటుకున వచ్చి ధర్మమును దాల్చెడి వారలలోన మిన్నయౌ
పటుమతి రాముఁ డాత్మసతి వల్లను చున్నను నారచీర వే
చటకున లాగి పట్టునుచల్వకుఁ బైనె స్వయంగాఁ గరం
బిటు నటుత్రిప్పి కట్టె నట నింతులుతల్లులు తండ్రి చూడఁగన్ 963

సీతకు నారబట్ట యెటొ చేతయి నట్టులు త్రిప్పి త్రిప్పియే
దో తగఁ గట్టురాముఁగని తొయ్యలు లంతిపురంబు నశ్రులెం
తో తడుపంగ నిట్లని రయో సుకుమార! మనస్వినిన్ బ్రియన్
పూతను సీతఁ దీసికొని పొమ్మని నీకును నాజ్ఞ లేదుగా, 964

జనకుని యాజ్ఞ నీవు ప్రజసందడె లేనటు శూన్యమౌ వనిన్
చనుమికఁ బోని సీత నయనన్ గని మేమును జీవితాలువే
యునుసఫలంబు చేసికొనుచుందుము, తమ్ముఁడు తోడు నీడగా
వనిఁ జనుమీ సుమంగళి తపస్వుల యట్లు వసింప లేదటన్ 965

నాయన! మాదుప్రార్థన వినందగు, ధర్మపరుండ వై సనీ
వో యిటనుండి నిష్టపడ,వుంచుము జానకి సైన నంచనన్
ఆయెడ నట్లెతుల్యగుణ కామెకుఁ జీరను గట్టఁజూచి కై
కేయికి నావసిష్ఠుఁ డనెఁ గిన్కను, సీతను నాపి యుంచుచున్ 966

పథము నతిక్రమించు కులపాంసని! యోసి కుబుద్ధి! కైకయీ!
యధిపుని మోసగించి తగునట్టుల హద్దుల నీవా యుండు, వే
విధమునఁ గాని కానలకు వెళ్ళదు జానకి, రాము నాసనం
బధివసియించి యేలు ధర, యన్నిట భార్యయె యాత్మభర్తకున్ 967

మరి వని కేగునా యిటులె మైథిలి, రామునితోడ మేమిదే
యరిగెద, మీపురం బుటులెయుందఱతోడనెవచ్చు, భృత్యులున్
పరిజనులున్ స్వరాష్ట్రమును వచ్చును, నాభరతుండు తమ్ముఁడున్
మరలక నారబట్టలను మై ధరియించి వసింతు రన్నతో 968

ఇంకజను లెల్లఁబో వఁ దరులే తుద కుండిన శూన్యమౌధరన్
ఒకతెవె యేలిదుదుష్టవయియుండుము రాముఁడు రాజుగాని యా
సకలధరిత్రి కాన యగుఁజూడుము, రాముడె యున్న కానయే
సకలధనాఢ్యమై తనరుచక్కని రాజ్యమ యౌను పాతకీ! 969

ఈయుని రాజ్యమున్ భరతుఁడేలుట కర్హుఁడుగాఁడు రాజుకే
యాయనఘుండు పుట్టునెడ ఈఖలురా లగు నీకు పుత్త్రుఁడై
యీయెడ నుండఁగాఁ దగఁడు యీవెగరంగులవింకమింటికిన్
ఈయఖిలాన్వయం బెఱుగు నీభరతుండొ యొనర్పఁడన్యముల్ 970

కొడుకున కీవురాజ్యమును గోరుచుఁజూడవ యప్రియంబునే
కొడుకుకుఁజేయుచుంటి వని,కూళరొ రామునివెంటఁ బోక యె
వ్వఁడు నిటనుండఁబోఁ డిపుడె పక్షులు పాములు జంతువుల్ పశుల్
వెడలుట నీవె చూచెదవు వృక్షము లెత్తి ముఖాల లటేగనున్ 971

రాముండు సీత లక్ష్మణు
డా మహిపతి దశరథునకు ప్రాంజలు లగుచున్
నీమముగ ప్రదక్షిణముల
నేమరకయె చేసినార లిటు దైన్యముతో. 1018

పిదప రాముండు సీతతోఁ బితను నసుమ
తింపఁజేసి శోకజడుఁడై యెఱఁగె జనని
కంత కౌసల్యకున్ మ్రొక్కి యవల తల్లి
యగు సుమిత్రకు లక్ష్మణుఁ డపుడు మ్రొక్కె. 1019

ఇటులు మ్రొక్కు లక్ష్మణుఁ గాంచి యేడ్పు పొంగ
లక్ష్మణు శిరంబు మూర్కొని, లక్ష్మణునికి
ఆమహాబాహునకు హిత మభిలషించి
తల్లి యగుసుమిత్ర వచించెఁ దగినరీతి. 1020

## రాముని గొలువుమని లక్ష్మణునికి సుమిత్ర బోధించి పంపుట

ఈవు నాయన ! వనికె సృజింపఁబడితి
వన్న వని కేగుచుండ సౌహార్దమొప్ప
సఖుల యెడననురాగంబు నెంతొయుంచి
రామునెడ ప్రమాదము చూపరాదు సుమ్ము. 1021

వ్యసని యయిన బీద యయిన
నన లెప్పుడుగూడ నితఁడె యగుగతి నీకున్
అన లగుధర్మం బిదియే
సిసలగు నన్నకు వశమయి సేవించుటయే. 1022

ఇటు చేయుటె యుచితము ప్ర
స్ఫుటము సనాతనము నైన సూక్ష్మపు ధర్మం
బిటు యజ్ఞమ్ములయందు
త్కట దానము దీక్ష - యాజిఁ దనువర్జనమున్. 1023

తలఁపు దశరథుఁగ రాముని
తలంపు మాతగను సీతఁ దత్త్వపు దృష్టిన్
తలంపుమి యడవి నయోధ్యగ
తలఁచి యిటు సుఖముగఁ బుత్ర ! త్వరగఁ జని రమ్మా. 1024

వివ. దశరథుఁడు=రాముని తండ్రి, పది యింద్రియములు రథములుగా గల
విష్ణువును. మాతగ=తల్లిగ, మా=లక్ష్మియై, తగ=తగునట్లు.

వ. అని సుమిత్ర దీవించి పంపగా అంత. 1025

వడచి వినయజ్ఞుఁడు సుమం
త్రుఁడు మోమునఁ జేతు లొగ్గి తొందరగా న
ప్పుడు కాకుత్థ్సునితో నసె
మడఁగియు వాసవునితోడ మాతలియటులన్. 1026

రథ మెక్కు నీకు మేలగు
రథ మెక్కుము రాజపుత్ర రమ్ము ! సుకీర్తీ !
రథమెక్కి నీవెటకు నే
పథమున తీసికొని వెళ్ళవలయునో చెపుమీ. 1027

—: సీత తాను పతిని గౌరవింప నేర్చితినని చెప్పుట :—

తీగ లేకుండ వీణియు మ్రోగ దెపుడొ
రథము నడవ దెన్నండుఁ జక్రంబులేక
నూర్గురు సుతులతోడుతన్ గూడికూడ
పతియె లేనట్టి సతి సౌఖ్యపడదు గాదె. 1007

మితముగనే పిత యిచ్చును
మితముగనే మాత యిచ్చు మితముగ సుతుఁడున్
హితుఁడై యమితముగ నిడెడి
పతియే సతులందఱకును పరదైవతమౌ. 1008

పితవల్ల మాతవల్లను
హితులైన గురువులవల్ల నెంతయొ వింటిన్
పతి నెటు లవమానింతును
బతియే సతులందరకును పరదేవతయౌ. 1009

మదికిని నచ్చిన జానకి
మధురోక్తుల నాలకించి మది వగ ముదమున్
ఒదవఁగ గౌసల్య యచట
వదలెను సత్త్వంబు శుద్ధపడి బాష్పముళన్. 1010

మాతలమధ్యను సత్కృతి
యా తల్లిని రాముఁడు గని ప్రాంజలి యగుచున్
ఆతరి ధర్మాత్ముండయి
మాతకు నీరీతిఁ జెప్పె మన్ననతోడన్. 1011

నీవమ్మా ! దుఃఖింపకు
నీవిపుడు నాదుపితను నిత్యము గనుచున్
సేవింపుము, వనవాసము
నీవిటుగనుచుండ ముగియు నిజముగ వేగన్. 1012

నిదురించి లేచు నప్పటి
కిదిగో పదునాలుగేండ్లు లిట్టే గడుచున్
పదపడి సుహృదులతో మే
మిదె యందర మేగుదేర నీక్షింతువుగా. 1013

ఇటులు తన నిశ్చయము తల్లి కెఱుకపరచి
మూడు వందలయేఁబండ్రు పూజ్యలైన
తల్లులను వేరువేర్వేర మెల్లఁజూచె
వారు గూడ రాముని చూచినార లపుడు. 1014

అంత రాముఁడు వారితో ననియె మ్రొక్కి
కలసియె వసించియుండుట వలనఁ గాని
తెలియకే గాని యేదైనఁ పలుకు నెడల
వేగ మన్నించి సెలవిండు వెళ్లి వత్తు. 1015

అనఁగ నపుడు ధర్మసహితం బైనరాము
పలుకు విని శోకమున మది కలతఁ జెంద
ఆడుకొంగల వోలెను నధిప సతులు
నొక్కపెట్టున నేడ్చిరి వెక్కివెక్కి. 1016

అదివరలో పణవంబులు
మృదంగముల ధ్వనులతోడ మిన్నెగురంగన్
పదెపదె మ్రోగు పతి గృహం
బది యేడ్పు లరుపులతోడ వ్యాప్తంబయ్యెన్. 1017

రాముండు సీత లక్ష్మణు
డా మహిపతి దశరథునకు ప్రాంజలు లగుచున్
నీమముగ ప్రదక్షిణముల
నేమరకయె చేసినార లిటు దైన్యముతో. 1018

పిదప రాముండు సీతతోఁ బితను నసుమ
తింపఁజేసి శోకజడుఁడై యెఱఁగె జనని
కంత కౌసల్యకున్ మ్రొక్కి యవల తల్లి
యగు సుమిత్రకు లక్ష్మణుఁ డపుడు మ్రొక్కె. 1019

ఇటులు మ్రొక్కు లక్ష్మణుఁ గాంచి యేడ్పు పొంగ
లక్ష్మణు శిరంబు మూర్కొని, లక్ష్మణునికి
ఆమహాబాహునకు హిత మభిలషించి
తల్లి యగుసుమిత్ర వచించెఁ దగినరీతి. 1020

## రాముని గొలువుమని లక్ష్మణునికి సుమిత్ర బోధించి పంపుట

ఈవు నాయన ! వనికె సృజింపఁబడితి
వన్నవని కేగుచుండ సౌహార్దమొప్ప
సఖుల యెడననురాగంబు నెంతొయుంచి
రామునెడ ప్రమాదము చూపరాదు సుమ్ము. 1021

వ్యసని యయిన బీద యయిన
నస లెప్పుడుగూడ నితఁడె యగుగతి నీకున్
అస లగుధర్మం బిదియే
సిసలగు నన్నకు వశమయి సేవించుటయే. 1022

ఇటు చేయుటె యుచితము ప్ర
స్ఫుటము సనాతనము నైన సూక్ష్మపు ధర్మం
బిటు యజ్ఞమ్ములయం దు
త్కట దానము దీక్ష - యాజిఁ దనువర్జనమున్. 1023

తలఁపు దశరథుఁగ రాముని
తలంపు మాతగను సీతఁ దత్త్వపు దృష్టిన్
తలంపుమి యడవి నయోధ్యగ
తలఁచి యిటు సుఖముగఁ బుత్ర ! త్వరగఁ జని రమ్మా. 1024

వివ. దశరథుఁడు=రాముని తండ్రి, పది యింద్రియములు రథములుగా గల విష్ణువును. మాతగ=తల్లిగ, మా=లక్ష్మియై, తగ=తగునట్లు.

వ. అని సుమిత్ర దీవించి పంపగా అంత. 1025

వడచి వినయుజ్ఞుఁడు సుమం
త్రుఁడు మోమునఁ జేతు లొగ్గి తొందరగా న
ప్పుడు కాకుత్థ్సునితో నసె
మడఁగియు వాసవునితోడ మాతలియటులన్. 1026

రథ మెక్కు నీకు మేలగు
రథ మెక్కుము రాజపుత్ర రమ్ము ! సుకీర్తీ !
రథమెక్కి నీవెటకు నే
పథమున తీసికొని వెళ్ళవలయునొ చెపుమీ. 1027

పదునాల్గేండులు వనమున
వదపడి నీవును వసింపవలయును గాదా
ఇదిగో నిప్పుడె వానిని
మొదలిడవలెగాదె దేవి మును చెప్పినటుల్. 1028

వ. అపుడు వరారోహ యయిన సీత సంతసించి మనస్సుతో తన్నలంకరించుకొని రథమును ఎక్కెను.

వనవాసవత్సరంబులు
గణియించియ క్షౌమములు ఘనభూషణముల్
తన భర్త ననుసరించెడి
జనకజకు నరపతి మామ సరగనొసంగెన్

వ. అట్లే భ్రాత లిద్దఱకు ఆయుధములను కవచములను చర్మముఁతోఁ గట్టిగా బంధించి యీయఁగా రథము మధ్యగా నుంచి రామలక్ష్మణులు అగ్నివలె ప్రకాశించునదియు బంగారుతో నలంకరింపబడినదియు నగు రథమును శీఘ్రముగా నెక్కిరి. సీతారామలక్ష్మణులు ముగ్గురును రథ మెక్కఁజూచి సుమంత్రుఁడు వాయువేగముతోఁ గూడిన మేలి యశ్వములను బూన్చి ఆలస్యముకారాదను భావముతో సంకోచము లేక తోలెను 1020

చిరమునకున్ మహాటవికి శ్రీచెడి రాముఁడొ పోవున త్తఱిన్
పుర మది యెల్లమూర్ఛపడె మూర్ఛిలి సైన్యము మొద్దుబాఱె, నం
దఱు ప్రజ మూర్ఛవోయి యెఁదితా మొఁనరింపఁగ నొప్పునో యెఱుం,
గరలిగి యేన్గు లశ్వములు గందరగోళము చేసె నప్పురిన్. 1030

—: వనమునకుఁబోవు రామాదులఁజూచి ప్రజలేడ్చుట :—

బాలురు వృద్ధులున్ మొదలు పట్టన మంతయు గ్రీష్మవేళలన్
నీళుల కోస మట్టులు, పనిండబడి రాముని వెంటనే పడెన్
గోలున నేడ్చుచున్ రథము కూడను ప్రక్కల వెన్కలన్ బ్రజల్
వ్రాలుచుఁ గూలి వ్రేలఁబడి వస్త్రము లెత్తుచు నార్చి రశ్రులన్ 1031

వాజుల కళ్లెమున్ బిగియఁ బట్టుము సూతుఁడ! త్రోలు మెల్లగా
నీజన మేము రాము మొగ మిప్పుడె చూతుము, మేము జన్మలో
ఈజనుఁ గాంతుమో గనమొ; యామనరాముని తల్లి చిత్తమో
సైజముగా నయోమయ మనందగు. వ్రీలద యిట్టి యప్పుడున్. 1032

సీత ధన్యురాలుగనుక స్వీయపతిని
నీడ వోలె ననుసరించి కూడనేగు
పరమధర్మాత్మురాలు గనుక పతిని విడదు
భానుకాంతియొ మేరుపర్వతము నటు. 1033

ఓయి లక్ష్మణా! ధన్యుఁడ వోయి నీవు
ఎల్లపుడు ప్రియుంబును వచియించుచున్న
దేవునిం బోలు నన్నను నీవు కూడ
పోయి పరిచర్య చేయుచుఁ బొలుతు గాన. 1034

నీమ బుద్ధియొ ఘనమౌచు నెగడుచుండె
ఇట్టి యభ్యుదయము కూడ నెంతొ ఘనమె
ఇట్టి యన్నగారి ననుసరించుచుంటి
విదియె స్వర్గలోకమునకు పదవి సుమ్ము. 1035

ఇట్లనుచు రాముని ననుసరించి జనులు
అక్షుల నుబుకు కన్నీళ్లు లాపలేరు
దీనలౌ స్త్రీలు తను చుట్టట్టు దీనచిత్తు
డయి పతి, సుతుఁ జూతు ననుచు బయలు వెడలె. 1036

ముందుగాఁ బోవుచును పైకి నేడ్చుచున్న
స్త్రీల గొప్పనాదమ్ము నాలించె రాజు
బద్ధమై యున్న మత్తద్విపంబుఁ జూచి
యాడు నేన్గుల రోదనం బటుల నపుడు. 1037

తండ్రియగు దశరథుఁడు సంతప్తుఁడయ్యె
చదల గ్రహణవేళను పూర్ణచంద్రుఁ డటు
అపుడ చింత్యాత్ముఁడు దశరథాత్మజుండు
పల్కె సుతు; రథము త్రోలు త్వరగ ననుచు. 1038

త్రోలు రథం బని రాముఁడు
త్రోలకు మాపు మని జనము త్రోయుచు నుండన్
త్రోలుటకును మానుటకును
జాలక యట నూగులాడెఁ జని సూతుండున్. 1039

వనికై పట్టనమున్ త్యజియించియు మహాబాహుండు రాముడటన్
చనుచుండన్ జనతాశ్రుధారల నమస్తక్షోణి దుమ్మంతయున్
అణఁగన్, రోదననాదముల్ పెరుగ హాహాకారముల్ మీద చే
తనమేఁ బోవఁ బురంబె కాదుధరయున్ స్తంబించి పోయెన్గడున్ 1040

ఆయ్యాస సంభవాశ్రులు
నాయతలోచనల నుండి యతిగ స్రవించెన్
ఆయతమీనక్షోభిత
తోయజముల నుండి రాలు తోయంబటులన్. 1041

రామునితోడనేకమయిరాజిలు చిత్తము గల్గు నప్పురం
బాయెయి రాజుచూచి మొదలంటగఁ గొట్టిన చెట్టుపోలికన్
భూమిపయిం బడన్ గనుచు భూతలవాసులు నయ్యొయయ్యొహో
రాముఁడ! రామ మాత!యని, రంధలు చేసిరి రోదనంబులన్. 1042

వ్యథ పడి భ్రాంతులౌ పార్థివుఁ దల్లిని
పథియందు రాముఁడు మొదట చూచె
త్రాటఁ గట్టిన బిడ్డ తల్లినటు పిదప
ధర్మబద్ధుఁ డెవండు తల్లిఁగనఁడు
తడఁబడుచు నడచు తల్లిదండ్రుల గాంచ
లేక రథమును తోలించె వేగ
తల్లిదండ్రులు పడు దైన్యదృశ్యము గాంచి
అంకుశమున నేను గటుల గ్రుక్కె.

పరమ వాత్సల్యమున వత్స కొఱకు త్వరగ
ఇంటికై పుగఁ బరువెత్తి యింటిరాట
గట్టఁబడు వత్సకై పాఱు గంగిగోవు
వలెను పడి రామమాతయుఁ బరువులెత్తె. 1043

అటు గౌసల్యయు నేడ్చి పర్విడుచు రామా! సీత! ఓలక్ష్మణా!
ఇటు రామా! యని రామలక్ష్మణులకై యీ సీతకై యేడ్చుచున్
కట! యల్లాడుచు వేగ గంతులిడుచున్ గాశ్లీడ్వఁగా రాముఁ డం
తట వీక్షించును గండ్లుమూసికొను, నంతన్ జూచుఁ బల్మా రటుల్ 1044

ఆగు త్రోలకు అని రాజు అఱచుచుండె
నడుపు నడు పని రాముండొ నుడువుచుండె
వారి నుడులమధ్య సుమంత్రు స్వాంతమపుడు
నడుచు మును వెన్క చక్రాల నడుమఁ బడెను. 1045

'ఆప మంటిని నీవేల యాపనైతి'
వనుచు రాజౌకవేళ దూఱు నెడ నపుడు
నీవు "వినలే దనుచిర మీక్షింపలేను
వ్యథలు పాపిష్ఠ మనసు సైపదు గదోయి. 1046

ఇటు లనుచు ప్రజననుమతింపఁజేసి
రాముఁ డనినట్లు త్రోలఁ దలంచి యపుడు
హయము లల్లన నడచు చున్నప్పటికిని
అనుమంతుౄఁడు త్వరపెట్టి యపుడు తోలె. 1047

జనులు రాజుతోపాటుగ మనసునందె
క్షణములో రామునకు ( బ్రదక్షిణముచేసి
మనసుతో నశ్రువుల యాగమనముతోడ
మరలిరే గాని మేనితో మరలరైరి. 1048

ఎవఁడు తిరిగి రావలయు నిష్టపడుదు
మాతనిని దూరముగ సాగ నంపరాదు
అని దశరథమహారాజు కని యమాత్యు
లాతనిని తీసికొని పురి నాగినారు. 1049

అఖిలగుణ మగు తద్వాక్కు లాలకించి
యొడలఁ జెమటలు పోయగ సడలి వగచి
దీనుఁ డౌచు భార్యలతోడఁ దేఱితేఱి
తనయుఁ జూచుచు నిలిచిపోయెను విభుండు. 1050

ఆపురుషవరేణ్యుఁడు రాముఁడు ప్రాంజలి యయి
దండకారణ్యమునకు తరలిపోవ
అంతిపురమున నున్నట్టి యింతు లెల్ల
నార్తనాదము గావించి యార్చినారు. 1051

ఎవఁ డనాథుల, కార్తి నెనయుదీనులకును
నాథుఁడై గతిశరణంబ యగునో
ఎవఁడు దూఱినఁ గోపగింపక కోపప
డఁదగు కృద్ధుల నోర్చి సదయు డగునో
ఎవ్వండు తనతల్లి యెడలబోలెను మన
యందఱగూడ స్నేహమున గనునో
ఎవఁడు ధర్మాత్ముఁడై ధృతి సత్యనిష్ఠుఁడై
ప్రజకు బ్రియుం డయి రక్ష చేయు

అట్టి రాముఁడు—కైకేయి యధిపులెన్నొ
బాధలను పెట్ట— నిప్పు డేవనికిఁ జనునో
అనుచు సతులు వత్సలు లేని యావులట్లు
వ్యథలచే విలపించుచు బారు మనిరి. 1052

అగ్నిహోత్రముల హోమాదులు జరగవు
సూర్యు డావేళలో చూడఁబడడు
* ఏనుగుల్ కబళముల్ లో నిముడక గ్రక్కె
వత్సల కావులు పాల నిడవు.
అంగారక త్రిశంకు లాబృహస్పతి బుధు
లెల్ల గ్రహము లిందు నెనసి నిలిచె
నక్షత్రముల వెల్గణఁగె గ్రహాల ద్యుతు ల
డఁగె విశాఖలుగూడఁ బొగలఁ దనరె 1054

---

* శకుంతలకు కణ్వశిష్యులు పతియింటికిఁ దీసికొని
పోవునపుడు బెంగచే మృగములు కబళముల గ్రక్కె ననికాళిదాసు

వాయు వేగానఁ గొట్టఁగఁ బడినజలధి
సంబుదాళులు భరియించు నటుల నయ్యె
దండ కారణ్యమునకు రాముండు తరల
నగర మెల్లను క్షోభించి నటులయయ్యె. 1055

అంధకారాన బలె దిశలు వ్యాకులమయి
కడకు నక్షత్రములు గ్రహాల్ కానఁబడవు
అట హతాత్తుగ పురమె దైన్యంబు చెందె
ఇంక నాహారము విహార మెదకె రావు. 1056

వ్యథచే మాటికిమాటికినీ సతతమున్ బల్మారు నిట్టూర్చుచున్
వ్యథితాయోధ్య జనంబు లెల్ల పృథివీ పాలేంద్రు గోపింతు రా
పథిఁ నుం దొక్కఁడుగాని భాష్పములచే పర్యాకులాస్యుండునై
మథియింపంబడి గాడు హృష్టుడు వ్యథామగ్నాత్ము లై రెల్లరున్. 1057

## రాముని వనవాస ప్రయాణసమయమున సర్వప్రపంచము దుఃఖములో మునుగుట

చల్లఁగ గాలి వీచదు శశాంకుఁడు సౌమ్యముగాఁ గనంబడం
డెల్ల జగత్తునన్ రవి తపింపఁడు వ్యాకుల మయ్యె సర్వమున్
ఎల్లెడ రామునే తలఁచి యింతుల భర్తల నన్నదమ్ములన్
పిల్లలఁ జూడఁగోర రెవ్వరును, వీడిరి సర్వులు సర్వలోకమున్. 1058

రాము సఖాళి బెంగకొని వ్రాలియు మంచము పట్టి వీడఁ బో,
రీమహియున్ నగంబుల ధరించియు శోకహతాత్మ యౌచు నెం
తోమతి కంప మొందె, గజ యోధ తురంగ సమూహమున్ కడున్
వేమఱు ఘోషపెట్టెను భువిన్ దివి సర్వము బ్రిద్దలై చనన్ 1059

రాము రథంపుధూళి కనులంబడి కన్పడు సంతదాఁక న
ట్లే మొగ మెత్తి చూచు మరలింపఁడు కన్నుల ధార్మికున్ సుతున్
వేమఱు చూచునందనుక వేగమె వెంటనె మేను సాచు నెం
తో మెయి సాగిపోయె మది నుబ్బిన పుత్త్రుని జెంగతోడుతన్. 10 0

* అదిగో రాముర థంబు చక్రములవే యౌనాను జెండాయు న
ల్లదె యాపై పుగ నున్న ధూళి యదియే యాచెట్ల పై పే రథం
బదిగో పోవుచునుండె నాకస మదే యా వైపెయంచున్ గడున్
మది తృప్తింబడె రాజు నద్దియు గనన్ రామిన్ నిరాశన్ గనెన్ 1061

కనులకు రాము ధూళియును గాలియుఁ గన్పడ కాగినంత నా
జనపతి మేనుకూడను వెసన్నిలువంబడి యుండలేక నే
లను బడిపోయి కూలబడ రాజును దక్షిణబాహు వెత్తి చెం
తనె చనె రాముమాత; భరతాంబయె పోయెను వామపార్శ్వయై 1062

అట్టు లెడమప్రక్క నడచునట్టి కైకఁ
గని, వయమ్మున ధర్మమునను వివయమునను
ఇంద్రియము లెల్ల మిగుల తపించిపోయి
ఆదశరథమహారాజు వనియె నిట్లు. 1063

---

* ఈ గుర్తు గలవి అనువాదకుని భావములు.

—: కైకతో నినువిడచితినని దశరథుడనుట :—

నను గైకా! యిక నీవు నాదుతనువున్ స్పర్శింప,! కోదారుణా
నన! కండ్లంబడ కీవు, నేఁడు మొదలున్ నాభార్యవే కాద యిం
కను నాబాంధవురాలె కావు, మఱియింకన్ నిన్ను సేవించువా
రును నావారలె కారు,వీడితిని ధర్మున్ వీడు స్వార్థన్ నినున్. 1084

ఇదె నీపాణి గ్రహింపలే, దనలుచుట్టేఁ జుట్టనే లేదు ని
న్నిదె వర్జించితి నిందు నందు నను నాకేబంధమున్ లేద యి
య్యదె రాజ్యంబును పొంది యాభరతుఁ డేదైనన్ సమర్పించుచో
నది యాయుంజలి నాకు నివ్వనిదియే యౌగాక నన్నుట్టదున్ 1085

సంతసమె చావ చిక్కు కౌసల్య యపుడు
దుమ్ములోపడ్డ రాజును దులిపి పిదప
పైకి లేవగ నెత్తియు పట్టుకొనుచు
నింక ముందు కేగక మర్లె నింటిపైపు 1086

ఏదొ కోర్కె బ్రాహ్మణుని వధించి నటులు
చేతిలో నగ్ని హోత్రి స్పృశించినటులు
ధర్మపరుఁ డైన రాజు సంతాప మొందె
నార బట్టగట్టిన రాము నాత్మఁ దలఁచి 1087

మరలియున్ మరలియు రథమార్గములను
చూచి చూచియు దుఃఖించు చున్నరాజు
సరిగ గ్రిహమును పట్టిన చంద్రుఁ డట్లు
ఎంత మాత్రముగూడ శోభింపఁ డయ్యె. 1088

## —: దశరథుని విలాపము :—

పురసమీపము వచ్చిన ట్లెటిగి తన్ను
ప్రియసుతుఁ దలంచి కడు విలపించె రాజు
"ప్రియసుతుని దీసికొని వెళ్లు హయవరాల
యడుగులు కనంబడు, మహాత్ము డరయఁబడడు. 1069

ఎవఁడు హాయిగ గంధముల్ కవిసిపూయ
బోంట్లు విసర నున్దిండు పాన్పునఁ బరుండె
అతఁ డెటనో చెట్టుమూలము నాశ్రయించి
కట్టెనో ఱాతనొ దిండు గని పరుండు 1070

అతఁ డుర్వినుండి దుమ్మంట దైన్యమున ను
స్సని తటినుండి యే న్గటులలేచు
అతఁ డావనిని లేచి యరుగగ లోకనా
థు ననాథు నటు గాంత్రు వననివాసు
లాసీత సుఖమునకర్హురాలయ్యు
బహు కంటకాకీర్ణవనిని నడచు
ఆసీత యెఱుఁగని దతిభీరురాలును
హింస్ర జంతు నద మాలించి హడలు

ఓసి! కైకేయి నీకోర్కె యీసు తీరె
విధవరాలపై రాజ్యాన వెస వసింపు
ఆయనఘుఁడు లేక బ్రదుక "ననుచు పురము
నిటుమృతస్వాతుఁడు పురిటి ల్లటుల చొచ్చె" 1071

నలువీధుల్ నడివీధులున్ సభలు శూన్యం బయ్యె షాపుల్ బజా
రులు మూతల్‌పడి యెల్లచో నలసి పౌరుల్ రోజుచున్ క్రుక్కి దు
ర్భలులై పోయిరి రాజమార్గముల నెవ్వారంతగాఁ జూడఁ గ
న్నులకున్ గన్పడ రట్టి వీటిని విభుండున్ జొచ్చె శూన్యార్ముఁడై 1072

నృపవరేణ్యుడు కడు విలపించు చుండి,
సీతారామలక్ష్మణు లేగ స్వీయగృహము
అహుల గరుడి చంపఁగ నొప్పుహ్రదమునట్లు
సూర్యుఁడు పయోదమును బోలెఁ జొచ్చె నపుడు 1073

మంద మృదు దీన వాక్కుల మనుజ పతియు
గొంతు వణకఁ దడబడి గొణుగు చుండి
యేడ్చి వచియించెఁ "గౌసల్య యిల్లు నన్ను
చేర్పుఁ డింకొక చో శాంతి యోర్పు గనను." 1074

—: దశరథుడు కౌసల్యాయింటికిఁబోవుట :—

వ. అని పలుకుచున్న రాజును ద్వారపాలురు వినమ్రులైయున్న కౌసల్య గృహమునకు దీసికొని వెళ్లిరి. అపుడు రాజు కౌసల్య గృహమున పాన్పు నెక్కియు మనస్సున కంగారుపడుట మానలేఁ డయ్యెను. అపుడు ఇద్దరు కొడుకులు కోడలు లేని గృహము చంద్రుఁడులేని యాకాశమువలె నుండెను. 1075

అపు డాభూపతి చేయి యెత్తి యట "హాహారామ! న న్వీడితే
ఎపు డైతే నిను మర్లిరాఁగఁ గని యెంతేఁ గౌగిటం గుచ్చియే
నృపు వీక్షింతురొ వారె ధన్యులు సుఖుల్ వీక్షింపవే యంచుఁ దీ
వ్రపు నాదంబున గట్టిగాను విలపింపన్ సాగె శోకంబునన్ 1076

అంత కాళరాత్రివలె నున్నట్టి రాత్రి
ప్రమయు మర్ధరాత్రిమునఁ గౌసల్య కనియె
సరిగ నినుఁ గాంచఁ జాలఁ గౌసల్య! తాకు
రాము వెంటఁజనిన దృష్టి రాదు మరలి. 1077

అటుల రాముని జింతించు నట్టిరాజుఁ
బాన్పునం జూచి యప్పుడు పాన్పుదరిని
కూరుచుండియుఁ గౌసల్య కుములుచుండి
యెంతొ నిట్టూర్చి కడు విలపించె నపుడు. 1078

వ. అపుడు శోకముచే శయనమునఁబడి యున్నరాజును కౌసల్య చూచి పుత్త్రశోకముచే నార్తులయి రాజుతో నిట్లనెను.

రామునికి విషంబిడి కుటిలవర్తనము గలిగి
కైక కూసము విడుపాముకరణిఁ దిరుగు
రాము వనికంపి శుభగ సకామ యగుచు
నింట భయపెట్టు చెడుపాముపంటి దీఁకను 1079

రాముఁడో యిఁక ఈ నగరంబునందు
నింటనే యుండి బిచ్చంబు నెత్తికొనగ
భరతునికి బానిసగ సమర్పణము చేసి
పైచుటయు నిష్టపడి యుండు వరమె యిదియు 1080

స్వేచ్ఛగాను గైకేయి యీయింట నుండి
యెక్కడకొ మనరాము గెంటించి వైచి
పర్వమున నాహితాగ్ని దేవతల నోట
నిడు హవిసు రాక్షసులనోట నిడిన యట్లు. 1081

ఏన్నటు చను మహాబాహు వింటినుండి
ధనుసు గొని తమ్ము డింతి రా వనుల కేగె
కైకకై నీవు విడిచిన యాకుమారు
లట్లె సీత యెట్టి యదృష్టపాట్లు గాంతొ 1082

ఉత్తమ ద్రవ్యహీను లాయువకు లెట్లు
రాజభోగా లనుభవ కాలంబునందు
దీనులై పండ్లు వేళ్లను దినుచు నెటులు
అడవులకు పాలయిచరింతు రిడుమ లొంది. 1083

పడఁతితో భ్రాతతో రాముఁ డడవి నుండి
నావ్యధలు పోవ నిటు రాఁ గనంగగలనె
నిద్రనుండి లేచినయ్లటు భద్రముగను
ఎపుడు వీరు లయోధ్యకు నేగుదెంతొ 1084

ఎపు డరణ్యమునుండి యిటు రాగ పర్వాన
జలధియటు లయోధ్య యలరునొక్కొ
ఎపు డావు పెద్దటు లీసీత ముందుంచి
రథ మెక్కియు నయోధ్య రాముఁ డరయు
ఎపుడు రాజపథాల నీనాదు సుతులపై
జనులు పేలాల్ చల్లఁ గనుచుఁబొంతొ
ఎపుడెత్తి శస్త్రాలు ధృతి నద్రిశృంగంబు
లటు కుండలా లూని రాఁగఁ గాంతొ

ఎపుడు ద్విజులకు పండ్లు, పూలింతుల కిడి
లీలఁ బురివాళులు ప్రదక్షిణాలు చేతు
రెపుడు బుద్ధిచే వయసుచే నిపుడు పండి
వర్షమటు బుజ్జగించుచు వత్తు రొక్కొ 1085

సంశయము లేక మున్ను నీచాత్మ వగుచు
నేను శిశువులు పాల్ త్రావ నెంచునపుడు
మాతల స్తనంబులను శుష్కమైన యటులు
చేసి యుండి యుందు బహుశా క్షితితలేశ! 1086

బాల వత్స ధేనువు హరివలనఁబోలె
కట! వివత్సఁ జేయఁబడితిఁ గైకవలన
అఖిల శాస్త్రజ్ఞుఁడు గుణాఢ్యుఁడైన సుతుని
వీడి నేనేక సుతను జీవింపలేను. 1087

వివ: హరి=సింహము.

ప్రియుఁ డయిన రాము లక్ష్మణున్ విదితబలుని
గాంచకుండగ నేను జీవింపజాల
తనుజ శోకాగ్ని నన్నింక తగులఁబెట్టు
గ్రీష్మమున సూర్యు డంశులన్ క్షితిని బోలె. 1088

వ. అటు విలపించుచున్న కౌసల్యను జూచి ధర్మమందున్నదై సుమిత్ర ధర్మయుక్తమైన వాక్కు పలికెను. 1089

## —: కౌసల్యను సుమిత్ర ఓదార్చుట :—

అక్క! భపత్సుతుండు సుగుణాంచితుఁ డౌపురుషోత్తముండు నీ
విక్కడ దీన వౌచు విలపించెద వేల! మహాత్ముఁ డౌపితన్
లెక్కగ సత్యవాది నొనరింపఁగ రాజ్యమే వీడి, శిష్టు లిం
దెక్కరణిన్ జరింత్రురెటు చరించుసుధర్ముఁ డశోచ్యుఁ డన్నిటన్ 1090

ఈతనియందు లక్ష్మణుఁడు సెంతయొ యుత్తమవృత్తి నుండి తా
నేతఱి నెల్లప్రాణిఁ గరుణించు, మహాత్ముని కద్దె లాభమౌ
సీత సుఖార్హయై వనివసించుట కష్టమటంచుఁ దెల్సియున్
నీతనయున్ త్యజింపదు, వనిన్ బడి ధార్మికువెంట బోయెఁ గా 1091

ఏతనయుండు లోకముల నెంతయు కీర్తిపతాక నిల్పునో
యాతనయుండు సత్యపరుఁ డాత్మరతుం డిటఁ బొందఁడేమియిం
దాతని శోచమున్! కడుమహామహిమంబును నెంచి నిత్యమే
యాతపనుండు నంశువుల నార్తిని మేనికిఁ గూర్పఁ డింతయున్ 1092

వనముల నుండియున్ వెడలి వాయువు చల్లఁగ వెచ్చగాఁగ వీ
చును సుఖపెట్టికొల్పు: నిశ సోకుచు చంద్రుఁడు నిద్రచెందురా
మునిఁ గడు గౌఁగలించుకొని మోదముఁ గూర్చు: బ్రహ్మ యె
వ్వనికి సుబాహుఁ జంపఁగ శుభాస్త్రములిచ్చె నతండు మోదిలున్ 1093

రాముఁడు స్వీయ బాహుల బలంబున భీతిలేకయే
గీమునఁబోలె నుండి వనకేళులఁ దేలి సుఖించు నట్టి యా
రాముశరాల కుల్కి నిఖిలారులు నాశము గాంతు రిట్టి త
ద్రాముని శాసనంబులను దాలిచి యీధర నిల్చి యుండుఁగా 1094

వని కేగక పూర్వం బే
ధనము శుభము శక్తి శ్రీయు తగె రామునికిన్
ధనము శుభము శక్తియు శ్రీ
యును నవె వనినుండి వచ్చియును గను నతఁడే 1095

సూర్యునికిఁ గూడ రాముఁడె సూర్యుఁ డగును
వహ్నికిని వహ్ని ప్రభునకుఁ బ్రభువె యగును
శ్రీకి శ్రీయగు, కీర్తి వల్కీర్తుల కగు
క్షమకు క్షమయగు మన మెన్ని గతులఁ గనిన. 1096

ఆవిభుఁడు దైవతములకు దైవతంబు
భూతములకుఁ గూడ శ్రేష్ఠమౌ భూత మగును
రాష్ట్రమునఁ గాని దేవి! పురానఁ గాని
అతని కెవి యువగుణములు నరయ రావు. 1097

భరతోడ సీతతోడను
వరయగు శ్రీతోడ గూడ వరనరుఁ డతఁడే
మఱి యామువ్వురతోడ న
చిరముగ రాజ్యంబున నభిషేకింపఁబడున్ 1098

ఎవ్వండు వనమున కేగుచుండఁగ గాంచి
పురి యయోధ్యయె యశ్రువులను గురిసె
ఎవఁడు వల్కలముల్ ధరించి జై యని యేగ
సీత లక్ష్మియు వోలె చేరి యరిగె
ఎవనివెంట ధనుస్సు నెక్కిడి యస్త్రిలు
కొని ముందు స్వతహా లక్ష్మణుఁడె యరిగె
ఎవ్వండు తనతండ్రి భువి సత్యవంతుఁగా
పలుప రాజ్యమె వీడి చనియె వనికి.

అతని కెపుడైన దుర్లభం బవనిఁ గలదె
త్వరగ వనినుండి మరల నీ వరయుఁగలవు
విడుము శోకమున్ మోహమున్ విడుము దేవి!
సత్యమును జెప్పుచుంటిని సరిగ నమ్ము. 1099

శిరసున చరణాబ్జంబుల
కెఱఁగ నుదితశశి నటు సుతు నీక్షింతువుగా
మరలియు శ్రీ యభిషేకము
జరగగ నానందబాష్పసరు లిత్తువులే. 1100

కాననమందును శోకము
గానీ యశుభంబుగాని కష్టముకానీ
కానఁడు రాముఁ డిట్టుల్
కానఁగలవు రాముఁ బుత్త్రి లక్ష్మణుసీతన్. 1101

దేవీ! యశేష జనమును
నీవే యోదార్పవలయు: నీవే దుఃఖం
బీవిధి హృదిఁ గనుచుండఁగ
నేవా రోదార్పఁ గలర యిఁక నీజనమున్ 1102

శ్రీరాముఁ గన్న దానవు
వీర జనని విట్టి నీవు వెతఁ గనఁదగునే
ధీరుండు రాముకంటెను
వేరీ సత్పథిఁ జను ఘను లీలోకములో 1103

పర సుహృదులతో రాముం
డరుదెంచి నమస్కరింప నరయుచు నీవున్
మరి వర్షాకాలపు జల
ధరమాలవలె విడుతు ప్రిమదాశ్రు లసరముల్ 1104

వరదుం డగు నీపుత్త్రిడు
త్వరగ నయోధ్యకును వచ్చి వరమృదు వగునీ
చరణాబ్జంబుల వ్రాలియు
పుర వనితలు చూచుచుండ మ్రొక్కును జుమ్మీ 1105

వరసుహృదులతో రాముం
డరుదెంచి నమస్కరింప నరయుచు నీవున్
మరి పర్వతంబుపయి జల
ధరమాలవలె విడుతు ప్రమదాశ్రు జలంబుల్. 1106

వ. ఇట్లు ఉపచారవాక్యము లాడుటలో జాణయును అనవద్యయు నగు
సుమిత్ర వివిధ వాక్యములచే రాముతల్లి నోదార్చెను, 1107

విని లక్ష్మణుతల్లి వాక్కులు
జనపతి సతి యైన రాము జననికి త్వరగన్
తనువున శోకము తరిగెను
నను శరదభ్రమున సుంత నను జల మట్టుల్ 1108

## పౌరులు రాముని అనుసరించుట

సత్యబలుఁడు రామునియెడ
నిత్యం బనురక్తు లయిన నిజపుర జనముల్
అత్యంత మనుసరించిరి
స్తుత్యముగ వనము చేడు సుజను మహాత్మున్ 1109

ఎల్ల సుహృదులున్ విభుని బోధించి యపుడు
అతిగ బలిమిని మరలించి నప్పటికిని
రాము రథము ననుసరించుప్రజలు నెంత
మాత్రమును వెన్కకును తాము మరల రైరి. 1110

గుణసంపన్నుఁడు రాముఁడెల్లయపుడున్ గూడ న్నయోధ్యాజనం
బున కత్యంతము పూర్ణచంద్రుఁడటు సమ్మోదంబు చేకూర్చఁ, గా
వున ప్రార్థించుచు వారు కాళ్ళఁబడ రాముండో పితన్ సత్యవం
తుని జేయం దలపోసి కానన పథంబున్ బట్టె శీఘ్రంబుగన్ 1111

కనులన్ జనులను త్రిప్పుచు
చనువాఁడయి మైత్రిచేత సరిగన్ గనుచున్
జనులను తనపిల్లలవలెఁ
గనుచున్ స్నేహమునఁ బలికెఁ గడు రాముండున్. 1112

నాయం దయోధ్యజనులకు
ఏయనురాగము బహుమతి ప్రేమయుఁ గలవో
ఆయవి నాప్రియము కొఱకు
మీయందఱు నింకభరతుమీదను నిడుడీ 1113

ఆతండు శుభచరిత్రుం
డాతఁడు కైకేయి కెపుడు నానందకరుం
డాతండు మీకును హితమును
ప్రీతియు తగురీతి సలిపియిష్టుండెయగున్ 1114

ఆతండు జ్ఞానవృద్ధుఁడు
నాతండు వయస్సుచేతనా బాలుండున్
ఆతండు మృదువు వీరుఁడు
నాతం డనురూపవిభుఁడు నభయుఁడు మీకున్. 1115

ఆతండు రాజగుణయుతుం
డాతని యువరాజుఁగాఁగ నధిపుఁడె చేసెన్
ఈతని నియుక్తులై తిమి
ప్రీతిని రాజాజ్ఞ శిష్టు లేనును చేయున్ 1116

నేను వనంబున కేగన్
భూనాథుఁడు తాపమేమి పొందని యటులన్
ఈనా కోర్కె ప్రకారము
ఏనాఁడును మీరు చేయ నెంచగ వలయున్. 1117

ఎంతెంతగ ధర్మంబును
చింతించుచు రాముఁడెట్లు స్థిరపడి చెప్పెన్
అంతంత కెదిగి ప్రకృతులు
స్వాంతములో రాముఁ బతిగ నటు తలఁచిరిగా 1118

కనులం దశ్రులు నింపుచు
మనసున దీనాత్మ లగుచు మఱి సుగుణులనొ
జనులన్ రాముఁడు లక్ష్మణుఁ
డును నాకర్షించి నటులుగ నై రపుడున్. 1119

వయసుచేత జ్ఞానముచేత వర్చసునను
త్రివిధముగ వృద్ధు లైనట్టి ద్విజులు నపుడు
ముసలితనమునఁ గంపించు పోవు తలలు
గలిగి దూరమందుండియె పలికి రిట్లు 1120

"రాముని తీసికొని పఱచు
నోముఖ్యపు జాతి గలిగి యున్న హయంబుల్
మామాట విని ప్రభుహితము
నేమఱకయె చేయుకొఱకు నిటు మరలుండీ. 1121

భువిలో సాధారణముఁగ
చెవులుండును ప్రాణులకు, విశేషించియు మి
మ్ముమవంటిహయముల కగు, మా
సవినయ మగు ప్రార్థన విని చన కిటురండీ. 1122

ఆరాముఁడు శుద్ధాత్ముడు
వీరుఁడు శుభవ్రతంబె ప్రియమగువాఁడున్
మీరాజుపురిదరి నిలుఁడు
దూరవనికి పోవవలదు తురగములారా!" 1123

ఆని యార్తాలాపంబుల
వినిపించెడి వృద్ధులయిన ద్విజుల ను గనుచున్
వెనువెంటనె రాముండును
తన రథమున నుండి దిగెను దయగలవాఁడై 1124

తనతో సీతయులక్ష్మణుండు దిగి చెంతన్ రాఁగరాముండు మె
ల్లనఁ గాళ్లుంచుచుఁ గాన వైపునకె వెళ్లన్‌సాగెఁ గానీరథం
బున మాత్రంబు చనండు.కాల్నడకలన్ ముంగాళ్ల నీడ్పించుచున్
తనతోవచ్చు ద్విజాతులన్ విడడు స్వాంతంబందుఁబెన్ జాలితో. 1125

దిగియట్లాగకె పోవు రాముని సుబుద్ధిన్ జూచి సంతప్తులై
వగఁ గంగారుగ బ్రాహ్మణోత్తములు చెప్పన్ జొచ్చి రీ రీతిగన్
"తగు బ్రాహ్మణ్యమె యీయదెల్లనిను సబ్రాహ్మణ్యమేపొందె, తి
న్నగ మామూపుల నెక్కి యగ్నులివె చెంటాడి వచ్చుంజుమీ. 1126

శరదృతునందు మబ్బులటు చక్కఁగమాకును వాజపేయమం
దిరపగునట్టి ఛత్రములివే వెనువెన్కను వచ్చుచుండె నీ
వరయుము, ఛత్రమున్ గొనమి నా తపతాపము మెండునిన్ను ని
త్తఱి గొడుగుల్ ధరించి రవితాపము బాయగనిడ గూర్తుమే. 1127

అరయన్ వైదిక మంత్రరాశి కలవారే యైన మాబుద్ధి నీ
కొఱకై నేడు భవద్వనానుగతినే కోరున్ మనోవీథిలో
సరసంబై చరియించు వేదములె మాసర్వస్వమౌ నిండ్లలో
నిరతం బాత్మసతుల్ పతివ్రతలెయై నిద్రింతురే హాయిగా. 1128

వననివాస నిశ్చయ మొనర్పంగ వలదు
నీకొఱకు వనిన్ వసియింప నిల్చినాము
నీకిది యధర్మ మైనచో మాకు నిదియు
ధర్మ నిశ్చయ మగుఁ జుమ్ము ధర్మమిదియ 1129

పిట్టహంసలవలె తెల్లజుట్టు కలిగి
నేలపై బడు దుమ్మంటి నెఱసియున్న
తలలతో కూడ మిగుల ప్రార్థనలు చేతు
మింక వనమున కేగక యిటునె మరలు 1130

ఏ ద్విజులో యైతె నిచ్చట కేగుదెంత్రొ
వారు బహుయజ్ఞములఁ బూనినారుసుమ్ము
వాని కిప్పుడు ముగియింపు వచ్చియుండె
నీవు మరలినఁగాని యవేవి కావు. 1131

రామ! నీయందు భక్తియుఁ బ్రేమకలిగి
జంగమ స్థావరంబులు జగతి నిలచె
అవ్వి నిన్ను మరల్చుట కాశపడెను
వానియెడ భక్తి చూపి పోవకుము వనికి. 1132

ఇఁక మొదళ్లతో నిను సమీపింప లేక
వాయువేగాన తలలను బాదుకొనుచు
మిగుల నెత్తైన చెట్టులు వగలఁ జెంది
యార్చుచున్నవివలె నుండె నదిగో చూడు. 1133

చేష్ట లాహారము విహారచింత విడిచి
చెట్లపైనె యుండి యిటుల నట్లు చనక
అన్ని ప్రాణులపై దయ నలరు నీకు
వనికి చనవల దంచు ప్రార్థనలు చేయు. 1134

పురికి నీవిపు డైవను మరలు మనుచు
ఆద్విజు లదే పనిగ కోరి యార్చుచుండ
ఇంక నిటుపైకి మఱి వెళ్లకీ వటంచు
వాపినటు తమసానది యగపడియెను. 1135

తగ సుమంత్రుఁడు వేగ రథంబు నాపి
అలసి పోయిన గుఱ్ఱాల నటుల నిటుల
దొరలఁజేసి నీళ్లిడి యొంటి ధూళిఁ గడిగి
ఇంక తమసానది దరిఁ జరింపఁ జేసె. 1136

అంద మగుతమసాతీర మాశ్రయించి
జనకజను పైకిఁ జూచి లక్ష్మణుని కనియె
లక్ష్మణా! నీకు మేలౌ; నరణ్యమునకు
వెడలు మన కిది తొలిరాత్రి వెంగపడకు. 1137

మృగములును పక్షులును గూండ్లు నిండ్లు చేర
శూన్యమె యరణ్యము లేడ్చుచున్న యట్టు
లుండె, పితృరాజధాని యయోధ్య మిగుల
నిటకు వచ్చు మనల నెంచి యేడ్చు ధ్రువము. 1138

సకలార్చ్యన్ నృపు! నిన్ను, నన్ను భరతున్, శత్రుఘ్ను ప్రేమించుచున్
వికలాత్ముల్ జనులౌదు, రాజననిఁ దండ్రిన్ గూర్చి శోకించెదన్
ఇక నీపాటికి నంధులే యవుదురో యేమో కరం చేడ్చి వా;
లౌకధర్మాదికవాక్కు లాడి భరతుండోదార్చు మాతన్ బితన్ 1139

భరతుని కోమలం బయిన భావము మాటికి మాటి కెంచి య
త్త్రిఁ దలిదండ్రులన్ గుఱిచి తత్త్రమొందను, నీవు లక్ష్మణా
యురవడి వచ్చి నావెనుక నుత్తమ కృత్యము చేసియుంటచే
సరిపడ సీతకై యెవరి సాయము నక్కఱ లేక పోయెఁగా 1140

వ. ఓ లక్ష్మణా! రకరకములైన వన్యము లగుపండులున్నవి. కాని వీటి తోనే ఈ రాత్రి గడుపుదును అని పలికి పిదప సుమంత్రుతో గుఱ్ఱములను అప్రమత్తుడవై మేపి చూడు మని చెప్పెను. అంత సుమంత్రుడు సౌమిత్రితోఁ గూడ ఆశుభ మైన రాత్రిని తమసాతీరము చెట్ల ఆకులతో శయనమును ఏర్పఱి

చెను. అంత ఆ సీతారాములు ఆఆకుల ప్రక్కమీద శయనించిరి. వారట్లు శయ
నించుట చూచి లక్ష్మణుఁడు సూతునితో రాముని గుణములు చెప్పెను. ఆరా
త్రింతయు. లక్ష్మణుడు మేల్కొనియుండ సూర్యుడే యుదయించెను. మఱి
ఆరాత్రి గోకులముతో నిండి యున్న యాతమసా తీరమునకు దగ్గరగ రాము
డారాత్రి ప్రకృతులతోఁ గూడి యపుడు లేచి నిద్రించుచున్న వారిని చూచిపుణ్య
లక్షణములు గల లక్ష్మణునితో నిట్లనెను. 1141

—: రాముడు ప్రజలకు తెలియకుంగ వెడలిపోవుట :—

మనయం దెంతొ యపేక్షతోడ తమకొంపా గో డుపేక్షించి నే
లనె వృక్షాల మొదళ్లఁ బండుకొను పౌరవ్రాతముం జూడుమీ
మనలన్ మర్లఁగఁ జేయు నిశ్చయమునన్ బ్రాణాలు వర్జింపనై
నను వర్జింతురుగాని నిశ్చయమునింతన్గూడ వర్జింపరే 1142

ఎంతటిలోన నిట్లు నిదురించిన వీరలు లేవకుందురో
అంతటిలోనె యిట్టె మనమారథ మెక్కియు నిప్డె భీతి యా
వంతయు లేని మార్గమును నారసిపోవలె నింకవీరా రో
జంత శ్రమన్ బడలి యట్లె వరుండిరి నాదు ప్రేమచే. 1143

తమవల్ల జనము లింతయు
శ్రమపడనియటు నృపసుతులు సలుపగ వలయున్
తమదుఃఖంబులలో భా
గము ప్రజ పంచుకొననియటు గావింప వలెన్. 1144

అనఁగ సాక్షాత్తు ధర్మమో యనిన యట్టు
లలరు రామునితో లక్ష్మణుం డనియె "నీకు
నిష్ట మైనట్లె చేయుద మెక్కి రథము,
అనఁగ రథము తెమ్మని రాముఁ డనె సుమంత్రు. 145

అపుడు సూతుఁడు నటనుండి యరిగె త్వరగ
రథమునకు గుఱ్ఱములఁ గట్టి ప్రాంజలి యయి
యనె మహాబాహు! యిదె రథ మరుగుదెంచె
త్వరగ నీవెక్కు సీతతో తమ్ముతోడ. 146

అంత రాముఁడు చని కవచాదికముల
రథమునందుంచి యందు శీఘ్రముగ నెక్కి
దట్ట మగు సుళ్లతో పాఱు తమస దాటి
క్రూరమృగబాధ లేనట్టి దారిఁ బట్టె. 1147

తిరుగ పౌరులకు తెలియ నటుల
రాముఁడు సుమంత్రుతో బల్కె "రథమునెక్కి
సూత! ముందుత్తరము నీవు సుంత పోయి
పౌరులకు దారి తెలియని పగిది మరలు. 1148

అంత సూతు డట్టులే చేసి యవలఁ జెప్ప
లక్ష్మణుఁడు సీత రాముఁడు రథము నెక్కి
చన తపోవనమువయిపు సారథి చని
రథము శుభనిమిత్తమ యుత్తరముగ నుంచె. 1149

రాత్రి తెల్లవారఁగ లేచి రాముఁ డచట
కానిపింప కుండుటను శోకంబుచేత
చేష్ట లుడిగి పౌరులు తమచిత్త మెంతొ
యుత్తలపడ కూలంబడి యుండి రపుడు. 1150

కంట నీరూన నిటునటు కనుచు నెటను
రాముదథ మేని నెటనైన రాజు జాడ
కానిపింపకుండుట చేత కరుణతోడ
నెంతొ దీనులై వగచెంది యిటుల ననిరి. 1151

## —: పాడు నిద్రను ప్రజల నిందించి ఏడ్చుట

ఏమి యీపాడు నిద్ర ఛీ యెంత చేసె
ఇది మన మనస్సెటు లవహరించి పోయె
కానిపించఁడు వెధఱొమ్ము కలుగువాఁడు
విపుల భుజుఁ డైనరాముని నిపుడు కనము. 1152

ఈ యమోఘ పరాక్రమ మెసఁగురాముఁ
డిపుడు తనునమ్ము వారిఁ ద్యజించి పోయె
కన్న కొడుకులబలె మమ్ముఁ గాచు రాముఁ
డిపుడు తను నమ్ము మమ్ముఁ ద్యజించె నకట., 1153

చచ్చిపోవ నైనను నిటఁ జచ్చిపోద
మిందు వానిని జూడగ నింక నెచట
కైనరాకుండఁ బోదమా? యతఁడు లేని
జీవిత మిఁకేల బ్రతికి చచ్చియు నికేల. 1154

ఇచట నెండుకట్టెలు పెద్ద వెన్నొ కలవు
వాని చితిపేర్చి పడుదమె వహ్నియందు
రాముఁ డేడి యని యడుగ నేమియంద
మతఁడు గైకొని వెళ్లలే దనుట యెట్లు. 1155

అతఁడు లేకుండ వచ్చు మమ్మరసి పురము
జాలిగొనుచు నాబాలగోపాల మేడ్చు
వడి జితేంద్రియు వెనుకనే బయలుదేఱి
అతఁడు లేకుండ పురమెటు లరయఁ గలము. 1156

అనుచు బాహువు పైకెత్తి యార్చి యేడ్చి
వత్సలను బాయు గోవులవలెనె యఱచి
రవల రథమార్గమునుబట్టి యరిగి సుంత
మరల రథమార్గ మది లేమి మరలినారు. 1157

ఇంక మనమేమి చేయుద మిపుడు గాని
అకట! దైవోపహతులమై యయితి మనుచు
వచ్చినట్టి మార్గముఁబట్టి వారు వగచి
సుజనులు వ్యథపడు నయోధ్యఁ జొచ్చినారు. 1158

హ్రదములందుండి గరుడి సర్పమ్ము లెత్తు
కొని చనగ శూన్యమైనట్టి నదిని బోలె
రాముఁడే యుండని యయోధ్య యేమి గూడ
శోభ చెందక యెంతయు శూన్య మయ్యె. 1159

చందురుఁడు లేని వినువీధి చందమునను
జలములే లేక యుండిన సంద్రముటుల
అల్పమానందమును లేని యాయయోధ్య
చిత్తములె లేని జనముల్ని చేరి కనిరి. 1160

ధనములను నిండియున్న పత్తనము చూచి
పరమ దుఃఖాలచేఁ జంపఁ బడుచు వారు
దిక్కు లెఱుఁగక ముదమేగ దిగులు పడుచు
స్వజనమును గాని పరజనంబైనఁ గనరు. 1161

అతి దుఃఖంబున నశ్రుపాళిఁ గనులే యత్యంతమున్ వాచఁగన్
మృతి చెందం దలపోసి, యిట్లు వనిపై పే రాము వెన్నాడి యం
దతనిన్ గానక యింటిదారిఁ బడు పౌరాళుల్ మనస్సే చనన్
మతియే లేకయె యేడ్చి రింట సుతులన్ భార్యన్ నిరీక్షించుచున్ 1162

వణిజుల్ మోదము గాంచ, రంగడుల విప్పంబోవ రానష్టపో
యిన ద్రవ్యంబు లభించి మిక్కిలిగ లాభింపం బ్రహర్షింపరే;
మునిముందే తొలికాన్పు పుత్త్రుఁగని యామోదంబు బాలెంతలున్
గన, రింటింటను నేడ్చ్రి రాముఁ గనకుండన్ భర్త లేతేరగన్ 1163

అంకుశములచే మత్తగజాళిఁ బోలె
వాక్యములచేత భర్తల బాధ గూర్తు
రాముడే లేనపుడు వారి కేమిసుఖము
సతులచే నేమి ధనములవలన నేమి. 1164

సుతులచే నేమి మఱి యంకసతులనేమి
అన్యసుఖములచే నేమి యమరు నేమి
రాము సేవింప వనికేగు లక్ష్మణుండె
అవనిలో ధన్యుఁడు సుజనుం డగును గాదె. 1165

ఎచ్చోట రాముండె యిపుడు స్నానము లాడు
నాతమ్మి కొలఁకులె పూత మగును
ఎచ్చోట రాముఁడు స్వేచ్ఛగాఁ దిరుగు నా
నదు లద్రివనులె ధన్యంబు లగును
ఎచ్చోట రాముని నిష్టాతిథిగఁ గొల్చు
నాశైలవనులె పూజార్హ మగును.
ఎచ్చోటఁ దుమ్మెద లెగురు పూగుత్తులు
రాముఁ జూచు నవియె రమ్య మగును

కైకవల్ల సర్వము నష్టమై పోక మాన
దిది యనాయకమై దిక్కెయెనయ కుండు
అడవి రాముఁ డేగ దశరథుఁడును జావ
నింక నేడుపె గతి మన కెల్లరకును. 1168

విషము త్రాపుఁడు రాముని వెనుకఁ జనుఁడు
ఊరు పేరు లేకుండఁగ చేరు డెటకొ
చెడిపి సీత రాముఁడు లక్ష్మణుఁడును వనికి
పంపబడిరి, భరత యోధు పశుల మింక 1169

ఇఁకఁ జంద్రాస్యుఁడు గూఢజత్రుఁడు ప్రియంబే ముందు మాటాడు వా
డకలంకాత్ముఁడు శత్రు నాశనకరుం డాజానుబాహుండు ర
క్షకుఁ డెల్లప్పుడు చంద్రుఁ డట్లు ప్రియుఁడై కన్పించు నబ్జాక్షుఁడున్
సకలారాముఁడు సత్యవాది వనులున్ భాసిల్లఁ గ్రీడించుఁబో 1170

అని విలపించుచున్ ప్రమద లప్పురి మృత్యువు భీతిచే వ్యథన్
గనినటు దుఃఖ మొందుటను గాంచఁగ లేకనొ సూర్యుఁ డస్తమిం
చెను, నిశ యాక్రమించెను యజింపరు వ్రేల్వరు నిప్పెవేయగా
చనరు పఠింప, రంధతమసంబును పూసినటుల్పురం బగున్. 1070

మూసిరి యంగడుల్ ముదమెపోయె నయోధ్యయె దిక్కులేనిదై
యాసమయాన, తారకలు నందరుదేఱని యాకసం బటుల్
మూసియు యుండె,భర్తయె కుమారుఁడొ యప్పుడు ప్రవాస మేగి న
ట్లాసతు లేడ్చి రాసుతులఁ గంటెను రాముఁడెయయ్యె ప్రీతుఁడై 1172

నృత్తములు గానములు హర్షమేని లేక
ఏమి యుత్సవములు బజా ర్లె వియు లేక
జలములే లేక యుండిన జలధి వోలె
ఆయయోధ్య యుండెను మిగుల శూన్యంబ యగుచు 1173

రాము డేగువనా లకాలమునఁ బండు
వృక్షములో రాముఁ దలను నెక్కించుకొనును
రాముఁ డున్న కొండలు నిర్ఝరములఁ పు
రాముఁ గన- పోవు భీతి పరాభవములు. 1166

ప్రథిత బాహుబలుండు రాముండు దూరము
చనక యున్నంతలోఁ గనెద మతని
జనులకు గతి పరాయణ మైన రాముని
పదముల ఛాయపైఁ బడెద మిపుడె
ఏము జానకిని సేవింతు మిఁక మీరొ
రాముని సేవింప రండు వనికి
వని రాముఁడో మిమ్ము భద్రంబుగాఁ జూచు
సీత మాభద్ర మీక్షించు చుండు

నమ్మకములేక బెంగతో నలుగు చుండి
సుందరము కాక చిత్తమున్ గుందఁ జేయు
నీయయోధ్యతో నిక మనకేమి కార్య
మనుచుఁ బురకాంతలు పతుల కనిరి వగచి. 1167

కైక రాజ్యము చేయు కడుదిక్కు లేకుండ
ధనపుత్త్ర జీవముల్ గనెద మెటులు
ఐశ్వర్యమును గోరి యాపతిన్ సుతు గెంటు
కైక యెవ్వని గెంటకయె వసించు
కైక రాజ్యంబులో కడు బానిసల మౌచు
గతిలేక యుండము సుతులతోడ
సిగ్గును విడి, రాముఁ జెడ నాడు దుష్ట యు
ధర్మఁ గని కను భద్రంబు నెవఁడు.

పూరుషశ్రేష్ఠుఁ డైన రాముండు గూడ
తండ్రియాజ్ఞను మనసులోఁ దలచుకొనుచు
అంత మిగిలిన నిశసమయంబులోనె
వడి నయోధ్య దాటియుఁ జాల పథము గడచె. 1174

అటు చనుచుండ భద్ర నిశ యవ్వలికిం జనె, రాముఁడున్ హుటా
హుటి తొలిసంజ వార్చి వడి నుత్తరకోసల దాటి, సీమలన్
పటు వగు గ్రామముల్ గడచి బాగుగ విచ్చిన వల్వనంబు ల
చ్చటఁ గనుచున్ శరా లటు వెసన్ జను వాజులతోఁజనెన్ గడున్. 1175

గ్రామములందుఁ బల్లెలను గల్గు జనంబులు పల్విధంబులన్
రాముఁడు నాలకింపఁ గడు రామునివాసము గూర్చి యిట్టులన్
తాము వచించి "రాదశరథాధిపుఁ డెంతటి కాముకుండొ యీ
రాముని, గన్న పుత్త్రి వనులంబడి పోవఁగఁ బంపె నిర్దయున్. 1176

ఇంతటి ధర్మమూర్తిని జితేంద్రియుఁ బ్రాజ్ఞు దయార్ద్రచిత్తునిన్
సుంతయుఁ బ్రేమలేక దయఁజూడక కానకు గెంటు; కైకయో
యెంతటి క్రూరురాలు దయ యింతయు లేక యె పాపురాలె యై
యింతటి క్రూరకర్మలకు నిట్టులఁ బాల్పడి పోయె నక్కటా. 1177

అని జనము లాడుకొను వాక్కు లాలకించి
కోసలేశుఁడు కోసలన్ బాసి పావ
నాంబు లొప్పు వేదశ్రుతీ నదిని దాటి
ఆ యగస్త్యుఁ డున్న దిశకు నరిగె త్వరగ 1178

అపలఁ జాలసేపే పోయి యమలజలము
గల నదిని దాటి గోవులు గల బయళ్ల
దనరి సంద్రమువై పుగఁ జనుచునున్న
గోమతీనదిన్ దాటెను రాముఁ డపుడు. 1179

సత్వరంబుగఁ బోవు నశ్వములతోడ
తిరుగ గోమతీనదిని నతిక్రమించి
హంసల నెమిళ్ల కూఁతల నందమైన
స్యందికానదిన్ రాముఁడు సరిగ దాటె. 1180

మున్ను మనువిభు డిక్ష్వాకు భూపతికిని
ఇచ్చినదియు రాష్ట్రమున నావరించినదియు
ధాన్య ధనములచే సమృద్ధంబు నైన
క్షితిని నెల్ల రాముఁడు జానకికిని జూపె. 1181

వ. సూతా! అని పిలిచి హంస వంటి మదించిన స్వరముతో పురుషోత్త
ముఁడైన రాముఁ డిట్లనెను" 1182

తల్లిదండ్రుల్ మది సమ్మతించి నపుడత్యంతంబు పుష్టించి పు
వ్వులు పిల్వన్ సరయూవనాన నెపుడేఁ బోదున్ గదో వేటకై
విలుకాం డ్రెప్పుడు కోరు వేఁట నిఁక నీపృథ్వీతలంబందు లీ
లలకై రాజఋషుల్ పచించి, రిది కోరన్ జుమ్మి యత్యంతమున్ 1183

వ. అని సూతు డగు సుమంత్రునికి మధురవాక్కులతో జెప్పిరాముఁడు
ముందునకుఁ బోయెను. 1184

—: అయోధ్యను రాముఁడు వీడ్కొనుట :—

సువిశాలం బగురమ్యకోసలము లచ్చో దాటి రాముం డయో
ధ్య విలోకించి కరంబు లొగ్గి యునెఁ గకుత్స్థాన్వయా యయోధ్యాపురీ
యిదె జోహారులు పోయి వత్తు నెల విమ్మన్నెన్నొ దైవాల గ్రో
తువు వారుండిరి తండ్రి యాజ్ఞఁజని వత్తున్ జూతునిన్ గ్రమ్మఱన్. 1185

అవల సెత్తురువలె సెఱ్ఱనైన కనులు
వఱలు రాముఁడు కుడిచేయి పయికి నెత్తి
అశ్రుముఖమున దీనుఁడై యచట నున్న
జానపదులను గని పల్కె నవినయముగ, 1186

"నాయెడల మీరు దయ జాలి న్యాయరీతి
చూపితిరి చిరముగ వగచుటయు తగదు
మీదు మీదు కార్యంబులన్ మిగుల సరిగ
చేయఁ జని రండు మీ కార్యసిద్ధి యగుత 1187

అటు మహాత్ముఁడౌ రాముని కంజలించి
ఇక ప్రదక్షిణముల నాచరించి కూడ
జానపదులును విలపించి చాలసేపు
అచ్చ టచ్చట నిల్చిరి యరసి యటులె. 1188

అట్లు విలపించుచుండియు నట్లె యుండి
తృప్తి పొందక వారలు నేడ్చుచుండ
ఆ ప్రజలకు సాయంకాలమందు త్వరగ
భాను డట్లు రాముఁడు కనంబడక పోయె. 1189

వ. అంత
ధనధాన్యములతోడ వినుతమై స్ఫీతమై
దాన శీల ప్రజాతతుల నిండి
శుభములై యభయమై శోభితం బయి యొప్పు
చైత్యయూపములతోఁ జక్కఁదనరి
మహితోపవనులతో మావితోపులతోడ
రమ్యసరసుల హర్షంబు గూర్చి
తుష్టులై మిక్కిలి పుష్టులౌ జనముతో
గోకులాకులములై గొనబు చూపి

అవని పతులకు రక్షణీయంబు లగుచు
బ్రహ్మఘోషముతోఁ బ్రతిధ్వనులు చేయు
రాజభోగ్యకోసలములన్ రథముతోడ
తిన్నగా పురుషవరుఁ డతిక్రమించె. 1190

వ. ఇట్లు కోసలదేశములను దాటి పిదప

పావన జల మొప్పి పాచి నాచును లేక
పుణ్యమై ఋషులతో పొలుపు గూర్చి
సుశ్రీకమై దరి నాశ్రమంబుల మీఱి
యచ్చరల్ క్రీడించు హ్రదము లలరి
సుర దైత్య గంధర్వ వరకిన్నె రాఢ్యమై
నాగ గంధర్వ కాంతలను వఱలి
సుర గణాంచిత కేళిగిరిశతంబులతోడ
దేవతోద్యానాల రీవిఁ దనరి

దేవతల కోస మాకాశదేశ మెక్కి
దేవపద్మాలతోఁ గూడ దీప్తి చెంది
సకలలోక పావనియంచు జగతినెపుడు
ప్రగాలుత త్రిపథగ గంగను రాముఁడరసె. 1191

ఒకెడ నీళ్లుఁ గొట్టి వికటాట్టహాసంబు
వెడల నుర్వులతేట వెలిఁగి నవ్వ
ఒకెడ నీళ్లజడల నూరించి సుడి చూపి
స్తిమితగంభీరయై తేలియాడు
ఒకెడ వేగముతోడ వికటభీ నాదమై
దేవగణస్నాన దీప్తి వెలయు
ఇఁక నొక్కచోఁ గల్వ లిసుక తిన్నెలు మించ
మత్త పక్షులతోడ మసలు చుండు

ఒకెడ హంస సారస చక్ర యోగ్య రవము
ఒకెడ తటవృక్షముల మాల లొప్పుచూపు
ఒకెడ పద్మాలు మొగ్గలు నుండ వెలిగి
పువురజము పోవ ప్రమదయై పొలిచె గంగ. 1192

వరదల్ పోవగ ము త్తె మట్లు విమలంబౌ నీళ్ళతో వన్యమౌ
ద్విరదవ్రాతముతోడ దిక్కరులతో దేవద్విపశ్రేణితో
కర మాగాంగతటాంకకాననము నుగ్రంబై న నాదాలతో
నురువై సుందరమై భయంకరమునై యొప్పారియుండెన్ గడున్.
1193

వ. మఱియును ఈగంగ ఫలమూలముతోడను చివుళ్ళతోడను పొదల తోడను పక్షులతోడ నావరింపఁబడియుండి యుత్తమ భూషణములతో నలంకరింప బడిన ప్రమదవలె నందమై నీటిక్రోతులతోడను మొసళ్ళతోడను పాముల తోడ నిండి విష్ణుపాదములనుండి జాఱి దివ్యమై పాపములను నశింపఁజేయుచు భగీరథుండు హర జటాజూటమునుండి క్రింది దింపఁగా నొప్పి సముద్ర మహిషియై సారస క్రౌంచి పక్షుల నాదములతో మారుమ్రోగుచు శృంగిబేరముగా ప్రవహించు గంగను ఆ రాముఁడు సమీపించి కెరటంబులతో సుడులలో నలరారు గంగను చూచి రాముఁడు సుమంత్రునితో "ఈ రోజు ఇక్కడనే యుందము. ఇదిగో ఇక్కడనే దగ్గరగా ఇంగుదీ వృక్షము (=గారచెటు) గలదు ఓ సారథి ! ఈ దినము ఇక్కడనె వసింతము. దేవ దానవ గంధర్వ మృగ మానుష పక్షి సేవితమైన పవిత్రజలము గల గంగను చూతము. అని రాముడు అనగా "సరే" అని లక్ష్మణుఁడు సుమంత్రుఁడును ఆ యింగుదీ వృక్షము దగ్గరకు రథముతో వెళ్లిరి. అంత సీత రామలక్షణులు రథము దిగిరి. సుమంత్రుడును దిగి గుఱ్ఱములను విప్పి యా చెట్టు దగ్గరనున్న రాముని సమీపించెను.
1194

## —: రాముని దరికి గుహుడు వచ్చుట :—

అచట గుహుఁ డనునొక నిషాధాధిరాజు
వాస ముండె, నాతడు రాము ప్రాణ సఖుఁడు
అతఁడు రాముఁడు తనదేశ మరుగుదేఱ
విని యమాత్య వృద్ధాదుల గొనుచు వచ్చె. 1195

అపుడు తనసమీపమునకు నరుగుదెంచు
గుహు నిషాధాధిపతిని కన్గొనుచు రాముఁ
డింక సౌమిత్రితోఁ గూడ నెదురు పోయి
తనదు సఖుని గుహుని గల్సికొనియె ప్రీతి. 1196

ఇంక నపుడు రాముని గౌగిలించుకొనుచు
నా గుహుఁడు నార్తితోడుత ననియె నిటుల
ఎటుల నీ కయోధ్యయొ యట్లె యిదియు రామ !
ఇపుడు నీకేమి సేవ గావింతుఁ జెప్పు. 1197

## —: రామ గుహ సమాగమము :—

ఓ మహాబాహు ! యిటువంటి యిష్టుఁడైన
యతిథి యెవ్వనికి లభించు నయ్య చెప్పు
అని వచించుచు గుహుఁడు నన్నాదికముల
నర్ఘ్యమును దెచ్చి రాముని కనియె నిటుల. 1198

సఖ ! మహాబాహు ! నీకిదే స్వాగతంబు
నీదియే గాదె రామ ! యా నిఖిలపృథివి
ఏము భృత్యులము ప్రభుఁడ వీవు సుమ్ము
చక్కఁగా మమ్ము రాజ్యమున్ సతత మేలు. 1199

ఇదిగొ భక్ష్యము భోజ్యము నిదిగొ పేయ
మిదిగొ లేహ్యము సిద్ధమై యివిగొ వచ్చె
ఇవిగొ శయ్యలు వాజుల కిదిగొ తృణము
అని పలుకు గుహుతో రాము డనియె నిటుల. 1200

నడచి వచ్చి స్నేహముచూపినావు కనుక
ఎల్ల గతుల మమ్మీవు పూజించినట్లె
అనుచు బలిసిన బాహువు లపుడు గ్రుచ్చి
ప్రబలి కౌఁగిలించుకొనుచు రాముఁ డనియె. 1201

బాంధవులతోడి నారోగ్యవంతుఁడ వయి
సౌఖ్యముగ నున్న నిను సదృష్టమునఁ గంటి
కుశలమే గద రాష్ట్రము కూర్మిసఖులు
వసములునుగూడ నోగుహ ! భద్రమగునె. 1202

ఏదియైతె ప్రీతిని నీవు నర్పించినావొ
ఎల్ల యది సమ్మతింతు, గ్రహింపఁ జాల
వల్కలము లూని వేళ్ళును వండ్లు తినుచు
వనుల ధర్మానఁ దపసిగా నను నెఱుంగు. 1203

ఈ హయములకె యాహార మిమ్ము చాలు
ఇంక నేదియుఁ గోర, యాచింతు నింతె
ఇంత మాత్రము పూజ్యుండ యిచ్చు నెడల
నేను పూజింపఁబడి నట్లె యెంతుఁ జుమ్మి. 1304

ఇవియె తండ్రియౌ దశరథనృపతి కెపుడు
ప్రియములై యున్నయవి యని వినుము మిత్ర
వీనిc జక్కగc జూచెద వేని చాలు
నేను పూజింపబడి నట్లె యెంతుc జుమ్మి. 1205

నీవు వీని కాహార పానీయములనె
ఈయవలె నని యతcడు శాసించె మిత్ర!
అనుచు రాముండు చెప్పcగా విని గుహుండు
నట్ల యని భృత్యులకు నట్లె యాజ్ఞ చేసె. 1206

అవల రాముండు నుత్తరీయమ్ము దాల్చి
శ్రద్ధతోడ సాయంకాల సంధ్య వార్చి
స్వయముగా లక్ష్మణుండు భోజ్యముగ జలమె
తెచ్చి యీయcగ వానినె పుచ్చుకొనియె. 1207

ఊర్విపైని రాముండు పరుండియుండ
కాళ్లు ప్రక్షాళనమ్ము లక్ష్మణుcడు చేసి
భార్యతో నున్న యతని సేవలను చేసి
యింక నా వృక్షమును నాశ్రయించి యుండె. 1208

గుహుcడు కూడ సూతునితోడc గూడి యపుడు
లక్ష్మణునితో నపుడు మాటలాడుచుండి
రామునెడ నప్రమత్తుcడై యేమి గనక
ధనువు ధరియించి రాత్రి మేల్కొనియె యుండె. 1209

ఇదివఱకు దుఃఖ మన్నదె యెఱుcగకుండి
సౌఖ్య మొందcదగిన యాయుశస్వి బుధుcడు
నగు మహాత్ముcడు రాముcడు నట్లె నేలc
బండుకొనc జనెc జాలసేపటికి రాత్రి. 1210

గరువ మింతయు లేక లక్ష్మణుఁడు రాత్రి
అన్నకై మేలుకొని యుండ నరసి గుహుఁడు
మిగుల సంతాపమును పొంది వగచి యపుడు
రఘుకులుఁ డగు లక్ష్మణుని కీలాగు పలికె. 1211

ఇదిగొ నాయనా! సౌఖ్యము నీయందగిన
యాశయనము నీ కొఱకుఁ గల్పింపఁ బడియె
రాకుమార! మిక్కిలి నీవు శ్రమము పడకు
ఊరడిలి హాయిగా నిటఁ బరుండవయ్య. 1212

పాటు లివి యెల్ల మా కలవాటె సుమ్ము
ఈ వెపుడు కష్టపడుటన్న వెఱుఁగ వయ్య.
రాఘవుల రక్షకై మేము రాత్రి యెల్ల
మేలుకొనియె యుందు మయవలీల నిపుడు. 1213

ఇంక రాముని కంటె వేఱెవఁడు నాకు
నిష్టతముఁ డైన వాఁడు గన్పింప డెటను
ఇటు వినుము సత్యమేను వచించుచుంటి
ఇట్టు సత్యముతో నొట్టు పెట్టుకొందు. 1214

—: రాముఁడు నేలఁబరుండ లక్ష్మణుడు చింతించుట :—

ఇతని యనుగ్రహంబుననె యీజగమందును గొప్పకీర్తియున్
అతిగ ధనంబు ధర్మమును నర్థము పొందితి నెంతొ, కేవలం
బితనిని జానకిన్ ధనువు నేనును జ్ఞాతులు దాల్చి కాతు మీ
మతిగనినట్టి దీవనము మానక గెల్తుము సేన వచ్చినన్. 1215

వ. అంత నాగుహుని వాక్యములు విని లక్ష్మణుం డిట్లనెను. 1216

అనఘా ! ధర్మ మెఱుంగు నీవిటులు మమ్మత్యంతమున్ జాగ్రత్తన్
గని రక్షించుచు నుండ మాకెటుల నింకన్ భీతి వర్తిల్లునై
ననుగానీ రఘురాముం డుర్విం బడి యుండన్ నాకెటుల్ నిద్ర వ
చ్చును సౌఖ్యంబుగనెట్టులుందుం గనవచ్చున్ రాము డిట్లుండఁగన్. 1211

ఎవని సురాసురాదు లెదిరించి సహించుటకైనఁ జాలరో
ఎతడు శ్రమించి మంత్రముల నెంతొ జపించుటచే లభించెనో
ఎతఁడు నొకండె యాదశరథేశుని కెంతయు నిష్టుఁ డయ్యెనో
యతఁ డిటు సీతతోఁ దృణములందు సుఖంబపరుండెఁ జూడుమీ. 1218

ఇతఁడును గెంటివేయబడ నింక విభుం డిటు లెంతకాలమో
బ్రతుకఁడు ధాత్రియో విధవరా లయిపోవును సత్వరంబుగన్
అతిగను జేడ్చి యేడ్చి శ్రమ నంది యిఁకేడ్వఁగ లేక యింతయున్
క్షితిఁబడియుండ మేడలు నిశన్ బిడుగుల్ పడి మానినట్లుగన్. 1219

పతి, కౌసల్యయు, నాదుతల్లియును నావంతేని యీరాత్రి జీ
వితమున్ నిల్పెద రంచు నెంచ, నెటొ జీవింత్రేని నీరాత్రియే
సతి నాతల్లియొ కొంతకాలమటు నాశత్రుఘ్నునికై చూచుచున్
బ్రతుకన్ వచ్చును, రాముమాత యిఁక జీవంబున్ త్యజించున్ గదా. 1220

అనురక్తప్రజతో నిం
డినదై సౌఖ్యంబు కూర్చి నిఖిలమునకుఁ బ్రీ
తిని జరపి యయోధ్యయు నదె
జనపతి నశియింపఁ జూచి సరగ నశించున్. 1221

ఈమహాత్ముఁడౌ జ్యేష్ఠుని రాముఁ గనక
ఆమహాత్ముఁడౌపతి నిల్పుఁ బ్రాణ మెటుల
నృపతి నశియింపఁ గౌసల్య మృతినిగాంచు
పిదప నాతల్లియును మేను విడచివైచు. 1222

అవల నశియించె నశియించె ననుచు నపుడు
ఆత్మ కాంక్షిత మీడేర నందువల్ల
రాజ్యమున రాము నుంచక రాజుపోవు
ఇంక పితృకర్మచేసి సుఖింత్రు వారు. 1223

నడివీధుల్ రమణీయము మౌచు వెలయన్ నవ్వీధులన్ మేడలన్
కడు వేశ్యల్ చెలువొందగా రథ తురంగానేకప శ్రేణులున్
నడువన్ వాద్యములున్ ధ్వనింపఁ బజలున్ గళ్యాణముల్ దీర్ప సం
దడి ఘారల్ పిత రాజధాని నిఁక వానందింత్రు కాఁబోలునే. 1224

బ్రదుకునె తండ్రి మేము వనవాసము నుండి పురంబు క్రమ్మఱన్
ముదమునఁ జేర్చి ధార్మికుఁ గనుంగొనఁ జాలుదుమే, కృతప్రతి
జ్ఞు దరసి సౌఖ్య మొందుదుమె చొచ్చి యయోధ్య నటంచు లోఁబదే
పదె నిలుచుండె యేడ్చి వగవన్ గనలేకయె రాత్రియే చనెన్. 1225

అనుచుఁ బ్రజాహితుఁ డగు నృప
తనయుఁడు సత్యంబు పలుకు తఱి విని గుహుఁడున్
ఘన సౌహృదమున వగచుచు
కనులన్ నీరిడె జ్వరార్త గజమును బోలెన్. 1226

వ. రాత్రి తెల్లవాఱఁగా వృథులవక్షస్సు గలవాఁడును మహాయశస్కుఁడు నగు రాముఁడు శుభలక్ష్మణుఁ డగు లక్ష్మణునితో నిట్లు పలికెను. 1227

* ఉదయింపన్ రవి వచ్చు సౌమ్య! చన నెందో యానిశాదేవి యిం
దదిగో నల్లనిమేని కోయిలయుఁ గూయన్ జొచ్చె శ్రావ్యంబుగా
ఇదె యాకాన నెమిళ్ళ కేకలును విన్పించున్ చెవుల్ విందుగా
ఫదమా, దాటుద మబ్ధిపైపు చను భ్రూభంగాంగ గంగానదిన్ 1228

---

* చాతకము గూయుచున్నది బయలుదేఱుమని యక్షుడు చెప్పినటు కాళిదాసు మేఘసందేశములో వర్ణించెను.

## —: రామాదులు నావ యెక్కుట :—

ప్రియమిత్రున్ సుఖపెట్టు లక్ష్మణుఁడు సంప్రీతాత్ముఁడై రాము నా
ప్రియవాక్యంబుగ్రహియించి సూతుని గుహున్‌వీడ్కొల్పి యాఖ్యాత ది
క్కయి నిల్చెన్. గుహుఁడున్ స్వమంత్రులను వేగన్‌బిల్చి వారికుచ్చెమీ
రె యిఁకన్ జక్కనినావ నావికులతో నాతేవుకుం బంపుడీ. 1229

అపు డమాత్యులు నావను నచటఁ జేర్చి
"మంచినావ వచ్చె" నని వచించినారు
అంత గుహుఁడు మ్రొక్కి రాముని కనియె దేవ!
నావ వచ్చె నింకెది చేతు నీవు చెప్పు. 1230

"ఇంద్రసుతతుల్య! రాఘవ! ఇదిగొ నావ
వార్ధిఁ జేరు గంగను దాట వచ్చు నెక్కు"
మన మహాతేజుఁడౌ రాముఁ డనియె మిత్ర!
యేఁ గృతార్థుఁడ నైతి నెక్కింపు మనుచు. 1231

ఖడ్గమును నాయుధాదులు కవచములును
కట్టి సీతతో రామలక్ష్మణులు నావ
యున్నచోటికిఁ గరంబు లొగ్గి సూతుఁ
డప్పుడే నింక నెదిచేతు నని వచింప. 1232

అవల రాముఁడును సుమంత్రు నవయవముల
శ్రేష్ఠమై యున్న తన కుడిచేతఁ దట్టి
సఖ! సుమంత్ర! యరగి రమ్ము సత్వరముగ
అధిపు దరి నప్రమత్తుఁడ వగుచు నుండు. 1233

ఇంతవఱకును నాకుఁ గావించునదియు
చాలు మరలుము రథమును సరగ విడిచి
కాలినడకనె పోదుము కానలకును
అనుచు ప్రీతితోడుత రాముఁ డనఁగ నంత. 1234

—: నేనుగూడ మీతో వచ్చెదనని సుమంత్రుఁడనుట :—

అపుడు తన కనుజ్ఞ యిడినయటు తలఁచి
ఆర్తుఁ డయి సూతుఁడు సుమంత్రు డతనికనియె
"భ్రాతతో భార్యతో హీనువలెను వనిని
వాస ముండుట యిదెవరుఁ బాపలేరు. 1235

స్వయముగాఁ జేయు నీబ్రహ్మచర్య మైన
ఏమియు ఫలంబు లేదని యెదఁ దలంతు
మీదు మెత్తఁదనముచేత మీదుబుజుత
మీక యిట్టి కష్టమ్ము సంప్రాప్త మయ్యె. 1236

రామ! భ్రాతతో సతితో నరణ్యవసతిఁ
బరఁగి జితలోకుఁడ వయి సత్పదవిఁ గాంతు
వీవు విడిచిన యేము నశించిపోదు
మేగి పాప కైకవశమై యిటు పడుదుము. 1237

అని పలుకుచుఁ బ్రాణసముఁడై యగు సుమంత్రుఁ
డడవి కేగు రాముని గాంచి యడలె చిరము
ఇంక మోము గడిగి యాచమించు సూతుఁ
గని మధురముగ మఱిమఱి యనియె నతఁడు- 1238

—: తన తల్లిదండ్రులఁ జూడుమని రాముడు సూతునితో ననుట :—

సుఖుడ! యిక్ష్వాకులకును నీసాటి సుహృదు
నెచట నైనను నేను వీక్షింపలేదు
ఆ దశరథ మహారాజు నాదుతండ్రి
నన్ను గూరిచి శోకింప నట్లు చేయు. 1239

పతియొ వృద్ధుఁడు శోకాన మతియుఁ జెడియె
క్షితిపు వాంఛ తీరమి నిట్లు చెప్పుచుంటి
ఆమహాత్ముఁ డేది వచించు నద్ది యెల్ల
కైక ప్రియముకై చేయు శంకలను విడిచి; 1240

ఇందుకొఱకె రాజులు రాజ్య మేలుచుందురు
కార్యముల నెల్ల నెట నడ్డు గలుగరాదు
ప్రభున కెందైన నడ్డు లేర్పడని యట్లు
చింతఁ గుముల నట్లు సుమంత్ర! చేయుమయ్య! 1241

బాధ లెఱుఁగని రాజును వశిని వృద్ధు
నార్యుఁ గూర్చి మ్రొక్కి యిటు నాకయి వచింపు
ఇటు లయోధ్య వీడి వని వసింతు మనుచు
అనుకొనము నేను సీత లక్ష్మణుఁడుగాని. 1242

పదియు నాల్గేండ్లు గడవ త్వరగ పురికి
వచ్చు నన్ను లక్ష్మణు సీత స్వేచ్ఛఁ గనెద”
వని పితకుఁ తల్లికిని జెప్పి జనులకును
కైకకును మఱిమఱి చెప్పు క్షేమవార్త. 1243

సీత నేను లక్ష్మణుఁడు కూఁడ జెప్పినట్లు
చెప్పి మాకు మారుగ నీవు తప్పకుండ
తల్లిదండ్రులకుఁ గడుఁ బాదాభివంద
నమ్ము లాచరింపవలయుఁ జుమ్మి సూత"! 1244

త్వరగ భరతు రావింపుము వచ్చినంత
నృపు మతమున రాజ్యమున స్థాపింప దగును
ఇఁక భరతు మూర్ధ్నిని యభిషేకింపు మీవు
మావలనఁ గల్గు వ్యథ మాసి పోవు లెమ్ము. 1245

భరతునితో వచింపు మిటు "పార్థివు నందెటు లుందువో యటుల్
సరిగను మాతలంద ఱెడఁ జక్కగ నుండుము తల్లి గైక నె
ట్లరయుదువో సుమిత్ర నటు లారయు మింక విశేషరీతి, నిం
కరయుము దేవి నాజనని నాదర ముంచి విశేష మౌనటుల్. 1246

వ. అని చెప్పి మఱియు సుమంత్రునికి కిట్లనియె.

జనకు ప్రియముకై యభిషేక మనుమతించి
ఇహము పరము వర్ధిలఁ జేయ నెంచు మెపుడు
అనుచు రాముఁ డాడుచు సుమంత్రుని మరల్చ
విని సుమంత్రుడు స్నేహాన ననియె నిట్లు. 1247

— రామునిజూచి గుఱ్ఱములును వెనకకు నడవ పోవుట :—

ఏను మర్యాదకై చెప్పు టేమి కాదు
స్నేహమునఁ దొట్రుపడకయె చెప్పుచుంటి
నితఁడు నాయెడ భక్తి వచించె ననుచు
దాని నీవును క్షమియింప దగుదువయ్య. 1248

సుతుని యెడఁబాటు చేత వ్యాకులిత నట్లు
ఎట్లు నీవు లేక పురిని నేను చూతు
అపుడు నీతోడ వని కేగు నరదమరసి
నీవు లేని రథముగనన్ వ్రీలుఁ బురియె. 1249

రణమునన్ హతశేషబలంబు నట్లు
శూన్యరథమును గని పురి దైన్య మొందు
దూరమున నున్న నీ వెదన్ దోచ సెదుటఁ
గనిన యటు లెంచి తిండియే తినరు జనులు. 1250

రామ! చూచితివే గద ప్రజలు నెట్లు
ఈవు వనికేగు తఱి విలపించినారొ
ఇంక రథమున నిన్ను వీక్షింపకెట్లు
నూఱు రెట్లుగ ఈనను జూచి యేడ్త్రు. 1251

"మాత! నీదుపుత్త్రుని మేన మామ యింట
వదలి వచ్చితి తాపమున్ బడయు కమ్మ"
అని యసత్యము మఱి చెప్పెదున; యిఁకెటులు
అప్రియ మ్మగు సత్యము నాడఁగలను. 1252

నాదు నాజ్ఞకు లోఁబడి నీదు జనుల
దీసికొని పోవు గుఱ్ఱముల్ తిన్నగాను
నీవు లేనట్టి రథముఁ గన్పించి యెట్లు
వారితో నీదు వార్తలఁ బలుకఁ గలను? 1253

కనుక నీవు లేక యయోధ్య కేను బోవఁ
జాల ననఘ! వని కనుజ్ఞను మెసంగు
ఇట్లు యాచించు వను త్యజియింతువేని
వరయు మిదె నేను రథముతో వగ్నిఁబడెద. 1254

వనములో నీతపంబును బాడు చేయు
సత్త్వముల నెల్ల రథముతోఁ జంపివైతు
నిన్ను నభిషిక్తు రథముపై నిలుపు సుఖము
పొందనైతి పోని వనినేన్ గందు సుఖము. 1255

నీదరినె యుండ నన్ గరుణింపుమయ్య
ప్రీతి నీవును పురికేగఁ బ్రీతిఁ గాంతు
ఈహయములున్ నిన్ను సేవించి వనిని
పరమ సంతోషమును నింకఁ బడయు ననఘ. 1256

వనిని నుండుచు నెత్తిపై నిను ధరించి
కొలిచెద నయోధ్య స్వర్గమేన్ వలదు నాకు
నీవు లేక యయోధ్యకు నేగలేను
పాపి యింద్రపురంబును బడయునటులు. 1257

వన నివాసము ముగియఁగ పట్టనంబు
ఈ రథముతోఁ జనుట నా యభీష్ట మనఘ!
పదియు నాల్గేండ్లు నీతోడ వాసమున్న
నాకు నూఱేండ్లును గడుచున్ క్షణము లోనె. 1258

భృతవత్సల! ప్రభుపుత్త్రుఁ డేగుదారి
నడచు నను భక్తు సుస్థితున్ విడకుమయ్య
అని పలువిధాల దీనుఁడై యాచ్న చేయు
సూతుతో భృత్యవత్సలుఁ డాతఁ డనియె. 1259

ఎట్టి భక్తి నాయెడ నీకు నిటు లుండె
భర్తృవత్సల! యది నాకు బాగుగాను
తెలియు నిటనుండి నిన్నెందువలన పురికి
పంపుచుంటినో యదియు గ్రహింపు మీవు. 1260

నీవు పురి జేరఁ గని యింక నేను వనికి
పోతి నని కైక పినతల్లి పూర్తినమ్మి
నాదుపెతను ధార్మికు మృషావాది వనుచు
వనక భరతుఁ డేలెడి రాజ్య మందుఁ గాక 1261

ఇదియు నా ముఖ్య మగు పని యింక నీవు
నాకుఁ బితకుఁ బ్రియము చేయు న్యాయవిధిని
చనుము నేఁజెప్పు మాటలు వినుపు పితకు
అనుచు మఱిమఱి సూతు న్నోరార్చి యంత. 1262

—: రాముడు జడలు కట్టుకొనుట :—

గుహునితో రాముఁ డనియె నోగుహ సుమిత్ర!
జనము లున్న చోటనిక వాసంబు నాకు
తగదు తప్పక యాశ్రమ స్థానమందు
నుండవలె నిదియే నాకు నున్న వ్రతము 1263

కనుక తాపసులకును భూషణమె యైన
నియమ మూని తండ్రికిఁ దమ్మునికిని సతికి
హితముగా జడ లూని పోయెదను వనికి
మఱ్ఱిపాలను దెమ్మి యోమహిత! యనఁగ. 1264

గుహుఁడు మఱ్ఱిపా లప్పుడు కూర్చి తేఁగ
రాముఁ డంతటఁ దనకును లక్ష్మణునికి
జడలు కట్టెను పిదప నాజానుబాహు
మనర శ్రేష్ఠుఁడు జటియై యమరి పోయె. 1265

పిదప నారబట్టలు జడల్ వేగఁ దాల్చి
రామలక్ష్మణుల్ ఋషు లటుల్ వరగి రపుడు
అవల వైఖానసుల మార్గ మాశ్రయించి
కూడి లక్ష్మణు, వ్రత మూని గుహుని కనియె. 1266

"గుహ! బలంబున దుర్గానఁ గోశమందు
జనపదంబున జాగ్రత సరిగ నుండు
నీదు రాజ్యము కడు రక్షణీయ మనుచు
ప్రేమతోఁ జెప్పి గుహు నంత వీడుకొనియె. 1267

వ. అంత రాముఁడు సీతతో లక్ష్మణునితో నావదరికి పోయి లక్ష్మణునితో రాముం డనియె. లక్ష్మణా ఈ సిద్ధముగా నున్న నావ నెక్కి సీతను నెక్కింపు మనఁగా అతఁడు సీతను ముందెక్కించి పిదప తానెక్కెను. అంత రాముఁడును స్వయముగా నెక్కెను. అపుడు నిషాదరాజు గుహుఁడు నావికులతో నావను నడుపమని చెప్పెను. పిదప రాముఁడు నావపై నెక్కి బ్రహ్మ క్షత్రియ దేవతాకమైన మంత్రములను ఆత్మహితముగా జపించెను. యథావిధిగ సీతతోఁగూడ ప్రీతితో మోద మొంది గంగకు నమస్కరించెను. అవల లక్ష్మణుడు నమస్కరించెను. ఇట్లు రాముఁడు సుమంత్రుని పోవ ననుమతించి బలయుతుఁడైన గుహునికి సెల విచ్చి పంపి నావికులను నావ నడప మని చెప్పెను. అంత వారును చుక్కాని ధరించి తెడ్ల చే వేగముగా త్రోయ అది జలమధ్యకుఁ బోయెను. అంత అనఘురాలైన సీత ప్రాంజలి యయి గంగానదితో నిట్లు ప్రార్థనము చేసెను. 1268

## —: సీత గంగను ప్రార్థించుట :—

ఇదిగో నీతఁడు ప్రాజ్ఞుడౌ దశరథోర్వీశాగ్రపుత్త్రుండె యీ
యదవన్ తండ్రి యమోఘ శాసనము చేయన్ కానలన్ మాతరో!
పదునాల్గేండ్లు వసించి నీదు దయచే స్వభ్రాత సౌమిత్రితో
ఇదె నాతో పురిఁ జేరు నట్లు మము నీవే గావు ప్రార్థించెదన్ 1269

శుభగా ! గంగమతల్లి ! క్షేమమున నిచ్చోఁజేరి పూజించెదన్
శుభమౌ రీతి మమున్ గనుంగొనుమి యెన్నో కోరికల్ దీర్చు న
ట్టి భవద్గాత్రము బ్రహ్మలోకమును నిట్లే చూచు నోదేవి ! స
త్ప్రభువౌ వార్ధికి భార్యవౌ జగతిలో రాజిల్లు దోమాతరో. 1270

ఇదిగో నీకు నమస్కరింతు స్తుతులర్పింతున్ నరశ్రేష్ఠుఁ డా
పద లేకుండ శుభంబవచ్చి మరలన్ స్వారాజ్యమున్ బొంది స
త్పదవిన్ బొందిన యంత నీదగు ప్రసాదం బొంద నూర్వేలు ధే
నుధనాన్నాంచిత వస్త్రదాన మొనరింతున్ బ్రాహ్మణశ్రేణికిన్. 1271

తిరుగఁ బురిఁజేరి మాంసంబు సురయుఁ గలుగు
వేయి కడవల యన్నంబు పెట్టి నీకు
నర్చగావింతు నీతీరమందు నున్న
గుడులఁ దీర్థాల దేవులఁ గొల్తుతల్లి! 1272

వడి మహాబాహు నాతోడ భ్రాతతోడ
వనమునుండి యయోధ్యకు భద్రముగను
వచ్చు నటు లనుగ్రహింపంగఁ జేయు
తల్లి! యని సీత దక్షిణ తటము చేరె. 1273

పిదప రాముఁడు నావను వదలి పైచి
భ్రాతతో సీతతోడఁ దీరంబు చేరి
లక్ష్మణుని కనె ల్మక్షణా ః రక్షచేయ
విజన వని ముందు చను, సీత పిదప వచ్చు. 1274

నిన్ను సీతను గాంచుచున్ వెనుకవత్తు
మనము నొండొరుల్ రక్షించుకొనఁగ వలయు
సమయ మిది మించితే నేమి సలుపలేము
ఇపుడొ సీతకు వని దుఃఖ మేమొ తెలియు. 1275

ప్రజల జాడ, పొలా లుపవనులు లేక
హెచ్చు తగ్గయి గోతుల హెచ్చియుండు
వనము చొచ్చు, నన విని లక్ష్మణుఁడు ముందు
పోయె, సీత వెనుకను రాముఁడును చనియె. 1276

గంగ కవతలి యొడ్డు శీఘ్రముగ రాముఁ
డేగ నదియె పనిగ నిరీక్షించి సూతుఁ
డెంతొ దూరమౌట నిఁక నీక్షింపలేక
దృష్టి త్రిప్పి పాపము సూతుఁ డేడ్చె మిగుల. 1277

లోకపాలుర తోడఁ దుల్యుండె యైన
యామహాత్ముఁడు రాముఁడు నధిక మైన
పంటలను పండు శుభ సారవంత మైన
వత్స దేశంబులకు సమీపమున కరిగె. 1278

ముదము గలిగించు వారిలో ముఖ్య మైన
రాముఁ డప్పుడా వృక్షమూలంబు చేరి
శ్రద్ధతోడ సాయంకాల సంధ్యఁ గొల్చి
నిట్లు లక్ష్మణుతో వచియించె నపుడు 1279

* పెద్దపంది లేడిని దుప్పి పెద్దజింక
అను మృగములను నాల్గిటి నాకలికిని
చంపి మేధ్యము కొని వనస్పతి సమీప
మరిగి రట వాసమును జేయ త్వరితగతిని. 1280

జనపదమ్ముల వెలుపల మనము గడుపు
మొదటి రాత్రి యిది సుమంత్రుఁ డిదిగొ నిన్న
యుండి నేఁడతఁడును లేక యున్నరాత్రి
బెంగ పడకుండ గడుపుము వీర! నీవు. 1281

నేఁటి నుండి పొరపడక నిశలయందు
మనము మేల్కొని యుండియె కనఁగవలయు
ఇంక లక్ష్మణ! మనపైనె యెల్లయపుడు
కలవు సీత యోగక్షేమములునుగాదె. 1282

ఎటులో యీరాత్రి మాత్రము యాధరిత్రి
మీఁదనే పరుండి యిటు సౌమిత్రి! వినుము
మనము స్వయముగఁ దెచ్చుకొనిన దాని
తోనె గడుపు కొందమ యని తాను పలికె. 1283

కడు వెలగల సెజ్జకుఁ దగు ఘనుఁడె యయ్యు
నట్టి కటికనేలపై మేను వాల్చి యంత
లక్ష్మణునితోడ నిటు పల్గతుల కథలు
చెప్పఁ దొడఁగెను రాముఁడు శిష్టవరుఁడు. 1284

---

* భోగములకై మాంసమును చక్కగా వండించి తినుట వనిలో నిషిద్ధము
ఁదో ఆకలికై తినుట నిషిద్ధముగాదని వ్యాఖ్యాతలు.

ఇపుడు నృపతి కష్టమున నిద్రించు నిజము
దేవి కైకేయి తనకోర్కె దీరిన దయి
భరతుఁ డేగుదెంచినఁ జూచి పట్టు వట్టి
ప్రభుని యుసురు తీయదుగద రాజ్యమునకు. 1285

దిక్కయిన లేని యావృద్ధుఁ డింక నిపుడు
నా సహాయ మేమియును లేనటు చేయఁ
బడియు, కామాలఁ బడి కైకవశుఁడె యగుచ
ఇప్పుడో పాప మేమి గాపింపఁ గలఁడు 1286

వచ్చి నెత్తిపై బడు నిటువంటి బాధ
రాజునకు గల్గిన మతి భ్రమయ్యుఁ జూచి
అర్థమున కంటె ధర్మంబుకంటెఁ గూడ
కామమే గొప్ప దగు నని నామతంబు, 1287

ఎట్టి మూర్ఖుండ యైనను నింతికొఱకు
నన్ను బలె జెప్పినటు వినుచున్న సుతుని
ఇట్టి యేమియును మదిఁ జింతింప కుండ
నీవు పొమ్మని వని విసర్జించునొక్కొ. 1288

కైకకొడుకు భరతుఁడు స్వకాంతతోడ
సౌఖ్యమౌర యనుభవించఁగలండు
అత డొకండె రాజాధిరా జయ్యు సమృద్ధ
మగు సమస్తకోసల రాజ్య మనుభవించు. 1289

తండ్రియో వయసుచేత వృద్ధత్వ మొంద
నేనో కాననంబుల భ్రమియించు చుండ
ప్రథిత మైనట్టి సకల సామ్రాజ్యమునకు
ఇతఁ డొకఁడె యన్నిటికి ముఖం బగునుగాదె 1290

ఇటు లర్థధర్మములఁ ద్యజించివైచి
యెవ్వఁ డొకకామమె యనుసరించు, వాఁడు
ఈ దశరథమహారాజు లెట్టిగతిని
పొందిరో యట్టి దుర్గతిన్ బొందఁ గలఁడు. 1291

దశరథున కీవిధమున నంతంబు కొఱకు
భరతుఁడు సమస్తరాజ్యంబు పడయుకొఱకు
నేను కాననంబుల భ్రమియించు కొఱకు
వనిత కైకేయి సౌమ్య! సంప్రాప్త యయ్యె. 1292

ఎల్ల సౌభాగ్య మదము మోహింపఁ జేయు
నాదుమాతఁ గౌసల్యను నీదు మాతృ
దేవిని సుమిత్ర నీకైక యేవిధిగను
నన్ను బట్టి బాధింప కుండదు గదోయి. 1293

ఇపుడు దేవి సుమిత్ర నా హేతువునను
నెట్టి దుఃఖమున్ బొందక యెనఁగుఁ గాక
లక్ష్మణా! నీ వయోధ్య శీఘ్రముగనె
ఉదయమే యిటనుండి పోయెదవుగాక. 1294

నే నొకండనెదండక కానలకును
సీతతోఁ గూడ వెళ్ళెద శీఘ్రముగను
నీ వనాథురాలై విలపించునట్టి
యమ్మ కౌసల్యకును దిక్కై యవుదు గాని. 1295

ఏదొ జన్మలో నాతల్లి యెవరినైన
తనయుల్లను విడఁదీసి యుండును నిజంబు
లేనిచో నెటువచ్చు నీరీతి బాధ
అనుచు నేనను కొందు లక్ష్మణ! సువీర! 1296

చాల కాలము దాఁక పోషణము చేసి
బహుళ కష్టాలు పడరాని పాట్లు పొంది
నేను చేతి కందిన వాడనైన యపుడు
జనని వీడితి, నేనుండి- చచ్చి యేమి. 1297

లక్ష్మణ! నేను తల్లి కనంత మైన
కష్టమును తెచ్చి పెట్టితిఁ గడకు నిపుడు
ఇట్టి నావంటి కొడుకు నేజననియు
నుర్విఁ గనకున్న బాగుండి యుండుగాదె. 1298

కడు జనని శత్రుకాళ్లను కఱువు చిలుక!
అనుచు గోర్వంక చిలుకతో ననుచునుండ
వినఁబడుచునుండు నింట లక్ష్మణా! యదెంత
ప్రియజనని యందు నాకంటె ప్రీతి కలది. 1299

అట్లు దురదృష్టవంతురా లగుచు నేడ్చు
మాత కేమియు నుపకరింపకయె దూర
మందుఁ బడియుండి బ్రతికి యున్నట్టి వట్టి
యిట్టి ననుబోటి సుతువల్ల నేమి ఫలము. 1300

పీనె యుండిలే నటు జీవించు నాప్రి
యజననియొ యెంత నిర్భాగ్యురాలు చూడు
శోకజలధిలోఁ బడి లేవలేక కుమిలి
యెటులు దుఃఖించుచుండునో యిపుడు వీర! 1301

ఒక్కడనె నేవ యిప్పు డయోధ్యకాదు
ఈ సమస్త విశ్వంభరనేని నిట్టె
కోపగించి బాణములతోఁ గూర్చి వేయఁ
గలను కాని నావీర్య మకారణంబు. 1302

నే నధర్మానకు భయమున్ జెందుచుంటి
నల్ల పరలోకపు భయమ్ము వల్లఁ గూడ
నేను నన్ను నిపు డభిషేకించుకొనను
కనుమి యంతియే నాచేతఁ గాక కాదు. 1303

విజనమునఁ గన్నీరు వెడలుచుండ
నిటులు నింకను కడు విలపించి రాముఁ
డప్పు డా రాత్రివేళను నప్పగిదినె
ఊరకయె చెట్టుదరిఁ గూరుచుండి పోయె. 1304

అటు విలపించి యూరక యట్లె యున్న
యన్న రామునిఁ జల్లారు నగ్నిఁబోలె
అఖిల వేగము పోయిన యబ్ధిఁబోలెఁ
దలచి సౌమిత్రి మెల్ల నోదార్చె నిటులు. 1305

రామ! యాయుధ ధారులన్ ప్రభుఁడ వైన
నీవచట నుండి యిచ్చట కేగుదేర
శశియు గతియించిపోయిన నిశయు పోలె
అయయోధ్య నిష్ప్రభయగు ధ్రువంబు. 1306

ఇటు తపించుట నీకిది యేమి తగదు
నృవర! యిటు నను సీత నేడ్పింతు వేమి
జలము వెలికిఁ దీయఁబడు మత్స్యంబు లటులు
నిను విడి త్రుటి సీతయు నేను నిలువలేము. 1307

నీవు లేకుండ నేను తండ్రిని సుమిత్రఁ
దమ్ముఁ డైన శత్రుఘ్నుడు తరిగిపోవు బొండ
అనఁగ వారు దరిగ సీతఁ గనుచు ధర్మ
వత్సలు లయి నిద్రించిరి వటము క్రింద. 1308

అపుడు రాముఁడు లక్ష్మణు నాదృఢంపు
వాక్కు విని యాదరించి యావత్సరంబు
లన్ని తనతోడ నుండుట కనుమతించి
సుచిరమునకు రాముఁడు ధర్మసూక్ష్మ మెుందె. 1309

జన సంచారమె యుండని
వనమున బలులు రఘువంశ వర్ధను లవ్వా
రనయము భయసంభ్రమముల
నెనయరు, చటియలఁ జరించు మృగరాజు లటుల్. 1310

వా రపుడు నా మహావృక్ష పార్శ్వమందు
ఆశుభం బగునిశ యుండి యరుక్కుఁ డుదయ
మంద బైల్దేరి యాగొప్ప యడవి దాటి
కనిరి గంగతోడ యమున కలియుచోట 1311

అటు గంగా యమునా సమాగమము పూర్వాదృష్ట రమ్యస్థలులున్
వటముల్ లోనగు చాలచెట్లు గనుచున్ భద్రంబుగా నేగి రం
తట సౌమిత్రికి రాముఁ డిట్టు లనియెన్ "సౌమిత్రి! వీక్షింపు మి
చ్చొట నీ ముందు ప్రయాగచుట్టును పొగల్ చూపట్టె మధ్యాహ్నమున్ 1312

ఇటు సమీపముగ మునియుండుట ధ్రువంబు
కనుము గంగాయమునల సంగమము చేరు
కొంటి, మిది నీళ్లతో నీళ్ళు కొట్టు చప్పు
డలవనచరులును కొట్టు కట్టలును నివిగొ.

ఇదె భరద్వాజు నాశ్రమ మిచట వివిధ
తరువులు గల వంచును వారు తరణి వ్రాల
గంగ యమునలు కలియు సంగమము చేరి
యవల మౌని యాశ్రమమును నరసినారు. 1314

రాముఁ డాశ్రమమును జేరి యామృగములఁ
బక్షులను బెదరంగఁ గొట్టి క్షణము నడవ
నాభరద్వాజు నాశ్రమ మఱిగి మౌని
దర్శనేచ్ఛులై నిలచిరి దవ్వుగానె. 1315

వ్రతముల్ దాలిచి లబ్ధచక్షు వయి ఛాత్రశ్రేణితో నగ్ని నా
హుతు లర్పించుమహాత్ముఁ డైన ఋషిచే యోగ్యుం డనుజ్ఞాతుఁడై
వ్రతియౌ రాముఁడు సీతలక్ష్మణులతో వక్త్రానఁ గేల్మోడ్చి స
ద్గతి నమ్రుండయి శ్రేష్ఠమౌనికి నమస్కారంబు ఛేసెన్ వడిన్. 1316

వశి యగు రాముఁ డమ్మునికి వాకొనె నిట్టుల నోమహాత్మ ! యా
దశరథు కన్నపుత్త్రులము తమ్ముఁడు లక్ష్మణుఁ డేను రాముఁడన్
వెస సతి సీత నావెనుకనే చనుదెంచెను, తండ్రి కానకున్
పసచెడి నన్నుఁ బంప నిటు భ్రాతయు మానక నన్ను వెన్కొనెన్. 1317

ఓయి మహాత్మ! మాపితృ నియోగము చేతఁ దపోవనంబు మే
మేయిటు చొచ్చినార, మిఁక మేకొని ధర్మమునే చరించి మే
మో యిట పండ్లు వేళ్లు తినుచుండియు నిశ్చలవృత్తి నుందు మం
చాయనఘుండు పల్క ముని యర్ఘ్యము పాద్య మొసంగె ధేనువున్ 1318

వివిధమౌ నన్నపానీయ విధులు కూర్చి
పండ్లు వేళ్లిచ్చి వారికి వసతి చూపి
మృగ విహగములు ముఁను లావరింప మౌని
మెచ్చి యతిథికి స్వాగతం బిచ్చి కొల్చె. 1319

ఉచిత మర్యాద లంది గూర్చున్న రాముఁ
గని భరద్వాజుఁడనె ధర్మవినుత రీతి
నేటి కిటువచ్చిన నిను గాంచితిని రామ!
నీయుహేతు ప్రవాసము నేను వింటి. 1320

గంగయమునల గొప్ప సంగమమునందు
నిదిగో చాల నిశ్చలదేశ మెసఁగుఁ జూడు
ఇది పవిత్రము నందమైనదియుఁ గూడ
ఇచట హాయిగ నీవు వసింతుగాని, 1321

అని భరద్వాజుఁ డన రాముఁ డఖిల హితుఁడు
పల్కె! "భగవంత యిటు జానపదులు పౌరు
లతిదరిగ నుందుర్ మరియు నిట్లె యరయవచ్చు
నని తలుచు వత్తు రిట నుండ నభిలషింప. 1322

ఎపుడును కష్టమే ననుభవింపని జానకి యెందు హాయియై
ఎపుడు సుఖింపఁగాఁ గలదొ యిట్టి ప్రశాంతపు టాశ్రమ స్థలం
బిపుడు మహాత్మ! తెల్ప గదవే యన మౌనియు సప్రయోజనం
బిపు డుపయోగ దాయకము నెయ్యదొ యయ్యది చెప్పె నిట్టులన్. 1323

ఎది మహాఋషులు సేవింపఁ బావన మౌచు
కోర్కెఁతి కపు లెలుంగు గొడ్ల కిరవౌ
దేని శృంగములన్ దేటి చూడ మనస్సు
మంచె గాని చెడు గావించకుండు
ఎందు ఋషులు విహరించి నూరేండ్లును
తరియించి మేన సద్గతిని గాంత్రు
ఎందు వాసము శాంత మెంతో సుఖప్రద
మగుచు మనసునకు హాయి గూర్చు

ఇట్టి చిత్రకూటం బను నద్రి గలదు
అదియు గంధమాదన శైల మతిగఁ బోలు
ఆదియు నిటనుండి పదికోశులంతె దవ్వు
అచట హాయిగ నొంటిగ నలరఁగలరు. 1324

పోని యిటనైన వనవాసమును పొనర్చి
సుఖము పొందుము నాతోడఁ జూడు రామ
అని వచించి భరద్వాజు డాసుధర్ముఁ
డాప్రియాతిథులకుఁ గోర్కె లన్ని కూర్చె. 1925

వ. అటు భరద్వాజ మహర్షిని సేవించి అఖిల కథలు చెప్పుకొనుచుండ రామునికి ఆ రాత్రి గడచెను. ఆరాత్రి వారందఱును సుఖముగా భరద్వాజాశ్రమమునందె యుండిరి. అపుడు తెల్లవాఱఁగా లేచి రాముడు భరద్వాజఋషిని సమీపించి యిట్లనియె. ఓమహర్షీ! సత్యశీలా! ఈ రాత్రి సుఖముగామీయాశ్రమమున నుంటిమి. ఇక మాకు అనుమతీయుము" అనఁగ భరద్వాజుఁడనియె. "మంచిది తేనెలు వేళ్లు పండ్లు నిండుగాఁ గల యా చిత్రకూట పర్వతమునకె వెళి రండు అటనే మీకు సుఖమైన సకల వస్తువులుండు ననుకొందును. దానిని గజములు కిన్నరులు ఉరగులు సేవించుచుందురు. అక్కడ సకల మృగములు గజములు రథములు సంచరించుట నీవే చూడఁగలవు. 1926

సెలయేళుల్ ప్రవహించు సుందరదరుల్ చెల్వారు ప
క్షుల కూతల్ వినిపించుఁ గ్రోయిలగముల్ కూయున్ మృగం
బులు సంచారము చేయు నట్టి గిరిపై మోదంబునన్ సీతయున్
విలసిల్లన్ గని నీవు సంతసిలు దోర్వీరాగ్రగణ్యా! మదిన్. 1327

అనఁగ విని యందె నిశయుండి యరిదమనులు
ఋషికి మ్రొక్కి యాకొండ చేరనేగునపుడు
ఋషియు పుణ్యాహ మొనరించి నృపతిసుతులు
నాత్మజులఁ దండ్రివోలెను ననుసరించె. 1328

ఇఁక భరద్వాజుఁడు సుతేజుఁ డిటు లనియె
ప్రథిత సత్యవిక్రములైన రాట్సుతులకు
పురుష వరులార! గంగా యమునల సంధి
పొంది పడమర కేగు కాళిందిఁ గనుఁడు. 1329

పిదప వడిఁ బోవు కాళింది నదికిఁ బోయి
యచట నలిగిన జేవును నరసి మీరు
క్రమతఁ దెప్పచేసికొని యంశుమతినదిని
దాటుఁ డటఁ బచ్చయాకుల మట్టి తారసిల్లు 1330

అదియుఁ బలుచెట్లతో వృద్ధి నందె శ్యామ
మనఁగ, సిద్ధులు గొల్వ మహావటంబు:
దానికిని సీత మ్రొక్కి ప్రదక్షిణములఁ
జలిపి యట నుండవచ్చును చనఁగ వచ్చు. 1331

అంత రెండు క్రోసులు పోవ శ్యామల మగు
గొప్పవనము కన్పడు, మోదుగులును రేగి
చెట్లలర యమునానది గట్లఁబెరుగు
వెదురు పొదలతో నది కనువిందు లిచ్చు. 1332

అదియే చక్కని చిత్రకూటగిరి కొప్పైనట్టి మార్గంబు న
య్యది నున్నెత్తనిదై దవాగ్ని రహితంబై యుండు, వచ్చోటికిన్
మది సంతోషముతోడఁ బల్మరు ప్రయాణంబుల్ తగన్ జేసితిన్
పదుఁడీ మీరలు గూడ నంచు మునియున్ వాక్రుచ్చుచున్ వీడ్కొనెన్ 1333

సరె మౌనీశ్వర! పోయి వత్తుము నమస్కారంబులంచున్ ఋషిన్
మరలింపన్ ఋషియేగ, రాముఁడనియెన్ సౌమిత్రి వీక్షించితే
ధరలో నెంతటి పుణ్యవంతులమొ సత్కారుణ్యమున్ జూపుచున్
మరలెన్ మౌని యటంచుఁ జెప్పుకొనుచున్ వారేగి రాముండుకున్ 1334

వారు కాళిందినది యొడ్డు చేరి నదిని
తేలికగ దాటఁ గట్టల తెప్ప కట్టి
యెండు వెదురులు పట్టి వేళ్లేర్చి యచట
చక్కఁగా నేర్పఱచి రంత సత్వరముగ. 1335

చేరి ప్రబ్బలి నేరేడు చెట్లనుండి
శాఖలను కొట్టి సీత కాసనము గూర్చి
లక్ష్మణుఁడు తీర్చగ నచింత్యలక్ష్మి నట్లు
లజ్జపడు సీత నెక్కించె రాముఁడపుడు. 1336

ప్రక్కఁగా సీత వల్వలు పెక్కునగలు
గునపమును పాఱ బుట్టయు ధనుసు లాయు
ధములు కట్టకట్టి దశరథాత్మజులును
నెక్కి తెప్పను నడిపిరి యక్కజముగ. 1337

అవలఁ గాళింది మధ్యకు నరిగి సీత
నదికి మ్రొక్కి "దేవి నిన్ దాటుచుంటి
నాపతి నియతి దాటింపు నగరి చేరి
వేల గోవుల్ శతసురాఘటాలు నిడుదు. 1338

వ॥ అని సీత ప్రాంజలి యయి ప్రార్థించి దక్షిణ తీరమును చేరెను. పిదప వారు త్వరగాఁ బ్రవహించు నంశుమతిని యమునను దాటిరి. వారంతట తెప్ప విడిచి యమునా తీర వనము నుండి శ్యామ మనెడి మఱ్ఱి చెటునమీపించిరి అపుడా సీత యావటవృక్షమునకు నమస్కరించి యిట్లనెను. 1339

ఓ మహావృక్ష! నే మ్రొక్కుచుంటిఁ గనుము
నా పతి వ్రతంబు దాటగన్ దయను గనుము
అత్త కౌసల్యను సుమిత్ర నరయు మనుచు
తరుణి చేసెను శ్రద్ధ ప్రదక్షిణములు. 1340

అట ప్రార్థించి విధేయయై దయితురాలౌ సీత నీక్షించి యం
తట సౌమిత్రికి రాముఁడిట్లనియె సీతన్ మెల్లఁ గైకొంచు ముం
దట నీవేగుము సాయుధుండ వయి వెన్కన్ వత్తు నీ విప్పు డి
చ్చటఁ దెమ్మో భరతానుజా! వదెన కిష్టంబౌ పువ్వుల్ పండులున్ 1341

అని రాముండు వచింప జానకియు నత్యంతంబు తా నెప్డు చూ
డని యొక్కొక్క ద్రుమంబు, బుష్పముల నల్లాడు తీవెన్‌పొదల్
గనుచున్ రాముని నిద్ది యేమి యదిగో కన్పట్టునావృక్షంబు లే
మని ప్రశ్నించె మనోహరం బయిన యాయా దృశ్య దేశంబులన్ 1342

మొదటన్ లక్ష్మణుఁ డాతని
పిదపన్ జానకియు నామెవెనుకను రాముం
డద నెఱిగి చనఁగ జానకి
మదకరుల నడుమను కరిణి మాదిరిఁ దనరెన్. 1243

ఎది యెది సీత తెమ్మనుచు నెప్పుడు తొందఱఁబెట్టునప్పుడే
అదె అదె లక్ష్మణుం డరిగి యామెకు మానక తెచ్చి యిచ్చు నా
సుదతియు రంగురంగిసుక చొప్పడు తిన్నెలఁ జిల్కునీరముల్
మదయుతహంససారసకలన్ యమునానదిఁ గాంచి రంజిలెన్ 1344

మిగులన్ గ్రోశమె యేగి రాజతనయుల్ మేధ్యంబు_నట్టి పల్
మృగముల్ చంపి భుజించి, పోక తరులం దెన్నో నెమిళ్ళంతొ యిం
పుగఁ గూయన్ కపిమత్త నాగములతోఁ బొప్పారు కాళిందిని
మ్నగ తీరాన సమస్థలాన వసతిన్ గావించి రాధీరులున్ 1345

రేయి తెల్లవాఱఁగ నిదురించి యున్న
లక్ష్మణుని నా పిదప లేపి రాముఁడపుడు
ఓయి ల క్ష్మణ! విను చక్కఁగూయు వన్య
పక్షుల రుతాలు వినఁబడె బ నులుదేఱ. 1 46

తఱిఁ బదుండి రాముని చేతఁ దానులేపఁ
బడియు సౌమిత్రి నిద్రను విడిచి యంత
బద్ధకమును మార్గశ్రమ వదల, వారు
అంబులు స్పృశించి చిత్రకూటాద్రి చనిరి. 1345

వ. అటు సౌమిత్రితో బయలుదేఱి రాముఁడు సీతతో నిట్లనెను. 1348

ఇదె సీత! చూడు మీ యిట మోదుగులు చెట్లు
చలిపోవఁ బూల మాలలను గట్టె
ఇదె కోయు ప్రజ లేక యాజీడి మామిళ్ళ
పండ్ల వంగెను నింక బ్రతుకఁ గలము
ఇదె ద్రోణములఁ బోలె నీతేనె టీగలు
చెట్టు చెట్టునఁ దేనె పట్టు లుంచె
ఇదె వానకోయిల నీపూలతో నిండు
వనిఁ గూయ నెమిళులు బదులు కూయు

అవిగో నేన్గుల ఘీంకార మాలకించి
పక్షి గణములు కడు ప్రతిధ్వనులు చేయు
ఇదిగో చిత్రకూటము నొప్పె శృంగములను
ఇటు సమస్థలిఁ గని విహరింత మిపుడె. 1349

పిదప సీతతోఁ గాల్నడన్ వెడలి వారు
అంద మైనట్టి చిత్రకూటాద్రి గనిరి
అదియు వేళ్ళు పండ్లతో వలర రాముఁ
డనె "స్వయంపోషక మిది,యిం దన్ని కలవు. 1350

గొప్పమును లనఘులు చిత్రకూట గిరిని
దనరు చుంద్రు కావున సౌమ్య! మనము నిటనె
యుంద మిది రమ్యమైనది యుందె మనసు
నిష్ట పడ హాయిగా విహరింత మిందె. 1351

* అనఁగ రాముఁడు సీత లక్ష్మణుఁడు నంద
టాశ్రమము చేరి వాల్మీకి కపుడు మ్రొక్కి
రంతట మహర్షి ధర్మజ్ఞు డలరి కొల్చి
స్వాగతం బిడి కూర్చుండఁ బనిచె నంత. 1352

ఆ మహాబాహువౌ రాముఁ డఖిలవృత్త
మింక వాల్మీకికిని నివేదించి పిదప
లక్ష్మణునితోడ వచియించె లక్ష్మణుండ!
మంచి దారులు తెచ్చి నిర్మించు కుటిని. 1353

అనఁగ సౌమిత్రి దారుల నంత తెచ్చి
సరిగ గోడలఁ బర్ణశాలకట్టి
తలు పమర్చెను నట్టి సుందర కుటీర
మరసి, యట్లు సేవించు సోదరుని కనియె. 1354

వ. సౌమిత్రీ! నీవేగినల్ల లేడి మాంసమును తెమ్ము మన మీపర్ణశాలను యజింతము చిరజీవితము కోరువారు వాస్తు శాంతిని చేయవలెను. ఇదిధర్మము అని రాముఁడు చెప్పఁ దెలిసికొని యట్లె చేయఁగా రాముఁ డిట్లనెను. సౌమ్యా! ఈ నల్ల లేడి మాంసమును పక్వము చేయుము. సౌమ్యా! ఈ ముహూర్తము ధ్రువమైనది అనఁగా లక్ష్మణుఁ డామాంసము రక్తము పోవు నట్లు పక్వము చేసి మండుచున్న యగ్నిలో వ్రేల్చి రామునితో నిట్లనెను. ఇదిగో ఇది నల్ల లేడి పక్వ మైనది ఇదిగో సర్వము సంపూర్ణ మైనది దేవసంకాశా! ఇంక దేవతలను యజింపుము అనగా రాముఁడు స్నానము చేసి నియమము పూని అన్ని మంత్రములను సంగ్రహముగా జపించి సర్వదేవ గణములను యజించి

* రాముని వనవాసస మయమునఁ జిత్రకూటమునందును తరువాతఁ దమసాతీరమునను వాల్మీకి యున్నట్లు వ్యాఖ్యాతలు వ్రాసిరి.

శుచియైన పర్ణశాలలో నప్పుడు ప్రవేశించి మనస్సున నానందము పొంది వైశ్వ దేవబలిని రుద్రవిభుదేవతాకము లైన మంత్రములు జపించి వాస్తు పురుషుని శమింపఁజేయు మంగళము లాచరించెను. మఱియు నది యందు యథావిధిగ స్నాన మాచరించి పాపముల శమింపఁజేయు నుత్తమబలిని చేసెను. పిదప రాముఁడు వేదిస్థల విధానములను చైత్యములను గణపత్యాయ తనములను విష్ణుని యాతనములను ఆశ్రమమునకుఁ దగునట్లు చేసెను. అనంతరము వన ములో దొరకునట్టి మాల్యములు పండ్లు వేళ్ళు వండిన మాంసములు జలములు వేదోక్తములైన జపములు దర్భలు సమిధలు కూర్చి వానితో రామలక్ష్మణులు సీతతో పాటు భూతములకు తృప్తి గావించి శుభలక్షణులై యాపర్ణశాలను ప్రవేశించిరి. 1355

ఆకులు కప్పి గాలి చొరనట్టులు చక్కఁగ దీర్చినట్టిదా
నాకుటిలో సుధర్మసభ నా సురలట్టులు చొచ్చి పక్షి స
త్త్వాకుల చిత్రకూటమును పావన మాల్యవతీ నదీతటిన్
వేకని వారు హర్షిలిరి, వేగమె వీడి ప్రవాప దుఃఖమున్ 1356

వినుత రాముఁడు గంగ దక్షిణ తటంబు
చేరఁగని గుహుఁడు సుమంత్రుఁ జేరి యంత
చిరము దుఃఖాన నవి యువి చెన్పుకొనుచు
ఎట్టకేలకు తన గృహం బేగె నపుడు. 1357

* రాముఁడును భరద్వాజు నాశ్రమము చనుట
ఆ ప్రయాగను నుండుట యవలవారు
చిత్రకూటము వఱకును చేరుటయును
అచట నున్న వా రిది యెల్ల నరసినారు. 1358

---

* గంగను దాటిన పిదప చెట్టు మొదట మొదట, రెండవరాత్రి భరద్వాజుని యాశ్రమమున, మూడవ రాత్రి యమునా తీరమున నాల్గవ రాత్రి చిత్రకూట మున, అయిదవ రాత్రి అచటనే సంభాషణలతో గడచెను.

పిదప రాముని యనుమతిన్ వెడలి పోయి
యాసుమంతుృండు గుఱ్ఱంబు లరదమునకు
కట్టి యింకంజేయునది లేక బిట్టు వగచి
ఆయయోధ్యానగరి వైపె యరిగినాఁడు 1359

ఇంక సాయాహ్నపు వేళ మూడవదినంబే యా యయోధ్యాపురిన్
సకలానందము లంతరింప నెట నేశబ్దంబు లేకున్న యా
వికృతాకారపు శూన్య రాజపథమున్ వీక్షించి యాసూతుఁడున్
వికలాంతః కరణాలతో నిటుల భావించెన్ మనోవీధిలో 1360

—: రాముడులేని సుమంత్రుని గని ప్రజ వగుచుట :—

అగునే యాపుర మెల్ల రాముసెడఁ బాయన్ మండు దుఃఖాగ్నిచే
తగులం బెట్టఁగ బడ్డదై హయములున్ తత్పౌర సంఘంబు లే
నుఁగులున్ రాజును కాల, శూన్య మయి యిందున్, జావనే చావలే
దు గదా "యంచు విచార మగ్నత సుమంతుృం డేగె శూన్యాత్ముఁడై
1361

నగరద్వారము చేరి యందుఁ జొఱగన్ దైన్యంబుతో వచ్చు సూ
తుఁ గనుంగొంచు నూర్లు వేవురు జనుల్ తోడ్తోడఁ బర్వెత్తి చు
ట్టు గుముల్ గూడుచు రాముఁ డేడి యతఁ డెట్టుల్ పోయెచెప్పంచు పె.
క్కుగతుల్ ప్రశ్నలు వేసి చంప నిటు వాకృచ్చెన్ సుమంతుృం డాగన్
1362

"గంగానది యొడ్డున రా
ముం గడకును వీడుకొనుచుఁ బుణ్యాత్ము నను
జ్ఞం గని మరలితి, వారలా
గంగను దాటి" రని చెప్పఁ గళపళ పడుచున్. 1363

జనములు కనులన్ గన్నీ
రనయ మురల నయ్యో నిస్సి యని, యుస్సనుచున్
వసటన్ హా! హా! రామా!
యని గుంపులు గుంపు లగుచు నార్చిరి మిగులన్. 1643

వ. మఱియును.

ఎవఁడు వివాహాల నిష్టిదానంబుల
సభసమాజముల దర్శనము లిచ్చు
ఎవఁడు జనంబుల కిష్టుఁడై కష్టాలఁ
దపియించు వారి బాధలను బాపు
ఎవఁడు పట్టన మెల్ల నెపుడు తండ్రియె వోలె
స్వయముగఁ బరిపాలనంబు చేయు
ఎవఁడు దిక్కులె లేని హీన దీనులకును
దిక్కయి మోదాలఁ దేల్చుచుండు.

అట్టి రాముని జన్మలో నరయఁ గలమె
ఈ జనులఁ గావఁగ సమర్థుఁ డెవ్వఁ డింక
ఇంక ప్రియమేమి యింక సుఖం బేది మనకు
అయ్యో! దిక్కేది చచ్చితి మకట! రామ! 1365

అని బజారుల నడివీధులందు జనులు
ఇండ్ల కిటికీల యందును నెల్ల స్త్రీలు
వగల నేడ్వ సుమంత్రుఁడు మొగము కప్పి
కొనుచు రాజమార్గము మధ్య వినుచుఁ బోయె. 1366

అవల దశరథుఁ డున్న గృహంబు చేరి
రథము దిగి రాజగృహము శీఘ్రముగఁ జొచ్చి
గుంపులుగ గుంపులుగ ప్రజ గూడి యుండఁ
గని సుమంత్రుఁడు నేడు కక్ష్యలను దాటె. 1367

అటులన్ వచ్చిన యాసుమంత్రుఁ గని హాహా యంచు లోనుండె యు
త్కట హర్మ్యంబుల నుండి యభ్ర విలస ప్రాసాదమందుండి యు
త్కటః బాష్పంబులు కాఱు స్వచ్ఛమగు దీర్ఘంబైన నేత్రంబులున్
చటులాక్షుల్ కని రొండొరుల్ కడు నిరాశన్ రాము నీక్షింపమిన్ 1368

అపుడు ప్రాసాదముల నుండి యప్పుడపుడు
శోకములచేతఁ బొగులుచు గ్రుక్కుచుండు
స్త్రీల శోక దుఃఖిత విలాపాలు మెల్ల
నవి దశరథమహారాజు చెవులఁ బడియె. 1369

"రామునితో బయలుదేఱెను
రాముఁడు లేకుండ నిటకు రయమున వచ్చెన్
బాములఁబడు కౌసల్యకు
నేమని రాముని గుఱించి యితఁడు వచించున్. 1370

ఇటువంటి కష్టపు బ్రతుకు
నెటులన్ సుకర మ్మగు నని యెంతయు మదిలో
ఎటొ గెంటఁగ సుతుఁ డేగగ
నెటు లీకౌసల్య తాను నెక్కడ బ్రదుకున్. 3371

అని రాజసతులు సత్యము
వినిపింపఁగ దుఃఖ దగ్ధ వేశముఁ గనుచున్
చని, యష్టమ కక్ష్యకుఁ జని
కనెఁ బాండుర గృహమున సుతుకయి వగచు నృపున్. 1372

వ. అట్లు సుమంత్రుఁడు రాజును సమీపించి యభివాదనము చేసి రాముడు చెప్ప మనిన పలుకులు నివేదింపఁగ మనసు గ్రుదన తిరుగ రాజు

మూర్ఛిల్లి పడిపోయెను. పిదప నంతఃపుర మంతయు రాజు మూర్ఛపడుట జూచి దుఃఖార్తిష్టమైమై బాహువులు ఎత్తి యాక్రోశించెను. కౌసల్య మాత్రము సుమిత్రతో గూడి మూర్ఛిల్లి పడిపోయిన రాజును లేవఁదీసి యిట్లనెను. 1373

## —: దశరథునితో కౌసల్య పరుషము లాడుట :—

"ఘనమౌ కానల కేగి దుష్కరములన్ గావించు చున్నట్టి యా
తని యీదూత వనంబు నుండి యిట కింతన్రాఁగ మాటాడవే
లను, నన్యాయము చేసి సిగ్గుపడు దేలా ఓ మహాభాగ! నీ
కు నిఁకన్ బుణ్యమె యుండు లెమ్ము మఱి నీకున్ శోకమే సాయమౌ
1374

దేవా! యెవ్వతె భయమున
నీవిధి రాముని గ్రహించి యీవు సుమంత్రున్
వా విడి యడుగవొ యట్టి ప్ర
భావతి-కైక యిటు లేదు పలుకుము స్వేచ్ఛన్ 1375

అని మహారాజుతోఁ బల్కి యతిగ వెతల
నార్తురా లయి కౌసల్య యశ్రు లురల
మిగుల గద్గదకంఠియై పొగిలి పొగిలి
నేలపైని శీఘ్రంబుగఁ గూలఁ బడియె. 1376

అటుల భువిఁ బడ్డ కౌసల్య నాక్షితీశు
నరసి స్త్రీలు రాగా లిడ నంతిపురము
కవిఁసు రోదనములు చూచి యువలు వృద్ధు
లింతులు నరు లేడ్వఁగ దద్దరిల్లెఁ బురమె. 1377

అట మూర్ఛంబడి సుంత తేఱుకొనియే యారాము వృత్తం బెఱుం
గుటకై కానలనుండి వచ్చిన సుమంత్రున్ బిల్వ నాతండు మి
క్కుటమౌ నార్తిని రాము నెంచు నృపతిన్- కొంగ్రొత్తగాఁ బట్ట ను
త్కట రోగంబున స్రుక్కు నేన్గువలె- కుందన్ మ్రొక్కి నిల్చుండఁగన్. 1378

కడు దుమ్మంటుకొనంగఁ బాడుపడు నంగాలొప్ప మో మశ్రువుల్
తడుపన్, దీనతనున్న సూతుఁ గని యాధాత్రీశుఁ డీరీతిగా
నడిగెన్ సూతుఁడ ! చెట్లక్రిందఁబడి ధర్మాత్ముం డెటుల్ నిల్చె, ని
య్యెడ నత్యంతము హాయినుండు నత డట్లే మేమి తించుండెనో. 1379

శ్రమకుఁ దగ కెవండు, శయ్య కర్హుఁడౌ యాతఁ
డె యనాథుఁ డటు లెట నిలఁబరుండు
ఎవతేగఁ గాల్బంటు లేనుగుల్ రథములు
వెంటాడు నతఁడెటు విజని నుండు
ఎవరు మేడల సుఖియింత్రొ వారెటు సీత
తో నాగమృగముల కాననుంద్రు
ఎవరు రథములఁ జరింత్రొ వారెటు సుకు
మారిజానకితోడ మహిఁ జరింత్రు

అశ్వినులు మందర మటు వారడవిఁ జేర
నొగి ఖెనుచను నీవెంత ధన్యుండ వాక్కొ
రాముఁ డేమనె లక్ష్మణుం డేమిపలికె
మైథిలి వని నేమనెనొ సుమంత్ర ! చెప్పు ! 1380

ఎచ్చోటఁ గూరుచుండిరొ
ఎచ్చోటఁ బరుండినారొ యెటఁదినినారో
ఇచ్చట వినియేన్ బ్రదికెద
హెచ్చుగను యయాతి సాధుకృపచేఁ బోలెన్. 1381

వ. అని దశరథుఁడు ప్రేరేప బాష్ప గద్గద కంఠము గల వాక్కుతో నాపూతుఁ డిట్లనెను. 1382

రాముఁడో మహారాజ ! ధర్మమునె కావ
ప్రాంజలి యయి శిరసువంచి పలికె నిట్లు
"శిరసుచేఁ మ్రొక్కఁదగి యాత్మ నెఱుఁగు జనకు
మ్రొక్కఁదగు కాళ్లు నాకుఁగా మ్రొక్కు కరము. 1383

నాకుఁగా సూత ! ఎల్ల యంతఃపురంబు
మ్రొక్కి యారోగ్య మడుగుమి చక్క సరిగ
జనని కౌసల్యకును మ్రొక్కి సకల కుశల
మడిగి పొరపాటు విడి చెప్పు మామె కిట్లు. 1384

ఎపుడున్ ధర్మము నెంచి యగ్నిగృహ మర్చింపందగున్ వేళకున్
ఎపుడున్ దేవిరొ! దేవుపాదముల సేవింపన్ వలెన్ దేవు వ
ట్లెపుడున్ మానము స్వాభిమానమును లేకేచూడుమీ తల్లులన్
ఎపుడున్ రాజును బూజ్యుఁ గైక ననువర్తింపందగున్ న్నీవిఁకన్. 1385

భరతకుమారు నెప్పుడును పార్థివుఁ జూచిన యట్లు చూడు, భూ
వరులును నెప్పుడున్ ధనమువల్లనె శ్రేష్ఠులు, రాజధర్మ మీ
వరసి నయాన వర్తిలుమి యాభరతున్ గుశలంబడుగందగున్ మరిన్
మరియడుగ్గోయి నాకొరకు: మాతల యందరఁ జూడు చక్కగన్. 1386

అల యిక్ష్వాకుల వంశనందనుఁడయొ నాజానుబాహున్ నిరీక్షించి యి
ట్టుల వాక్రువ్వుము, యౌవరాజ్యమున నట్టుల్ నిల్చి రాజొ పితన్
లలిఁ బాలింపు, వయస్సు చెల్లు విభు నేలాగున్ విరోధింపఁబో,
కిలజీవించు, కుమార రాజుగఁ దదాజ్ఞే యింక వర్తించుటన్. 1387

అతఁడు మిగులఁ గన్నీళ్ళతో ననియె నింక
తనయు ప్రేమ గల మదంబ జనని నట్లు
అరయు మెపుడంచుఁ దా్రమాక్షుఁ డగు యశస్వి
వినుచునె రాజ ! కన్నీళ్ళు పెట్టుకొనియె. 1388

నిను సౌమిత్రియొ క్రుద్ధుఁడై కడువడిన్ నిట్టూర్చుచుం జల్కె, నే
మని యేనేరముచేతఁ గైకపలుకే యారాధ్యదై వాజ్ఞగా
మనుజాధీశుఁడు రాజపుత్రుని బురంబందుండి గెంటించె, ఈ
పని దుష్టంబొ యదుష్టమో యిటు మమున్ బాధించుచుండెంగదా. 1389

ఇది లోభంబునఁ గాని, కైకకు వరంబే యిచ్చుటంజేసి యి
య్యది యయ్యెన్ విభుఁ డేమి చేయు నను మిథ్యాహేతుఁచేగాని, యె
ట్లదియైతే మిటు రాము గెంటి కడు దుష్కృత్యంబు గావించె, ఇ
య్యది స్వేచ్ఛాగతిఁ జేసి దైవతముపై నారోపమున్ జేయునే. 1390

ఇది యిట్లింతియె కాని రాము వని గెంటింపందగున్ హేతు వె
య్యది వీక్షింపను, తెల్వితక్కువను చేయంబడ్డదై బుద్ధి గ
డ్డి తినన్ చాల విరుద్ధమై సుతుని గెంటింపించుటన్ వేదన
న్నొందవించున్, పతి తండ్రి కాఁడు పితబంధుల్ భ్రాత రా జీతఁడా. 1391

అందఱకున్ బ్రియుం డగుచు నందఱకున్ హితుఁడై చరించు వా
నిం దెగనాడు నీపనుల నెంచుచు నీ కనురక్తు లౌచు నె
ట్లుందఱు మర్త్యదు, సర్వజనులం దభిరాము ధార్మికున్ వనం
బందుఁ ద్యజించి సర్వనుతునందు పగన్ గొని రాజ వౌదెటుల్. 1392

కనులన్ దైన్యముతోప నుస్స్వరనుచున్ గన్నీళ్ళతో రాజ ! త
డ్సినదై దయ్యమె పట్టినట్లు జడురాలేయై తనున్ మర్చి యు
ట్లనె నిల్వంబడి మున్ను దుఃఖ మెఱుఁగన్ రానట్టి యాసీత యే
మిని మాటాడద, యేడ్చు, భర్తవదనంబే పైకి జాలిన్ గనున్. 1393

పురికిం బోయెడి నన్ను సీత కనుచున్ మోమెత్తి రోదించె న
త్తఱి సౌమిత్రి భుజాల నానుకొని హస్తాల్గొగ్గి మోమందు నీ
ళ్లురలన్ రాముఁడు నిల్చెఁ గన్నుగవ నీళ్ళుల్ నిండ పైదేహి యు
ట్లె రథంబున్ నను జూచుచున్ నిలచిపోయెన్ దీనమౌ మోముతో. 1394

వ. అని మంత్రిసత్తముఁడును సూతుఁడునగు నాసుమంత్రుడు చెప్పగా విని రాజు "మిగిలినది కూడ చెప్పు" మని అనఁగా రాజు మాటలాలకించి బాష్పములచే వ్యాకులమగు కళ్ళతో విస్తరమైన రాముని సంగతి నిటు చెప్ప సాగెను. 1395

జడలన్ దాలిచి నారవస్త్రములతో సద్గంగ గంగానదిన్
వడిగా దాటి ప్రయాగ పైపుగ నటుల్ వారేగి రాపైని త
మ్ముఁడు శ్రీరాముని యాజ్ఞ నగ్రమునసే పోయెన్ వయిన్ సీత, రా
ముఁడౌ యామీఁదట నేఁగ గన్గొని వశమ్మున్ లేకనే మర్లితిన్. 1396

వనికిన్ రాముఁడు పోవ వాజు లుడుకున్ గన్నీళ్ళులన్ గార్చుచున్
కని మర్లించినఁగాని దారిఁ బడకే నానావ్యథల్ పెట్టె, నే
నును వారిం గని మ్రొక్కి యెట్లొ రథమున్ గొంచున్ బయల్దేఱి,ర
మ్మనునో రాముఁడటంచునాశ గుహుతో నందుంటి గొన్నాళ్ళుగన్ 1397

ప్రభు నీ దేశమునందు రాముని యెడంబాటొందు వృక్షాల స్వ
ప్రభ పోవన్ చివురుల్ పువుల్మొకుళముల్ మానంబు లయ్యెన్ పురా
విభవం బేది కడున్ పురోపవను లెండెన్ మోదుగుల్ మోడులౌ
శుభనీరాలు నదుల్ సరస్సు, లెటువుల్ శుష్కాక్షమై పోయెఁ జూ 1398

తిరగవు వనమున సత్త్వము
లురగంబులు పాక పూరకుండెను పక్షుల్
సరసిజదళము లణంగెను
సరస్సులు బురదయ్యె రాము సంతాపముచే 1399

కొలకులఁ దమ్ములు వాడెను
జలజంబులు మత్స్యములును జలముల వడఁగెన్
ఫలముల సుగంధ మడఁగెను
పొలుపారక శూన్యము లగు, బూవుందోటల్ 1400

ఆరామము లభిరామము
లై రాజిల్లవ యయోధ్య యందును రాజా!
అ రాముడు లేని రథము
నారసి నిట్టూర్చినా రలధిపా! జనముల్ 1402

అటులన్ వచ్చిన నన్నుఁ గన్గొనుచు హాహా యంచు లోనుండి యు
త్కట హర్మ్యంబుల నుండి యభ్రవిలస త్ప్రాసాదమందుండి యు
క్కట! బాష్పంబులు కాఱు-స్వచ్ఛమగు-దీర్ఘంబైన నేత్రాలతో
చటులాక్షుల్ కని రొండురుల్ కడు నిరాశన్ రాము వీక్షింపమిన్ 1402

ఇందును నెందు నమిత్రుల
యందును మఱి మిత్రులందు నామధ్యస్థ జనం
బందును భేదము గనుగొన
నిం దతిగను నేను దుఃఖ మెనయుట చేతన్. 1403

మన రాముండు ప్రవాస మేగిన తఱిం భావంబునన్ మోదమే
చన నార్తింబడి వాడి పోయి వడి న్నిశ్వాసాల నుస్సంచు నెం
తొ నిరానందమయి యౌచు నొక్క తనయుండున్ లేని కౌసల్య లా
గున నార్తధ్వనిచే నయోధ్య జడమై కొంచెమ్ము శోభింపదున్. 1404

వ. అని యిటు సూతుండు చెప్పగా నాలించి పరమదీనంబుగా బాష్పం
బులచే నడ్డగింపఁబడిన వాక్కుతో రాజు సూతుని కిట్లనెను. 1405

కులమున్ భావము చెడ్డదౌ కయిక నాకున్ దా నియోగింప వ్యా
కులతన్ బెద్దల సంప్రదింప సఖులన్గూడ విచారింప మం
త్రులనే వర్తకులన్ సహాయ మడుగన్ తోడ్తోడ మోహానని
ట్టుల స్త్రీవల్ల నొనర్తుఁగా దగు నొ యిట్టుల్ దైవమే చేసెనో. 1406

అనుకోకుండసె యిట్లు వచ్చి వడె వంశాంతంబుకై యెప్పుడై
నను నేదైనను సుంత పుణ్యము సుమంత్రా ! చేసియుంటేని రా
ముని బొందించు, మదాజ్ఞ చెల్లునెడ రామున్ నీవు మర్లింపు, రా
ముని వీక్షింపం మూర్తమేని బ్రదుకన్బోన్ ప్రాణముల్ వే చెడున్. 1407

ఒకవేళన్ మృధుబాహువే గనుక నెంతో దవ్వుపోడేని, వ
న్నికక, నెక్కించి రథంబు, శీఘ్రముగఁ జూపింపందగున్ రామునిన్
రకమౌ గుండ్రని పండ్లు గల్గి పెనువిల్కాఁడైన యా రాముఁడే
డి? కగనుగొందును సీతతో సరిగ నేఁడే నేను జీవించుచో. 1408

ఎఱుపౌ కన్నులనాని దీర్ఘభుజు గెంపింపౌరు మేల్కుండలాల్
మురువుం జూపెడి రాముఁ గన్గొననిచోఁ బోదున్ యముం జేరఁగన్
మఱి నాకింతకు మించి యేది వ్యధలన్ గల్గించు, నిక్ష్వాకు సు
దరు రామున్ గనకుంటి నిట్టి దురవస్థన్ బొందియున్ నేనహో. 1409

అయ్యో ! రామ ! రామానుజ ! యయ్యో సీత !
దిక్కు లేని నన్ చనిపోవు దీనుఁ గనుఁడు"
అనుచు కష్టవశమ్మైన మనసు కలిగి
అసె నపారదుఃఖాబ్ధిలో మునిగి పోయి. 1410

బహురామ శోకమన్ వైశాల్యమున నొప్పి
ఘనసీత యెడఁబాటు గట్టుపొంది
నిట్టూర్పుఁ గెరటాలు నిడుద సుడులుమీరి
బాష్పాల నురుగుల వారిఁ గలఁగి

చేతు లాడించుటల్ చేపల గుంపుగా
ఘోరరోదనముల ఘోష గలిగి
చెల్లచెదరు జుట్టు చిఱునాచు గాఁదోవ
కైకేయి బడబాగ్ని కాక లొప్పి

గూనిదాని నుడులె మొసళ్లై నటింప
క్రూర కైకేయి వరములతీర మొప్పి
రాము విరహదైర్ఘ్యము మదస్త్రముల వడియు
తనరు దుఃఖ సముద్రాన మునిఁగి తకట ! 1411

అనుచు విలపించి విలపించి యాయశస్వి
పాన్పుపైఁబడి మూర్ఛిల్లె బార్థివుండు
రాముకొఱ కతిదీనుఁడై ప్రబలి చాల
సెట్టు లటులేడ్వఁ కౌసల్య బిట్టు హడలె. 1412

పిదప దయ్యము పట్టిన ట్టిదియ వోలె
మాటిమాటికి వణఁకుచు మహిని బడియు
ప్రాణములు వోయినట్టుగ నవ్వొ డగుచు
ననియెఁ గౌసల్య యాసుమంత్రునికి నిట్లు. 1413

జానకి రామలక్ష్మణుల సన్నిధికిన్ గొనిపొమ్ము, నన్ క్షణం
బేనియు వారు లేక యిట నేఁబ్రదుకన్ దలఁపన్, రథంబు నా
కానలకేసి ప్రిస్పు నను ఁగ్రచ్ఛుఁ గైకొని పొమ్ము పోవకుం
టేని యమాలయంబునకె యిప్డు పోవుదు నింక సారథీ ! 1414

వ. అని యిట్లు బాష్పవేగముచే నుపహతమై సిద్ధపడియున్న వాక్కుచే
నామెనోదార్చుచు ప్రాంజలియై సూతుఁడిట్లనియె. 1415

విడు కంగారు, త్యజింపు మోహమును నావేదంబు వర్జింపుమీ
విడి సంతాపము రాముఁడున్ వనుల నీవేళన్ సుఖమ్మ్రుండు త
మ్ముఁడు సౌమిత్రియు రామపాదముల సంపూర్ణంపు సద్భక్తి నె
ప్పుడు సేవించి జితేంద్రియుండె యగుచున్ బూజించు స్వర్గోకమున్. 1416

జనముల్ లేని వనాల సైనను నివాసంబుండి యాసీత రా
మునిమీఁదన్ మనసుంచి నిర్భయముగా మోదంబు స్వేచ్ఛన్ గనున్
మనసందేనియు నామె దైన్యమును సూక్ష్మంబేనియున్ బొంద దె
ట్లును నీసీత ప్రవాసవాసముల కాలోచింపగా యోగ్యయే. 1417

నగరోద్యానములందు నెట్లు మును పానందము బొందెన
ట్లుగ నిర్మానుషమౌ వనంబులను నాలోకించి యాసీత మెం
డుగ హర్షించు నబాలచంద్రముఖి యాడున్ బాలవోలెన్ సమం
బుగ రాముంగని తేలు మైమఱచు నమ్మోదంబు పొందున్ గడున్. 1418

రాముఁ నిజేరె సీత మది రాము నధీనము సీత జీవముల్
రాముఁడు లేక యున్న యెడ రమ్యయయోధ్య వనంబెయామెకున్
ఆమెయు దాయందుఁ గల యన్ని పురాల పేరులన్
రాముని సైన లక్ష్మణునొ ప్రశ్నలువేసి యెఱుంగు నెప్పుడున్. 1419

తన కయోధ్య క్రోసెడు దూరముననె యున్న
యటు తలఁచి సీత విహరించు నదియె యామె
మాటలందును వ్యక్తంబయౌటఁ దలఁతు
కైక గూర్చి యేమున్నదో జ్ఞప్తిలేదు. 1420

వడి ప్రమాదాన నేదియో పలుకఁబోయి
అంతలోపలనే యది యాపివైచి
దేవికిని ప్రహర్షము గూర్చు తియ్యనైన
మాటలను జెప్పఁదలఁచి సుమంత్రుడనియె. 1421

వథిలో తొందరలో తుపానుసుడిలో వల్పొట్లలో నెండలో
వ్యథలోఁగూడ సుధాంశు కాంతిమృదులంబౌ సీత దేహ ప్రభల్
శిథిలంబై చనవబ్జతుల్యమయి పూర్ణేందు ప్రభం బైన యా
మిథిలేశాత్మజ యా వదాన్య వదనంబేన్ వాడ దేమాత్రమున్. 1422

లత్తుక దూది రంగటుల రంగేయి జానకి కాళ్ళు నేటికిన్
లత్తుక పూయ నప్పటికి రక్త సరోరుహ కోశ రమ్యమౌ
మెత్తని కాళ్ళ కందియలు మేలుగఁ దాలిచి ఘల్లుఘల్లు టం
చిత్తరి సందియల్ రవళు లింపగులీలఁ జనున్ విలాసగా. 1423

జనకజ యేన్గునో సింహం
బునో బెబ్బులినో గని భుజములపై ప్రా
లునుగాని యెంతమాత్రం
బును భయమును పొంది పిలువబోవద యెపుడున్. 1424

శోకింపఁ దగరు వారలు
శోకింపఁగఁదగము మనము క్షోణిధవుండున్
లోకంబున నీచరితము
నేకాలమునందునైన నిట శాశ్వతమౌ. 1425

విడి శోకము మది మోదిలి
జడదారులు నడుచు బాటుఁ జనుచును స్థిరులై
అడవిని పండ్లును వేళ్ళును
కడుఁ దిని పితృ పావనాజ్ఞ పాలింత్రు సుతుల్. 1426

అని యుక్తముంగ బలుకు సూ
తునిచే వారింపబడియు తొలగక సతియున్
తన యార్తిని రాఘవ! ప్రియ!
తనయా! యని యూర్పు మాన దయ్యెను వ్యధచే. 1427

వ. ఆనందించువారిలో శ్రేష్ఠుఁడును, ధర్మపరుడునగు రాముడు వనమునకు వెళ్ళినంతటఁ గౌసల్య ఏడ్చుచు స్వార్థమును జాచునదై భర్తతోనిట్లనియె నిజముగ నీ మహాయశస్సు మూఁడులోకములందు ప్రసిద్ధమైనదే. దయగలవాఁడవే వదాన్యుఁడివే ప్రియములు పలుకు రఘువంశస్థుడవే అయినను. 1428

## —: కౌసల్య దశరథుని నిర్దయగా పలుకుట :—

హాయిగాఁ బెరిగియు నార్లుత్త వని నెట్లు
శ్రమ నీసుతులు సీత పైచఁ గలరు
సుఖయోగ్య శ్యామయు సుకుమారి యెటు సీత
చలిని వేడిని వనిపై చఁగలదు
రుచియౌ పదార్థముల్ భుజియించు నాసీత
యెటు వన్యవస్తుల్ భుజింపఁ గలదు
మధుర వాద్యపు ఘోష మృదుగీతి విను సీత
యెటు కూ్రరశబ్ద మాలింపఁగలదు

ఆ మహేంద్ర ధ్వజాభుఁడు మహిత భుజుఁడు
గడియ వంటి బాహుతలా దగనెట్టి వరుండు
పద్మవర్ణుని పద్మనిశ్వాసుఁ బద్మ
నయనునినుకేట రామునివ్ గమదు వెపుడు 1429

వాస్తవముగ నాహృదయంబు వజ్రదృఢము
ఇందు నేమాత్రమును లేదు-సందియంబు
కనుము కాదేని రామునిఁ గనని హృదియొ
వేయి ముక్కలుగాఁ గాక పోయెడిదియె. 1430

నిర్దయగఁ గర్మ తప్పించి నీవు సుఖము
పొందఁదగు నాదుబంధులఁ బోవఁ ద్రోయ
దీను లగుచును వారలు దిక్కు లేక
అడవులంబడి తిరుగుచుఁ బడిరి యకట. 1431

పదియు నై దవ యేటను వనమునుండి
పట్టనమునకు రాముఁడు వచ్చునేని
భరతుఁ డనుభవించిన రాజ్య భాగ్య మెల్ల
గోశమును నుపయోగింపకుండ విడచు, 1432

కొంద ఱిల శ్రాద్ధములఁ దమ బాంధవులను
పిలిచి మృష్టాన్నములఁ దినిపింత్రు మొదట
తాము కృతకృత్యు లై నంత తదితరులగు
ద్విజవరుల సంగతులను నాపిదవఁ గాంత్రు. 1433

అందు గుణవంతులును ప్రాజ్ఞు లమరసములు
ద్విజు లెవరు గలరొ వారు పిదప నొసఁగు
దాని నమృతమైనను గాని తాము మాత్ర
మనుభవించుట కిష్టంబు గనఁబఱపరు, 1434

బ్రాహ్మణులు తృప్తి పొందినప్పటికిఁ గూడ
పిదప భుజియించుటకు నయి ద్విజవరేణ్యు
లయిన ప్రాజ్ఞులు నిష్టంబు నంద రెపుడు
శృంగభంగము నెట్లు వాంఛింప నట్లు. 1435

ఇట్టు లాచిన్న భ్రాత భుజించి విడచు
రాజ భోగాలు సర్వము రాజ ! యింక
భ్రాతజ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడౌ రాముఁ డెట్లు
ధిక్కరింపక గ్రహియించు తెలుపు మీవె. 1436

ఇతర జంతువు చంపిన మృగము నెపుడు
పెద్దపులి తాను తినుటకు సిద్ధ పడదు
ఇట్లె యితరులును ననుభవించినట్టి
దాని నెపుడు నరవరుఁడు తాను గొనఁడు. 1437

హవిసుగాని పురోడాశమైనఁ గాని
దర్భ లాజ్యము చంద్రి యూపములు గాని
ఇవ్వి యేవియు జాము గతించెఁ గాసె
ఎపుడు యజ్ఞాలలో నగ్రహింపఁబోరు. 1438

ఇటులె యనుభవింపఁ బడిన యట్టి రాజ్య
మెల్ల సారము పోయిన కల్లు నట్లు
నష్టమౌ సోమరసపు జన్మంబు నట్లు
రాముఁ డంగీకరింపఁడు రాజవర్య! 1439

కడు నమర్షము గలుగు రాముఁడును నిట్టి
ధర్షణను సైచఁ బోవఁ డీతరుణమందు
అతఁడు కోపించె నా వాడి యమ్ములేసి
మందరాద్రి నేన్ జీల్చ సమర్థుఁ డధిప!. 1440

పితయుం దుండుండెడి గౌరవంబునసె యావేళన్ మహాత్ముండు నీ
క్షితి, నిన్ జంపఁడు గాని వాఁడె కనుకన్ గిన్కన్ విజృంభించెనా
క్షితి లెక్కౌ, శశి భాస్కర గ్రహతతిన్ జిత్రించఁగాఁ బద్ధదై
నుత తారాయుతమౌ దినంబును పడన్ గొట్టున్ నినున్ దాటుఁ డే 1441

కొండల్ వందలు దాల్చు భూమి నయనన్ క్షోభించు వారించెడిన్
మెండౌ తోక స్పృశింప బెబ్బులియటుల్ మీదం బడుంగాని రా
ముం డీరీతి నిరాకృతిన్ సయిపగాఁ బోడెంత మాత్రమ్ము ను
ద్దండంబై జగముల్ సమస్తమొకటై తాకంగ లే వాతనిన్. 1442

తలచి ధర్మాత్ముఁ డీతఁ డధర్మమైన
జగములను ధర్మములతోడ చక్కఁగలుపు
ఆ మహాభుజుఁ డావీరుఁ డల్లఁబసిడి
బాణముల వార్ధి లింకించు ప్రళయ మట్లు! 1443

అట్టి సింహబలుని వృషభాక్షుఁడైన
పురుష శ్రేష్ఠుని తండ్రియే పూర్తిగాను
స్వయముగ నె చంపె నేమింక వాకొనునది
తండ్రి చేపయె పిల్ల మత్స్యంబు నట్లు. 1444

ధర్మరతుఁడైన పుత్త్రుఁ డధర్మరీతి
అడవుల ప్రవాసముగఁ బంపఁబడిన యెడల
ద్విజులు చేయు సనాతన విహిత మైన
శాస్త్ర ధర్మమె యిదె టదృష్టంబు రాజ! 1445

అతివకుఁ దొలిగతి పతియే
సుతుఁడో రెండవ గతి యని చూపం బడియెన్
క్షితిపా! జ్ఞాతులు మూఁడ వ
గతి, యింక నాల్గవ గతియిటఁ గలదే యెందున్. 1446

నీవై తె నిపుడు నాకున్
గావై తివి, రాముఁ డయ్యెఁ గానల పాలై
నీవుండుట నెటకేగెద
నీ వేచంపితి విటు నను నిఖిల విధాలన్. 1447

నీచే హత మీరాజ్యము
నీచే హతులైరి పౌరు లీవు నమాత్యుల్
నీచే నిహతను సుతుతో
నీచే తుష్టు ల యిరి యిక నీసతి సుతుఁడున్. 1448

దారుణ మగు నీవాక్కులు
నీ రాజాలించి మూర్ఛ సెనసెను వ్యథతో
దారుణవేదన మొందెను.
నీరాజు స్మరించి పూర్వకృత దుష్కృతమున్, 1449

వ. ఇట్లు శోకించు రాముని తల్లి కోపించి పలుకఁగా రాజు చింతించి వ్యాకులేంద్రియుడై మూర్ఛ పొంది చాలవడికి సంజ్ఞ పొంది దీర్ఘముగ వెచ్చగను నిట్టూర్చుచుఁ బ్రక్కనే యున్న కౌసల్యను చూచి మరలఁ చింతపొందెను అట్లు చింతించుచుండ అజ్ఞానమువల్ల శబ్దవేది బాణముచేఁ జేయఁబడిన దుష్కృతము వలని శోకము చేతను నేటి రాముని శోకముచేత మనస్సుఖోఁగా మిగిలి తపించి వణఁకి పోవుచు తలవంచుకొని దశరధుఁడు అంజలి పట్టి ప్రసాదము కొఱకు కౌసల్య కిట్లనెను.

ఇదిగో నంజలి నీకు, నీవిట ప్రసాదింపంగఁ బ్రార్థింతు నీ
విదె కౌసల్యా! సతంబు నున్న జనులం దేన్ క్రౌర్యమున్ లేక యున్
సదయన్ వర్తిలు దానవే, గుణము లున్నన్ లేక యున్నన్ సదా
మది ధర్మజ్ఞకు నారికిన్ బతి యగుం బ్రత్యక్షదైవం బిలన్. 1451

మహిత ధర్మవు లోకాన మంచి చెడ్డ
కన్న దానవు శోకాల మంటివైన
అధిక శోకమునంబడి యుఁగు నన్ను
నప్రియమ్ము లాడ దగవిట్టి యదను వందు. 1452

అనుచు దీనుఁడౌ భూపతి కరుణవాక్కు
వినియుఁ గౌసల్య బోదె నవీనజలము
నట్లు భాష్పమున్ విడి పద మట్లు తలను
నంజలి నిడి కంగారుగా వదలి యనియె. 1453

దేవ! నాపైన ననుగ్రహ మీవు చూపు
ప్రార్థన మొనర్తు నీకాళ్ళఁ బడితి నిపుడు
సర్వవిధములచేత నేఁ జచ్చి యుంటి
నింకనను జంప కయ్య యాచించుచుంటి. 1454

ప్రాజ్ఞుఁడును శ్లాఘనీయుఁడౌ భర్తచేత
నెప్పుడును గూడను బ్రతిమాలించు కొనెడి
యింతి యది స్త్రీ యని యనిపించుకోదు
ఉభయ లోకంబులందు ను శుభతఁ జూడు. 1455

ఎఱుఁగుదును నేను ధర్మము
నెఱుంగుదును సత్యవాది వీవ యటంచున్
ఎఱిగియు సుతశోకముచే
పరవశనై యేదొ కొంత పలికితి నిపుడున్. 1456

శోకము ధైర్యము నణఁచును
శోకము నశియింపఁ జేయుశ్రుతమును నెల్లన్
శోకము సర్వము నణఁచును
శోకమ్మును బోలు శత్రుఁజూడ ము ధరలో, 1457

వైరిచేతుల నుండియు వచ్చిపడిన
యాస్త్రప్రహారము సైప శక్యంబ యగును
స్వ నముగా మీదఁ బడినట్టి వ్యథయొ మాత్ర
మెంత సూక్ష్మ మయ్యును సహియింప రాదు. 1458

యతులే ధర్మార్థంబుల
గత సంశయులయ్యు శ్రుతులు గలవారయ్యున్
వెతలన్ మూఢం బయితమ
మతిచెడ, మోహము పడుదురు మన లెక్కేమీ. 1459

వనమునకున్ రాముండున్
చని నేటికి నైదునాళ్లు చనియెను గానీ
వనటన్ సంతోషమె పో
యిన నాకైదేండ్లవలెమ నిప్పుడు తోచున్. 1460

అతనిని తలచిన కొలఁదిన్
మతిలో శోకంబు నాకు షటిమటి పెరుగున్
అతిగ ప్రవహించు నేఱుల
గతి వేగంబున్ సముద్రఘున జల మట్టుల్. 14 0

ఇటు కౌసల్యయె శుభమౌ
నటులన్ వచియించుచుండ నర్కుఁడు చనియెన్
పటువయి నిశ వెడలెను. సతి
యిటులఁ బ్రసన్నని పోనర్ప నృపుడు పరుండెన్. 1462

సోలి యొక ముహూర్తములోనె మేలుకాంచి
ఆ దశరథమహారాజు వ్యథను పొందె
తనయుల ప్రవాసమున నుపద్రవము విభుని
పట్టె రాహువు సూర్యునిఁ బట్టినట్లు. 1463

మును గావించిన దుష్కృతంబు స్మృతికిన్ భూభర్త తా దెచ్చికొం
చును, రాముండును సీత లక్ష్మణుఁడు నా సుతుం డరణ్యాల కే
గిన, యాఱో నిశ యర్థరాత్రి పలుపుం గ్రిగంటె కౌసల్య కి
ట్లని చెప్పందొడగెన్ మునుంగుచు నపారంబైన దుఃఖాబ్ధిలో. 1484

మనుజుఁడు శుభ మశుభమొ యెది
యొనరించునొ దాని ఫలమొ యొందు శుభాంగీ!
మును గురు లఘుతలు. లాభం
బును నష్టము, గనని వాఁడు మూర్ఖుఁడు సుమ్మీ! 1465

పువులన్ బట్టియె పండ్లు వచ్చు చిఱుపువ్వుల్ గల్గు మామిళ్ళు పె
ద్దవి పండ్లీయ వటంచు వేనఱకి యంతన్ పెద్దపూ లున్న మం
చివి పల్మోదుగు చెట్లు పెంచి ఫలముల్ చేపట్టు కాలానఁ జె
డ్డవి పండ్లుండుటఁ జూచి కుందెడి నరుండ నేన యైతివ్వుడున్. 1466

నే మావి తోపు నఱకియు
ఆమోదుగు తోపు వేసి యంబువు లిడితిన్
రామునిని పంట వేళను
నేమానక త్రోసి పిదప జేడ్చెడి కుమతిన్. 1467

జగము లోనఁ గుమారుండు శబ్దవేధి
అని జనమ్ములు కీర్తింప ధనుసు దాల్చి
సరిగ నేఁ గుమారుఁడ నైన సమయమందు
ఒక్క పాపకృత్యము చేసియుంటిఁ జుమ్ము. 1468

శిశువు తెలియక విషము భక్షించినట్లు
స్వయఘుగాఁ జేసికొన్నది ప్రాప్తమయ్యె
ఒకఁడు మోదుగులకు మోహ మొందినట్లు
శబ్దవేధిత్వఫలము నజ్ఞతను వచ్చె. 1469

అప్పటికి నేను నిన్ను పెండ్లాడలేదు
దేవి ! యువరాజునై యుంటిఁ దెలిసికొనుము
మదముఁ గామము మిక్కిలి యొదవఁ జేసి
యపుడు వర్షకాలమ్ము సంప్రాప్తమయ్యె. 1470

పృథివిపైఁ గల రసముల స్వీకరించి
వేడి కిరణాల జగము తపింపఁజేసి
భీమ మగు యామ్య దిక్కుగా వెడలి త్వరగ
సూర్యుఁడును ప్రకాశింపఁగఁ జొచ్చె నపుడు. 1471

అపల వేడిమి వెంటనె యంతరించె
ధట్టమై కారుమబ్బులు తరలి వచ్చె
కప్పలును నెమిళ్ళను చాతకములు నెల్ల
మిగుల సంతోషమునఁ బొంగి మెచ్చె మదిని. 1472

తమదు ఱెక్కపై తడియు స్నానములు చేసి
బహుళ కష్టంబుచే నట్లు పక్షు లెల్ల
వర్షముల గాలిచేత నూపంగఁ బడిన
వృక్షముల యగ్రముల నాశ్రయించె నపుడు. 1473

దిమ్మరించివ వర్షజలమ్ము చేత
ఉండి యుండియు తడిసిన యొడలితోడ
మదపుటేనుంగు నచ్చోట బొదలుచుండె
కదలకయు మెదలక యున్న యుదధివోలె. 1474

స్వచ్ఛమైనట్టి జలముల వఱలుచుండి
అద్రి గైరికాదికధాతు లందునుండి
పడుచు తెలుపు నెఱుపు రంగు లడర నందు
గిరుల సెలయేళ్ళు పాముల కరణి జాఱు. 1475

—: దశరథుడు వేటకు వెళ్ళుట :—

అట్టి యతిసుఖమౌ సమయంబునందు
ధనుసు శరములు దాల్చి రథంబు నెక్కి
పరిగ వ్యాయామమును జక్కఁ జలుపఁ దలఁచి
నేను సరయూనదికి వెళ్లినాను జుమ్మి. 1476

రాత్రి నదిలోని జలముల త్రాగుటకును
వచ్చిన యెనుఁబోతునుగాని బలియు నేన్గుఁ
గాని మఱియొక క్రూరమృగమ్ము గాని
చంపఁ దలపోసి పొంచి యచ్చటనె యుంటి, 1477

ధనుసు నెక్కిడి యక్కడ దాగియుండి
తీరమునకు వచ్చిన యొక్క క్రూరమృగము
ఒక్క వన్యమృగంబును నోలిఁ జంపి
యుంటి శబ్దముఁ బట్టియె కంటఁగొనక. 1478

జలములో కుండ నిండించు సమయమందు
అంధకారములో శబ్ద మాలకించి
ఏన్గు ఘీంకార మనుకొని యేమి కనక
శబ్దమునుబట్టి యహి వంటి శరము విడితి. 1479

అపుడు సంజవేళ హా! హా! యటంచును
శరము మర్మఁ దగిలి జలములందు
పడుచునున్న యొక్క వనచరు శబ్దము
చెవులఁ బడెమఱి యిటు చెప్పెనతఁడు. 1480

—: మునికుమారుని విలాపము :—

ఎట్లు నావంటి తపసిపై నిపుడు శరము
పడియె, నది కొంటి నీళ్ళకై వచ్చినాను
శరమున నెవండు కొట్టె నెవ్వరికి నేమి
చేసితిని. వేరినైన హింసించి యెఱుఁగ. 1481

వనిని నాకొ యలమొ తిని బ్రతుకు నన్ను
వంటి ఋషికి శస్త్రముచేత వధ యిదెట్లు
జడలు దాల్చి వల్కలమూనివడియె యున్న
నన్నుఁ జంప నేమగు, తప్పు నాది యేమి. 1482

ఈయనర్థ మిటు నిరర్థమై యొసంగు
మతి నన్నుఁ గనరు గురుపత్ని గతునిబోలె
నేను జనిపోవుదు నని చింతింప మదిని
మృతిని గనఁ దల్లిదండ్రుల కేన వగతు. 1483

తల్లిదండ్రుల వృద్ధుల తగిన రీతి
నేను పోషించుచును వచ్చినాను గాదె
నేను మృత్యువు పొందితినేని పిదప
ఎవరు వీరిని గూర్చి పట్టించుకొంద్రు, 1484

తల్లిదండ్రులో వృద్ధులై తనరి రిట్లు
నేనొ యొకబాణమున వధియించఁబడితి
సరి వివేకములేనట్టి జడునిచేత
అందఱము మేము నిహతుల మైతి మకట. 1485

ధర్మమందుఁ గాంక్ష గలనేఁ దత్క్షణంబు
ఆకరుణ మైన వాక్కును నాలకించి
వ్యథల బొందెడి నాకరమందునుండి
బాణములు ధనుస్సును క్రిందఁ బడియె నపుడు. 1486

అటుల కడురాత్రి విలపించు వతని యేడ్పు
వినుచు వెతను గంగారుగా వేగ పోయి
చేతనము పోయి దీనతఁ జింతఁ జిక్కి
పరయు తటిఁ బడిన తపసి నరపినాఁడ. 1487

జడల గుంపు చెదరి పోవ, జల ఘటంబు
పడగ, దుమ్ముతో నెత్తుటఁబడి పరుండి
శల్య మది బాధయిడఁగఁ దేజమ్ము దగులు
పెట్టఁ గని చిత్త మేగునన్ భీతుఁ బలికె. 1888

అపకారం బెది నీకుఁ జేసితి నృపాలా ! గొట్టితీ వేటికిన్
విపినంబందు వసించుచున్ బితలకై నీరంబుతే వచ్చితిన్
ఇపుడీ విట్లొక యమ్ముచేత నను వేధింపంగ వృద్ధాంధులై
న పితన్ తల్లిని జంపినట్టి ఘనపుణ్యం బెంతొ యార్జించితే. 1489

అంధులును దుర్బలులు వృద్ధులైన పితలు
ఇపుడు దప్పికచే బాధ నెనయుచుండి
యిపుడు వత్తునొ వత్తునో యపుడు ననుచు
చూచి చూచి నాకయి యాశ వేచి యుంద్రు. 1490

ఇల పైనిఁ బడి యిట్లు పండుకొను నన్నెట్టుల్ పితల్ తెల్పికోఁ
గల రీయాపదఁ బట్టి నాశ్రుతముకున్ గావించు నాయీ తపం
బుల కిందున్ ఫలమేమి లేదని మనంబున్ చెప్పు, నాతండ్రెటుల్
తెలియున్ దీనిని, తెల్పికూడ నడవన్ లేడేమి చేయున్ గటా ! 1491

ఒక చెట్టును నఱుకఁ గని మ
ఱొక చెట్టది చేయఁ గలుగు నూరక చూచున్
నిఁక నిటు నడవగ లేకుం
డి కనుచు నెది తల్లిదండ్రి నెఱవేర్తు లెటుల్. 1492

ఈవే నాపిత చెంత కేగి వెస నా వృత్తాంతమున్ జెప్పు మీ
దావాగ్నింబలెఁ దండ్రి నిన్ వనిగ గ్రోధం బొంది కాల్పండుతే
నీవిట్లే చని సుంతలోఁ గనెదు తండ్రిన్ దల్లి మాయాశ్రమం
బీవున్ దండ్రిఁ బ్రసన్నుఁ జేసి కొను కోపింపండు శాసింపఁడున్. 1493

రాజ! శరము దీయుము శరీరంబు నుండి
ఎంతొ మెత్తని పొడవైన యేటి యొడ్డు
జలముల ప్రవాహవేగ మట్టులఁ గరంబు
వాడి బాణము నామర్మ బాధ పెట్టు. 1494

కూడి శల్యము ప్రాణాలు కోతకోయు
శల్యమును పీసివేయు నాశంబు పొందు
అనుచు శల్యంబు తీయుటకయి కరంబు
స్వాంతమున్ జింత మిక్కిలి బాధపెట్టె. 1495

వ. అటు దుఃఖించి దీనుఁడనై శోకార్తుడనై యున్న నాహృదయమున నున్న చింతను మునికుమారుఁడు కనిపెట్టి తపించుచు బాధపడుచుఅంగములు త్రిప్పి దొర్లుచు నాశము సమీపించి యిట్లనియె ఓయనఘా! స్థిరచిత్తమున నీలోని దుఃఖమును అపుకొని బ్రహ్మ హత్యవలన వచ్చు దుఃఖము పొందకుము రాజా! నేను ద్విజజుఁడను కాను. అట్లని నీమనస్సులో చింత పెట్టి కొనుకుము రాజా! నేను వైశ్యునికి శూద్ర స్త్రీయందుఁ పుట్టితిని. అని చెప్పుచు బాణముచే మర్మయందు గొట్టఁబడి దొర్లుచు చేష్ట లేకుండ నేల పైని బడి వణఁకుచు నిటునటు కొట్టు కొనుచున్న యాతని శరీరము నుండి శరమును నేను వెతికి ఊడఁ దీసితిని. అప్పు డతడు నన్నుఁ బైకిఁ జూచి భయపడి యాతాపసుడు ప్రాణములను వదలెను, అతఁడు జలముచే తడిసిన గాత్రములో విలపించి కష్టముగా మర్మవ్రణము నుండి సంతతము ఉచ్ఛ్వాసము విడచెను. అట్లు పరుండి యున్న యతనిని జూచి ఓభద్రులారా!ఎక్కువ విషాదము పొందితిని. 1496

వ: చేయరాని యామునీ వధను స్వయముగాఁ జేసి ధర్మాత్ముఁడైన యాదశరధుఁడు విలపించుచునె మరల నాకౌసల్యతో నిట్లనెను. 1497

అట్లు తెలియక పాపంబు నాచరించి
వ్యాకులించిన యింద్రియ ప్రతతితోడ
ఎట్లు చేసిన మేలయి యొసఁగు నొక్కొ
అనుచు నేనొంటి మనసులో నవుడె తలచిఁ 1498

మంచినీటితో ఘటము నిండించి యపుడు
మౌని చెప్పిన యాశ్రమ మేను చేరి
వృద్ధు లబలులు సాయంబె లేని యంధ
పితలఁ గంటి ఱెక్కలు తెగు పిట్టలనటు. 1499

## —: వృద్ధదంపతుల పరితాపము :—

కొడుకును గుఱించి యవియవి నుడువు కొనుచు
సుతు డెపుడు వచ్చు నపుడె వచ్చునాయటంచు
తలఁచి శ్రమ వీడి యదియు నావలనఁ బోవు
నని గనక దిక్కు లేకుండి రచట వారు. 1500

వెతయే చిత్తము జంపి వేయమిగులన్ భీతుండనై క్రమ్మఱన్
వెతలప్ జిక్కుచు నాశ్రమంబు దరికిన్ వెళ్ళంగ, నాకాళ్ళ చ
ప్పుడతి జాగ్రతగ నాలకించి యనె నిట్లామౌని: యోబిడ్డ! యి
ట్లతి యాలస్యము చేసితేల యిటు తెమ్మా మంచి నీళ్లిప్పుడే. 1501

ఎందుల కాలసించితివి యింతటి సేపు, జలాల నాడితే
ఇందిదిగో భవజ్జనని యెంతయొ నీకయి బెంగ నాశ్రమం
బందునె యుండె, వెళ్లి కను, మమ్మయొ నేనొ యెదేని యప్రియం
బెందొనరించితే. దపసి వీవు మనంబునఁ బెట్టుకోకుమీ 1502

గతియె లేనట్టి వారికి గతియు నీవు
కనులు లేనట్టి వారికి కనులు నీవ
నీవయినె మాదు ప్రాణములు నిలిచియుండె
ఏల మాతోడ మాటాడ విపుడు నీవు 1503

స్పష్టముగ నుండని యప్పుడు వణఁకుచున్న
హల్లులవి తేటఁబడని వాక్యములతోడ
ఆ మునిని నెంతొ భయమున నరసి నేను
భయపడియుఁ బల్కితిని భయపడని యట్లు. 1504

మనసు బిగపట్టుకొని చేష్ట పనులద్వార
హక్కు నిలబెట్టుకొని కడుఁ బదిల పఱచి
తనయునకు వచ్చినట్టి బాధను గుఱించి
యతనితోడ నేను వచియించితిని నెటులొ 1505

క్షత్రియుండను నన్ను దశరథుఁ డంద్రు
సుజనులు మహాత్ములైన మీసుతుఁడఁ గాను
ఎల్ల సుజనులచేత నిందింపఁదగిన
యిట్టి కర్మ స్వయముగ గావించినాఁడ 1506

ఓయి భగవంతా! చేత విల్లూని నేను
సరయు నది తీరమునకు నరుగు దెంచి
నీరు త్రావ వచ్చిన యొక్క క్రూరమృగము
జంపఁ దలచిఁ యాయత్నముఁ జలుపుచుంటి. 1507

ఇంతలో పాత్రి నిండించు నేదొ శబ్ధ
మప్పుడే నాదు వీనులయందుఁ బడఁగ
ఏనుఁ గిదే వచ్చె నని మదిలోనఁ దలఁచి
వాడి బాణముచేఁ గొట్టినాఁడ నేను. 1508

అపుడు నది యొడ్డునకుఁ బోయి యరసితిఁ గద
తీవ్రముగ హృదిన్ బాణము దెబ్బ తగిలి
ప్రాణములు పోవుచుండిన యట్టి తపసి 1509
యొక్కడట నేలపైఁ బడి యుండఁ గంటి

ఓయి భగవంత! నేనప్పు డొక్క యేన్గుఁ
జంప దలఁచియు నీటిలో జప్డు కాగ
వేగ నీటిలో బాణంబు వేసినాఁడ 1510
అపుడు మీదు కుమారుండు హతుఁ డయయ్యె.

అంత పరితాప మొందెడి యాతపస్వి
వాక్కులనుబట్టి యే సమీపమున కేగి
మర్మముల నుండి బాణముఁ బయికి నపుడె 1511
వెంటనే గని నేనూడఁ బెఱికినాఁడ

నేను శరముఁ బయికిఁ దీయఁగానె యతఁడు
వృద్ధు లగు తల్లిదండ్రుల నెంచి యెంచి
ఎంతో విలపించి మిమ్ము శోకించియపుడె 1512
యక్కడనె స్వర్గమును పొందె నయ్యలార.

నేనొ యజ్ఞానమున మీదు సూను నిపుడె
యిట్టులను జంపి పాపము గట్టుకొంటి
మిగిలినది చేయఁదగినది మీదు చిత్త 1513
మింక మునులు మీర లనుగ్రహింపు డయ్య.

చెడ్డ వినిపింప నేనంతఁ జెప్పినట్టి
యతిగ ఘోరమౌ నావాక్కు లాలకించి
యపుడు భగవంతుఁ డౌఋషి యాత్మ నుబుకు 1514
సత్వరామాసనమును సైపఁ జాలడయ్యె.

భాష్పములు మోముపై నెల్ల వఱదవాఱ
వ్యధను జిక్కి నిట్టూర్చుచు నార్తితోడ
ఆమహాతేజుఁ డగుమౌని యాక్షణంబ
ప్రాంజలి యయిన నాతోడఁ బలికె నిట్లు 1515

ఈ యశుభవార్త స్వయముగ నీవె వచ్చి
యిటుల నాకుఁ జెప్పక పోతివేని యపుడు
రాజ! నీతల వెంటనే బ్రద్దలై యయి
వేయి నూర్ల ముక్కలై యయి పోయి యుండు 1516

అవని క్షత్రియుఁడౌ యనాథు ననపరాధు
తుది విశేషించి వానప్రస్థునిని తెలిసి
చంపి యుండినచో నది శక్రుసైన
స్వపదమున నుండి భ్రష్టునిఁ జలిపి వైచు 1517

తపసునందున్న మునిపైని తపసు చేయు
బ్రహ్మచారిపై తెలిసి యస్త్రంబు వేయు
వాని శీర్షము శీఘ్రముగానె యివుడె
యేడు ముక్కలై పోయిడి దే నృపాల 1518

ఇట్లు తెలికయే నీవు గావించి యుంటి
విందువల్ల నిందాక జీవించి యుంటి
తెలిసియే యిది గావించితేని రాజ!
రఘు కులమె పోయిడిదె నీ బ్రదు కిదెంత 1519

క్షితిప యచటికే మమ్ముఁ దీసికొని పొమ్ము
అంత్యదర్శన మే గల యాతనూజు
నిపుడు గన్గొన మేము వాంచింతు మోయి!
అనుచు నామౌని నాతోడ ననియె వంత! 1520

పుడమి నెత్తురు లోపలఁ దడిసి యుండి
చెల్ల చెదరైన చర్మముఁ జేల మొప్పి
సంజ్ఞయే లేక నేలపై సరయు దరిని
యముని వశమైన సుతు దరి కపుడు చేర్చి. 1521

నే నొకండనె సుతుని స్పృశింపఁ జేయ
వార లాసుతు స్పృశియించి వానియెడలఁ
బడిరి; యంతట నాముని పలికె నిట్లు
ఇపుడ యభివాదనము చేయవేల వత్స! 1522

## —: వృద్ధ తపసి విలాపము :—

ఏల నాతోడ మెచ్చి భాషింప వేల
ఏల క్షితిఁ బరుండియుఁ గోపగించినావె
తనయ! నే నప్రియుఁడఁ గాను తల్లిఁ గనుము
ఏర! కౌఁగి లీయవు సుకుమార! పలుకు. 1523

ఎవ్వాఁడు తుది జాము హృద్యంబుగా మించి
శాస్త్రమో యెదో యింకఁ జదువ విందు
ఎవఁడు సంధ్యను గొల్చి యింక ముంది వేల్చి స్నా
నమ్ము చేయించిన నాత్తుఁ గొలుచు
ఎవండు దుంపలు వేళ్లు నిఁక బండ్లు తెచ్చి య
తిధి నటు తినిపించి పథముఁ జూవు
ఎవఁ డంధ నీదీన వృద్ధను సుతకామ
నీతల్లి పెంచి మన్నించు నింక

నేను మీయమ్మ భరియించలేము బిడ్డ!
ఆగు, వద్దు. వెళ్ళకు మిప్డె యముని కడకు
జననితోడ నాతోఁ గూడి చనెదు గాని
కృపణుల మనాధులము, కూడి యేగవచ్చు, 1524

నే నిపుడ పోయి యమునిఁ బ్రశ్నింతు నిట్లు
"ఇతఁడ తల్లిదండ్రులను పెంచు, సుతు క్షమించు"
యముఁడు ధర్మాత్ముఁడు యశస్వి యఖిల భర్త
ఇట్టి నా కక్షయ మభయ మిడుత మొకడటె. 1525

పాపకర్మల నీవొవర్పంగ లేదు
పాప కర్మము చేతఁ జంపంగఁ బడితి
చేరి నీకు నాసత్యమ్ము చేత నిపుడు
శస్త్రయోధులౌ వీరుల స్వర్గ మెగు. 1526

రణములో మరల చనిపోపు వారల
యుద్ధవీరుల లోక మొందు మయ్య
సగర శైబ్య దిలీప జనమేజయ నహుష
దుందుమారుల లోక మొందు హాయి
సాధువులును తపస్స్వాధ్యాయ పరు లాహి
తాగ్నులు పొందు లోకాదు లొందు
వీక పత్నీవ్రతుల్ పృథ్వి గోహస్రిదా
తలు గురు భృతు లేగు స్థలము లేగు

దేహమే న్యాస మగు వారి దేశమేగు
మవకులంబున నశుభమున్ గనఁ డెవండు
ఆత్మ బంధుల జంపువాఁ డశుభ మొందు
అమచు మాటిమాటికి దీనుఁ డాతఁ డేడ్చె. 1527

## —: దశరథుని పరితాపము :—

కనులతో నిన్నుఁ గౌసల్య కాంచలేను
తిన్నగా నీవు చేతితో నన్నుఁ దాకు
అని పలికి యేడ్చుచు మరల నాతఁ డంత
భార్యతో నీరీతిఁ బలికె త్వరగ. 1530

యముని గనువారు తమవారి నరయలేరు
రాముఁ డిపు డొక్కపరి నిటుల్ తాకె నేని
ధనమునో యౌవరాజ్యమోగనెన యేని
యేను నొక వేళ జీవింతునేమొ యింక. 1531

రాముువిషయాన నాప్రవర్తనము చూడ
నాకు నదృశమై వరలు చున్నదియె సుమ్ము
నాయెడల రాముని ప్రవర్తనంబు కూడ
రామునికె సదృశ్యమయి యేర్పడియెఁ గాద. 1532

కనుము దుష్టు డైనను తన కన్న సుతుని
తెలివి గలవాఁ డెవడు విడంగలిగె నొక్కొ
తన్ను గెంటించు చుండిన తండ్రి నెపుడు
నెవ్వఁ డైన నసూయ నిందింప కున్నె 1533

కంటితో నిన్నుఁ గౌసల్యఁ కాంచలేను
నాదు స్మృతి పోవుచుండెను నన్ను విడిచి
ఇదిగో నీయము దూతలు నేగుదెంచి
నన్నుఁ గౌసల్యఁ త్వరపెట్టు చున్నవారు. 1534

రాము ధర్మజ్ఞు, సత్యపరాక్రమాఢ్యు
జీవితమున నన్నుఁ ద్యజియించె పోవునప్పు
డేని దర్శింప లేకుంటి నింతకంటె
కష్ట మెటనైనఁ లోకానఁ గలుగు నాక్కొ. 1535

బదులు చేయు టెఱుఁగని దివ్యాత్ముసుతుని
చూడ నందువల్ల నయిన శోక మిపుడు
చేరి నాప్రాణ మెండింపఁ జేయుచుండె
స్వల్ప మగు నీటి తీవ్రాతపంబు వోలె. 1536

పదియు నాలు గేడులు వనవాస మేగి
పదియు నైదవ యేటను వచ్చి నపుడు
రాముని శుభసుందర కుండ లాఢ్య ముఖము
నరయు వారు దేవులె గాని నరులు గారు. 1537

కమలాక్షున్ వరనాసికున్ సురధు రాకాచంద్రవక్త్రున్ సుగం
ధ మనోజ్ఞాంబురుహాస్యు రాఘవుని నా దైవంబు సుభ్రున్ వనాం
తము నందుండి యయోధ్యఁ జేరు విభు కానల్ పోయి యేతెంచు కి
రము నట్టుల్- కను వారె ధన్యులు, కృతార్థం బౌను తజ్జన్మయున్.
1538

చిత్తమోహాన నాహృది చిట్లిపోయె
శబ్దము రుచి స్పర్శ యెఱుంగఁ జాలనైతి
చిత్తనాశ్వాన నింద్రియాల్ చెడి నశించి
నూనె యయిు పోన దీపకాంతుల విధాన. 1539

ఆత్మలోఁ బుట్టివట్టి యావ్యథ కరంబు
నన్ను చేతను శూన్యుని నన్ను నాధు
శీఘ్రముగ సర్వనాశము చేసి వైచె
కడువడి నదీప్రవాహము గట్టుఁబోలె. 1540

హా రామా! పృథుబాహు! హాసుత! మదీయాయాసనాశంకరా!
హా రమ్యాస్య! పితృప్రియా! స్మితముఖా! హానాథ! యెందుండెదో
హా రామా! యెట కేగితో కట! సుమిత్రా! దీన! కౌసల్యా! హా
క్రూరా కైకయి! వంశపాంసని! ప్రియక్రోధా. యమిత్రా కృతీ!. 1541

—: దశరథుని మరణము :—

అనుచు రాము మాతదరిని ఆసుమిత్ర
దరిని దీనుఁడై పలుకుచు దశరథుండు
వగ నుదారమూర్తి సుతప్రవాస చింత
నర్ధరాత్రానఁ బ్రాణము లంత విడిచె 1542

పిదపన్ రాతిరి తెల్లవాఱ నుదయుంబే వంది బృందంబు రా
ట్పదసంబంధును జేరె, సూతులు సువంస్కారార్థులున్ మంగళున్
విదిత ఖ్యాతులు గాయకుల్ శ్రుతియుతుల్ విజ్ఞుల్ వడిన్ స్తోత్రముల్
పదముల్ కీర్తన చేయు దీవెనలఁ బల్ మార్మ్రోగెఁ బ్రాసాదముల్. 1543

అపుడున్ సూతులు స్తోత్రముల్ సలుప విందై పాటివాదాత్మకుల్
అపదానంబులు దాహరించి ధ్వనిచేయన్ పాణివాదంబులన్;
అపుడే పక్షులు కూసెఁ బంజరములం దామైన గోర్వంకలున్
నృపు కీర్తుల్ వినిపించె, వీణెలు క్వణిల్లెన్ మ్రోగె గాథాస్తుతుల్ 1544

ఇఁక మామూలుగ సేవనాకుశల లౌ నింతుల్ శుభాచారలున్
సకల క్లీబులు నందు నెప్పటి యటుల్ చన్దేఱ సుస్నాన శి
క్షకులన్ చందన మిశ్రకాంచన ఘట గ్రామంబుతో సిద్ధమై
సకల క్షోణుల వేచియుండ శుభవేషాభూష గావింపఁగా. 1545

శుచి తైలంబులు దంతధావనపు వస్తుల్ సల్గుఁ బిండుల్ పొడుల్
రుచి గండూషములన్ సుమంగళకరుల్ యోగ్యంపు గంగోదక
ప్రచురంబౌ తులసీ దళంబులును వస్త్రాభూషలున్ దెచ్చి యందందెకిన్
రుచిరాలంకృతి చేయఁ గాంత్రు పువుఁబోండ్లున్ రాజురాకన్తఱిన్. 1546

ఇదియే, మెప్పటి యట్లు రాఁడేఁక విభుం, డేకారణంబో యటం
చెదలో నుత్సుకలై తలంచెడి తఱిన్ పృథ్వీశు శయ్యాతలం
బు దరిన్ నిల్చెడి స్త్రీలు మేల్కొలిపినన్ భూభర్తయో లేవమిన్
ముదితల్ భార్యలు ముట్టి తట్టి శయనంబున్ తాకిరంతన్ పతిన్. 1547

అయినన్ గొంచె మెఱుంగ కేమి హృదిమధన్ తాకి కేల్పట్టి చూ
చియు చేష్టల్ గనరామి దీన లగుచున్ జీవంబు లే పోయెనే
మొ యటం చంత ప్రవాహ మెట్టయెదురరై యున్నట్టిదేగడ్డి పో
చ యటుల్ వణ్కుచు కాంత లిట్లనిరి రాజవ్నట్లుఁ గానయ్యెఁబో. 1548

పుత్రశోకంబులో మున్గి పోయి నట్టి
ఆసుమిత్రయుఁ గౌసల్య యార్తిఁ జిక్కి
వేళ కాని వేళఁ బరుండి వేగుచుండి
లేవలేరు మేల్కొనరు నిద్రించు చుండి. 1549

ప్రభయె లేక వివర్ణయై వణఁకి ముణిఁగి
స్రుక్కి కౌసల్య చీకటి చుక్క యయ్యె
ప్రభుని పిదపఁ గౌసల్య యాపయి సుమిత్ర
రాజిలదు చింతఁ గుములు వక్త్రాలతోడ 1550

అట్లు పడి యుండి లేవకున్నట్టి సతుల
దేవులను నిద్దఱను నృపున్ దేఱి చూచి
అఖిల మైనట్టి యారాజు సంతిపురమె
ప్రాణములు లేచి పోయిన యట్టు లయ్యె. 1551

అవరాంగన లెల్లరు నంత వగచి
పైకి స్వరముతో దీనలై వారు మనిరి
అడవి స్వపదంబు నుండి యూథాధిపతులు
ఎగసి పాఱఁగ నాడనే నుగులువోలె. 1552

వెంటనే వారి రోదన వేదనముల
పైకిఁజై తన్యమది లేచి వడిగ రాఁగ
అదిరి పడుచుఁ గౌసల్యయు నా సుమిత్ర
నిద్ర వదలి పోవ వ్యథలన్ లేచి యపుడు. 1553

నాథుఁ జూచి స్పృశించి హానాథ! యనుచు
నేడ్చుచు ధరిత్రిపైఁ గూలి యిట్టె పడిరి
పడియుఁ గౌసల్య దుమ్మెంతో యెడలిఁ గప్ప
మింటి నుండి పడిన తారవంటి దయ్యె, 1554

అల్ల దశరథు మేనెల్లఁ జల్లపడఁగ
అవనిఁ బడియున్న కౌసల్య నపుడు నచటె
యింతు లెల్లరు కండ్ల వీక్షించినారు
వగచి పడియున్న యాడు యేనుగును బోలె. 1555

అపుడు కైకేయి మొదలైన యువతులెల్లఁ
జేరి చైతన్య మేగఁగ క్షితిని బడిరి
వారి రోదనములచేత ప్రభు గృహంబు
మరల నిండిపోయి మిగుల మారు మ్రోగె. 1556

వ. అట్లు నరదేవుఁడు కాలధర్మము పొంద జను లందఱు నేడ్చిరి. అంతట ఆ క్రందనములు మిన్ను ముట్టె ఆనందము పోగా అందఱు దీనులై ఆపోయిన రాజు చుట్టు చేరి పత్ను లందఱు ఏడ్చుచు అనాథలై బాహువులు పట్టుకొని విల పించిరి. 1557

అంత చల్లారి పోయిన యగ్నినట్లు
జలము లెండిపోయిన మహాజలధి నట్లు
ప్రభలు పోయి నల్లఁబడిన భానునట్లు
స్వర్గమునకుఁ బోయినట్టి యాపతిని గాంచి. 1558

కనులఁ గన్నీరు మున్నీరు కాఁగ నేడ్చి
ఎంతో వైధవ్య దుఃఖానఁ జింతఁ గుమిలి
ఉర్వీ పతితల నొడి లోన నుంచి కొనుచు
నిట్లు కైకేయితో వచియించె నపుడు. 1559

కైక ! నీకోర్కె తీరెనె కాద యిపుడు
ఓ నృశంసురాలా ! పాప ! యోసి దుష్ట !
పతిని వర్జించి యింక వొక్కతెవె నీవు
అవల నిష్కంటకపు రాజ్య మనుభవించు. 1560

రాముఁడో నన్ను వీడి యరణ్య మేగె
భర్తయో నన్ను త్యజియించి స్వర్గ మేగె
దారిఁ బరివారమే లేని దానఁ బోలె
ఇంక నేనిపు డిందు జీవింపఁ గోర. 1561

ఇంతవఱకు నాతనితోడ నిట సుఖించి
తనకు దైవతం బైన భర్తను ద్యజించి
కడకు ధర్మము విడిచిన కైక తక్క
యింతి యెవతె భర్తను వీడి యింక బ్రదుకు. 1562

లాభమున విష మిచ్చిన లోభివోలె
నీవు చేసిన దోషాల నెఱుఁగ నైతి
గూనిదానికై రఘువుల దైన కులము
ఇట్టి కైకేయిచే నశియించి పోయె. 1583

ఇందు నన్యాయముగ నియోగింపఁ బడిన
రాజుచే- సీతతోఁగూడ రాముఁ డడవి
కంప బడినట్లు జనకరా జాలకించి
నావలెనె యెంత చింతలను గనునొ. 1564

ధర్మపరుఁడును పద్మపత్రాక్షుఁ డైన
రాముఁడును నేనిటు విధవరాల నగుచు
కడు ననాథలై నటు, రాజు కాలధర్మ
మంది నట్లును నెట్లు తా నరయుఁ గలఁడు. 1565

అధిక పుణ్యము చేసికొన్నట్టి సీత
వగకుఁ దగనిది వనములన్ భయము చెందు
భీమ మగు గర్జ లిడు మృగ విహగములకు
హడలి రాముని యాశ్రమమందు నిజము. 1566

వృద్ధుఁ డింక పుత్రులే లేని నృపుఁడు జనకు
డిపుడు కూఁతుఁ జింతించి త్యజించు మేను
నేఁ బతివ్రత నిపుడె గతించిపోదు
పతి శరీరముతోఁ జొత్తు వహ్ని నిపుడె. 1567

ఇట్లు పతిని గౌఁగిటఁ గ్రుచ్చి యేడ్చుచున్న
కృపణు రాలైన కౌసల్య నెటులొ తీసి
తొయ్యలుం లమాత్యులును మానె తొట్టె యందు
రాజు మేను నుంచి చేసి రర్హంపుఁ బనులు 1668

సుతుడు లేకుండఁ బ్రేతసంగతులు చేయ
రాదని సమస్త మెఱిఁగిన ప్రాజ్ఞు లపుడు
రాజు తనువుఁ గావఁగఁ జూచి రాజ
ఛేయి యెత్తి యేడ్చిరి పతి పోయె ననుచు. 1569

హా మహారాజ! యెపుడు ప్రియంబు లాడు
రాముఁడును సత్యసంధుఁ డరణ్యములకు
మమ్ము విడిచి పోవఁగ నీక్షణమ్మునందు
నీవు కూడ మమ్ముల వీడి యేగినావె. 1570

రాము నెడఁబాసి నిన్నును రాజ! విడచి
అనఘుఁ బతిఁ జంపుదుష్టురాలైనయట్టి
కైక యేల్బడి లోన దిక్కైన లేక
విధవ రాండ్రమై యెట్లు జీవింపఁగలము. 1571

అతఁడె మాకును నీకును నాత్మవంతుఁ
డైన ప్రభు వెల్ల సమయంబులందుఁ గూడ
అట్టి శ్రీమంతుఁ డగు రాముఁ డనఘుఁ డిపుడు
రాజ్యలక్ష్మి వీడి చనె నరణ్యములకు 1572

నీవు లేక వీరుఁడు రాముఁ డేని లేక
సకల కష్టాల పాలయి సడలి పోయి
కైక ధిక్కారముల మెంది కష్టముగను
ఎట్లు నివసింపఁ గలమయ్య! నృపవరేణ్య! 1573

విభుని రాముని లక్ష్మణు విపులబలుని
సీత విడు నామె యెవరిఁ ద్యజింప దింక
అనుచుఁ గన్నీరు మున్నీరు లగుచుఁ గాఱఁ
గుంది ముదమేగ విలవిల కొట్టుకొనిరి. 1574

రమ్య చంద్రుఁడు లేనట్టి రాత్రివోలె
భర్తచె ద్యజియింపఁబడిన పత్నివోలె
ఆ మహాత్ముఁడౌ రాజు లేనట్టిదగుచు
ఆ యయోధ్యయు శూన్యమై వ్యథలఁ బడియె. 1575

జనులు కన్నీటి మున్నీటి కముల నేడ్వ
అంగనలును హా! హా! యని యార్చుచుండ
వాకిళులు నిశ్శు మందిరాల్ పాడుపడఁగ
ఆ యయోధ్య పూర్వ మ్మటు లలరదయ్యె. 1576

శోకమున రాజు త్రిదివంబు చొచ్చె నంత
రాజపత్నులు భూమితలాన నుండ
క్షణములో సూర్యుఁ డంత పచార్లు మానె
కడు నిశాచరి రజని షికారు చేసె. 1577

సుతుఁడు లేకుండ నృపతికి సుహృదు లపుడు
నింక దహనకర్మను చేయ నిష్టపడరు
కనుక నూహింపరాని దర్శనము కలుగు
నృపుని నాశయనమునందె నిలిపినారు. 1578

అర్కుఁడును లేక ప్రభపోవు నభ్ర మటులు
రమ్య తారకలును లేని రాత్రి యటులు
అశ్రు పూర్ణాస్యముల గల్గి యఖిలవథుల
ప్రాంగణముల నేడ్చె నయోధ్య రాముఁ గనక. 5179

నరదేవుఁడు మరణింపఁగ
నరులును నారులును గూడి నలువీథులలో
భరతుని ప్రియమాత నయిని
కురిపించుచు తిట్లు వానఁ గొనరు సుఖంబున్. 1580

వ. ఇట్లు అయోధ్య ఆక్రందనలచే ఆనందములుపోగా అశ్రుకంఠులైన జనులచే వ్యాకులమైయుండ దీర్ఘముగా నారాత్రి వెళ్ళిపోయెను. ఆ రాత్రి వెళ్లిపోగా సూర్యు డుదయించుటయు, రాజ్యవ్యాపారములు చూచుమంత్రి పురోహితాదులైన ద్విజులు ఒకచోట గూడిరి. అపుడు మార్కండేయుడు

మౌద్గల్యుడు వామదేవుఁడు కాశ్యపుఁడు గౌతముఁడు మహాయశుఁడైన జాబా
లియు అను ద్విజులు అమాత్యులతోఁ గలిసి రాజపురోహితుఁడైన వసిష్ఠుని
కభిముఖులై వేఱు వేఱుగా నిట్లనిరి. 1581

సుతశోకంబున రాజు పోవ నిశయున్ శోకాన నూరేండ్లటుల్
మతి తోఁచెన్ మన రామలక్ష్మణు లరణ్యం బేగ శత్రుఘ్న స
మ్మతుఁడై యాభరతుండు రాజగృహమున్ మాతామహోద్యత్పురిన్
సతితో గూడియు నున్నవాఁడు కనుకన్ క్ష్మాపాలు డెవ్వండొకో. 1582

దేశ మరాజకం బయిన దిక్కేది లేక వినాశ మొందు నీ
దేశము నందు నొక్కని క్షితీశుఁగఁ జేయుట యొప్పు రాజె యీ
దేశమునందు లేని యెడఁ దిన్నగ వర్షములుండ విట్టిచో
దేశము గింజచల్లక గతించు సమస్తము తల్లక్రిందులౌ. 1583

సతులున్ పత్నియుఁ జెప్పినట్లు విన రిచ్చో ద్రవ్యమే యుండమిన్
సతులే యుండర. యింతకంటె నిఁక త్రాసం బేది న్యాయాలయ
స్థితి పోవున్ మరి రాకపోక జనముల్ చేయంగఁ బోరింకిటుల్
మతిలోఁ జోర భయానఁ దోఁటలు గుడుల్ పాడై నశించుంగదా. 1584

ద్విజులున్ యజ్ఞము చేయకుండెదరు ఋత్విక్శ్రేణి సత్రంబులన్
నిజ మంత్రంబుల వల్లెవేయ, రిఁక నిందే యజ్వలౌ బ్రాహ్మణుల్
ప్రజలున్ దక్షిణ లీయు, రెందు నటకుల్ రాష్ట్రాల నర్తింపరే
ప్రజమందున్ బుధిలో సమాజములు పర్వంబుల్ ప్రవర్తింపవున్. 1585

కథలున్ గాథలు వాదముల్ జరగ వింకన్ పట్టు నారామముల్
పథముల్ శూన్యములౌ కుమారిక లిటున్ వాహ్యాళి గావింప, రే
మిథునంబుల్ తమి వాహనావళుల నేమీ పో రరణ్యాలకున్
సుధనుల్ గోకృషిజీవనుల్ తలుపు లెచ్చో దీసి నిద్రింపరున్. 1586

రాజవీధుల గంట లల్లాడఁ బెను దంత
ములయుర్వదేండ్ల యేన్గు లిఁకఁ దిరగ
షల్ విద్యలను నేర్చు విలుకాండ్రతల ఘోష
లవి వినదు గూర్చుచుఁ జెవులఁ బడవు
ఇఁక దూర దేశంబు లేగు వర్తకులు స్వ
సామాగ్రితోఁ బోరు క్షేమముగను
ఇఁక నొంటిగా మునులెద నాత్మఁ దలఁచుచు
సాయం సమయములఁ జనఁగఁ బోరు

ఉర్వి నింక యోగక్షేమ ముండఁబోదు
ఆజిలో సేన శత్రుల హిత మొనర్ప
దిఁక రథములు గుఱ్ఱము లెక్కి యేగరు ప్రజ
శస్త్ర చమరు లింక వివదించరు వనాల 1587

జనముల్ మాల్యము మోదకంబులను స్వేచ్ఛాదక్షిణల్ దేవతా
ర్చనలన్ గూర్పరు, చందనంబు లగురుల్ రాజిల్ల వీచెట్లు పూ
లను మైఁదీర్చి వసంతమందువలె విభ్రాజిల్ల వేఱుల్ జలా
లను గోపాలురు నావులున్ తృణము లారామాలు లేకుండెడున్ 1588

ధ్వజమే రథమును జూపును
ధ్వజమై ధూమంబు నెపుడు వహ్నిని జూపున్
ధ్వజమై మన కందఱకును
నిజ సామర్థ్యంబు చూపు నృపతి గతించెన్ 1589

రాజు లేనట్టి యిటువంటి రాజ్యమందు
సొంత మన్నది యుండ దావంత కూడ
బలము కల్గువార్లలు బలహీనులను నెపుడు
చెరి యొకరిని భక్షింతురు చేపలట్లు, 1590

హద్దులే పోవ నంశయ మదియు లేక
న్యాయమే లేక తిరుగుచు నాస్తికులును
రాజె యున్నప్డు రాజ పాలనమునకును
వెఱచి యోగ్యులై సంచరింతురు సతంబు 1591

హితమును గూర్చుచు దృషియు
సతతంబు ప్రవర్తిల్లుచుండు చాడ్పున నెందున్
క్షితి సత్యధర్మముల సం
తతి యగు పతి రాష్ట్ర హితము తప్పక గూర్చున్ 1592

రేడే (రాజే) సత్యము ధర్మము
రేడే (రాజే) కులవంతులకును రమ్య (దృతిని) కులంబున్
రేడే (రాజే) తల్లియుఁ దండ్రియు
రేడే (రాజే) హితకరుఁడు సర్వపృధివీ ప్రజకున్. 1593

రాజె యముఁడు వైశ్రవణుఁడు
రాజే శక్రుఁడు వరుణుఁడు రాజె యిదెల్లన్
రాజె మఱి సువృత్తముతో
రాజిల్లినచో నతండె రాజోత్తముఁడౌ 1594

ఏది యసాధువౌ యెయ్యది
సాధువౌ విభజించి తెలుప క్ష్మాపతి లేమిన్
ఏదియు తెలియక యేయిఁక
మీదఁ సకల మంధకారమే యయి పోవున్. 1595

ఈ మహారాజు జీవించి యుండె యుండ
ఎల్లప్రము నీపలు కతిక్రమింపలేదు
సర్వ సమయంబు లందును సాగరములు
తమదు తల్లి గట్టును గాని దాట నట్లు. 1596

ఈవు ద్విజవర ! మమ్ము వీక్షించి యిపుడు
రాజు లేక యడవి యైన రాజ్య మెఱిఁగి
వరుని నిక్ష్వాకుతనయుని సరిగఁ దెలిసి
ఇంక రాజ్యమున నభిషేకింపు మయ్య. 1597

అని యమాత్యులన్ వసిష్ఠుఁ డాలకించి
ఆ సఖుల నమాత్యులకు బ్రాహ్మణుల కనియె
ప్రభునిచే రాజ్య మొందిన భరతుఁ డిపుడు
మేన మామింట శత్రుఘ్నుతోనె యుండె. 1598

కనుక మన మింక నిపుడు కర్గొనెడి దేమి
తొరగ గుఱ్ఱాలపై నెక్కి దూత లిపుడె
భరత శత్రుఘ్నులను దేఁగ నరుగవలయు
నని వసిష్ఠుఁ డనఁగ నంద రిట్లు యనిరి, 1599

ఆవసిష్ఠుఁ డనియెను సిద్ధార్ధ ! విజయ !
విను జయంత ! యశోకనందనుడ ! రండు
చేయవలసిన వనియేదొ చెప్పుచుంటి
మిపుడె గుఱ్ఱాలపై రాజగృహము చనుఁడు. 1600

మదిలో శోకము లేకయే భరతుతో మామాటఁగా జెప్పు నిన్
హృదితో మంత్రిపురోహితాది ప్రకృతుల్ ప్రచ్ఛింత్రు నీక్షేమమున్
పద ! బైల్దేఱుము సత్వరంబుగ మొనర్పం దగ్గ కార్యంబ యీ
యదవన్ గల్గె నటంచుఁ జెప్పు డిటు లాహ్లాదంబుపై కొప్పఁగన్. 1601

కానకు రాము డేగె నటుగాని యిటుల్ పిత పోయి నట్టులన్
గాని, రఘూద్వహాదు లిటుకష్టము లొందిన యట్లు గాని యిం
తేనియు చెప్పరాదు, మఱి యెన్నియొ పట్టుదుకూలముల్ నగల్
వానివి రాజువిన్ మిగులఁ బట్టుకు పొం డిటనుంచి శీఘ్రమే. 1602

## —: భరతుని దెచ్చుటకు దూతలు పోవుట :—

వ. అని వశిష్ఠుఁడు చెప్పఁగా దూతలు విని తమతమ యిండ్ల దారి బత్తెము తీసుకొని కేకయ దేశములకు పోవు వారయి వసిష్ఠుని యనుమతి పొంది పడమరగా నున్న అతలాద్రిని ఉత్తరముగా నున్న ప్రిలంబాద్రిని సమీపించి అక్కడ మధ్యగా నున్న మాలినీ నది దరికేగి హస్తినపురమున గంగను దాటి ఉత్తరముగా నున్న పాంచాలదేశమును చేరి యచట మధ్యగా కురుజాంగల దేశమును అనుకొని యున్న నిండిన సరస్సులతో స్వచ్ఛోదక ములైన నదులును చూచుచు కార్యమును బట్టి తొందరగా వెళ్ళిరి. 1603

విమలోదకంబును వివిధపక్షి యుతమున్
సజనమౌ శరదండ నదినిదాటి
ఒడ్డు పడమట సత్యోపయాచన మను
తరువు మ్రొక్కి కుళింగ పురిని జొచ్చి
అభికాల గ్రామము నాబోధి భవనాద్రి
మరలి పిత్ర్యము నిక్షుమతిఁ దరించి
దోసిటి జల మాను తొలివేద విప్రుల
గని బాహ్లిక క్షితుల్ కనుచు నేగి

గిరి సుదామము: విష్ణు సంఘ్రిని, విపాశ
నదిని శాల్మలి నితరమౌ నదుల దాటి
వాపి పద్మాకర తటాక పల్వలములఁ
గనుచు నేగిరి దూతలున్ కరము వడిగ. 1604

ఏన్గులఁ బులుల సింహాదిమృగ గణాలఁ
గనుచు పెద్దల యాజ్ఞచేఁ గరము దూర
మైనఁ గాని ప్రభుహితంబు నఖిల హితము
నరసి నిశనె గిరివ్రజ పురికిఁ జనిరి. 1605

పురికిన్ దూతలు చేరు రాత్రి తుది జామో యొక్క దుస్స్వప్నమున్
భరతుం డారసి తెల్లవాఱ మిగులన్ పర్యాకులుం డౌట నె
య్యురు వీక్షించి ముదంబు గల్గుటకు నెన్నో చెప్పి నాట్యాదులన్
కరమున్ జూపి వినోదపెట్టి రయినన్ గన్గోఁడు హర్షింపఁ డుటన్ 1606

కొంద ఱది యిది కదపుదురు
కొందఱు వాయింత్రు వీణ కూయుదు రొకరుల్
కొందఱు వినోద పఱచెద
రందం దుపహాస నాటకాదులచేతన్ 1607

సఖు లెన్నెన్నొ ప్రియంబు లాడి భరతున్ సంతోష పెట్టన్ గడున్
ముఖమం డాతఁడు కొంచ మైనను ముదంబున్ బొందు నేసూచనల్
సుఖముం బొంధెడి పద్ధతుల్ గనక యుచ్చో దుఃఖ వృత్తాంతముల్
నిఖిలంబున్ దెలియుంగఁ గోరి కడుఁ బ్రశ్నింపంగ నాతం డనెన్ 1608

"వినుడీ యెందుకు నామనస్సునను. నుద్వేగంబు నిట్లయ్యెనో
కనితిన్ స్వప్నము దానిలోన గిరి శృంగం బెక్కి యందుండి మా
జనకుండే తన జుట్టు వీడ బహుళాస్వచ్ఛంబుయౌ గోమయం
బున నిండారు హ్రదంబునందుఁ బడియున్ బొర్లాడుటన్ జూచితిన్, 1609

ఆటఁ బలుమాఱు నవ్వుచునె యంజలితోఁ బిత నూనె త్రాగి పి
మ్మటఁ దిలభోజనంబు తిని మాటికి శీర్షము వంచి మేని నం
తటఁ గడునూనెపూసికొని తైలమునందునె స్నానమాడుచుం
డుటఁ గలఁగంటిఁ గ్రమ్మఱఁ గనుంగొనితిన్ జలరాశి యెండుటన్. 1610

అవనిని జంద్రుండున్ బడిన యట్టులు, రాక్షసులాక్రమింపగాఁ
గవిసి తమంబు లోకమునఁ గ్రమ్మిన యట్టులు వాహనార్థమై
భువిఁ జను నేన్గు దంత మిఁక ముక్కలె యైనటు. మండు నగ్నులా
యవి చెడి యాఱినట్లు, ధరయంతయుఁ గ్రుంగిన యట్లు చూచితిన్.
1611

వివిధంబౌ తరు లెండి ధూమిత గిరుల్ విధ్వస్త మైనట్లు న
ల్లవి బట్టల్ ధరియించి లోహ రచితాగ్ర స్థాను నాసీనుఁ బా
ర్థివు వీక్షించుచుఁ గృష్ణ పింగళ సతుల్ గేల్సేయుచున్నట్టు ధ
ర్మవిదుండౌ పితఁ గంటి గాడిద రథంబందే యవాచిన్ జనన్. 1612

ఎఱుపౌ మాల్యము గందమున్ గలిగి యందే యేగు రాజున్ పితన్
ఎఱుపౌ బట్ట విరూపమాస్యమును నెంతేఁ దాల్చి యంతన్ నిశా
చరి యొక్క ర్తు పహాసముం జలిపి యీడ్చున్ వచ్చుచున్నట్టు లీ
తఱి స్వప్నంబునఁ గంటి రాత్రి నెటు లీతర్వాతఁ గానున్నదో. 1613

నృపుఁడో రాముఁడొ నేనొ లక్ష్మణుఁడొ యిందెవ్వాఁడొ మృత్యుంగనున్
ఎపు డెవ్వానిని నైతె గాడిన రథంబెక్కన్ గలన్ జూతుమో
అపుడే వాఁడును మేన ధూమ శిఖయున్ వ్యాపింప జూడం బడున్
ఇపు డీహేతువుచేత నామనసు నింతేనిన్ బ్రశాంతింపదే. 1614

గళమో యెండెమనస్సు కుందెను వ్యథన్ గష్టాలు భావిన్ గనన్
గళనాదంబును భ్రష్ట మయ్యెను మెయిన్ గాంతుల్ నశించెన్, ననున్
గలయంజూడ జుగుప్స కల్గెడిని నానారూప దుస్స్వప్న మి
ట్టుల వీక్షించి యచింత్యుఁ దండ్రిఁ గని యెట్లున్ భీతి వో దీమదిన్.
1615

భరతుం డిట్టుల స్వప్నమున్ సఖులకున్ వాక్రుచ్చు నావేళలో
తురగంబుల్ శ్రమ పొంద దూత లపుడున్ తూర్ణంబ గంభీరమౌ
పరిఖన్ మించు పురంబు రాజ గృహ మేపారన్ బ్రవేశించి యా
భరతుం గాంచి కృతార్థులై యనిరి తత్పాదాలపై వ్రాలుచున్. 1616

"హృదితో మంత్రి పురోహితాది ప్రకృతుల్ పృచ్ఛింత్రు నీక్షేమమున్
వద ! బైల్దేరుము సత్వరంబుగ నొనర్పం దగ్గ కార్యంబ యీ
యదనన్ గల్గె నివే మహార్హ వసనా లాభూషలున్, నీకు ని
ర్వది కోటుల్ పదికోట్లు మామ కివి సంపూర్ణంబ యిప్పింపుమీ. 1617

వార లిచ్చిన భూషణ వస్త్రములను
అన్ని గ్రహియించి యనురాగ మందఱపయి
సెఱపి, కోర్కెల వారి సంతృప్తి పఱచి
భరతుఁ డాదూతలకు నిట్లు పలికె నపుడు. 1618

"నృపుడున్ తండ్రియు నైన యాదశరథుం డీవేళ క్షేమంబె కా
ఇపు డారోగ్యమె రాముఁ డట్టి యనఘుం డిష్టుండు సౌమిత్రియున్
ఇపు డారోగ్యమె ధర్మవాదినియు ధర్మేష్టాత్మ కౌసల్యయున్
ఇపు డారోగ్యమె యాసుమిత్ర కవలన్ బ్రేమించు నామాతయున్. 1619

తన లాభమె కనుఁగను కో
పనయును చండియును తన్ను ప్రాజ్ఞగ మదిలో
అనుకొనెడి కైక నాదుజ
ననని యారోగ్యంబె, యామె నాకెది చెప్పెన్. 1620

అని భరతుండు వచింపఁగ
నని రిట్టులు దూత లెవరి దగు కుశలంబున్
గనఁగోరుదొ వారు కుశలు
లెనయుత నిన్ను పద్మశ్రీయు సెక్కుము రథమున్. 1621

వ. అని దూతలు చెప్పఁగా విని భరతుఁడు నేను మహారాజు దగ్గఱ సెలవు గైకొని వచ్చెద నని యన్నవార లట్లె యన నేగి మాతామహునితో నిట్లనియె రాజా! దూతలు నన్ను ప్రేరేపించు చుండిరి నీవు మరల నన్ను జ్ఞాపకము తెచ్చుకొనులోపలనే పోయి వచ్చెదను" అని భరతుఁడు చెప్పగా మాతామహు డిట్లనియెను. 1622

నాయన! పోయి రమ్మిపుడు నాకుఁగ తల్లిని తండ్రి క్షేమమా
ప్యాయముతోడ నీవడుగు బాగుగ కైకయి సుప్రజా ! యిఁకన్
ఆయనఘున్ పురోహితుని నాద్విజులన్ గుశలంపు ప్రశ్నముల్
జేయుము రామలక్ష్మణుల క్షేమ మెఱుంగు మహార్ఘచాపులన్. 1623

వ. అని చెప్పి యుత్తమాశ్వములను చిత్రము లైన చర్మములనుకంబ
ళములను భరతుని కిచ్చి రెండు వేల బంగారు నిష్కములను పదునాఱువందల
యశ్వములను ధనమును కేకయిపుత్రునికి సత్కరించి యిచ్చెను. మఱియు
అశ్వపతి ఇష్టులును విశ్వసనీయులును గుణవంతులును నగునమాత్యులను
అతనితో గూడ పంపెను. ఐరావతపర్వత సంభవములును ఇంద్ర శిరః పర్వత
సంభవములును సుందరములు నగు నేనుఁగులను శీఘ్రముగాఁ బోవు కంచర
గాడిదలను ధనములను భరతునికి మేనమామ యిచ్చెను. అంతఃపురములో
బాగుగా పెరిగి పెద్దపులులవలె బలము గలిగి కోరలె అయుధములుగాఁ గలిగి
పెద్ద శరీరము గల శునకంబులను మండల చక్రములను రథములను నూటికి
పైఁగా గూర్చి యిచ్చెను. అంతట, ఒంటెలు, గుఱ్ఱములు కంచరగాడిదలు
భృత్యులును బయలుపెడలు భరతుని అనుసరించిరి. కాని భరతుఁడు మాత్రము
కేకయ రాజిచ్చిన యీ సకల ధనములను గమనమునందలి తొందరచే అభినం
దించఁ డయ్యెను. 1624

దూతలు మాటి మాటికిని తొందర పెట్టుట వల్ల స్వప్నమున్
ఆతఱిఁ జూచినందునను నాతని చిత్తముచాలఁ జింతిలెన్
ఆతఁడు వారణాశ్వ మనుజాన్వితమౌ స్వగృహంబు దాటి యా
తాతను మేనమామను యుధాజితు వీడ్కొని యేగె భ్రాతతో 1625

కూడ బలమును తాతకు నీడువచ్చు
నాయమాత్యులు శత్రుఘ్నుఁ డరుగుదేఱ
ఆమహాత్ముఁడౌ భరతుఁడు నపుడు వెడలె
చింత నింద్రలోకమునుండి సిద్ధుఁ డట్లు. 1626

వ. ఆ భరతుండు తూర్పు ముఖముగా రాజగృహమునుండి బయలు దేఱి సుదామానదిని చూచి దాటి తీరము దూరముగా నున్న హ్లాదినీనదిని పడమరగా ప్రవహించు శతద్రూనదిని దాటెను. ఆవల ఏలధాన మందున్న నదిని దాటి అపర పర్పటములను దేశములను అతిక్రమించి శిలలను ఆకర్షించు శిలానదిని ఆకుర్వతీనదిని ఆగ్నేయ దిక్కుగా నున్న శల్యకర్తన మను ఓషధులు గల దేశమును దాటి సత్యసంధుఁ డగుభరతుఁడు శిలావహానదిని చూచును మహాశైలములను గడచి చైత్యరథ మను వనమునకు మరలెను. అంతట సరస్వతీ నదియు పడమరగాను గంగానదియు జంటగానున్న చోటును తరించి ఉత్తరదేశము లగు వీరమత్స్యము లను, పిదప భారుండ మను వనమును చేరెను. పిదప వేగముగా ప్రవహించు కుళింగనదిని పర్వతములు చుట్టుకొని సంతోషపెట్టు యమునానదిని సమీపించి యక్కడ దిగి బలమును విశ్రమింపఁ జేసెను. అక్కడ స్నాన పానములచే శరీరము చల్లఁబఱచుకొని గుఱ్ఱములకు మేత పెట్టి స్నానము చేసి త్రాగ కొంత జలమును తమకూడఁ దీసికొని తఱచు సంచారములు లేని మహారణ్యమును భద్రమైన గజము నెక్కి దాటి మేరుప్రఖ్య మను దేశమును దాటెను. అంశధాన మను నగరమున దాట శక్యము గాని భాగీరథినిఁ ప్రాగ్వట మను పురమును దాటి పిదప కుటికోష్టిక యను నదిని బలసహితుఁడై దాటి ధర్మవర్ధన మను గ్రామమును చేరెను. అక్కడ రమ్య మైన ఆ వనమున వసించి పిదప, 1627

మనువను రాజేంద్రునిచే
తను నేపట్టనంబు నిర్మింపం బడియె యులరా
రెనా యాయయోధ్య నేఁక స
ప్తనిశలు పథి గడిపి యపుడు భరతుఁడు కనియెన్. 1628

* దూతలు సేనారహితులు గాన త్వరగా వచ్చు మార్గమున వెళ్ళిరి. భరతుడు సేనాసహితుడు గాన సేనకు వీలైన యింకొక మార్గమున వెళ్ళెను. సరస్వతీ గంగలు కలిసినచోట రెండురోజులు, తరువాత మూడవరోజు యమున దగ్గర, నాల్గవరోజు ఉజ్జిహానది దగ్గర, అయిదవరోజు సరస్వతీ తీర్థ మను చోట, ఆరవరోజు పాలపనమును, దానిని దాటినపుడు ఏడవరోజు అని తెలియునది.

ఎదుటన్ బోల్చు నయోధ్యఁ జూచి భరతుం డీరీతి ప్రశ్నించె సా
రథి ! యేమిప్పు డయోధ్య మున్పటి యటుల్ గన్పింపకే యున్నదే
అదిగో దవ్వుల నాయయోధ్య కుసుమోద్యానాఢ్యయై తెల్పు మ
ట్టిఁదగన్ వర్తిలునట్టిదేనుగద యిట్టీలాతోఁచెఁ గన్డోయికిన్, 1629

గుణులౌ యజ్వలచేత వేదములలోఁ గూలంకష ప్రజ్ఞ యొ
ప్పిన సద్బ్రాహ్మణ పంక్తిచే ధనికులై పేర్మోయు వైశ్యాది న
జ్జన బృందంబులచేత సాంద్రమయి రాజర్షుల్ నిరీక్షింపఁ బొ
ల్చు నయోధ్యన్ వినిపింప వేమి మును పట్లున్ పౌర వాగ్ఘోషముల్. 1630

మును సాయాహ్నములందు నేగి నిశలన్ మోదానఁ గ్రీడించుచున్
నినదంబుల్ పొనరించి పొంగు ప్రజలన్ దీపించు నుద్యానముల్
జనముల్ కాములు లేక యేడ్చెడి యటుల్ గన్పించె నేడేలకో
వనమైపోయి యయోధ్య పాడుపడి శూన్యంబై యికన్ దోచునే. 1631

తరులన్ నక్కి విహంగముల్ కిలకిల ధ్వానాలు వర్జించె; నీ
పుర సౌధంబుల వీణియల్ మొరయవే మున్పట్లు, భేరీ మృదం
గరవంబుల్ మును పట్లు మందిరములన్ మార్మోగవే, చందనా
గరు ధూపంబులు గ్రమ్మఁగా ఘుమ ఘుమల్ గన్పింప వేలా పురిన్. 1632

వివిధానిష్ట నిమి త్తముల్ కనఁబడున్ వేగంబుగాఁ జెప్పు బాం
ధవులున్ క్షేమము యున్నవారె గద సూతా ! కుందఁగాఁ దగ్గ హే
తువులే లేకయు నామనస్సు మిగులన్ తూర్ణంబు చింతిల్లు నెం
తొ విషాదం బగు నంచుఁ, జొచ్చె భరతుండున్ తా నయోధ్యాపురిన్. 1633

వారక పర్విడన్ సడలు వాజుల తోఁజని వైజయంతమన్
ద్వారము గుండఁ జొచ్చి యల వంగుచు జై యని ద్వారపాలురున్
బారులు తీర్చి పల్కఁ గని స్వాస్థ్యము లేని మనస్సుతోడ దౌ
వారికులన్ మరల్చి శ్రమ వందఱు కై కయిసూతుఁ డిట్లనెన్. 1634

హేతువు లేకనే యనఘ ! యింతటి తొందర పెట్టి నన్ను నీ
దూతలు నిట్లు తీసికొని తూర్ణము వత్తురె, దారుణాత్త యే
వో తల మించియున్ జరిగి యుండు నమంగళమే మనమ్మ నెం
తో తలపోయు, నాతలయు నూడి ఘువింబడు నట్టు లయ్యెడిన్. 1635

నృపులు వినాశమొందు తఱి నెట్టివి యానని విందు నట్టివే
యిపుడిట నన్ని కన్పడును నెవ్వరు నిండ్లను తుడ్చుకోరు, పా
డువడి గృహంబు లుండె నిటులన్ దలుపుల్ ప్రజ మూయకే దిగా
లు పడియు కూడుచుండరు బలుల్ పడవేయరు శ్రీలె పోయెడున్. 16'6

మాలలు కట్టకుండఁ గుసుమంబుల పూజలు లేక యుండి దే
వాలయముల్ పురశ్చరణఁ బాసెను ముగ్గులు లేక వాకిళుల్
మూలుగు చున్న యట్లు కళ పోయి కనంబడు, యజ్ఞగోష్ఠులున్
మ్రాలెను నాపణంబులును మానె, వణిక్కుల మోము లెండెడిన్. 16 7

మలినము నశ్రుపూర్ణ ముఖమై కృశ మౌచును ధ్యాన దీనమై
కళలను దక్కి యీజనము కన్పడుఁ, బాడయి రాజమార్గముల్
చెలువము దక్కి దుమ్ముడరి చేడ్పడియుండెఁ గవాట యంత్రముల్
పొలుపఱియుండె నింద్రపురిఁ బోలు నయోధ్య" యటంచుఁ గుందుచున్
1338

మది కప్రియమును గూర్చెడు
సదనముల యయోధ్యఁ జూచి సంతాపముతో
వదనము వంచుకొని జనకు
సదనమును మహాత్ము డపుడు సరగన్ జొచ్చెన్. 1639

భరతుండున్ పితృ సౌధమందు జనకున్ పైళంబ వీక్షింపమిన్
సరగన్ మాత గృహంబు చేరఁగ. ప్రవాసంబుండి యేతెంచు నా
భరతున్ గాంచి సువర్ణ పీఠి దిగి, భావంబందు నుప్పొంగి చె
చ్చెఱ హర్షంబునఁ గైక పై కెగిరి వచ్చెన్ పుత్త్రు వీక్షింపఁగన్. 1640

ఇఁక ధర్మాత్ముఁడ వైై తనర్చు భరతుఁ డేతెంచి శ్రీపోయి యుం
డి కళాహీనమ యైన స్వీయ గృహమున్ వేచొచ్చి యెంతో పవి
త్రకరం బైన స్వమాతృ పాదములపై వ్రాలంగ శీర్షంబు మూ
రుకొనన్ గ్రుచ్చి కవుంగలించుకొని యొళ్ళో చేర్చి కైకిట్లనెన్. 1641

నాయన ! వచ్చినావె కద నాయన గేహమునుండి వచ్చు నీ
కో యెవొ కొన్ని రాత్రులయి యుండఁగ వచ్చు, రథాన వేగ ని
ట్లే యరుదేఱు నీకు శ్రమ యేమియుఁ గల్గగ లేదుగాదె నీ
శ్రేయసు కోరు తాత సుఖియే సుఖియే గద మేనమామయున్. 1642

అటకున్ నెళ్ళిన నాటినుండియును సౌఖ్యం బొప్ప నున్నావె య
చ్చటి వార్తల్ వినిపింపు మోయి యని యిష్టం బెంచి ప్రశ్నింప తా
నిటు చెప్పెన్ భరతుండు పద్మనయనుం డీతాత యిల్వీడి యి
చ్చట కేతేరుట కేడురేలు గడచెను సౌఖ్యంబు నీ తండ్రియున్. 1643

తాతయు మేనమామయు యుధాజితు క్షేమము యున్న వారు నా
కాతఁడు నిచ్చినట్టి ధన మామణు లెల్లయు తెచ్చు గుఱ్ఱముల్
ఈతఁడు దారిలో నలసె నిచ్చట కల్లన నేగుదెంచు, నా
దూతలు వేగిరింపఁ గడుఁ దూర్ణమ యాగక నేను వచ్చితిన్. 1644

సరెకానీ యిది ముందు చెప్పు జననీః న్వర్ణాంచితం బైన నీ
విరిపాన్పేటికి శూన్య మౌచు నిపుడొప్పెన్, హృష్టుఁ డిక్ష్వాకు భూ
వరు డేలా కనిపింపఁ. డెప్పుడును నీ ప్రాసాదమున్ వీడ, డా
నరపాలున్ జనకున్ గనంగ నిటకున్ వైశంబ యేతెంచితిన్ 1645

ఇపుడే నేఁ జని తండ్రికాళ్ళఁ బడుదున్ హేమాత! వాక్రుచ్చు నే
నిపుడున్ దండ్రి గుఱించి నిన్నడిగితిన్ జ్యేష్ఠాంబ కౌసల్య గే
హపు వైై పేగెన లేక, చెప్పు, మన రాజ్య ప్రాప్తియే ముక్తిగా
నపు డాశించెడి కైక చెప్పె నసుఖంబౌ ఘోరదుర్వార్తయున్ 1646

అఖిల మగు ప్రాణు లనయంబు నంతమందు
నెట్టి గతి పొందుచుండునో యట్టి గతినె
యజ్ఞములు చేసెడి మహాత్ముఁ డార్యసుగతి
యధిక తేజుఁడు నీతండ్రి యందె నయ్య, 1647

ఎదియో మృత్యువె మూడి యుండు ననిమున్నె యెంచు ధర్మాత్ముడున్
మది దుశ్చింతయె లేని యాభరతుఁ డామాటల్ చెవిన్ ముల్కులై
హృదిలోఁ జొచ్చెనొ లేదొ కాని యపు డిట్టే వ్రాలి హా! చచ్చితం
చు ధరన్ గూలఁబడెన్ భుజంబులును నచ్చో వ్రేల దీనాత్ముఁడై 1648

పితృ శోకంబున మూర్ఛ పొంది వెతలన్ విభ్రాంత చేతస్కుఁడై
మతి పోవన్ విలపించె చాలవడి యామాన్యుండు తేజస్వి యీ
పితృ శయ్యాతల మెంత రమ్యమయి యొప్పెన్ మున్ను మబ్బెగగా
నతిగా నిర్మల మౌచు రాత్రి శశిచే నందంబె యౌ మిన్నటుల్. 1649

అదె యీ పానుపు నేఁడొ యట్టి మహితుండౌ తండ్రిచే శూన్యమై
మదికిన్ వేదన గూర్చెఁ జంద్రరహితం బై నట్టి యభ్రంబటుల్;
ఉదకా లెండిన సంద్రమట్లు హృది నెంతో నొంచు, నంచేడ్చుచున్
వదనంబున్ వసనానఁ దుడ్చుకొనెఁ గంటాశ్రుల్ దిగన్ మ్రింగుచున్1650

మొదలన్ గొడ్డలి దెబ్బ తిన్న తరువుంబోలెన్ క్షితిం బడ్డ యా
బుధ సంకాశుని మత్తహస్తి సదృశున్ సోమార్కభాసున్సుతున్
వ్యథచే గుండెడు వానిఁ దల్లి గని లేవన్ గేలఁ బై కెత్తి పెం
పొదవన్ బల్కెఁ బరుండు వేళ సుయశా! యోరాజ! లేలెమ్ముఁకన్ 1651

నినుఁబోల్ సజ్జనులున్ సభావిదులు సుంతేనిన్ వ్యథన్ బొందరే
మిని! నీబుద్ధియొ దానయజ్ఞ సభలన్ మేలౌచు సద్వర్తనన్
ఘనమై విద్యల పారముం దెలిసి యర్కజ్యోతి వోలెన్ దన
ర్చునె, నీవంటి మహాత్మ లేద్వఁదగ దంచున్ మాత పల్కెన్ వెతన్.1652

చిర కాలం బుటు లేడ్చి యేడ్చి భువిపైఁ జింతన్ వడిం దొర్లుచున్
భరతుం డార్తిని చుట్టుకోఁ బడి యనెన్ "తల్లీ! నరేశుండు ని
త్తఱి రామున్ యువరాజుఁ జేయునొ లసద్యజ్ఞంబె గావించునో
యరయన్ తండ్రియుఁ బంపెనోయని ప్రయాణంబై ముదం బొందితిన్ 1653

అది యెల్లన్ దలక్రిందు లాయె మదియోయాయావేదనం బొందు, నా
యుదితాత్మున్ బ్రియుఁడౌ పితన్ గనను నాయుత్సాహమున్ చచ్చె నే
మిదియమ్మా! పిత యేల పోయె రుజయా, యేన్ రాకముందే చనెన్
బుధుఁ దండ్రిన్ దుదిఁ గొల్చు లక్ష్మణుఁడు రాముం డెంత ధన్యాత్ములో 1654

బహుశా కీర్తిధనుండు రాజిటుల, నేపై శంబ యేతెంచుటే
యిహలోకాన నెఱింగియుండఁడె కదా! యే వచ్చుటే తెల్పినన్
బహురక్తిన్ పిత వంచి శీర్షము, వెసన్ నన్ మూర్కొనుం గాదె యా
బహు సౌఖ్యం బిడతాకి కష్టమె యొనర్పంబో నికే లేదిఁకన్ 1655

పథిలో దుమ్ములలోన నాడెడి ననున్ బైకెత్తి దుమ్మెల్ల దు
ల్పి దమిన్ బ్రేమను నెత్తి కొంచు వడినాడించెంగదా, యట్టి యా
బుధు హస్తం బెది. నాకు నున్న పితయున్ బూజ్యుండు బంధుండునై
వ్యథయే పెట్టని రాముఁ డేడి చెపు మంబా! నేనొ తద్దాసుఁడన్ 1656

అన్నయె తండ్రి, ధర్మవిధుఁడై తగు నన్న పదాంబుజంబులన్
గ్రన్నన వ్రాలి పట్టుకొని కాంచెద ధన్యత, నాతఁడే యిఁకన్
నన్నుఁ దరింపఁ జేయు గతి న్యాయపరుండును సత్యసంధుఁడున్
సన్నుత ధర్మ నిత్యుఁడును సత్య దృఢ వ్రతి, ధర్మవేత్తయున్ 1657

ఘనసత్యంబె పరాక్రమం బయిన యాత్మనాథుఁడే మేమి ప
ల్కెను, నమ్మా! తుది నాదు తండ్రి యిడు సందేశంబు వాక్రువ్వుమీ"
యనఁ గైకేయి వచించె నెల్లరకు దిక్కౌ నామహాత్ముండు నో
య్యన రామా! యని సీత! లక్ష్మణ! యటం చార్తిన్ జనెన్ స్వర్గమున్
1658

సీతతోఁ గూడను తిరిగి చేరినట్టి
రాముని మహాభుజుం డైన లక్ష్మణు నిఁక
ఏనరులు మరల నిట వీక్షించువారొ
ఆనరులె ధన్య జన్ములై యవని నింద్రు 1659

అనుచు రెండవ యప్రియమైన మాట
అమ్మ చెప్పుటవల్లను నాలకించి
యెంతయో విషాదమున శోకించి యతఁడు
మరల నీరీతిగ నడిగె మాత నపుడు. 1660

"పృథివిఁ గౌసల్య నానంద పెట్టు నట్టి
పరమ ధర్మాత్ముఁడౌ రాముఁ డనుజుఁడైన
లక్ష్మణునితోడను తన యర్థాంగియైన
సీతతోఁ గూడి యెట కేగె మాత! చెప్పు." 1661

భరతుఁ డిట్లని యడుగంగ జరిగినట్టి
దెల్ల జరిగి నట్లుగ వచియింపఁ దలఁచి
భరతుని కిది ప్రియమగు నన్ భావ మొప్ప
భరతు తల్లి యప్రియ మొకపరిని చెప్పె. 1662

"నాయనా! రాజసుతుఁడు దండకవనంబు
లక్ష్మణుఁడు సీత రాగ వల్కలము లూని
యేగె" నన నన్న నడత శంకించి యతఁడు
వడి కులమహిమ చెడెనో యం చడలి యనియె. 1663

"మఱి యే బ్రాహ్మణుసొమ్ము రాముఁడు హరింపన్ లేదుగా యెన్నడేన్
దురిత స్వాంతుఁడె కాని యాఢ్యుని దరిద్రుం గాని చంపండుగా
పరదారన్ నృపసూనుఁడే యభిలషింపంబోడు గాదే యిఁకన్
మఱి యే హేతువుచేత గెంటఁబడెఁ గానల్, బ్రహ్మహంతన్ వలెన్." 1664

అనఘుఁడౌ భరతుండొ యాతురతతో నాలింప సమ్యార్థమౌ
మన సొప్పారఁగ నుబ్బి లోని ముదముం బట్టంగ లేకప్పుడే
వినుపం గోరుచు స్త్రీస్వభావముననే వే పండితం మన్యయై
అనె నా చంచల కైక స్వీయ ఘనకార్యంబున్ యథాతథ్యతన్ 1665

మఱి యే బ్రాహ్మణు సొమ్ము రాముఁడు హరింపన్ లేద, యెన్నండుతా
దురిత స్వాంతుఁడు గాని యాఢ్యుని దరిద్రుం గాని చంపండ, యే
పరదారన్ గననే కనం, దరయుచున్ రామాభిషేకంబు, భూ
వరు నేఁగోరితి నీవు రాజ్యము, వనం బారాముఁడున్ పొందఁగన్. 1666

తన సత్యంపు ప్రతిజ్ఞ నిల్పుకొన నీ తండ్రే యిటుల్ దీనిఁ జే
సెను, సౌమిత్రియు సీతరా, వనిఁ జనెన్ శీఘ్రంబుగా రాముఁడున్
ఘనుఁడౌ రాజు యశస్వి యిష్టుని సుతున్ గన్గొక యాకూర్మి పు
త్త్రుని బెంగన్ భరియించలేకయు దివంబున్ బొందెలే నాయనా. 1667

ఈవో యిప్పుడు చేయఁ దగ్గ పనియా యేమంటెఁ నేఁ జెప్పెదన్
నీవాలింపుము: నీవౌ రాజ్యము త్రుటిన్ నీచేతఁ జిక్కించుకో
నే వేగన్ నిఖిలం బిటుల్ సలిపితిన్ నీకై; వ్యథన్ వీడు, శో
కావేగంబును నేల పొందెదవు. ధైర్యం బూని వర్తించుమీ. 1668

నగరం బంతయు నీయధీనమె, యికన్ రాజ్యంబొ నిర్బాధమున్
తగ నీవేగి వసిష్ఠుఁ డాది విధి వేత్తల్ చెప్ప శీఘ్రంబుగా
తగు సంస్కారము చేసి దైన్యమబలత్వం బైన లేనట్లు చ
క్కఁగ రాజున్ పొసరించి నిన్ను నభిషేకం బీపె గావించుకో 1669

అని కైకేయి వచింపఁగా హరహరా ! యంచున్ జెవుల్ గట్టిగా
తన హస్తంబులతోడ మూసికొనుచున్ రామానుజు డంత క్షో
ణిని కూలం బడి రామ! రామ! యనుచున్ దీనంబ పెక్కేడ్చి హా!
యని నేలంబడి సంజ్ఞ వీడి కడు నొయ్యన్ తెల్వి రా నిట్లనెన్. 1670

చచ్చితిని నేను నీచే
చచ్చెను పతి లోకమెల్లఁ జచ్చెను కుమతీ!
ఇచ్చెడు గెవ్వరు చెప్పిరి
హెచ్చిన పని యిది యెవరికి! నెటు చేసితివే. 1671

చంపితివి పతిని రాజును
పంపితి మునిఁజేసి రాము వనవాసముకై
ఇంపుగ భుజింప రాజ్యము
నొంపుగ నిదె గద్దెఁ గూరుచుంటివె కుమతీ! 1672

కృతి రాము వనికి గెంటియు
పతి కంఠము పిసికి చంపు త్వద్గర్భములో
మతిచెడఁగా బదినెలలన్
వెత గడిపియు హా! జగముల నింద్యుఁడ నైతిన్. 1673

మెడలో నురిపోసి కొనియొ
తడఁబడకయె ఘోరవిషము త్రాగియొ పాపీ!
కడువడి నీళ్ళనొ యగ్నినొ
విడువక పడి ప్రాణములను విడు దుర్మేధా! 1674

అనఘుం డగు రఘురాముని
యనుజుఁడు భరతుండు మాతృహంతకుఁ డని రా
ముని కపయశ మగు నేమో
యనె కాక యిపుడు నిను హత మార్చియె యుందున్. 1675

అని పరుషంబుగఁ బలుకుచు
కనులన్ దగులంగఁ బెట్టు కరణిని నల్కన్
తను భరతుఁడు కనుచుండన్
తనయుని గైకేయి కాంచి తగ నిటు పల్కెన్. 1676

నీకేమిటి యపకారము
నాకావించినది యేల నన్ఁదిట్టెదు ని
న్నే కని పెంచిన యందుకః
నీ కోరిక తీర్ప కేది నేనుంటినిరా. 1677

నీదు పిత స్వర్గ మొందెను
సోదరులా ప్రవాస మేగి చొచ్చిరి వనముల్
నీదీ రాజ్యము హాయిగ
వేఁదగ నీవేలుకోక పేలెద స్వైరా. 1678

వ. అని కైకేయి పలుకఁగా భరతుఁడిట్లనెను.

అసలే తండ్రిని. తండ్రిఁబోలు ననఘుండౌ నన్నఁగోల్పోయి యా
యుసురే పోయిన నాకు రాజ్యపు సుఖం బుండేమి లేకుండి యే
మసలే దుఃఖము మీద దుఃఖము పడె న్నాపుండుపై నుప్పు చ
ల్లి సతాయించెదు, రాముఁ బోనడచి తండ్రిం జంపితే రాక్షసీః 1680

కులమున్ గూల్చెడి కాళరాత్రివలె మాకున్ దాపురం బైతి, వా
కులదైవం బగు తండ్రి చిచ్చు వని కన్గోకుండ నే కొంప ని
ప్పుల పాల్సేసి కొసెన్, మదిష్టకులదేవున్ జంపి మోహాన ఈ
కులమందున్ సుఖశాంతు లుండనటు పై కొన్నావు వంశాంతకీః 1681

ఆ కౌసల్య సుమిత్రయు
కైకాః సుత దుఃఖదగ్ధగాత్రలె యయి యా
నాకన్న తల్లి నిను గని
హాః కటః యిఁక బ్రదికిర యతి దుష్కరమే. 1682

ఏమె మహాత్ముం డన్నయొ
నీమీఁదను మాతృభక్తి నెఱపును గాదే
ఆ మాతా పితృభక్తుఁడు
ఆమాతనువలె నిను నెపు డర్చించెఁగదే 1683

ఎల్ల యెప్పుడుఁ గౌసల్య జ్యేష్ఠ యైన
నాజనని దీర్ఘదృష్టియున్ గలదె యౌచు
భగినియుం దట్లు నీయందు మిగుల ప్రేమ
నిండుగాఁ గల్గి వర్తించుచుండెఁ గాదె. 1684

అటువంటి యామె పుత్త్రుని
అటువంటి సుధర్మమూర్తి నటు వల్కలముల్
ఎటొ కట్టఁబెట్టి యడవికి
కట! పాపీ! గెంటి యెటులఁ గటకటఁ బడవే. 1685

బహులుబ్ధ వెఱుఁగ వెంతటి
బహుభక్తిని రామునందు వర్తించెదనో
అహహా! కనుకనె యిట్టుల్
బహుళానర్థకరి వైతి రాజ్యము కొఱకై. 1686

మనుజ శ్రేష్ఠు లయిన రా
ముని లక్ష్మణుఁ జూడకుండ మూఢుఁడనై యే
మని యేసామర్థ్యముచేఁ
గనికావ మత్ప్రహింతు ఘనరాజ్యంబున్. 1687

బలయుతుఁ డగు రాముని పెన్
బలమె గొని మహాబలుఁ డయిన మహారాజున్
అల మేరువు తన వనమును
బలె నాశ్రయ మొందియేలె వర రాజ్యంబున్. ;688

ఘనవృషభము మోయు బరువు
చిన గిత్తయు మోయలేని చెన్నున నేనున్
ఘన మైన రాజ్య భారము
కని యెటు మోయఁ గల, నెవని ఘన తేజముచే 1689

ఇటు లనుటెందుకు పోనీ
పటుశక్తిని నేలఁ గల నుపాయాదులచే
ఇటుకేవల సుతుసౌఖ్యమె
దిటవుగఁగను నీదు కోర్కెతీర్చనుస్వార్థా! 1690

పాపపు దుర్బుద్ధి కలుగు
పాపిని నిను విడువ శంక పడకయె పోదున్
ఆపావనుండు రాముం
డేపట్టునఁ దల్లిఁబోలె నినుఁ జూడనిచో. 1691

సాధు గతినుండి పడి-మన
యాదిపురుషులును నసహ్య మొందెడి పాడౌ
ఈ దుర్బుద్ధియె యెట్టుల
నీదు మనసునందు పుట్టెనే పాపాత్మా!. 1692

మనపూర్వుల వంశములో
ననయము జ్యేష్ఠుండె రాజ్య మందుచు నుండున్
వినుతాచార మిది కడమ
యనుజులు తత్కార్యములను ననువర్తింతుర్. 1693

ఓసి నృశంసా! నీవో
శాసించెడి రాజధర్మ సంగతె కనవున్
శాసకు లగు రాజుల స్థిర
మౌ సద్వృత్తమును గూర్చి యరయవు కూడన్. 1694

నిరతము రాజ్యములోపల
స్థిరముగ జ్యేష్ఠసుతుండె యభిషేకింపఁ బడున్
మరియు విశేషించి సకల
పరమేక్ష్వాకుల కదెట్టి వట్టున సమమే. 1695

ఇల ధర్మమె రక్షణయయి
కుల శీలంబున వెలుంగు క్షోణీశుల యా
కులధర్మము నిమఁబట్టియు
నిలువక మరలింపఁబడియె నిఖిల జగాలన్ 1696

ఓసి: మహాభాగా; జ
నేశ కులజుల కులమున జనించినదానా!
ఈ సకల విగర్హితమగు
నీసుతు వ్యామోహ మెట్లు నీయం దొదవెన్. 1697

ఎది యెటులైనను నీకో
ర్కెకు దీర్ప నేమాత్ర మైన ధృతపాపాత్మా!
ఇదె నా జీవిత మంతయు
తుద గావించు యతనమున దొరకొంటివె గా 1698

ఇదిగో నిపుడె నీ కప్రియ
మొదవించుటకై మహాత్ము నుత్తము నన్నన్
ముదమును గూర్చెడి వానిం
బదపడి విపినంబునుండి మరలింతుఁ జుమీ. 1699

మరలించి మహాతేజో
ధరుఁ డగు రఘురామునికిని తత్పర మతినై
స్థిరమైన యంతరాత్మను
స్థిరముగ దాసుండ నగుచు సేవ యొనర్తున్. 1700

అనుచు మహాత్ముఁడు భరతుం
డని యింక నప్రియతమోక్తు లాడుచు కడునా
మెను బాధపెట్టి గర్జిం
చెను గిరికందరమునఁ గల సింహమువోలెన్. 1701

అని యిటు భరతుండు తల్లిని
ఘనముగ నిందించి పలికి క్రమ్మఱ నిటులన్
ఘన రోషం బావేశిం
ప నొడ లెఱుంగక మఱి మఱి వచియించె నటన్. 1701

రాజ్యమున నుండి కైకేయి! భ్రష్ట వగుము
క్రూరురాల ఓపాప! దురాచారురాల!
ధర్మమును విసర్జించినదాన వగుచు
నన్నుఁ జంపి నాకయి రోదనంబు లేల 1703

వేరికిని చావుగాని యావిపిన మేని
నీ నిమిత్తాన నొకపరి నెగడె, నట్టి
రాజుగాని ధర్మాత్ముఁడౌ రాముఁడేని
ఏమి నిన్ను దూషించిరే యీవ చెప్పు. 1704

ఈకులంబునకు వినాశ మీవు గూర్చి
బ్రహ్మ హత్యను పొందిన పడతి వైతి
నరకమును పొందుమో కైక తొరగనీవు
భర్తతోడి లోకము నీవు పడయఁదగవు. 1705

ఘోర మైనట్టి కర్మను మీరిచేసి
నీవు పాపము గట్టు కొన్నావు కాన
ప్రథిత లోకప్రియుండైన రాము వీడ
నాకుఁ గూడ కడుభయమున్ గలిగె నిపుడు. 1706

నీకొఱకు నాదు పిత మరణించె నింక
రాముఁడో ఘోర మైన యరణ్య మేగె
జీవ జగమందు నీవల్ల చెడ్డ కీర్తి
ప్రాప్త మైనది గాదె యో దురాత్మురాల!. 1707

జనని వేషము దాల్చిన శత్రువీవు
క్రూరురాల! యోసి! రాజ్యలోభురాల!
దుష్టమతి! పతిఘాతిని! కష్టురాల!
ఇంక నాతోడ నీవు భాషింప వలదు. 1708

ఆకౌసల్య సుమిత్రయు
కైక! కలుషరాల! యింకఁ గలిగిన మాతల్
ఈకులపాంసని నినుఁ గని
శోకం బెంతగనొ పొంది క్రుస్కిరి కాదే. 1709

ప్రియ ధర్మరాజు ధీయుతుఁ
డయి తగు నశ్వపతి కీవొ యాత్మజవె కా
వ, యతని యింటను రాక్షసి
వయి పుట్టితివి పితృ వంశ మఖిల మడంపన్. 1710

సతతము సత్య పరాయణుఁ
డతి ధర్మాత్ముఁ డగు రాము నడవి కనిపి నా
పితృదేవుని త్రిదివమునకు
వెతఁ బంపిన రాక్షసి వెటు ప్రియసతి వౌదే 1711

సకల లోకాప్రియవుకలుష ప్రధాన
వయిన నినుఁబట్టి పితృ పరిత్యక్తుఁడ నయి
భ్రాత లిద్దఱిచేతను వర్జితుండ
నయిన నన్ను ను నీపాప మాక్రమించె. 1712

అతి ధర్మను కౌసల్యను
పతిపుత్ర విముక్తఁ జేసి పాపము చేయన్
కృతనిశ్చయ వగు నీకున్
గతి యెది ప్రాప్తించు; నొక్క నరకమె తక్కన్. 1713

నిరతము బంధుల కాశ్రయ
పరుఁడయి కౌసల్యకనిన వరసుతుఁ డయి యిం
దఱకన్న యయిన పితృసము
వరరాము నెఱుంగ వైతి బహుళక్రూరా!. 1714

సకలాంగంబున నుండియు
నిఁక ప్రతి యంగమున నుండి హృదయము నుండిన్
ప్రకటమయి ప్రియుఁ డగుట మా
తకు సుతుఁడె ప్రియతముఁడు తదితర బంధులలో 1715

ఒకపుడు సుర పూజిత యయి
న కామధేనువు-శకముల నాగలి మెడపై
నిఁక దాల్చి మోయు వత్సల
వికల మనస్కలఁ గనుఁగొని వెతఁ జెందికడున్. 1716

పగలింటి మధ్య నెండల
మిగులన్ రోజుచు బడలి శ్రమించెడి వత్సల్
వగఁ గని వత్సల వ్యథచే
పొగులుచుఁ గన్నీళ్ళఁ దడియు మొగమున నేడ్చెన్. 1717

అపుడె యటఁ గ్రిందఁ జను స్వ
ర్గపతి తనువు పయిని నశ్రుకణములు పడియెన్
అపు డతఁడు దివి వగచు వే
లుపుటావును జూచి దోసి లొగ్గియుఁ బలికెన్. 1718

మాలో నెవ్వరి వల్లను
ఏలీలను నీకు కష్ట మేర్పడదు గదా"
ఏలకు నీ కీశోకము
చాలఁగఁ గల్గెను వచింపు సర్వ శుభాంగీ! 1719

అని దేవేంద్రుడు పల్క వాక్చతురయౌ నాకామగోవప్పు డి
ట్లనె పావంబు శమించుగాక సురలోకాధీశ! మీలోన వే
రును నేమాత్రము బాధపెట్టరు, స్వపుత్రుల్ పొందు కష్టంబులన్
కని యేడ్తున్ కృషికుల్ స్వవత్సల నెటుల్ కష్టాల పాల్సేతురో 1720

కశలన్ గొట్టుచు నెండలో నడుపుచున్ కష్టంబులన్ గర్షకుల్
స్వసుత శ్రేణికిఁ బెట్టుచుండెద రహో నామేన జన్మించి యి
ట్లు సమస్తం బగుయాతనల్ మిగుల పాటుల్ పొందుచున్నారు కా
న సుఖం బొందక యేడ్తు పుత్రసదృశుండౌ నిష్టుఁ డేడీ భువిన్. 1721

ఏకామధేను సంతతి
యీ కృత్స్న జగతి వేలె యెసగఁగఁ గనెనో
ఆకామధేను వెతగని
"యీ కొడుకె సకల ఘనుఁ" డని యింద్రుం డనియెన్. 1722

తనదు నొడలిపైని సువా
సనఁ జల్లుచు పడిన యశ్రుజాలము నెల్లన్
గని కామధేనువును మది
ఘనుఁ డింద్రుఁడు శ్రేష్ఠురాలిగాఁ దలపోసెన్ 1723

సమమున్ సాటియు లేని వృత్తమున భాసం బెందు నావేల్పు టా
వె మదిన్ లోకపు సంగ్రహేచ్ఛను స్వభావేష్టాన వేల్ సంతతిన్
క్షమలో వ్యాప్తము చేసియున్ వగఁచునే గాదేమి ఒక్కండ జ
న్మమునే పొందిన రాము వీడి యెటులన్ గౌసల్య వర్తించునే. 1724

ఏకైక పుత్త్రుఁడే గల
యాకౌసల్యను సుతరహిత యగు నట్టుల నీ
వే కావించితి, విహపర
లోకంబులలో సుఖ మవలోకింపవు లే. 1725

నే నన్న పూజ చేసెద
నే నుతచరిత పితృకర్మ నియతిన్ జేతున్
మానుగ కీర్తిని వర్ధిల
గా నొనరించెదను నిందుఁ గన సంశయమున్. 1726

అమహిత బాహుని రఘు
రాముని బలుఁ గోసలేంద్రు రావించి తగన్
ఆమౌని సేవితం బగు
శ్యామల విపినంబు వేగ స్వయముగఁ జొత్తున్. 1727

నీ విట్టి ప్రకారంబుగ
కావించిన పాప మ్రశుకంఠంబులతో
ఈవిశ్వము కనుచుండన్
నే వేచి సహింపలేను నిజ పాపమతీ ! 1728

నీ పగ్ని లోనఁ జొచ్చుము
నీ వాదండకవనికిని నీయంతనె పో
నీవురి మెడఁ బోసికొనుము
నీవింతకు మించి చేయ నెగడద యేమిన్. 1729

రాముండు సత్యవీర్యుఁడు
క్షేమంబుగ రాజ్య మొంది క్షితి పాలింపన్
నీమమ పాప మడఁచి కొని
భూమిని నేధన్యుఁ డగుచుఁ బుణ్యుఁడ నవుదున్. 1730

అనుచున్ గానలఁ దోమరాంకుశములొయ్యం గుచ్చఁగాఁ బట్ట యే
న్గును బోలెన్ బుసకొట్టు పాముకరణిన్ క్షోణిన్ వడిం గూలి యె
ఱ్ఱని కండ్లన్ వసనంబులున్ సడల సర్వాభూషలున్ రాల భూ
మిని గూలెన్ భరతుండు, నుత్సవములై పో నింద్రుకేతుంబలెన్. 1731

చిర కాలానకు లేచి సంజ్ఞ గని యాశ్రేష్ఠుండు కన్నీటితో
భరమౌ కన్నుల- దీనయైన జననిన్- పై కెత్తి వీక్షించి యా
దరి కేతెంచిన మంత్రు లందఱకు మధ్యన్ వార లాలింపఁగన్
భరతుం డిప్పుడు నింద చేసె జననిన్ వాక్రుచ్చె నీరీతిగన్. 1732

ప్రభు రాజ్యంబును గోర నాజనని చేరన్ సంప్రతించన్ గదే
ప్రభు వీక్షించిన యౌవరాజ్యపదవీ నార్థన్ వినన్ లేదుగా
ప్రభు రాజ్యానకె దూర దేశ భువులన్ శత్రుఘ్నుతో నుండితిన్
ప్రభు వృత్తాంతము నేనెఱుంగకయు నెట్లైనన్ వినన్ గోరుదున్. 1733

వ. మఱియు ఆమహాత్ముఁడైన రాముని వనవాసమును, రామునితోఁ గూడ సీతయు లక్ష్మణుఁడును వనమువ కేగుటయు నెఱుంగను" అని యా మహాత్ముఁడైన భరతుఁడు ఆక్రోశించుచుండ నాభరతుని రోదన శబ్దమును తెలిసికొని కౌసల్య సుమిత్రతో నిట్లనియె. "క్రూరకర్మురా లయిన కైకేయి సుతుఁడు భరతుఁడు వచ్చినట్లు తోఁచుచున్నది. దూరదృష్టి గల యాభరతుని చూడ గోరుచున్నాను. రమ్ముపోదము". అని సుమిత్రతోఁ బలికి వివర్ణవదనయు కృశయునై వణఁకుచు చైతన్యము లేని యాకౌసల్య బయులుదేఱెను. ఆభరతుఁడు కూడ శత్రుఘ్నునితోఁ గూడి సరిగ ఆసమయముననే కౌసల్య గృహమునకు బయులుదేఱెను. అపుడు దుఃఖార్తురాలై చైతన్యము నశించి యున్న కౌసల్యను చూచి యా భరత శత్రుఘ్నులు దుఃఖార్తులై యామెను గ్రుచ్చి కౌగలించుకొనిరి. అపుడు ఏడ్చుచు మనస్విని యగు కౌసల్య య్యేడ్చు చున్న భరత శత్రుఘ్నులను చగ్గఱకు తీసికొని ఖిక్కిలిగ నేడ్చుచు భరతునితో నిట్లనెను, 1734

కైక చేసిన దారుణ కర్మచేత
అకట ! శీఘ్రంబ యీసమయంబునందె
ఇదిగో నీరాజ్యము నభిలషించు నీకు
కంటకమె లేని రాజ్యమె కదలివచ్చె. 1735

నారబట్టలు కట్టించి నాదు సుతుని
క్రూరదర్శిని యగు కైక దూర వనికి
అంపి నందువలన నిపు డామె కేమి
లాభ మదివచ్చె గుణమేమి లబ్ధ మయ్యె. 1736

మేలి బంగారు బొట్టుతో మెఱయుచుండు
ఆయశస్వి నాసుతుఁ డెందు నరిగినాఁడొ
అచ్చటికె నన్నుఁ గూడను నతిగ త్వరగ
నంపుటకును కైకేయియె యర్హురాలు. 1737

పోని లెమ్ము సుమిత్ర నాతోను రాఁగ
అగ్ని ముందుంచుకొని రాము నరయఁ బోదు.
స్వేచ్ఛ నీవేన్ స్వయముగఁ దీసికొని పొమ్ము
రాముఁడు తపస్సు చేయు నరణ్యములకు. 1738

ఇదిగొ నీకిప్డు ధన ధాన్య రథ తురంగ
హస్తియుత రాజ్య మామెయె యప్పగించె"
ఈ మొదలగు తీవ్రోక్తుల నామహాత్ము
హెచ్చి పుండుపై సూదటుల్ గ్రుచ్చ వగచి. 1739

అంత సంభ్రాంత చిత్తుఁడై యామె కాళ్ళఁ
బడుచు బిట్టేడ్చి స్మృతి వీడి వడిగఁ దేఱి
భరతుఁ డంజలి పట్టియుఁ బలికె నిట్లు
చాల శోకాల స్రుక్కు కౌసల్యతోడ. 1740

అనఘున్ సజను సత్యసంధు గురు మాయన్నయ్య నెట్లే నియున్
వనికిన్ సమ్మతి నిచ్చి నేనె కనుకన్ బంపించియుంటేని యెం
దనయంబున్ శ్రుతి శాస్త్ర యుక్త విధిఁ జేయం బోక దుర్మార్గ మం
దునె యున్నట్టి ఖలుండు పోవుగతిఁ బోదుం గాక యిప్పట్టునన్. 1741

విను పాపాత్ములఁ గొల్చి హీనుల గతిన్ వే పొందుదుంగాక తా
పను మోమై మలమూత్రముల్ విడుచు పాపం బొందుదుఁ గాక త్రో
వను నిద్రించిన గోవుఁ దన్నిన మహాపాపంబు నేఁ బొందెదన్
వనికిన్ సమ్మతి చూపి నేనె కనుకన్ మాయన్నఁ బంపించితేన్. 1742

వివ:- తాపనుక=సూర్యుడు. తపనస్తాపాపకురవి=సంసారార్ణవము.

భృత్యులచేఁ బనుల్ చేయించి యూరక
పంపించువాని పాపమును గాంతు
సూనుల పోలిక ప్రాణుల పోషించు
పతి దూఱు వాని పాపము గాంతు
ప్రజతగ నేలక పన్ను నారవ పాలు
పడయు భూవిభుని పాపమును గాంతు
యాగాన దక్షిణ లర్పింతు నని చెప్పి
యీయని వాని దుష్కృతము గాంతు

హయ రథ కరి శస్త్ర యుత రణాగ్రమందు
ధర్మ మరయుని నరు దుష్కృతము గాంతు
అనుమతించి మాయన్నను వనములకును
నేనె పంపించి యుందున యేని తల్లి! 1743

యోగ్యుఁడై గురు విచ్చు నుపదేశము వణంచు
దుష్టు పాపమును పొందుదును గాక
ఆజాన భుజు రాము నర్కేందు సముఁ బీత
గతుఁ జూడ లేని దుష్కృతమె యవుత
పులగంబు క్షీరాన్న మల పురోడాశంబు
వృథ తిని గురుదూఱు వృజిన మవుత
గోవులఁ దన్నియు గురుల దూఱి, సఖుల
ద్రోహము చేసిన దురిత మవుత

నమ్మి యే కాంతమునఁ జెప్పి నట్టిమాట
ప్రకట పఱచిన దుష్టు పాపమును నవుత
అనుమతించి మాయన్నను వనములకును
నేనె పంపించి యుందున యేని తల్లి! 1744

ప్రత్యుపకృతి చేయని వాఁడు వర్జితుండు
సిగ్గు లేని వాడకృతజ్ఞుఁ డెగ్గు తలఁచు
వాఁడు పొందెడి గతి పొందువాడఁ జుమ్మి
వనికి రాము ననుమతించి పంపి తేని. 1745

తనయింట సతి సుతు లనుచరుల్ చుట్టఁగ
మృష్టాన్నము తిను దుష్కృతమె యవుత
తగు పత్నులఁ గనక ధర్మ కార్యము లేక
చని పోవు నరుకలుషంబె యవుత
తనపత్ను లందు సంతతి గనక చిరాయుఁ
బడయని వాని పాపంబె యవుత
నృపకాంతుల బాలవృద్ధులఁ జంపెడి
వాని- భృత్య త్యాగి పాప మవుత

లక్క లోహము తేనెయల్ మాంస విషము
లమ్మి బంధులఁ బెంచు పాపమ్మె యవుత
రణము దరి రాఁగ శత్రువుల్ భయము పెట్టి
పాఱి పోఁ జంపు వాని పాపంబు యవుత. 1746

వృష్ణిచేతను దాల్చి ముఱికి బట్ట ధరించి
పిచ్చితో ముష్టి సేవింత్రు గాక
మద్యమున్ వనితలన్ బాచికల్ సేవించి
క్రోధ కామాలఁ దిర్గుదురు గాక

ధర్మంపుమతిలేక ధర్మమే వీడి య
పాత్రుల కిడువాని పాపంబె యవుత

దాచిపెట్టు వివిధ ధనముల దొంగలు
కొల్ల గొట్టుచును వేగుదురు గాక

రెండు సంధ్యలయందుఁ బరుండు వారు
పాప మయ్యది మిక్కిలి బడయు చుంద్రు
అనుమనించి యాయన్నను వనములకు
నిట్టులన్ బంపి యుండిన యట్టివారు. 1747

గురుభార్యఁ గలియు వాఁడును
మఱి యిండ్లకు నిప్పు పెట్టు మానవుఁడున్ క్ర
మ్మఱ మిత్రద్రోహియుఁ గను
నరకమె గను రాము వనికి నడపిన వాఁడున్, 1748

దేవతలను పితృదేవతలను మాతృ
పితలను కొల్వక వెలయువాఁడు

సుజన లోకమునుండి సుజన కీర్తుల నుండి
పతివ్రత కృతినుండి జాఱువాఁడు

మాతృ శుశ్రూషను మాని యనర్థమౌ
పనిలోనఁ దిరుగుచుఁ దనరువాఁడు

బహు పుత్రయుక్తుఁడై బహు దరిద్రార్తుఁడై
జ్వరరోగియై బాధపడెడు వాఁడు

ఆశపడి దీనులై పైకి నక్షు లుంచు
యాచకులను నిరాశతో నంపువాఁడు
ఎట్టి కష్టంబులను పొందు నట్టి కష్ట
మందు నెపుడు రాముని వని కనుపువాఁడు. 1749

పరుషుడై లోభియై కరమశుచి యయి మా
యనధర్ముఁడౌ నరుఁ డందుగతిని
సతి ఋతుస్నాతయై ఋతుకాల మాశించు
నింతిఁ ద్రోసెడు దుష్టుఁ డెనయు గతిని
ధర్మపత్ని విడి యితరపత్ని సేవించి
ధర్మ దూరుఁడు పొంద దగిన గతిని
ప్రకట సంతతి పోవు బ్రాహ్మణు లొందెడు
నధిక దారుణ మైనయట్టి గతిని

త్రాగఁ దగు నట్టి మంచి జలంబు పాడు
చేయు నరుఁడు, విషము పెట్టు చెడ్డ నరుఁడు
పొందు నట్టి వేదన పొందు నెపుడు
రాము వని కనిచిన యానరాధముండు. 1750

బ్రాహ్మణులకు చేసెడి పూజ పాడు చేయు
కల్మషుఁడు బాల వత్సను గవినిబిదుకు
వాఁడు పొందు దారుణగతి పడయు నెపుడు
రాము వనికి పనిచిన నరాధముండు. 1751

దప్పికను నీరు గోరు నాతనికి నిడక
భక్తితో తమ తమదు దేవతలఁ గొలుచు
చుండి వివరింపగాఁ గనుచుండి యుఱక
విడక కలహించువాని యాచెడుగు నొందు
రాము వనికి పనిచిన నరాధముండు. 1752

అని కావించెడి కష్టమైన శపథా లాలించి, నిశ్చేష్టుఁడై
వనటన్ భూమిని సడ్డయాభరతునిన్ బైకెత్తి కౌసల్య యి
ట్లనె బిడ్డా యిదె నాదు బాధ నీఁకమర్లన్ పెంచుచున్నావ యి
ట్లనువౌ రీతిగ నొట్లుపెట్టు కొనుచున్ ప్రాణంబులన్ తీతువే. 1753

నీమతి యదృష్ట వశమున
నేమాత్రము చెడఁగ లేదు నిజము శుభాత్మా!
ఈమహి సత్యవ్రతుఁడవు
రాముని కటు సాధు జగము ప్రాప్తం బగుతన్. 1754

అని యొడిలోఁ జేర్చుకొనుచు
ననయమ్మును భ్రాతృవత్స లాత్ముని భరతున్
ఘనబాహుని గౌఁగిట నిడు
కొని కౌసల్య కడువెతలఁ గుందుచు నేడ్చెన్. 1755

ఇటు విలపించుచు వ్యధచే
కట కటఁ బడు నామహాత్మ కరుణార్ద్రమనం
బటు శోకజ మోహాగ్నిని
చిటపట మని మఱియు క్షోభ చెందెను మిగులన్, 1756

అని యిట్టుల్ వ్యధ చెందు ధీరు భరతున్ స్వచ్ఛాత్ముఁ గై కేయి పు
త్త్రుని వీక్షించి వసిష్ఠుఁ డిట్టు లనియెన్ తూర్ణంబు శోకంబు నిం
కనె చాలింపుము నీకు భద్ర మగుతన్ క్ష్మాధీశపుత్త్రా! యశో
ధన! కావింపుము నేడు చేయఁ దగు కృత్యం బంచు వాక్రువ్వగా. 1757

వినియుఁ జేష్టలు దక్కియు వెతలఁ జిక్కి
యెడఁద నశియింప నేలపైఁ బడియె యున్న
భరతుఁ డెంతొ నిట్టూర్చి పల్మరు వగర్చె
యేడ్వ నెట్లొ రాత్రి చనె వీక్షింప లేక 1758

వ. అపుడు ధర్మవిదుఁ డగు భరతుండు వసిష్ఠునికి మ్రొక్కి ప్రేతకర్మకు జేయఁదగిన సర్వ కార్యములు చేయించెను. మఱియు నిద్రించు వానివలె నున్న రాజు దశరథుని నూనె దొట్టె నుండి పైకిఁ దీసి భూమియం దుంచి పచ్చఁ బడిన రాజు మొగమును జూచి పుత్త్రుఁ డగు భరతుండు నానారత్న భూషిత మగు శ్రేష్ఠ మగు శయనమున నుంచి మిగుల దుఃఖితుఁడై యిట్లు విలపించెను. 1759

నృపతి దూరదేశం బేగు; నేను రాక
మున్నె ధర్మజ్ఞుఁడౌ రాము నెన్నఁదగిన
బలము గల లక్ష్మణుని దూరవనికిఁ బంపి
ఏమి చేయంగ వాంఛింతు వింకఁ జెప్పు 1760

ఎవరి కైనఁ గష్ట మిడని కృత్యము గల
పురుష సింహుని రాముని మొదటఁ బాసి
వనటచేఁ బొగిలెడి యిట్టి జనము విడిచి
యెక్కడికి మహారాజ! నీ వేగుచుంటి. 1761

రాజ! దివి కేగు నీదు తర్వాత నింక
రాముఁ డిటనుండి దండ కారణ్యమేగ
ఈపురమున యోగక్షేమ కృత్యములను
ఎవరు కల్పింతురయ్య యోనృపవరేణ్య! 1762

నృపతి! నీవింక లేనట్టి యిట్టి పురియు
విధవరాలై ప్రకాశ మొందదు గదయ్య
చంద్రుఁడే లేని రాత్రిరి సరణి ననుచు
నేడ్చు భరతుతోడ వసిష్ఠు డిట్టు లనియె. 1763

ఇప్పు డే ప్రేత కర్మ గావింపవలెనొ
అది సమగ్రముగా నెట్టి వ్యథయు లేక
రాజుకో మహాబాహువా! రయముచేయ
వలయుననని వసిష్ఠుఁడు చెప్పభరతుడంత. 1764

ఆవసిష్ఠుని బూజించి యప్పు డతఁడు
ఋత్విజులను గురుల బురోహితులఁ బంప
నృపుని యగ్ని గృహమున బహిష్కరించు
వహ్నులను యాజకులు తెచ్చివచ్చి రపుడు. 1765

ఇంక చేతన లేని యానృపతి నంత
పల్లకిపయి నెక్కించియు బాష్పకంఠు
లయి మది కలంగ పరిచారికాదు లెల్ల
భూమి మోసిన రాజును మోసి రవల. 1766

వెండి బంగారు నాణేలు వివిధ మైన
వస్త్రముల దారి వెంబడి బహుళ రీతి
ప్రజలు చల్లుచు నప్పు డారాజు ముందు
ఏగ సాగిరి ప్రోగులు ప్రోగు లగుచు. 1767

చందన, మగురు గుగ్గిలి సరళపుఁ బొడి
పద్మకము దేవదారులు పరిమళములు
ఇతర పరిచారకులు వడి నతిగఁ దెచ్చి
అగ్ని ధూపముల్ వేయుచు నరిగి యపుడు. 1768

అట రాజున్! చితిమీద పెట్ట భరతుం డావేళనిప్పంచె-ఋత్విక్కులున్
పటుమంత్రాల జపించి సామముల గానంబుల్ యథాశాస్త్రమౌ
నటు గావించిరి, యంత రాజు వనితల్ యానంబులున్ పల్లకీ
లెటులో యెక్కియు నందు వృద్ధతతితో నేతెంచి రప్పట్టునన్. 1769

తిగ ముట్టించిన నిప్పు కాల్చ నృపు ఋత్విక్ర్కైణి కౌసల్యలో
నగు పూఁబోండ్లు ప్రదక్షిణాల్ జరిపి దైన్యం బొప్ప నేడ్పుల్ ధ్వనుల్
గగనం బందున క్రౌంచి రాజి బహుళ క్వాణాలు వోలెన్ ధ్వనిం
పఁగ- మార్మోగుచు సర్వదిక్కుల తుదన్ వ్యాప్తంబ యయ్యెన్‌గడున్. 1770

ప్రమదలు నేడ్చుచున్ వివశలై విలపించుచు మాటి మాటికిన్
తమతమ బండ్ల నెక్కియు వ్యథన్ దిగి యాసరయూ తటాన నీ
రము లిడి మంత్రి ఋత్విజులు రాజసుతుల్ పురిఁ జొచ్చి యశ్రునే
త్రముల దశాహముం జరపి తంత్రము మంత్రము తీర్చి రంతటన్ 1771

---

• సరళము, పద్మకము అనునవి యొకానొక ధూపద్రవ్యములు.

వ. పిదప దశాహము గడవఁగా ఏకాదశాహమున రాజ పుత్త్రుఁడు భర తుఁడు పుణ్యాహముఁ జేసి శుచియై ద్వాదశాహమున శ్రాద్ధ కర్మలను చేయించి బ్రాహ్మణులకు రత్నములు, ధనము. పుష్కలముగా అన్నము తెల్లని మేఁకను చాల గోవులను దాసదాసీ జనములను యానములను చాల గృహములను దానము జేసి నృపతి యౌర్ధ్వదైహికమును ముగించెను. పిదప పదుమూడవ నాఁడు భరతుఁడు శోకముచే మూర్ఛిల్లి రోదన ధ్వని కంఠమునుకప్పివేయఁగా తండ్రి చిత సమీపమునకు అస్థి సంచయ నాది స్థల శుద్ధికై వచ్చి దుఃఖితుఁడై 1772
యిట్లనెను,

ఎట్టి యన్నకు నన్నప్పగించినావొ
అట్టి యన్న వనమున కరుగ నేను
శూన్యమున నిరాధారమౌ చోట నిపుడు 1773
కట్ట! నీచేతను విడిచిపెట్టఁ బడితి.

ఏయనాథురాలికి గతి యేసుతుండొ
అతఁడౌ దూర వనమునకు నంపఁబడియె
అట్టి తల్లిని గౌసల్య నిట్టె విడిచి 1774
ఎక్కడకు రాజ! నీ విపు డేగినావు

అచట నెఱ్ఱని బూడిద నపుడు చూచి
తగులఁ బడు నెమ్ముకల ప్రోగు తడవి చూచి
నష్టమౌ పితృదేహాన దృష్టి నిలిపి 1775
భోరు మని యేడ్చె పెద్దగా భరతుఁ డపుడు,

అట్లు లేడ్చుచు మిగుల దైన్యంబు నొంది
భరతుఁ డప్పుడు పడిపోయె ధరణిపైని
త్రాళ్లచే లాగి పైకి నెత్తఁగఁబడుచు 1776
జాఱిపడు నింద్రు యంత్ర ధ్వజంబువోలె.

అపుడు నచ్చటికిని నమాత్య వ్రజంబు
శుద్ధ దీక్ష గల భరతుఁ డిద్ధ గుణుఁడు
పడిన చోటికి వేగమె వచ్చి పడిరి
యిలఁ బడిన యయాతి కడకు ఋషులు వోలె. 1777

శోకమునఁ జుట్టు కొనఁబడి స్రుక్కి యున్న
భరతుఁ గాంచి శత్రుఘ్నుడు వ్యథను పొంది
సంజ్ఞలేక భూమీశుని స్మరణ చేసి
కొనుచు బూమిపైఁబడియెను కుమిలి కుమిలి. 1178

చిత్త మది పోవ నున్మత్తు స్థితిని పొంది
మిగుల దుఃఖముచేతను పొగులు చుండి
తండ్రిగుణములు నంగముల్ తలచి తలచి
అప్ప టప్పటివిఁక నెంచి యపుడె యేడ్చె. 1779

మంథరవలనఁ బుట్టి తీవ్రాంధమగుచు
కైక మొసలి సంచారాల వ్యాకుల మయి
వరము లిచ్చుటచేత క్షోభంబు పడక
మించి శోకార్ణవము మమ్ము ముంచి వైచె. 1780

బాలుఁడు సుకుమారుఁడు నిత్య లాలితుండు
నయిన భరతుఁడు విలపింప నరయకుండ
ఎందువలనను త్యజియించి యిందు నుండి
నాయనా ! యెచ్చటకు నీవు పోయినావు. 1781

భక్ష్యముల యందు మఱి యన్న పానములను
వస్త్రములయందు మఱియు నాభరణములను
వలయు నవి యాత డిచ్చి మమ్మలరఁ జేసె
నింక నెవఁ డిచ్చి మము సంతసింపఁ జేయు. 1782

ధర్మవిదుఁడౌ మహాత్ముఁడు తరలి పోవ
చీలి పోవలసిన తఱిఁ జీలి పోక
యిట్టులే మెదలకయుఁ జలియింప కుండ
రాయివలె నిల్చి యుంటి స్థిరంబుగాను 1783

తండ్రియో స్వర్గజగతికిఁ దరలిపోయె
అన్నయో దండకారణ్య మాశ్రయించె
మఱియు నాకు జీవించు సామర్థ్య మేది
అగ్నిలోఁ బడి మృత్యువు నాశ్రయింతు 1784

తండ్రిచేతను భ్రాతచే త్యక్తుఁడ నయి
ఇంతవఱకు నిక్ష్వాకువు లేలి యిడిన
శూన్యమై పోయిన యయోధ్యఁ జొఱక యింక
నాతపోవనంబును జొచ్చి యాశ్రయింతు. 1785

అట్లు విలపింపఁగ విలాప మాలకించి
పైని బడియున్న వ్యసనంబు పట్టి చూచి
వారి పరివార మెల్ల నపార మైన
శోక సాగర మింకను జొచ్చినారు. 1786

అటు విషాదము పొంది యాయాస మొంది
భరత శత్రుఘ్ను లిరువురు వగలఁ జిక్కి
శృంగములు భగ్నమై పోవు వృషభము లటు
భూమిపైని దొర్లుచు కడుఁ బొగిలినారు. 1787

శుద్ధసత్త్వుఁడు పితృవైద్యుఁ డిద్ధమూర్తి
కుల పురోహితుఁడు వసిష్ఠుడలసి సొలయు
భరతు లేవఁ దీసి కడు నాదరముతోడ
ధైర్యమును జెప్పుచును నిటుల్ తట్టి చెప్పె. 1788

తండ్రి చనిపోయి నేటికి ధర్మవేత్త!
పదియు మూడవ దివసంబు: పదుము నేఁడె
చివర గల యెమ్ముకల నీళ్ళఁ జేర్చవలయు
నేల యాలస్యమును చేయు దిపుడు భరత! 1789

ఉండు పుట్టుఁ బెరుగు మార్పు పొందుచుండు.
చిక్కి పోవును నశియించు జీవుఁ డెపుడు.
విభుడ! తప్పింపరా నట్టి వీని గూర్చి
ఎంత మాత్రము నీవు చింతింపఁ దగవు, 1790

ఆసుమంత్రుఁడున్ శత్రుఘ్ను నరసి వేగ
తట్టి వడిలేవఁ దీసి యోదార్చి మిగుల
తత్త్వ మెఱిఁగిన యా నిమిత్తంబు వలన
పుట్టు చావుల తత్త్వంబు బోధపఱచె 1791

అపుడు లేచి నరశ్రేష్ఠులైనవారు
బహు యశస్వులై ధైర్యము వడసి మిగుల
ఎండ వానలఁ దడియుచు నెండుచుండు
నింద్ర ధ్వజములవలె ప్రకాశించినారు. 1792

కనుల నశ్రులను తుడుచు కొనుచు నంత
ఎఱ్ఱ కనులొప్పి జాలి భాషించు చున్న
యధిప పుత్త్రుల నితర కార్యములు చేయ
విభు నమాత్యులు తొందఱ పెట్టినారు. 1793

అవల రాముని గన వన యాత్రకేగఁ
దలచు భరతుని శోక సంతప్తుఁ జూచి
తొరగ లక్ష్మణానుజుఁడు శత్రుఘ్నుఁ డపుడు
ఇట్లు భరతునితోడ వచించె నంత 1794

“ఎల్ల ప్రాణికి బాధలం దెవఁడు గతియొ
అతఁడె మనకును గతి, చెప్పు నదియె యేమి
అట్టి రాముఁడు ఘనసత్త్వుఁ డయ్యుఁ గూడ
వనములకు నొక్క యబలచే పంపఁ బడియు. 1795

ప్రథిత బలశాలి వీరుఁడౌ లక్ష్మణుండు
కూడ నున్నాఁడు గద పోని వాఁడై యైన
పితను నిగ్రహించగ లేక వెడలె నెట్లు
ఏమి యతఁడు రాముని విడిపింప లేఁడె 1796

మార్గమునఁ బోకయే, యపమార్గ మేగు
భూపతియొ యింతిచేతి కీల్బొమ్మ యయ్యె
న్యాయ మన్యాయము సరిగ నరసి కొనుచు
తగ మొచటె నిగ్రహింపఁగఁ దగినవాడు. 1797

మ్రోల లక్ష్మణానుజుఁడు శత్రుఘ్ను డపుడు
నిట్లు సంభాషణంబు సాగించు చుండ
ఎల్ల భూషణంబు లలంకరించి కొనియె
గూనిది హఠాత్తు తూర్పు గుమ్మాన వచ్చె. 1798

ఒడలన్ గంద మలంది రాజవసనా లొప్పారఁగాఁ వాల్చి య
య్యెడ నానావిధ భూషణంబుల గణం బెంతో విచిత్రంబుగా
నొడ లెల్లన్ దిగవైచి కుబ్జ మొలనూ ళ్ళొప్పార, నొయ్యారపున్
నడకన్ వచ్చెను త్రాళ్ళఁ గట్టఁబడు వింతౌ నాడు క్రోతింబలెన్ 1799

పలు పాపంబులు చేసినట్టి ఖలఁ గుబ్జన్ ద్వారముం దుండ భృ
త్యులు వీక్షించియు బల్మిఁ బట్టుకొని శత్రుఘ్నున్ నివేదించి రీ
ఖల వల్లన్ వని రాముఁ డేగె, నృపుడున్ కాలంబు చేసెన్ జుమీ
ఖలురా లీమె నృశంసు,రా లిపుడు శిక్షన్ జేయుమీ దీనికిన్ 1800

అన శత్రుఘ్నుడు నాలకించి యింక నత్యంతంబు దుఃఖార్తుడై
యనె నంతః పురిలో చరించు ప్రజతో: నానాను, నేదుష్టవ
ల్లను నాసోదరు లిన్ని కష్టములపాలైరి వారో యాదుష్ట కు
బ్జ నృశంసాత్మ స్వకీయ కర్మఫలమున్ ప్రాప్తించుఁ గాకిప్పుడే 1801

అని వచించుచు సఖులచే నావరింపఁ
బడిన కుబ్జను బల్మితోఁ బట్టుకొనఁగ
నామెయో యిల్లు నదరిపో నార్చి యార్చి
గోల పెట్టి యిల్లును మ్రోగు లీలఁ జేసె 1802

అప్పు డామె సఖీజనం బంతఁగూడి
అతిగఁ గ్రుద్ధుఁగ శత్రుఘ్ను మతి గ్రహించి
ఎల్ల వైపులకుం బర్వు లెత్తి యెత్తి
యొకరితో నొక రిట్లు చెప్పుకొని రపుడు. 1803

"ఈమె సఖు లందఱను పిలిపింపుఁ డిపుడె
ఇదిగొ శత్రుఘ్నుఁడో వచ్చెనింక నేమి
మనల నిపుడు మిగుల్చఁడు మనమొ యింక
శరణుఁ జొత్త మాకౌసల్య కరుణ గలది. 1804

ఆమెయే గతి మన కిఁక నామె ధర్మ
మెఱిఁగినది జాలిగుండె యామెది వదాన్య"
అనఁగ శత్రుఘ్నుఁ డవలఁ ధామ్రాక్షుఁ డగుచు
గోల యిడి నేలఁ గూలిన కుబ్జ నీడ్చె. 1705

ఇటుల శత్రుఘ్ను డీకుబ్జ నీడ్చుచుండ
బహుళ మంధర భూషణ భాండమెల్ల.
నేలఁ బడి చెల్లచెద రయి నృపతి గృహము
శారదాంబర మట్లు భాసలను గులెక్కె. 1806

బలయుతుండు శత్రుఘ్నుఁడు బల్మితోడ
క్రోధమున మండి పడి కుబ్జమీఁదఁ బడుచు
అటకు విడిపింప కైక వచ్చుటయుఁ జూచి
గద్దరించుచు పరుషముల్ గ్రక్కె మిగుల. 1807

వేదనను గూర్చు పరుషాల వేగి కైక
వెఱచి శత్రుఘ్నున కడలి భరతు శరణు
చొఱఁగఁ గ్రుద్ధుఁడౌ శత్రుఘ్నుఁ జూచి భరతు
డిట్టు లనె "స్త్రీ లవధ్యల్ క్షమింప వోయి." 1808

నను మాతృహంతకుం డని
యనఘుఁడు రాముఁ డసహ్య మందునో యేమో
యనె కాక, లేక యున్నన్
మునుపే ఖలఁ జంపియుందుఁ బొగులక కైకన్. 1809

ఈ కుబ్జ చచ్చి నట్టుల
నాకౌసల్యాసుతుండు నాలించినచో
నాకును నీకును దవ్వయి
యాకరుణాత్ముండు మాటలాడఁడు మనతో" 1810

అనెడి భరతుని యామాట లాలకించి
లక్ష్మణ భ్రాత శత్రుఘ్ను డాక్షణంబ
రోషమున నుండి మరలి యుగ్రక్రోధ మడఁచి
వడిగ ముందర మంథరన్ విడిచి పుచ్చె. 1811

అపుడు మంథర రోజుచు నలసి సొలసి
వ్యథలఁ జిక్కి నిట్టూర్చుచు హడలి పోయి
వెళ్ళి కైకేయి కాళ్ళ ముంగోళ్ళఁ గూలి
మిక్కిలిగ దీనయై వెక్కి వెక్కి యేడ్చె 1812

అటు శత్రుఘ్నుం డీడ్వగ
కట కటఁ బడి స్మృతిని వీడి కలఁగెడి కుబ్జన్
అట భరతు తల్లి నిమిరెను
కట! వలబడి జాలిఁ గాంచు క్రౌంచిని బోలెన్. 1813

పిదపన్ ప్రభాత వేళను
పదునాల్గవ యాదినంబు ప్రాప్తము కాఁగా
అదె రాజకీయవేత్తలు
పదపడి వచ్చి భరతుఁ గని వాకొని రిట్టుల్. 1814

అవలన్ భూపతి మనదు గు
రువు దశరథుఁ డిట్లు జ్యేష్ఠ శ్రుతయుతు రామున్
అగణితబలు లక్ష్మణు వని
కగపడకయె పంపిస్వర్గ మరిగెను గాదే. 1815

ఇట నీవపరాధియె కా,
ఏటు లిఁక మారాజ వగుమి నృపసుత! సుయశా!
ఎటులో దైవ ఘటనచే
నిటు వచ్చె ననాయక మయి యాక్షితి యయ్యెన్. 1817

అభిషేక వస్తు లన్నియు
శుభవణిచియు తెచ్చి నిన్నుఁ జూతురు ప్రకృతుల్
అభిషేకము చేసికొనియె
ప్రభు మము పాలింప పిత్ర్య రాజ్యము గొనుమీ. 1816

వ. అని వారు చెప్పగా అప్పుడు,

అభిషేక పూర్ణ కుంభము
నభిముఖత ప్రదక్షిణంబు నటు చేయుచు నా
నఘచరితుఁడు భరతుఁడు తా
నభిముఖుఁడై ప్రజలతోడ ననియెను ప్రతియై. 1818

నిరతము జ్యేష్ఠుడె రాజయి
వరలుట యుచితంబు మాదు వంశంబునకున్
వరగుణ కుశలులు మీరి
కరణిని వచియింపఁ దగరుకని శోధింపన్. 1819

రాముండె పెద్ద అన్నయు
రాముండె కాఁగలడు రాజు రాజ్యములోనన్
నే, మరి పోయెద నడవికి
నీమమ పదునాలు గేండ్లు నివసింతు వనిన్. 1820

చతురంగంబు బలంబు కూర్పుఁ డిదె జ్యేష్ఠభ్రాత నారాము నీ
క్షితికిన్ కానలనుండి తీసికొని నేఁ గీర్తించుచున్ వత్తు స
మ్మతి సర్వం బభిషేక వస్తులు వన మ్మందుంచి పట్టంబు గ
ట్టి తగన్ రాముని తెత్తు నధ్వరమునుండిన్ వహ్నినిం బోలికన్. 1821

ఎగుడు దిగుడుగా నుండక
తగ సమముగ చేయువలెఁ బథంబులు శిల్పుల్
మగఁటిమి గల యోధులు ర
క్షగ వత్తురు గాక మార్గచతురులు గూడన్. 1822

ఇటు రామునికై పలికెడి
పటుభక్తుడు రాజసుతు శుభంబగు వాక్కుల్
దిటవుగ విని జనులందఱు
నిట శ్రీకరముగ శుభము వచించిరి ప్రియులై. 1823

"నృపసుతుఁ డగు నన్నకునై
యిపు డిటు రాజ్యంపు లక్ష్మి నిడఁగోరెడి ని
న్నెపుడును పద్మాలయ శ్రీ
స్వపతిని వలె సర్వగతుల భజియించెడుతన్. 1820

అని పౌరుల్ వచియింపగన్ భరతుఁ డాయుత్కృత్త మాలాప మొ
య్యన నాలించుచు, లక్ష్మణుం దలచుచు న్నానంద భాష్పాలు రా
ల్చెను, నంతన్ "మహితుండు చెప్పినటు శిల్పిశ్రేణి యీపూజ్య నా
జ్ఞను గావించెద" రంచుఁ జెప్పిరి ప్రజా సంఘా, లమాత్యాదులున్. 1825

వ. అనంతరము మెరక పల్లపు ప్రదేశములు తెలిసిన వారును జలము లేని చోట్ల అగాధంబు లగు దిగుడు బావులు నూతులు మొద లైన జలస్థలము లను రప్పించు సూత్రములఁ దెలిసికొన్న వారును, మార్గములు రక్షించుట మొద లగు పనులు చేయువారును! శూరులును అవసర మగుచోట నూతులు త్రవ్వు వారును యంత్రములు అమర్చి వంతెనలు లోనగునవి చేయువారు జీత భత్యములచే జీవించు వారును రథాదులను నిర్మించు స్థపతులును, మార్గాన్వే షణ నితరులును, వడ్రంగులును, మార్గకరులును, అడ్డువచ్చిన చెట్లను నరకు వారును, నూతులు త్రవ్వు వారును, వెల్ల వేయువారును, వెదుళ్ళతో చాపలు బుట్టలు మొదలగునవి యల్లువారును, చర్మకరులు సర్వ కర్మలందు సమర్థు లైన వారు మార్గాదులు చూచు వారును ముందుగా బయలుదేఱి వెళ్ళిరి. ఈ జనుల సమూహము విపులమై బయలుదేఱి పర్వ సమయమున మహాప్రవాహ వేగముగల సముద్రమువలె శోభించెను. ఈ జను లందఱు తమతమ గుంపు లను తీసికొని మార్గ కర్మలందు నేర్పరులై ఆయా సాధనములను ఉపకరణము లను తీసికొని ముందుగా బయలు దేఱి వెళ్లిరి. అట్లు వెళ్లి. 1827

కొందఱు దారులన్ గుల్మముల్ డొంకలు
చెట్ల మొద్దుల రాళ్ళఁ జెనకి నారు

కొందఱు చెట్లు లేకున్న బాతిరి, చెట్లు
గొడ్డళ్ళ టంకాలఁ గొట్టినారు
కొంద ఱవురు గడ్డియుందు స్తంభంబుల
కంటక మూలాలఁ గాల్చినారు
కొందఱు కూపాలు గోతులు పూడ్చిరి
పల్లముల్ సమముగా పఱచినారు

కట్టవలసిన వంతెనల్ కట్టినారు
పొడిగ చేయఁదగిన రాళ్ళఁ బొడిచినారు
భేద పఱచఁ దగ్గవి కూడ భేదపఱచి
సేన రాకపోకకు చక్కఁ జేసి రిట్లు. 1827

బలముల్ పోవు పథాన సున్నముల చప్పాల్ తీరె, పుష్పించు చె
ట్లులు సొంపారె, మదించి పక్షు లఱచెన్ డోలాయమానంబులై
పలు జెండాలు వెలింగె చందన జలం బందందు చిల్కింబడెన్
పలు పూమాలలు వ్రేలె బాట యిటుదేవాధ్వంబు వోలెన్ తగెన్. 1828

సరిగా మంత్రుల యాజ్ఞ పొంది కడు నాస్వాద్యంబులౌ పండ్ల సుం
దరమౌ చోట్ల మహాత్ముఁడౌ భరతు డుండన్ పల్ గుడారాలు వే
సిరి, దివ్యంపు ముహూర్తమందు శిబిరాల్ సృష్టించి వీధుల్ రచిం
చిరి, దిబ్బల్ గిరు లట్లు త్రవ్విన ఖువుక్ చెల్వొ, నగర్తల్ వలెన్ 1829

పెనువీథిన్ నున్ను వచ్చుటాళ్ళ ప్రతిమల్ వేగంబ తీర్పించి, దా
రిని ప్రాసాదములందు సౌధములపై వ్రేలాడి జెండాలు ర
మ్మని రామున్ బిలిపించు లాగు నిలపం బాగౌ వరాండాల నొ
ప్పెను సేనా నివహంబు పోవు పథముల్ బెంపారి యావేళలో. 1830

ఒకచో వానల నుండ వేదనినదంబొప్పా మతాల్ నిల్పినా
రొకచోఁ జాల బజార్లు వస్తువుల ప్రోగొప్పారగాఁ దీర్చినా
రొకచోఁ బట్టనమందుఁ బోలె పథమం దుంచంగ దీర్ఘాలటుల్
రకపున్ వస్తులఁ బౌరపంక్తుల సముద్రా లట్టు లొప్పెన్ పథుల్. 1831

వివిధంబౌ తరులన్ వనంబులను వింతై స్వచ్ఛమౌ శీతలాం
బువులన్ సొంపయి గొప్ప మత్యములతోఁ బూర్ణంబయై పోల్చు జా
హ్నవిదాకన్ పథు లెల్ల శిల్పిజనబృందా లందముల్ దీర్పుచున్
గవియన్, మార్గము చంద్రతారకల యభ్రం బట్టులన్ రాజిలెన్. 1832

* ఇఁక నాందీ ముఖ మాచరించఁ దగు రేయిన్ సూతులున్ మాగధుల్
ప్రకట స్తోత్రములన్ శుభాల భరతున్ వర్ణించి శ్లాఘించినా
రిఁక బంగారపు పిళ్లు దండముల వాయింపంగ పల్ దుందుభుల్
రకమై మోగెను, శంఖముల్ మొరసె పల్వాద్యాల ఘోషల్ తగెన్.
1833

వ. అంత భరతుండు అసలే ఇదివరలో బాధ పొందియు

ఘనమౌ వాద్యసుఘోష మింటిపయి మ్రోగన్ గ్రమ్మఱన్ గ్రుక్కి మె
ల్కని ఘోషల్ మరలించి నేను విభుఁడన్ గానేల ఘోషింతు, రిం
కను గైకేయియె యెంతకష్టమిడె లోకాలందు నీక్షించితే
మనకర్పించియె తండ్రి దుఃఖము దివంబందెగె శత్రుఘ్నుడా !
1834

ఆమహాత్ముఁడు ధర్మాత్ముఁడై నరాజు
కాల మొందె, రాజ్యశ్రీయుఁ గర్ణధారుఁ
డుండ నట్టి నౌకవలెను నొక్క స్థిరపుఁ
జోటె లేకయె భ్రమియించు చుండె సుమ్మి. 1835

* శుభములకుముందు చేయబడు నాందీముఖము భరతుని పట్టాభిషేకము నకో రాముని రప్పించుటకో పురోహితులు చేసిరని గ్రహింపవలెను.

గొప్ప నాథుఁడౌ రాముని గూడ వనికి
ధర్మము త్యజించి తానె నాతల్లి పంపె
అనుచు మతిలేక విలపించు నట్టి భరతు
నరసి యింతు లందఱు బారు మనిరి మిగుల. 1836

ఇట్లు భరతుండు కడు విలపించుచుండ
క్షితిప ధర్మంబు లెఱుంగు వసిష్ఠు డంత
వచ్చి యిక్ష్వాకుపతి సభన్ బసిఁడి మణులు
గూర్చు పీఠి శిష్యులతోడఁ గూరుచుండె. 1837

అటు కూర్చుండి వసిష్ఠుడే "యవసరంబై నట్టి కార్యంబు లి
చ్చటికిన్ వచ్చె నటంచు బ్రాహ్మణుల వైశ్య క్షత్రియామాత్యులన్
పటు రాజాంతిక భృత్యయుక్తు భరతున్ ఖ్యాతాత్మ శత్రుఘ్నప్రో
ద్ధుట నాప్తాళి యుధాజితున్ మఱి సుమంత్రున్ బిల్వ నంపెన్ వడిన్. 1838

ఇటులన్ హస్తి రథాశ్వ యానములతో నేతెంచు పౌరాళితో
నటఁ గోలాహల మయ్యె వచ్చు భరతున్ స్వచ్ఛాత్మ వీక్షించి యం
తట దేవేంద్రుని దేవు లట్లు కని యానందించి యామంత్రు లు
త్కటులౌ పౌరులు మెచ్చి రాదశరథ క్ష్మాపాలుఁ బోలెన్. మదిన్ 1839

అపుడు తిమి హస్తి శంఖ రత్నాదు లుండి
యధిక జలజంతు వస్తువౌ హ్రదమువోలె
ప్రముఖ, దశరథ సుత యుక్త రాజసభయు
నొప్పె దశరథ సమ్రాట్టె యున్న యట్లు. 1840

---

* భరతుని మేనమామ అయోధ్యకు రాలేదు. కనుక ఇక్కడ యుధాజిత్తు అనగా సుమంత్రసాహచర్యమున విజయు డనుమారు పేరుగల యుధాజిత్తు అను మంత్రియని వ్యాఖ్యాతలు.

ప్రముఖుల్ మంత్రిపురోహితుల్ బుధజనుల్ వస్త్రాంగ రాగంబులన్
తఱి మేనన్ ధరియించి యాసనములం దందంద కూర్చుండ మే
ఘము లేగన్ దివి పొల్చు పూర్ణశశిచేఁ గాంతించు రాత్రింబలెన్
తమి సొంపౌ సభ దేఱి చూచె భరతుం డంతన్ సుధర్మన్ బలెన్. 1841

అపుడు ధర్మవేత్త పురోధ యఖిలగతుల
ప్రకృతు లందఱ వీక్షించి భరతుతోడ
మృదువుగాఁ బల్కె నాయనా యిపుడు నీకు
దశరథుఁడు ధనధాన్య ధరణి నిచ్చి 1842

సత్య ధర్మము చేయుచు స్వర్గ మేగె
అట్టి సత్యసంధుఁడు రాముఁ డఖిలధర్మ
మనుసరించుచు తనతండ్రి యాజ్ఞ విడఁడు
పూర్ణ చంద్రుఁడు వెన్నెలఁ బోలె నిపుడు, 1843

తండ్రిచే నన్నచేతను దత్తమైన
కంటకములు లేనట్టి భోగాల పంట
యిట్టి రాజ్యమున నభిషేకించుకొనుము
అఖిల మంత్రులు ప్రజలును నలరి మెచ్చ. 1844

తఱి నుదీచ్యుల్ ప్రతీచ్యులు దాక్షిణాత్య
లపర దేశస్థులు సముద్ర విదిత వణిజు
లఖిల రత్నాలు కోట్లుగా నన్ని తెచ్చి.
నీకు నభిషేక వేళలందెత్తు రనఁగ 184;

* భరతుని వనయాత్ర విషయములు తెలియక వసిష్ఠుడిట్లనెను. లేక భరతుని రాజ్యము ముఖ్యమెంత స్థిరమో తెలిసికొనుటకు ఇట్టివివై అని యుండును ముందుపద్యముబట్టి భరతుడు వసిష్ఠుని కింకనుచెప్పకశిల్పులను పంపియుండు.

మఱి విని పురోహితుని వాక్కు భరతుఁ డంత
ధర్మవిదుఁడు రాముఁ దలఁచి ధర్మకాంక్ష
గద్గద గళుఁడై విలపించి పడుచు హంస
వలె సభను వగచి పురోధ పలుకు దూఱి. 1846

బ్రహ్మచర్యము గావించి ప్రాజ్ఞుఁ డగుచు
విద్యల ముగించి స్నాతుడై వివిధ మైన
ధర్మములు చేయు రాముని ధర్మరాజ్య
మిపుడు నను బోటి వాడు హరించు నెట్లు. 1847

రాజు దశరథు సుతుఁడనై రాజ్య
మెటు హరింతు నిచ్చట ధర్మమీవె చెప్పు
జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుడౌ రాము డీదిలీప
నహుష సము డొందుత ధరణిన్ దశరథువలె. 1848

ఆర్యులును మెచ్చనది, స్వర్గ మందరాని
పాప మిది నేనె గావించు వాఁడనేని
లోకమందును నేను నిక్ష్వాకు కులము
నాశ మొనరించు వాడఁగా వాసిగాంతు. 1849

మాతయే చేసి యుండినం బాప మేను
ఎంత మాత్రము గూడ నేనిష్టపడను
ఇచట నుండియె వనిని వసించియున్న
రాముని నమస్కరించెద ప్రాంజలినయి. 1850

ఇంక రామునినె యనుసరించి పోదు
మానవులలోన నాతఁడె మంచిరాజు
రాముఁడే మూఁడు లోకంబులకును గూడ
నృపతిగా నుండఁదగు వాఁడ యెల్ల గతుల. 1851

ధర్మయుక్త మైనట్టి తద్వాక్కు లిపుడు
అఖిలసభ్యులు ముదమున నాలకించి
రామునం దుంచఁబడు నంతరాత్మ గలిగి
వదలి రిఁకఁ గండ్ల నానంద బాష్పములను. 1852

రామునిసె కనుక మరల్ప రాద యేని
అన్న సౌమిత్రి తగు వనమందె యుందు
సాధువులు నార్యమిత్రులౌ మీదు ముందె
యెల్ల విధముల వని మరలింపఁ జూతు. 1853

ఐచ్ఛికంబుగ తమయంత నరుగు దెంచి
దారి సరిజేసి రక్షించువారు గూడ
పంపఁబడిరి నాచేత పూర్వంబువందె
నాకు వనయాత్ర కూడ నెంతయు ప్రియంబు. 1854

పలికి యిట్లు ధర్మాత్ముఁడౌ భరతుఁ డంత
భ్రాతృ వాత్సల్య మది పొంగ పార్శ్వమందె
తనరు మంత్రకోవిదు సుమంత్రుని కరంబు
ప్రేమతోడుత నీక్షించి యిట్టులనియె. 1855

నడు సుమంత్ర! లేచి త్వరగ నాదు నాజ్ఞ
వేగ యాత్ర కాజ్ఞయిడి రావింపు బలము
అన మహాత్ముఁడౌ భరతుని యాజ్ఞపొంది
యలరి భరతునాజ్ఞ ప్రకార మతఁడు చేసె. 1856

ప్రకృతుల్ సైన్యపతుల్ తదాజ్ఞవిని యారామున్ మరల్పంగఁ ద
ప్పక బైల్దేరిరి, యోధపత్నులు స్వభర్తల్ వేగ పోవంగను ను
త్సుకలై తోలిరి, యెద్దు బండ్లు హయముల్ తూర్గంబ పర్వెత్తు పల్
శకటంబుల్ రథముల్ వడింగొని ప్రహర్షంబొంది రయ్యాత్రకై. 1857

భరతుం డంత బలంబు సిద్ధ మగుటన్ బాటించి శీఘ్రంబుగన్
గురుముందే త్వరపెట్టి పార్శ్వగు సుమంత్రుతున్ నారథం బిప్పుడే
ద్వరగా తోలు మటంచు; నాతఁడును తద్వాక్యంబు లాలించి స
త్వరమే మేలి హయాలు పూన్చు రథమంతన్ తోలె హృష్టాత్ముడై. 1858

సత్యధైర్య మొప్పి సత్యవిక్రమ మున్న
భరతు డాయశస్వి వనిని నున్న
జ్యేష్ఠు రాము సదయుఁ జేయంగ దలపోసి
యపుడు భరతు డిట్టు లనియె చూచి. 1859

త్వరగ లెమ్ము సుమంత్ర! నీవరిగి బలము
కూర్చుటకు బలముఖ్యుల గూడ నిటకు
వచ్చు నటు చేయు మారాము వనము నుండి
వచ్చునటు చేయవలె లోక భద్రమునకు. 1860

భరతు డిటు లనన్ సూతుఁడున్ ప్రకృతి వరుల
బలము ముఖ్యులనఖి రాజ వైశ్య వృషల
బ్రాహ్మణులఁ బిల్చె వారు నశ్వములఁ గరుల
ఖరరథాలనొంటెలఁ గూర్చి యరిగి రపుడు. 1861

అవ్వల వడి లేచి నిత్యకృత్యములు జరపి
రథము నెక్కి భరతు డేగె రాముఁ జూడ
అతని ముందె మంత్రిపురోహితాదులెల్ల
రవి రథము పోలు రథహయాల్ నడిపి చనిరి. 1862

సరిగా వేలగజాల నర్వదియు వేల్ సత్స్యందనాలన్ ధను
ర్ధరులన్ పౌరులు పూన్చి వేగ భరతున్ రాట్సూను వెన్వెంట బో
యిరి నూర్వేల హయుంబు లెక్కి చనిరా రీయెల్ల దేశస్థులున్
భరతున్ ధీరుని సత్యసంధుని వశిన్ మన్నించి వెన్వెన్కనే. 1863

కైక సుమిత్ర యశస్విని
యౌ కౌసల్యయును రాము నతివడి తేఁగా
వీకన్ సంతోషముతో
నా కానలఁ బడిరి శ్రేష్ఠ యానంబులపై. 1864

జలదశ్యాము మహాభుజున్ స్థిరబలున్ సత్యవ్రతున్ రాముఁ గ
న్నులతో నెప్పుడు చూతుమో యరసి మున్ముందె మామా వ్యథల్
తొలఁగించున్ జగదార్తి నాశనశరుండున్ చీకటుల్ బాపి ర
శ్మల సూర్యున్ బలె నంచుఁ జెప్పుకొనుచుం బో సాగి రార్యుల్ జనుల్.
1865

ఇటులే వేయి విధాలఁ జెప్పుకొనుచున్ హృష్టాత్ములై యొండొరుల్
పటు హస్తంబులఁ గౌఁగిలించుకొనుచున్ బల్గాథలున్ వృత్తముల్
ఇటు లట్లంచును నాటి నేటి కథలెన్నోఁ జెప్పుకొంచున్ హుటా
హుటిఁ గేరింతలు కొట్టుకొంచుఁ జనినా రూరేగి తన్నాగరుల్. 1866

వ. మఱియు శోభనులైన మణికారులును, కుమ్మరులును, సాలెవాం డ్రును, శస్త్రోపజీవులును, నెమిళ్ళు పట్టుకొనువారు, అంపములతోఁ బనిచేయు వారు, మణ్యాదులకు మెఱుగుపెట్టు వారును, దంతపుఁ బని చేయువారును, వెల్ల వేయువారు, గంధములు చేయువారు. కమసాలులు, కంబళ్ళు ఉతుకు వారును, స్నానము చేయించు వారు, ఒడలు పట్టువారును, వైద్యులును, పొగ వేయువారును, మధ్యకారులు, రజకులును, కుట్టుపనివారును, గొల్లలు, గ్రామ వృద్ధులు, శైలూషకులు, పల్లెవారును, పనివారును భరతుని అనుస రించి వెళ్ళిరి, సైనికులు, యోగులు వేదవేత్తలైన బ్రాహ్మణులు ఎద్దుబండ్లతో వేలకొలదిమంది భరతుని అనుసరించిరి, వీ రందఱు రథములు, అశ్వములు, ఏనుగు లెక్కి గంగపైపున అప్రమాదముగ గుహుడు పాలించు శృంగిబేర పుర మునకు వెళ్ళిరి, అట్లు ఆ సేన చక్రవాక పక్షులతో రమ్యముగా నున్న గంగా

నదీతీరము చేరగా వాక్య కోవిదుం డగు భరతుండు సైనికుల యభిప్రాయము తెలిసికొని నేడిక్కడ విశ్రాంతి తీసికొని రేపు ఈ నదిని దాటెదము. స్వర్గము పొందిన రాజునకు ఈనదిలోనికి దిగి ఔర్ధ్వదైహికమునకై నీళ్ళు వదలెదను. అని చెప్పగా అయుమాత్యు లట్లె యనిరి. అపుడట్లు అక్కడ విడిసె ఆ మహాత్ము డైన రాముని మరలించు టెటులా అని యాలోచించుచు నట నుండెను. 1867

అట్లు గంగ దరి గల సైన్యంబు చూచి
తనదు జ్ఞాతుల రప్పించి యనియె గుహుడు
యరయుఁ డీసేన యంబుధి యట్టు లంతు
లేక యున్నది మది విచారించి చూడ. 1868

ఈ, కుబుద్ధియా భరతుఁడె యిపుడు తనకు
తానె యెత్తుకాంచన చెట్టు ధ్వజము గలుగు
రథముపై వచ్చెఁ గాబోలు రాముఁ జంపి
పిదప మనలఁ జంపుటకును వెడలె నేమొ. 1869

దాశరథి రాముఁడో నాకుఁ దగిన సఖుడు
అవసరమ్ముౕ రావచ్చు మీ రంద ఱేటి
సెల్లఁ గాచు మాంసాశనుల్ పల్లెవాండ్రు
రాముకై తయారె యయి తీరాన నిలుఁడు. 1870

రాము నెడ భరతుఁడు ప్రహర్షమున నున్న
నింక సేనను గంగదాటింత మలరి
అని పలికి మధుమాంస మత్స్యముల గుహుఁడు
కొన్కలను తీసికొనిపోయి కనెను భరతు. 1871

అట్లు గుహుఁడు రాఁగ సుమంత్రు డపుడుఁ భరతుఁ
జూచి యనె నమ్రత సమయజ్ఞుండె యగుచు
"ఇదిగొ జ్ఞాతులతో వచ్చె వృద్ధ గుహుఁడు
నీదు నన్న సఖుఁడు వనిన్ నేర్పుకాఁడు. 1872

సరిగ కాకుత్స్థ ! గుహుడు నిషాదరాజు
నిన్నుఁ గనెడి గాక, రామలక్ష్మణులు నెచట
నున్నవారొ గుహుఁడు రాము నునికె యెఱుగు
అన భరతుఁ డనె నను గుహుఁ డరయుఁ గాక ! 1873

వ. అనఁగా అపుడు 1874

త్వరగ భరతు నను జ్ఞచే వచ్చి గుహుఁడు
నమ్ర ముడయి జ్ఞాతిసహితుడై భరతుఁ బలికె
ఇదియె మీ యిల్లు మీసేవ యిడక మోస
గించితిరి, దాసునింట వసింప వలయు. 1875

ఈనిషాదులు తెచ్చిన వివిగొ వేళ్ళు
పండ్లు, నెండుది పచ్చిదౌ వలల మిదిగొ
సేన నిశ యిటనుండి భక్షించుఁ గాక
పూజ లివి మావి కొని రేపె పోవ వచ్చు. 1876

అని గుహుఁ డన మహాప్రాజ్ఞుఁ డైన భరతుఁ
డిట్లు యుక్తి యుక్తముగ వచించె నపుడు
నీదు గౌరవ మేము గ్రహించినట్లె
అన్న సఖుఁడ నీమము గొల్వ నెన్ని యుంటి. 1877

ఇటు మహాతేజు డని వచియించె మరల
ఆభరద్వాజు నాశ్రమ మరుగ నెట్లు
ఏము పోవగా వలె చెప్పు మీపథంబు
గంగతటినుండి పోవ దుర్గమము కాన. 1878

వ. అని భరతుఁడు పల్క విని ప్రాంజలి యయి గుహుఁ డిట్లనియె. 1879

ప్రాంత మిది యెఱింగిన పల్లెవాండ్రు నీకు
సాయముగ పత్తురి నేవత్తు సాయముగను
ఏమి యెవరిబాధింపని రాము నెడల
దుష్టభావన నేగ కుందువు గదయ్య. 1880

ఈ మహాసైన్యమును జూడ నెంతొ నాకు
శంక పొడముచున్నదివోలె చాల దోచు
అని గుహుఁడు పల్క నాకాశ మట్లు మిగుల
స్వచ్ఛుఁ డగు భరతుఁ డనె స్నేహంబుతోడ. 1881

ఒకనిఁ గష్టపెట్టుతఱి రాకుండుఁ గాక
ఈవు నను గూర్చి యిపుడు శంకింపఁదగవు
అట్టి రాముఁడు జ్యేష్ఠుఁడు నన్న నాకు
తండ్రిలాగునఁ గొల్తు సంతతము నతని. 1882

వనమునం దున్న కాకుత్థ్సుఁ బట్టనంబు
నిపుడె మరలింప నేడిదె యేగుచుంటి
వేఱయిన బుద్ధి నీమది పెట్టుకోకు
ఏను గుహ ! సత్యమునె వచియించు చుంటి. 1883

వ. అని భరతుఁడన నుప్పొంగి మోమున హర్షముతోడ గుహుఁడు భరతునితో నిట్లనియె. 1884

మేలు ! ధన్యుండ వీవు నిన్ బోలువాఁడు
జగమునంతట వెదకిన నగపడండు
ఏమి శ్రమలేక వచ్చిన యిట్టి రాజ్య
మిట్టె త్యజియింప సిద్ధమౌ నెవడు భరత! 1865

జగములందు నీకీర్తి శాశ్వతమ యగును
రాముఁ గష్టాలనుండి మరల్చు చుంట
ఇట్లు గుహుఁడు భరతుతో వచించుచుండ
సూర్య ప్రభ తగ్గె రాత్రియుఁ జొచ్చె నపుడు. 1886

కాని వ్యధల్ పడందగని కమ్రగుణున్ భరతున్ మహాత్ము, ధ
ర్మానతు, నంత సత్వరము రాముని గూర్చిన శోకవహ్ని యా
మేనునఁ జొచ్చి మండి కడు మీఱి దహింపఁగ జొచ్చె రాట్సుతున్
లోనను లోనె చొచ్చి తరులోఁబడి కాల్చు దవాగ్ని పోలికన్, 1887

వేదనాగ్నిచేతఁ దగులఁ బెట్టఁ బడిన
భరతు నొడలి యంతట నుండి యురలె చెమట
భానుకాంతిచే తపియింపఁబడిన యట్టి
హిమ నగమునుండి మంచు స్రవించు నట్లు. 1888

మదిలో ధ్యానమె చూర్ణమౌ శిలల సంబాధంబు, నిట్టూర్పులే
గద యాజేగురురాళ్ళు, దైన్యమెద్రుమగ్రామంబు, దుఃఖాధులే
తుది శృంగంబులు, మోహముల్ విడిన జంతుల్, శోక తాపంబె యో
షధి వేణువ్రజ మైన దుఃఖగిరి స్వేచ్ఛన్ గ్రమ్మెఁ గైకాసుతున్ 1889

కలఁగిన మాన సానఁ గడు కష్టము పొందియె సంజ్ఞ లేకయే
యలరఁడు, శాంతి పొందఁ, డెద నార్తిని పొందును మందమండి యే
వెలిఁబడు నావుఁ బోతువలె వే భరతుండు మహానుభావుఁ డె
గ్గులు గనఁ జూచి యాగుహుఁడు గ్రుచ్చి కవుంగిట, ఁగూర్చెనూరటన్ 1890

వ. పిదప అడవులందుండు గుహుఁడు అప్రమేయుఁ డగు భరతునితో మహాత్ముడైన లక్ష్మణుని సద్భావమును ఇట్లు పలికెను. శరములు చాపము కత్తిని ధరించి యన్నగారి రక్షణకై యున్న లక్ష్మణునితో నేను ఇట్లుపలికితిని 1891

ఇదిగో నాయనా! సౌఖ్యము నీయఁదగిన
యీశయనము నీకొఱకుఁ గల్పింపబడియె
రాకుమార! మిక్కిలి నీవు శ్రమము పడకు
ఊరడిలి హాయిగా నిటఁ బరుండవయ్య. 1892

పాటు లివి యెల్ల మాకలవాటె సుమ్మి
ఈవెపుడు కష్టపడు టన్న దెఱుఁగవయ్య
రాఘవుల రక్షకై మేము రాత్రి యెల్ల
మేలుకొనియె యుందుమ యవలీల నిపుడు. 1893

ఇంక రాముని కంటె వేఱెవఁడు నాకు
నిష్టతముడైన వాఁడు గన్పింపఁ డెటను
ఇటు వినుము సత్యమేను వచించుచుంటి
ఇట్లు సత్యముతో నొట్టు పెట్టుకొందు 1894

ఇతని యనుగ్రహంబుననె యీ జగమందును గొప్ప కీర్తియున్
అతిగ ధనంబు ధర్మమును నర్థము పొందితి నెంతో కేవలం
బతనిని జానకిన్, ధనువు నేనును జ్ఞాతులు దాల్చి కాతుమీ,
మతి గని నట్టి దీవనము మానక గెల్తుము సేనవచ్చినన్. 1895

ద. అని యిట్లు మేము మహాత్ముఁడైన లక్ష్మణునితో అనునయించి చెప్పఁగా ధర్మమునె చూచిన యాతఁడిట్లు మమ్ము అనునయించెను, 1896

అనఘా! ధర్మ మెఱుంగు నీవిటుల మమ్మత్యంతమున్ జాగ్రతన్
కని రక్షించుచునుండ మాకెటుల నింకన్ భీతి వర్తిల్లునే
ననుగానీ రఘురాముఁ డుర్విఁబడి యుండన్ వాకెటుల్ నిద్రవ
చ్చును సౌఖ్యంబుగ నెట్టులుందుఁ గవచ్చున్ రాముఁ డిట్లుండఁగన్. 1897

ఎతని సురాసురాదు లెదిరించి సహించుట కైనఁ జాలరో
ఎతఁడు శ్రమించి మంత్రముల నెంతొ జపించుటచే లభించెనో
ఎతఁడు నొకండె యాదశరథేశుని కెంతయు నిష్టుఁ డయ్యెనో
యతడిటు సీతతోఁ దృణములందు సుఖంబ పరుండెఁ జూడుమీ 1898

ఇతడిటు గెంటివేయఁబడ నింక విభుం డిటు లెంత కాలమో
బ్రతుకఁడు: ధాత్రియో విధవరాలయి పోవును సత్వరంబుగన్
అతిగను నేడ్చి యేడ్చి శ్రమ నంది యిఁ కేడ్వఁగ లేక యింతులున్
క్షితిఁబడి యుండ మేడను నిశిన్ బిడుగుల్ పడిమాని నట్ల గున్. 1899

పతి, కౌసల్యయొ, నాదుతల్లియును నావంతేని యీరాత్రి జీ
వితమున్ నిల్పెద రంచు నెంచ నెటొ జీవింత్రేని యీ రాత్రి యే
సతి నాతల్లియొ కొంత కాలమటనాశత్రుఘ్నుకై చూచుచున్
బ్రతుకన్ వచ్చును, రాముమాత యిఁక జీవంబుల్ త్యజించుంగదా
1900

అను రక్తప్రజతో నిం
డినదై సౌఖ్యంబు కూర్చి నిఖిలమునకు బ్రీ
తిని జరపి యయోధ్యయు నదె
జనపతి నశియింపఁ జూచి సరగ నశించున్. 1901

ఆ మహాత్ముఁడౌ జ్యేష్ఠుని రాముఁ గనగ
ఆమహాత్ముఁడౌ పతి నిల్పఁ బ్రాణ మెటుల
నృపతి నశియింపఁ గౌసల్య మృతిని గాంచు
పిదప నాతల్లియును మేను విడచి పెట్టు. 1902

అవల నశియించె నశియించె ననుచునపుడు
ఆత్మ కాంక్షిత మీడేర నందువల్ల
రాజ్యమున రాము నుంచక రాజు పోవు
ఇంక పితృకర్మచేసి సుఖింత్రు వారు. 1903

నడివీధుల్ రమణీయ మౌచు వెలయన్, నల్వీధులన్ మేడలన్
కడు వేశ్యల్ చెలువొందఁగా రథ తురంగానేకప శ్రేణులున్
నడువన్ వాద్యములన్ ధ్వనింపఁ బ్రజలున్ గళ్యాణముల్ తీర్ప సం
దడి వారల్ పిత రాజధాని నిఁక నానంద్రదింత్రు కాఁబోలునే 1904

బ్రదుకుచె తండ్రి మేము వనవాసమునుండి పురంబు క్రమ్మఱన్
ముదమునఁ జేరి ధార్మికుఁ గనుంగొనఁ జాలుదుమే కృత ప్రతి
జ్ఞు దరిసి సౌఖ్య మొందుదుమె చొచ్చి యయోధ్య నటంచు లోఁ బదే
పదె నిలుచుండె యేడ్చి వగవన్, గనలేక రాత్రియే చనెన్. 1905

ఉదయమున రవి స్వచ్ఛమై యుండ, నపుడు
అటుల గంగానది తటాన జటలు గూర్చి
నారబట్టలు విలుకత్తి మీఱ వారు
నేను దాటింప, సతి చూడ నేగినారు. 1906

అని గుహుఁడున్ వచింప విని యప్రియమున్, భరతుండు నప్డె నె
మ్మనమున ధ్యానమొంది, సుకుమారుఁడు వీరుఁడు సింహమున్‌బలెన్
ఘన మగుస్కంధముల్ గలుగు కంజ విశాల విలోచనుం డదే
క్షణమునఁ దేటి కూలెఁ బరుషాంకుశ విద్ధ గజంబుపోలికన్ 1907

మూర్ఛిలిన భరతు వివర్ణ ముఖముతోడ
భూమి కంపానఁ బడు చెట్టుఁ బోలెఁ జూచి
గుహుఁడు కుందె, శత్రుఘ్నుఁడు కూడ భరతుఁ
జూచి గ్రుచ్చి సంజ్ఞను వీడి స్రుక్కి యేడ్చె. 1908

అపుడును భరతుని తల్లులు
ఉపవాస కృశలె యయి కృపణోత్సుకలగుచున్
విపులఁ బడు భరతు చుట్టు వి
లపింపఁ గౌసల్య భరతు లాలించి కడున్. 1909

తన తనయునివలె దరి నిడు
కొని కవుఁగిట గ్రుచ్చి మిగులఁ గుందుచు నపుడున్
కనుఁగొని యీవిధముగ తా
ననె వాత్సల్యంబు పొంగ నాభరతునితో. 1910

నాయన! యేది యేన్ తనువునన్ వ్యధ గూర్పదు కాదె రాట్కులం
బీయది నీయధీనమయి యిప్పుడు నిల్చెడె భ్రాతలేగ మీ
నాయన పోవ నిన్నె గని నాబ్రదు కంతయు నిల్పుకొంటి, నీ
వే యిఁక మాకు నీభువిని నెల్లరకున్ గతి దిక్కు నన్నియున్. 1911

శ్యామలగాత్రుఁ డేకసుతుఁ డంగనతో వన మేగినట్టి యా
రామునియందుఁ గాని మఱి లక్ష్మణునందునుగాని యప్రియం
బేమి వినంగలేదుగద యిప్పు డటంచును నేడ్చుచున్న యా
రాముని మాత యూరడిల రమ్యగుణుం డని వాకొనెన్ గుహున్. 1912

ఏమి భుజించి యెచ్చట వసించెను నన్నయ లక్ష్మణుండు తా
నేమెయి నిద్రచెందె తిని యెచ్చట సీత పరుండెఁ జెప్పుమీ
యోమహితా! గుహా! యన గుహుండును సంతస మంది చెప్పె నా
రాముఁ బ్రియాతిథిం గని కరం బెటు ప్రీతిని నాచరించెనో 1913

చిన్నవి పెద్దవి భక్ష్యము
లెన్నైనను బండ్లు తెచ్చి యిడితి భుజింపన్
అన్నియు రాముఁడు గొనకే
* కన్నన మఱి పంపి వైచె క్షత్రియుఁ డౌటన్ 1914

* క్షత్రియుడు వేదములు చదువుట యజించుట, ఇచ్చుటచేయువలయునే కాని వేదాలు చెప్పుట యాగము చేయించుట పుచ్చుకొనుట చేయరా దనిపూర్వ ధర్మము.

మే మెపుడిచ్చుటె కానీ
యేమియు గ్రహియింపరాద యిటు లని యనుచున్
రాముండు మహాత్ముండే
యీ మెయి బ్రతిమాలి చెప్పె నెంతయుఁ బ్రీతిన్. 1915

లక్ష్మణుఁడు తెచ్చినట్టి జలంబు లాని
సీతతోడ నాఁడు నుపవసించి నియతి
పిదప లక్ష్మణుండును గూడ నుదక మానె
ఇట్లు మువురు సంధ్యను నుపాసించినారు. 1916

అవల సౌమిత్రి శుభమైన యాస్తరణము
బర్హిసులు తెచ్చి రాముకై స్వయముగానె
చేయ నట నన్ను కూర్చుండె సీతతోడ
వారికాళ్కడ్గి సౌమిత్రి ప్రక్క కేగె. 1917

* ఇదె రాముండును సీత పండుకొని నిద్రింపంగ నౌగార చె
ట్టిదె యాయాకుల గడ్డి పానుపును నిండే యంగుళిత్రాణముల్,
గదియంగట్టిన నిండు టంపపొదు లింకన్ వెన్కనే యుంచి యా
యదనన్ వింటిని నెక్కుపెట్టి నిశయం దాతమ్ముఁడో మేల్కొనెన్. 1918

అవల గొప్ప ధనుస్సును నమ్ము పొదిని
తాల్చి లక్ష్మణుఁ డున్నట్టి స్థలిసె యుంటి
విల్లు దాల్చి శ్రద్ధగ జ్ఞాతు లెల్ల రాఁగ
ఇంద్ర సముఁడైన రాము రక్షించు కొఱకు. 1919

* సీత పండుకొన్న గడ్డిపానుపును వాల్మీకి వర్ణించెను కాళిదాసు శకుంతల పూలపాన్పును వర్ణించెను.

అది విని మంత్రులతో నే
ర్పొదవర నాగారచెట్టు మొదటికి భరతుం
డదటునఁ జని రాముని సె
జ్జఁ దడవి చూచియు వచించె జనములతోడన్. 1920

ఇదిగో రాతిరి యామహాత్ముఁడును నిద్రింపంగ నొప్పారు చో
టిదిగో నిందె మహానుభావుఁడు బుధుం డిట్లట్లుదొర్లెం జుడీ
మృదులాంగుం డగు నట్టి దాశరథియున్ పృథ్వీతలం బందిటుల్
నిదురింపందగు వాఁడుకాఁడ యకటా! నిద్రించె నెట్లీగతిన్. 1921

ప్రాసాద శిఖరాగ్ర భాగాల బంగారు
వెండి పర్యంకాలఁ బండువాఁడు
విరిసెజ్జఁ జందనాగురు ధూప మింపార
దొరలుచు శుకగీతు లరయువాఁడు
గీత వాదిత్రాలఁ గేలి కంకణ నాద
మును మృదంగధ్వనుల్ వినెడు వాఁడు
వంది మాగధ సూత బహువిధ స్తుతి కథల్
వినుచును లేచి మేల్కొనెడి వాఁడు.

అట్టివాఁ డిప్పు డిటు నేల నెట్టు పండె
నిదియు నమ్మ దగని యట్లు మదికిఁ దోచు
సత్య మిది నాకు తోచును స్వప్నముగను
ఇందు నామది వ్యామోహ మందుచుండె. 1922

కాలమునకంటె కడు బలశాలి యైన
దైవతము లేదని మదిలోఁ దలఁచుచుంటి
ఆ దశరథ మహారాజు నాత్మజుండె
యయిన రాముఁడు భూతలిపయిఁ బరుండె. 1923

అల్ల జనకమహారాజు నంతవాని
కూతు రగుసీత ప్రియరూప కోమలాంగి
గురు దశరథమహారాజు కోడ లయ్యు
రాముదయిత పండవలసె భూమిపయిసె. 1924

ఇదె మాయన్న పరున్నగడ్డిపఱు పిందేయన్న యాబెడ్డ లం
దిదె గాత్రమ్ముల దొర్ల నల్గిన తృణం, బిందేకటా ! సీత వ
య్యద కొంగుంచి పరుండఁ బట్టువగు నాయాదారపుం ప్రోగు లిం
దుఁ దగుల్కొన్నవి, యివ్వె యామె నగలందున్ రాలు జాళ్వాపొడుల్.
1925

పతికి సుఖం బగుశయ్యయె
సతికిన్ సుఖ మౌను గాన జనకాత్మజయున్
అతి సుకుమారియె యయ్యును
ధృతిమతియై దుఃఖ మన్న దెఱుఁగక యుండెన్. 1926

ఎటువంటి క్రూరుఁడ నకట !
యిటువంటి కఠినపు శయ్య నింతియు తానున్
ఎటులన్ పరుండెను గదో
యిటు రాముఁ డనాథు డట్టు లిట నావలనన్. 1927

ఇటులన్ రాముఁడు సార్వభౌమకులమందే జన్మమున్ పొందియున్
ఇటులన్ సర్వజగాల సమ్మతుడునై యేపారి సామ్రాజ్యమున్
త్రుటిలో వీడియు సర్వలోక హితుఁడై యార క్త నేత్రుండు న
క్కట ! బాధల్ గనరానివాఁ డెటులహా ! కట్టా ! పరుండెన్ ధరన్.
1928

ఆపద వచ్చిన యప్పుడు
నీపగిదిని రాము ననుసరించెను గానన్
ఆపావన లక్ష్మణుఁ డయి
యేపాఱెడి లక్ష్మణుండె యిఁక ధన్యుండా. 1929

పతిని ననుసరించిన యా
పతి సీతయె యెంతధన్య జగముల లోనన్
అతి ధర్మాత్ముండె యయిన
యతండే లేని మన బ్రదుకొ యావద పాలే. 1930

ఇక్కానకు రాముండు చన
నక్కట ! యాదశరథుండు నమరుండు కాంగా
చుక్కాని పట్టు వాండే
నెక్కానని పృథివిపోలె నెమ్మదిం దలంతున్. 1931

రాముండొ వనికిం జనను
ద్దామపు వీర్యంబుచేతం దగం గాచెడి యీ
భూమిని మనస్సుచేతను
నేమహిపతి కోరి యాక్రమింపండు జగతిన్. 1932

ప్రాకారంబులు గావ రెవ్వరు, గజాశ్వాలెవ్వరున్ గట్టంబో
రీకోటన్ దల్పులు మూయు, రెవ్వరును రక్షింపంగం బోరిపురిన్
శోకార్తిన్ వ్యథ పొంది సైన్యము లిటన్ స్రుక్కెన్ మహాపాయతన్
గైకోకన్ రిపు లాక్రమింపరు విషాన్నం బట్టు లీరాజ్యమున్. 1933

ఇది మొదలు నేలమీందనె
నిదురింతును గడ్డిమీందనేనిం బరుందున్
ముదమున పండ్లును దుంపలు
పదపడి తినుచు నింక నారబట్టలె దాల్తున్. 1934

పదునాలు గేండ్లు వనమున
పదపడి వసియింతు వేళ్ళు పండ్లును తినుచున్
ఇదిగొ నింక ప్రతిజను తీ
ర్చెదం గావున మిథ్యగావు చేసిన ప్రతినల్. 1935

అన్నకొఱ కయి వనంబున
నున్నన్ శత్రుఘ్ను డింక నుండును నాతో
అన్న ననుసరించియె యిఁక
క్రన్నన లక్ష్మణుఁడె యుండి కాచు నయోధ్యన్. 1936

మఱియు నయోధ్యను ద్విజులును
కర మభిషేకింత్రు గాక కనుఁగొని రామున్
మఱి నాయభీష్టమును నిఁక
నెఱవేర్చెదరా మఱింకనేనియు దేవుల్. 1937

శిరసును వంచి స్వయంబుగ
పరిపరి బ్రతిమాలి మిగులఁ బ్రార్థించిన నేన్
మరలనిచో చివరకు నే
నరణ్యమున నుందు నాతఁ డపుడేన్ మరలున్. 1938

భరతుఁ డాగంగ యొడ్డున బండి రాత్రి
ఉదయమున లేచి శత్రుఘ్నుఁగదిసి పల్కె
లెమ్ము శత్రుఘ్న ! యింక నిద్రింతు వేల
పిలువు: గుహుడు దాటించును వేగ నదిని. 1939

మనయన్ననె తలఁచుచు మే
ల్కొనితిని నిద్రింప లేదు కూడను రాత్రిన్
అని భరతుఁడు వచియింపఁగ
ననె శత్రుఘ్నుండు నేను నట్లనె యుంటిన్ 1940

అనుచును నరవరు లొండొరు
లనుకొనుచుండగఁ గుహుండు ప్రాంజలి యగుచున్
అనెకాకుత్స్థా! సుఖని
ద్రను కంటివెగద కుశలమె తగుసైన్యంబున్ 1941

అని స్నేహంబున గుహుఁ డన
విని రాముని వశమునందు వెలసిన భరతుం
డనెరాజ!- నిశ సుఖము, మముఁ
గనికొల్తువు, దాట ఁజేయుగంగను మమ్మున్. 1942

అన విని గుహుఁ డంతటఁ జని
తన జ్ఞాతిజనంబుతోడ తగఁ జెప్పగ వా
రును లేచి యయిదు వందలు
గొని తెచ్చిరి నావ లపుడు కొలఁది క్షణాలన్ 1943

వఱియును స్వస్తికము లనెడి
నరఘంటల నొప్పి వేగ వర్వెడు నావల్
దరి నిడి మఱి స్వస్తి కమను
వరనందిని గుహుడుతెచ్చె భరతునికొఱకై 1944

వడి భరతుండును శత్రు
ఘ్నుఁడు కౌసల్యయు సుమిత్ర క్షోణీశు సుతుల్
విడక పురోహితుఁడును గురు,
లెడపరకులతోడ ద్విజులు సెక్కిరి నావన్. 1945

ఆపనతులఁ గాల్చు భటులు
తేవుల దిగువారు ఘటము లీడ్చెడి వారున్
కావించెడి ఘోషలు దివి
కావలి దాకను జనుచును వ్యాప్తము లయ్యెన్. 1946

జెండాలు గలుగు నావలు
నిండారుచుఁ బల్లెవాండ్రు నెఱపఁగ ఁదామై
మెండుగ ప్రజ సెక్కించుచు
దండై శీఘ్రంబుగాఁగ దరలెన్ నదిలో. 1947

కొన్ని పడంతుల తోడన్
కొన్ని తురంగములతోడ కొన్ని ధనాళిన్
కొన్నియు యానంబులతో
క్రన్నన c బైలైటి చనియె గంగానదిలో. 1948

ఆతలి యొడ్డున జనములు
నాతటి దిగc బల్లెవాండ్ర యందఱు బంధుల్
ప్రీతిని దండములను గొని
యాతల నీతలను నీది యాడిరి లీలన్. 1949

ధ్వజములు వింతగc గట్టిన
గజముల మావటులు మీటి కడువడినడపన్
ధ్వజములు గల గిరు లటు ల
క్కజముగ తోపంగ దొడcగె గంగానదిలో. 1950

కొందఱు పడవల నెక్కిరి
కొందఱు జలకుంభములమీదc గూర్చొని దాటన్
కొందఱు బాహా బలములు
నందముగాc జూపి దాటి రానదిలోనన్. 1951

అటు పల్లెవాండ్రు పల్గతిc
బటుగతి దాటింప గంగ స్వయముగ నలరెన్
ఇటు ధ్వజయుత సేనయుc జనె
* నరు మైత్రపు మూర్తమునc బ్రయాగ వనంబున్. 1952

* మైత్రము హూర్తము=ఉదయము మొదలుకొని మూడవము హూర్తము

భరతుండు మహాత్ముం డా
తఱి సేనను విశ్రమింపఁ దటమున నిలిపెన్
మఱి యచట భరద్వాజుని
నరయు వెడలె నంత ఋత్విగార్యులతోడన్. 1953

అభయున్ దైవపురోహితున్ సుచరితున్ స్వచ్ఛాత్ము బ్రహ్మజ్ఞు బూ
జ్యు భరద్వాజుని జూడ నెంతయు మనం బుత్సాహ మూగింపఁగన్
శుభమై సుందరమై యనేక తరులన్ శోభిల్లి రమ్యోటజ
ప్రభతో శాంతముతోడ వర్తిలెడి యాస్వచ్ఛాశ్రమంబున్ గనెన్. 1954

కని క్రోశంబున నుండె సైన్యముల వేగన్ నిల్పి యామంత్రులున్
తనతో రాగ, వరాస్త్రశస్త్రము లటున్ వర్జించి, ధౌతంబులై
వినతిం జూపెడి పట్టువస్త్రములనే వేఁడాల్చి, పూజ్యున్ పురో
ధను ముందుంచుకుపోయెఁ గాల్నడకనే తత్పూరుషశ్రేష్ఠుఁడున్, 1955

అనఘు భరద్వాజుని ద
ర్శనమును చేయుగ భరతుఁడు మంత్రుల నటనే
కని యాపి భరద్వాజుని
కనఁగ పురోహితునితోడఁ గన్నన నేగె 1956

పిదప వసిష్ఠునిఁ గనఁగనె
ప్రథిత భరద్వాజ ఘనతపస్వి తటాల్నన్
కదలి తన యాసనంబున
నెది యర్ఘ్యము నర్ఘ్యము ననియెను శిష్యులతో 1957

దరిఁ జేర్చుకొని వసిష్ఠుని
భరతునిచేత మిగుల నభివాదితుఁ డగుచున్
భరతుని దశరథసుతునిగ
నెఱిఁగె భరద్వాజుఁడు ఘనధృతతేజుండున్ 1958

వారి కర్ఘ్యము పాద్యము పండ్లు నొసఁగి
కులమున నయోధ్య బలమునఁ గోశమందు
మంత్రులెడ మిత్రులందు క్షేమంబు వరుస
నడిగె, దశరథమృతిఁ దెల్పి యడుగఁ డదియు, 1959

ఆ వసిష్ఠుఁడు భరతుఁడు నతని గూర్చి
యగ్నిఁ గూర్చి శిష్యులఁగూర్చి యఖిల తరులఁ
గూర్చి మృగపక్షితతిఁగూర్చి కుశల మడుగ
క్షేమమె యని యనియె రాము ప్రేమ నెంచి. 1960

క్షితి రాజ్యంబును నేలు నీవిటకు రాఁ గృత్యంబు లేమయ్యె నా
మతి నీసంశయమే జనించెఁ జెపుమీ మచ్చిత్తమున్ నీపయిన్
అతి శుద్ధంబుగ లేదు శత్రుదమనున్ గౌసల్యకానందమున్
మతిఁ గల్గించెడి రాము సీత ననుజున్ బంపించి రీకానకున్. 1961

స్త్రీ మాటల్ విని "నీవు కానఁ బదునాల్గేండ్లుండు" మంచున్ భువిన్
ఏమాన్యున్ సుయశస్కు స్వీయపిత శాసించెంగదా, యాయఘం
బేమీ చేయని వాని కాప్తులకు దుష్కృత్యంబు గావించి యెం
దేమీ కంటక ముండ నట్టులుగ భోగింపంగ వాంఛింతువే. 1962

అని యామౌని వచింప నప్డు భరతుం డంతన్ భరద్వాజునిన్
గని వల్కెన్ "కట ! హా ! హతుండ నను నింకన్ బూజ్యులుంగూడ ని
ట్లనె లో నెంతురు, దోష మేమియును నాయం దున్నటుల్ నే దలం
పను, నిట్టుల్ భగవానుఁడున్ దలపఁగా బ్రార్థింతు మన్నింపుఁడీ. 1963

ఇది నాకిష్టమె కాదు నాజననియే యేన్లేని యప్డిట్టు ల
న్నది, నేనో యది యొప్పుకోక యిటు లన్నన్ బూరుషశ్రేష్ఠు ని
య్యెదె ప్రార్థించి యనుగ్రహింపఁగఁ, దదీయాంఘ్రి ద్వయంబున్ వదే
వదె కన్నీటను దడ్పి వ్రాలి మరలింపన్ బోవుచుంటిం గదా. 1964

నను మీరిట్టు లనుగ్రహింపఁగఁ దగున్ ప్రార్థింతు మన్నింపుడీ
యనఘా! యిప్పుడు నామహావిభుఁడు మా యన్నయ్య రాముండు నెం
దున నుండెన్ దయయుంచి చెప్ప భగవానుండున్ ప్రసాదంబు చూ
ప నగుంగాక" యనన్ వసిష్ఠ ప్రముఖుల్ ప్రార్థింపఁ బూజ్యుం డనెన్. 1965

* "ఇది నీకే తగు, పూరుషాగ్ర్య ! రఘులం దిట్లీవు జన్మించి పే
రు దగన్ నిల్పితి, పెద్దలన్ గొలుచుటల్ పూజార్హ శుశ్రూష దే
హ దమం బాదికి మీరె పెట్టినది పేరంతస్థమౌ నీతలం
పది నాకుం దెలియున్, దృఢం బిదియ చేయన్ నిన్నిటుల్ పల్కితిన్. 1966

ఇలలో నీదుయశస్సు పెంచుటకు నేనీరీతి నంటిన్ మ తీ
ట్లుల నారాముఁడు సీత లక్ష్మణుడు తోడున్ నీడలై ధర్మవే
త్తలునై యుండిన వారి నేనెఱుఁగుదున్ తద్వార్త వాక్రుత్తు వా
రలొ యీవేళను చిత్రకూట గిరి భద్రం బొప్ప నున్నారుసూ. 1967

ఇట నేడుండియు రేప వెళ్లెదవులే యీనాఁడు మంత్ర్యాళితో
నిటు విశ్రాంతిని పొందు, నాపలుకు నిందిట్లీ విఁకన్ దీర్చి పొ
మ్మటు కామార్థవిదా: యనంగ భరతుం డాలించి సత్కీర్తుఁడం
తట ఆనాడట నుండె నుదారదృష్టి యయి తచ్ఛాంతాశ్ర మోర్వీతలిన్ 1968

వ. అప్పు డాభరతుఁ డాయాశ్రమముననుండ నంగీకరించిన భరతుని ఆముని మా యాతిథ్యమును స్వీకరింపు మని యాహ్వానించుటయు ఆభరతుం డప్పుడు "తమరు ఇది వఱకె అర్ఘ్యపాద్యములు వనమునందు లభ్య మగు పదార్థములతో నాతిథ్యము నొసంగితిరి గదా "అని యనఁగ భరద్వాజ

---

* విప. :- దేహదమంబు = దేహేంద్రియ నిగ్రహము.

మహాముని పరిహాసము చేయువాఁడు వలె నిట్లనియెను "అవును నేనెఱుంగు దును నీవు ఏదో దొరికిన దానిని గ్రహించి ప్రీతి పొందితివి. కాని యీ సైన్యమునకును భోజనపు ఏర్పాటు చేయఁదలచున్నాను. అది నాయభీష్టము దానిని మనుజాధిపా! స్వీకరింపుము అని మఱియు నిట్లనియె. 1969

బలముల్ దూరమునంద యుంచి యిటు క్ష్మాపాలాగ్ర! యేతెంచితే
బలముల్ నీవెనువెంటఁ దీసికొని రావచ్చున్గదా యన్న న
వ్వలఁ బల్కెన్ భరతుండు నంజలి మొగంబందుంచి భక్తి ప్రప
త్తులతోడన్; భగవంత! మీభయముచే దూరంబె సైన్యం బగున్.
1970

ఎపుడున్ రాజులు రాజపుత్త్రులును మౌనీశా! మిమ్ముం బోటి పూ
జ్యపవిత్రాత్ముల కెంతొ దవ్వగనె సైన్యంబు లుంచందగున్
ద్విపముల్ వాజులు యోధసంఘము ననున్ వెన్నాడు, నవ్వానిచే
నిపుడీ యాశ్రమ శాంతి భగ్నమగు నంచే నొంటినై వచ్చితిన్. 1971

అన, రప్పింపుము, సేన నం చనన నద్దాజ్ఞప్తి యీయన్ సరే
యని సేనన్ భరతుండు రమ్మనఁగ సైన్యం, బందు రా మౌనియున్
గని యందగ్ని గృహాన నీళ్ళుగొని యింకన్ దుడ్చి యాతిథ్యపుం
బనికై యప్పుడె విశ్వకర్మ నట కాహ్వానించె నప్పట్టునన్ 1972

పిలుతున్ త్వష్టను లోకపాలురను దేవేశున్ దిశన్ భూమిలో
గల యేళ్లన్;చనుదెంచి వీరలు సమగ్రంబైన యాతిథ్యమున్
సలుపన్ వత్తురు గాక యంచు మునియున్ సల్పెన్ శుభాహ్వానముల్
జలమున్ మద్యము వీరలిక్షురసముల్ పానీయముల్ గూర్చుతన్. 1973

వ. మఱియు దేవగంధర్వులను ఆహ్వానించుచున్నాను విశ్వావసు హాహాహూహూ లను అప్సరసలను గంధర్వ స్త్రీలను ఘృతాచిని విశ్వాచిని మిశ్ర కేశిని అలంబుసను నాగదంతను హేమను అద్రి యందున్న హిమను ఇంకను నింద్రుని బ్రహ్మను గొల్చు దేవతాస్త్రీలను అహ్వానించుచున్నాను. తమ తమ

వాద్యములతోఁ గూడిన తుంబురుడు మొదలైన వారిని, ఆహ్వానించుచున్నాను. ఇట్లే యుత్తర కురు దేశములందలి చైత్రరథోద్యానమును వేష భూషణ వస్త్రము లిడుచు దివ్యకాంతలు ఫలముగాఁ గల కుబేర దేవతలను అహ్వానించుచున్నాను. వీరు ఆసమస్త భోగములను సమకూర్తురుగాక. భగవంతు డగు సోముఁడు ఉత్తమాన్నములను భక్ష్యమును భోజ్యమును చోష్యమును వివిధ లేహ్యములను చెట్ల నుండి రాలిన విచిత్ర మాల్యములను వివిధ మద్యపేయ మాంసాదులను సిద్ధపరుతురు గాక."అని సమాధి నిష్ఠుఁడై అప్రతిమ తేజస్సుతో శిక్షా స్వర యుక్తముగా మంత్రములు జపించి పలికెను. అట్లు ప్రాఙ్ముఖుఁడై ధ్యానింపఁగా సర్వదేవతలు వచ్చి యాయా వస్తులు తయారుగా నుంచిరి. మలయ దర్దుర పర్వతములను తాకి మలయానిలము శివముగా చక్కగా వీచెను. దివ్య మేఘములు పుష్పవృష్టిని కురిసెను. దివ్య దుంభులు మ్రోగినవి. చల్లని వాయువులు వీచెను అప్సరసలు నాట్యములు చేసిరి. దేవగంధర్వులు వీణలు ఆలపించిరి. ఆశబ్దము లయగుణాన్వితమై భూమ్యాకాశముల ప్రతిధ్వనించెను. ఆశబ్దము ముగిసి నంత భరతుని సైన్య మంతయు ఈవిశ్వకర్మ విధాన మంతయు చూచెను. 1974

అచట నైదు యోజనములై యమరు నేల
మెఱక పల్లాలు లేకయు సరిగ సమమె
యొప్పుగుచు గరుడ పచ్చలఁ దీర్చి నదియు పోత
పచ్చికల బయళ్ళచే మది నెచ్చ నొప్పె. 1975

మారెడు పనస వెల్గలు మాది ఫలపుఁ
జెట్లు ఉసిరిక మామిడి చెట్లు పండ్ల
పఱలి యట నుండె నుత్తర కురులనుండి
వనము వచ్చె జంబునది చెట్లను దనర్చె. 1976

ప్రముఖంబె తనరారు నేను మొగసాలల్ వాజిశాలాళి యు
త్తము లుండందగు నాలుగిండ్ల భవనాల్ దర్పించు ప్రాసాద హ
ర్మ్యములున్ తోరణ రాజి, పుష్పముల మాలల్ దివ్య గంధాలు వ
స్త్రములున్ సర్వరసాలు నాసనములున్ శయ్యల్ తయారై తగెన్. 1977

నలు పల్కల్ సువిశాలమౌ శయనసంతానంబు, నందొప్ప విం
దుల నేర్పాటగు రుచ్య భోజనములం దొప్పారు ధౌతాచ్ఛ పా
త్రలు పీఠంబులు పల్లకీలును విహారార్హంబులౌ యానముల్
పలు వాగ్వర్ణన లేల నన్నియును సొంపై యొప్పె నానాగతిన్. 1978

అపు డాజానుభుజుండె యైన భరతుం డా కైక యీ పుత్త్రుడున్
విపులంబై సకలార్ఘ్య రత్న సుసమావిష్టంబ యౌ సౌధమం
డపమున్ మౌని యనుజ్ఞచేఁ జొఱగ నంతన్ సర్వులై నట్టి మం
త్రి పురోధల్ వెనువెంట నేగి కడుఁ బ్రీతిన్ జెంది రాశ్చర్యమున్. 1979

అట రాజాసన మింక ఛత్రమును దివ్యంబైన వింజామరల్
నిటలం బందుఁ గరాలతో భరతుఁడున్ నిండారు భక్తిన్ హుటా
హుటి వీక్షించి ప్రదక్షిణంబ చని యెంతో గొల్చి వేఁ్రమొక్కి హృ
త్కుటి రామున్ గని మంత్రి పీఠమునవే కూర్చుండి వీచెన్ వడిన్. 1980

మొదటన్ మంత్రి పురోహిత ప్రముఖు లాముందున్ బలాధ్యక్షుఁడుం
జిదపన్ బట్టనరక్షకుం డెసఁగ నెమ్మిన్ మౌనియాజ్ఞన్ బయో
నదులే వచ్చి భజింప రెండుదరులన్ స్వచ్ఛంబుగా వెల్లవే
యఁ దగన్ మీఱెను మందిరంబులును బ్రహ్మాత్మ ప్రసాదంబుచే 1981

ఎన్నొ భూషలు గల్గు నిరువది వేవురు
రమ్యాంగు లింతుల బ్రహ్మపంపె
ముత్యముల్ పసిఁడి కెంపులు గల యిర్వది
వేవు రంగనలఁ గుబేరుఁ డంపె

పురుషులఁ గడుఁ బిచ్చి పఱచు నిర్వది వేవు
రను నచ్చరలను నందనము పంపె
ద్యుతి సూర్య తేజులు తుంబురు నారదుల్
భరతు నెదుటఁ బాడి ప్రమద మిడిరి

పుండరీక వామన యలంబుసయు మిశ్ర
కేశియును నృత్యముల సాగించినారు
దైవములయందుఁ జైత్యరథాల నున్న
మాల్యములు ప్రయాగను జేరె మౌని యాజ్ఞ. 1982

మారెడుల్ వాయించె మద్దెల్: తాండ్రచె
ట్టు లలయన్ రావిచెట్టులు నటించె
తెగడ చెట్టులును బొట్టుగు చెట్లు నాగమ
ల్లెలు పొట్టివౌచు కుబ్జలుగ నాడె
ఇరుగుడు చెట్లు నుసిరికలు నేరేళ్లు
మల్లె మాలతి జాజి మహిళలుగను
అయి త్రాగువారు మద్యమొ పాయసమొ త్రాగుఁ
డాకలున్నను మాంస మదిగొ యనిరి

ఇట్టు లనుచు వడ్డన చేసి ఇంక మఱియు
నలుఁగు బిండి పెట్టి నదియొడ్డులను నొకరు
స్నాన మాడించి, రొకొక్కొక నరుని నపుడు
ఏడ్గు రెనమండ్రొ యట్లు సేవించినారు. 1983

వామాక్షు లొకక్కండ్రు పాదముల్ పిసుకుచు
స్నాన మాడించియు పానమిడిరి
యూవపాలు రొకండ్రు నశ్వాల గజముల
గాడిద లొంటెల గ్రాస మిడిరి

ఇక్ష్వాకు వరయోధ బృందాల వాహాల
కిక్షు లాజలు తేనె లెంతొ యిడిరి
ఎవరి కెవ్వరి కేది యిష్టమో దానిని
సర్వంబు ప్రీతి నొసంగినారు.

త్రాగి తినియు నున్మత్తులై! తందనాలు
నాడి యుప్పొంగి మిగుల సైన్యంబు లెల్ల!
తమదు గుఱ్ఱా లెఱుంగరు గుఱ్ఱముల వారు
మఱి యెఱుంగరు స్వగజములు మావటీండ్రు. 1984

ఇంక ఆసేనలు సర్వకామములచే తృప్తాత్ములై గంధముల్
సకలాంగాల నలంది యచ్చరలతో రంజిల్లి వాక్రుచ్చినా;
రింక మేమట్టి యయోధ్యకే చనము నిట్లే దండకారణ్యమే
ని, కనుంగోము సుఖంబ యౌత భరతుండే క్షేమమౌ రాముండున్. 1985

భరతుని ననుసరించిన వార లిదియె
స్వర్గ మని యంచు నృత్యముల్ సలిపినారు
విరుల దండలు మెడలోన వేసికొనుచు
నగిరి పాడిరి యిట్టులన్ పరువు లిడిరి. 1986

అట్టు లమృతోపమం బైన యన్నములను
తినియు దివ్య భక్ష్యము లింకఁ గనుచు తినఁగ
కోరు చుందురు మది వాంఛతీర దయ్యె
కాని వారి కడుపొ పట్టకయె చరింత్రు 1987

దాస దాసీ జనంబులు తరుణ సతులు
వేల కొలఁదిగ సేనలన్ వెలయువారు
మిగుల సంతృప్తి పొందుచు మెలగినారు
అందఱకు నూత్నవస్త్రముల్ ప్రాప్త మయ్యె. 1988

ఏన్గు లొంటెలు గాడిద లెడ్లు మఱియు
వారువంబులు మృగములు పక్షి గణము
అన్నియును తృప్తితో నలరి తిరిగె
పరు లెవరు వాటి కిడు నవసరమె లేదు. 1989

తెలుపు బట్ట కట్టని వారు తెలియరారు
ఆకలగువారు మలినులు నరయరారు
ధూళి దూసర మైన కేశాలు కలుగు
జనము లెవ్వరు నచ్చటఁ గనగరారు. 1990

మఱియు మేకల పందుల మాంసములును
నంజుడులు పక్వరసములున్ ఫలరసాలు
ముక్కు పుటముల సంతృప్తి పుచ్చు నవియు
మెండుగాఁ గల్గి యెల్లెడ నిండిపోయె. 1991

పూలతోడ ధ్వజాలతో పూర్ణ మయ్యె
తెల్లనగు నన్నములతోడ నెల్లనిండె
వెండి బంగరు లోహాల వేల కొలఁది
పాత్రలను దాల్చి జనములు పరువు లిడిరి. 1992

వనుల దరి కూపములు క్షీర భరము లయ్యె
కామ దుఘములు గోవులు, చెట్లఁ గాఱెఁ దేనె
మద్యపూర్ణాలు నూతులు, మాంసములును
నెమళు లవి లేళ్ళు కోళ్ళవి నిండిపోయె. 1993

పాత్రలును వేలు లక్షలు పళ్ళెరములు
పైఁడి పాత్రలు కోట్లుగా పరలి యుండె
పెరుగుతో నిండు కడవలు పెరిగిపోయి
దోర వెలగపండుల తావి మీఱి గ్రుమ్మె. 1994

జీలకఱ్ఱ కలిపిన తక్రాల నదులు
తెల్లని పెరుగుల సరసులు నెల్ల నిండె
పాలకొలకులె యెల్లెడఁ బరిఢవిల్లె
పంచదార రాసులె మిన్ను మించి పోయె. 1995

తైలములు చూర్ణములు కషాయాలు వెలసె
నదుల జేవుల నులివెచ్చ యుదక మూరె
స్వచ్ఛమయి పండ్లు తోమెడి బ్రష్షు లొప్పె
తెల్ల నగు చందనపు పొడ లెల్ల నిండె. 1996

నిద్దమగు నద్దములు తుండ్లు నిండిపోయె
పాదుకల బూట్ల ప్రోగులు ప్రబలి పోయె
కాటుక పుడకల్ దువ్వెనల్, గడ్డములను
నిమురు సామగ్రి కత్తులున్ విండ్లు నిండె. 1997

కలిగె సోఫాలు కుర్చీలు కవచములును
గజము లశ్వాలు నొంటెలు గాడిదలును
తినిన దరిగించు ప్రతిపాన తీర్థములును
దిగెడి జేవులుఁ గలువలఁ దొగల నిండె. 1998

నీలి పచ్చలరంగులఁ గ్రాలు నేల
పచ్చి గడ్డి మోపుల కొండ లచ్చటచట
పశులమేతకై నిండారి ప్రజల కెల్ల
కన్నులకు పండువులు గూర్చి క్రమ్మియుండె. 1999

భరతునికి మౌని యిచ్చిన స్వప్న తుల్య
మైన యద్భుతాతిథ్యాల నలరి జనులు
అచ్చెరువు పొంద నారాత్రి యరిగె నింక
కన్నులకుఁ బండువులు గూర్చి క్రమ్మియుండె, 2000

మత్తులై కల్లు మత్తుచే మరిగి జనులు
దివ్య గంధాలు మూచూచి దివ్య మైన
యలరు దండలు దాల్చి యవ్వి నలిగి
పోవ వానితో నిండియున్ ముదము గనిరి. 2001

పిదప భరతుండు పరివార వితతితోడ
విందులను బొంది యారాత్రి నందె గడిపి
యుదయమున బోయి యంజలి యొగ్గ యరయ
నాభరద్వాజుఁడు హుతాగ్ని యయి వచించె. 2002

ఇట నీ రాత్రి సుఖంబుగా గడచెనే యీ మీజనం బెల్ల ము
చ్చట నాతిథ్యము పూర్తిఁ గాంత్రె యన ! సంతోషమే" చెప్పనన్;
ఇటు లష్టాభరతుండు నాశ్రమమునుండే పైకి నేతెంచు ను
ద్భటు మౌనీశుని మ్రొక్కి చెప్పె భగవంతా ! సౌఖ్యమే యందఱున్.
2003

సకలబలంబు పూర్ణముగ సంతస మొందె, సమాత్యు లాది సే
వకులు ప్రహృష్టులైరి, శ్రమ వాసెను, నెందును నన్నపానముల్
వికలము కాక హాయి నిడె, వీడ్కొనెదన్ భగవానుఁడా ! దయన్
సకల విధంబులన్ గనుఁడి సమ్మతి నన్నను చేరఁ బోయెదన్. 2004

ఎటు మాయన్నయ యాశ్రమంబు గలదో యెట్లో మహాత్మున్ నుహా
త్కటు ధర్మాత్ముని జూడఁ బోవలయు నీతన్మార్గ మేలాగొ ముం
దట చెప్పుం, దన భాతృభక్తు భరతున్ తన్మార్గముం గూర్చి చె
ప్పట కారంభము చేసి యిట్టు లనియెన్ పూజ్యుండు మౌనీశుఁడున్.
2005

అటు మూడున్నర యోజనాలు చనఁగా, నందుండె రాజద్దరీ
తటముల్ గల్గిన చిత్రకూట గిరి, తత్పార్శ్వంబునందే యుద
క్తటి మందాకిని యున్న దందు తరువుల్ గ్రాలున్ వనప్రాంత ము
త్కటమై విచ్చిన పూల మేన బహు సాంద్రంబై మనోజ్ఞం బగున్.
2005

మఱి యాయేటికిఁ జిత్రకూటగిరికిన్ మధ్యన్ భరద్వాజుత లి
త్తఱి నిర్మించిన పర్ణశాల తనరున్, తత్పర్ణశాలన్ వసిం
తురు వా, రా కుడివైపుగా నటఁ గియద్దూరంబు మీరేగి ముం
దర సవ్యంబుగ పైని దక్షణపథిన్ సైన్యంబులన్ నడ్పుఁడీ.　　2006

అవలన్ నీవట రాముఁ జూచెదవు లే"యంచున్ మునీశుండనన్
అవలోకించి ప్రయాణమౌ సమయ మొయ్యన్ వచ్చెఁ గాఁబోలు నం
చు వడిన్ రాట్సుతు లామునీశ్వరునికిం జుట్టున్ తగన్ జేరఁ జే
రువఁ గౌసల్య సుమిత్రతోడ మునియంఘ్రుల్ పట్టెఁగంపించుచున్.2007

తన యాశల్ నెఱవేఱ కుండుట సమస్తంబైన లోకాలచే
ఘన నిందల్ వడి సిగ్గుచే శిరము నింకన్ వంచి కైకేయి యా
ముని కాళ్ళంబడి పల్ప్రదక్షిణములన్ ముంచెత్తి యాపుత్త్రు చెం
తన నిల్వంబడి యుండె దీనముగ చిత్తం బుత్తలం బొందఁగన్.　2008

భరతుం జూచి ధృఢవ్రతుం డగు భరద్వాజుం డిటుల్ పల్కె స
త్పురుషా నీప్రియమాత లెవ్వరెవరో పోల్చన్ విశేషించి నా
కెఱుఁగం జెప్పు వినందలంతు ననఁగా నిట్లప్డు వాగ్వేత్త యా
భరతుం డంజలి యొగ్గి నమ్రుఁ డగుచున్ బ్రాకుచ్చె నామౌనికిన్ 2009

ఇపు డేదేవిని దేవతం బలె నిరీక్షింత్రీమె నాతండ్రి ప
ట్టపుదేవింగ నెఱుంగుమో యనఘ! కట్టా! దీనయై చింతచే
ను పవాసాలఁ గృశించి కష్టములతో నున్నట్టి కౌసల్య వ్యా
ఘ్రపరాక్రాంతుని రాము నాయదితి తన్నాకేశుఁ బోలెన్ గనెన్.　2010

కొమరు పూలు రాల్చిన తీగ కొమ్మ వోలె
ఈమె యెడమ బాహువు నంటి నెసఁగె నెవతె.
ఈమె సుతులె సత్యబలులు నిష్టగుణులు
ననఘ లక్ష్మణ శత్రుఘ్ను లమరసములు.

ఇఁక ఏపాపిని వల్ల నాన్నవరు లెంతే జీవముల్ ప్రుక్కఁ గా
నకుఁ బంపంబడి రేయునార్యవలనన్ క్ష్మాభర్తయౌ భర్త యి
ట్టికుమారుల్ వని కేగ బెంగమృతి నిట్టే పొందెనో యట్టి ఘా
తకి కైకేయి కృతఘ్నురాలు ఖల యేతద్దుష్ట నా తల్లియే. 2012

సుభగ మానిని యైశ్వర్యసుఖము కోరు
గో ముఖ వ్యాఘ్ర దారుణ, క్రూరురాలు
మాతృ నామ ధారిణి యీమె హేతువుననె
యేను వ్యసనాల పాలయి యిట్లు చత్తు 2013

కరము యిటు లానరవరుండు గళము వడఁక
పలికి నిట్టూర్చి కడు నెఱ్ఱవడిన కండ్ల
నుఱికి పైబడు సర్పంబు కరణి మిగుల
నుస్సురంచును ప్రుక్కుచు నుర్విఁ బడఁగ. 2014

ఇఁక భరద్వాజ మహర్షి యిట్టె లేపి
కని మహాబుద్ధితో నర్థ యుక్తముఁగఁ బలికె
భరత! దోషిణిగను కైక నరయఁబోకు
రామ వనవాసము శుభోదర్కంబె యగును. 2015

భావితాత్ములౌ ఋషులకు దేవులకును
దానవులకుఁ గూడను భావిలోన మిగుల
హితమె యగు నని మతిలోన నెంచు మయ్యా
భద్రమగు రాము నీవన వాస మెల్ల. 2016

మరల భరతుండు మునికి నమస్కరించి
అల ప్రదక్షిణమును జేసి సెలవు పొంది
'సేనలు ప్రయాణమునకు సంసిద్ధ మవుత'
అనుచు సేనకు మంత్రుల కాజ్ఞ చేసె. 2017

అవలన్ బంగరు వెండివౌ రథములం దశ్వంబులన్ బూన్చుచున్
వివిధంబౌ జనముల్ బయల్వెడలి వేవే వానియం దెక్కి, ర
ష్ట్ర వడిన్ ఘంటలు మ్రోగ కేతువులు తోడ్తో నూగ గర్జించి వే
సవి తర్వాతఁ జరించు మబ్బులవలెన్ సాగెన్ కరేణుల్ కరుల్. 2018

పలు యానంబులు పెద్దవిన్ చిఱుతవిన్ వైశం బధిష్ఠించి పౌ
రులు పోసాగఁ బదాతులున్ నడుచుచున్ బ్రోగౌచు పోఁజొచ్చి రి
ట్టులె కౌసల్యయు లోనుగా సతులు గాఢోత్సాహలై రామునిన్
తిలకింపన్ బహుకాంక్షతోఁ జనిరి యందే శ్రేష్ఠ యానాలపై 2019

తరుణేందుఁ బోలు స్ఫటికము
లరుణార్కునిబోలు పద్మరాగము లెన్నో
విరచించి కూర్చు పల్లకి
భరతుఁడు శ్రీదుఁడు గొని చనెఁ బరివారముతో. 2020

కరు లశ్వాలు రథాలు వేటి కవియే కట్టాయితంబై చనన్
తొరగా దక్షిణదిక్కుగా తిరిగి యెంతో గొప్ప మేఘం బటుల్
గిరులన్ పక్షి మృగాఢ్య కాననములన్ గ్రేళ్ళుర్కు నేర్లన్ సరో
వరముల్ దాటుచు గంగ కాతలిదరిన్ వైశంబ సేనల్ చనెన్. 2021

ఒగిఁ గరులు వాజులు భటులు
మృగపక్షి గణాల కెల్ల మెయి భయ మిడుచున్
వగ వీడి మహావనమును
తగు భరతునిసేన చొచ్చి తనరెను మిగులన్. 2022

ఇటు వేగన్ జను సేనఁ జూచి వనులం దేపారు మత్తేభముల్
పటు యూథంబులతోడఁ బాఱె, నెలుగుంబంట్లున్ * రురుల్ దుప్పు ల
చ్చట నాకానలఁ గొండలన్ నదుల సంచారంబు గావించుచున్
తటులన్ కానఁగ రాఁగ నాభరతుడున్ తత్సేనతోడన్ జనెన్. 2023

---

వివ:- రురులు=చారలదుప్పులు.

అమహాత్ముడా భరతుని యఖిలసేన
అంబుధి ప్రవాహమువోలె నతిగ మీఱి
వర్షకాలాన మేఘ మ్మభ్రమును బోలె
క్ష్మాతలం బెల్ల మిక్కిలి కప్పి వైచె. 2024

తురగ గణంబులతోడన్
త్వరగాఁ బోయెడి మద ద్విపంబులతోడన్.
చిరకాలము దాఁకను క్షితి
యరయుంబడ రాక యుండె నాసమయమునన్. 2025

తురగంబు లలసి పోవఁగ
భరతుఁడు శ్రీమంత్రుఁ డపుడు స్వబలంబులతో
వరిగియు చాలాదూరము
వర మంత్రి వసిష్ఠుఁ జూచి పలికెను నిటులన్. 2026

ఎటువంటి గుర్తు వింటిమొ
ఎటువంటివి రూపమిప్పు డీక్షించితినో
ఎటుల భరద్వాజుం డనె
అటువంటి ప్రదేశ మిపుడె ప్రాప్తం బయ్యెన్. 2027

ఇదె చిత్రకూట పర్వత
మిదె మందాకిని నది యిటఁ గనిపించున్
ఇదిగో నీలపు మబ్బులు
నెదుటన్ గనుపట్టె వనము నీడాపుననే. 2128

మురువైన చిత్ర కూటపు
గిరిచటియ మదించి మిగులఁ గ్రేళ్ళుఱుకుచుఁ బెన్
గిరులం బోలిన యాయీ
కరులును దంతాలచేత గట్టిగఁ గొట్టున్. 2029

గిరి చఱియలపై నిప్పుడు
తరువులు సాంద్రంబు గాగ తలిరులు రాల్చెన్
కఱ కగు నెండలు పోవఁగ
కరమున్ గార్మబ్బు నీటి కణములఁ బోలెన్. 2030

కిన్నరులు సంచరించెడి
యిన్నగ దేశమును చూడు మిటు శత్రుఘ్నా!
మిన్నగ మృగములు చుట్టెను
పన్నగ మకరాల చేత వారిధి పోలెన్. 2031

భటులున్ వేగముతోలఁగ
నిటునటు పరువెత్తు నట్టి మృగములు దనరెన్
పటు వాయులచే మింటను
చటుకున త్రోయంగఁబడిన జలదము లట్టుల్, 2032

ఇదిగో దక్షిణ సీమను
నొదవిన వాజులు పరిమళ మొలికించు కళా
నిధిఁబోలె పువుగుత్తుల నం
బుద రుచి ఫలకములచేత మోయును లీలన్. 2033

ఘోరం బగు వన మియ్యది
నీరవమై యిప్పుడ యయి నెగడుచునుండెన్
పౌరజ నాకీర్ణం బయి
మీఱు నయోధ్యవలె మదికి మిగులన్ దోచెన్. 2034

బిట్టు డెక్కలు కడు లేవ గొట్టి నట్టి
దుమ్ము లాకాసమున నెల్లఁ గ్రమ్మిపై చె
దానిని వడిగ గాలియు దాల్చియుండె
అన్నఁ గనఁ బోవు నాకు ప్రియంబు నిడుచు 2035

లీల సూతముఖ్యులు వడిఁ దోలుచుండ
గుఱ్ఱములు శీఘ్రముగఁ దీసికొనుచుఁ బోవ
వడిగ కాననంబున నిదె పఱచుచున్న
స్యందనంబుల శత్రుఘ్న ! యరయు మవిగొ 2036

అందమౌ నెమిళ్ళు వెఱచి యవిగొ పాఱు
గూండ్లకును వేగ పోవు పక్షులను జూడు
తాపసుల నివాస మదె స్వర్గామ మట్లు
ఆ ప్రదేశ మెంతటి మనోహరమొ చూడు. 2037

బోఁటి లేళ్ళతో చార్ల దుప్పులను గనుము
పూలు చిత్రించి నట్టు లందాల నీను
సౌమ్య ! యెట ఘనుల్ రామలక్ష్మణులు గలరొ
వెడలి యాచోటు సైన్యముల్ వెదకుఁగాక. 2038

భరతు మాటలు విని శస్త్రధరులు వేగ
వనము చొచ్చి యచ్చట పొగబారుగాంచి
వార లాలోచనలు చేసి భరతు ననిరి.
నరులు లేకుండ నిప్పెటుల్ పఱగుచుండు 2039

ఇందె మనవారు తప్పక యుందు రయ్య
ఉర్వి శ్రేష్ఠులు నిచ్చోట నుండ కున్న
రాముఁ బోలు తాపసు లైన వార లైన
నొక్కవేళ నిచ్చోటను నుండి యుంద్రు 2040

తొరగ నరిదమనుఁడు భరతుండు వారి
మాట లాలించి సేనలం బలికె నిట్లు
మీర లందఱు జాగ్రతన్ మెలఁగుఁ డిందె
యేనును సుమంత్రుడు * ధృతి వీక్షింతు మిపుడె. 2041

వివ :- ధృతి=ఒకమంత్రికి మారు పేరు,

అని పలుక సైన్య మచటనె యాగి పోయె
భరతుఁ డంతటఁ బోగ చాలుఁ బట్టి యేగ
ప్రియతముఁడు రాము జాడల వేగ తెలియ
వేడి యాత్రముతో సేన వేచి యుండె, 2042

గిరు లన్నన్ వను లన్న లెంతొ ప్రియుఁడై క్రీడించు రాముండు నా
గిరియందే చిర ముండి సీతమదికిన్ గేళీ వినోదంబులన్
దరిఁ గల్గించుచు, స్వీయచిత్తమునకున్ తద్వేళ సంతోషమున్
బలపన్ లోనఁదలంచి వజ్రిశచికిన్ వర్ణించులాగిట్లనెన్ 2043

ఇదె యీసుందర చిత్రకూటపు గిరిన్ వీక్షించు నాకిప్పు రా
ట్పదవీ భ్రంశము గాని మిత్ర విరహం బైనన్ మదిన్ బాధ గూ
ర్పద, కళ్యాణి ! యనేక పక్షులు జయధ్వానాలు చేయన్ దివ
మ్ము దగు ల్గోఁజను ధాతు చిత్ర శిఖరంబుల్ చూడు మెట్లున్నవో 2044

కొన్నియు వెండివోలెఁ దగుఁ గొన్నియొ పోలును కొత్త నెత్తురున్
కొన్నియొ పస్పుగా తనరుఁ గొన్నియొ మించును నింద్రనీలముల్
కొన్నియొ పుష్యరాగములఁ గొన్ని దివాకరుఁ గొన్ని చుక్కలన్
కొన్ని తనర్చి యా మొగలి,కొండను జేయును చిత్ర కూటమున్ 2045

తమలో సాజమె యైన వైరము పరిత్యాగంబు గావించి శాం
తములై పెద్దపులుల్ సివంగు లెలుగుంబంట్లున్ మృగశ్రేణి సిం
హములున్ పల్ రకమైన పక్షులును స్నేహం బొప్ప నీయద్రి ప్రాం
తములందున్ గుహలందుఁ జెట్లపయి నానందమ్ము చేకూర్చెడిన్. 2046

* వ. జానకీ చూడుము, పనసలు, ఊడుగలు, ఇప్పలు, వెదురు, చంద్ర, మారేడు, వేగిస, కుంకుడు, నేరేడు, ఉసిరి, మోరటి, రేగి, అగిసె, మామిడిఁ నెమ్మి, అంబాళ, పేము, లొద్దుగ, బొద్దుగ, తుమ్మికి, నిమ్మ ఉలిమిరి, మేడి, కానుగు, మాదిఫలము మొదలగు చెట్లతోడను పువ్వులు, పండ్లు, నీడలు గల చెట్లతోడను మనోహరమై ఈ పర్వతము శ్రీలను అందాలను చిమ్ముచున్నది. ఎట్లున్నదో అట్లు. 2047

లలితాభ్రంలిహ శైలసుంద దరీ రమ్యాంత రోత్పన్న శా
ద్వల సీమా రమమాణ కిన్నర యుగీ స్వైరేష్ట వాంఛా విహా
ర లసద్గీతి మనోజ్ఞ భావ కలనా క్రావ్యోన్మత్త మాననంద తుం
దిల దేహోద్గత రోమ హర్షణ కళా దీప్తుల్ ప్రియా ! చూడుమీ. 2048

కొమ్మలఁ దగు లొ్కనిన ఖ
డ్గమ్ముల సుందరము లైన క్షౌమాంబరముల్
ఇమ్మగు విద్యాధర మిథు
నమ్ముల కేళీ ప్రదేశ నటనలఁ గనుమీ. 2049

మదముల్ జార్చెడి యేనుఁగుంబలెను రమ్యంబైన యీయద్రిఁ చెం
త దరిన్ పైనను క్రింద లోన జలపాతంబుల్ జలస్రోతసుల్
ఉద నిష్యందములున్, స్రవించు సెలయే, ళ్ళాకొ్కక్క ప్రాంతంబులం
దుదితంబై తగ బైలుదేఱి కను విందొప్పారఁ గావించెడిన్. 2051

---

* పాఠాంతరము

పనసాంకోల మధూక వేణు ధన బిల్వాప నారిష్ట ధ
న్వన జంబ్వామలక ప్రియాళు బదరీ భవ్యామ్ర సత్కాశ్మరీ
తిని శామ్రాతక వేత్ర లోధ్ర తిలకీ తిందూక జంబీర వా
రుణ యజ్ఞాంగ కరంజ బీజక ముఖద్రు వ్రాత మిందొప్పెడిన్, 2050

దరులందుండి యె బై లుదేఱి తరులన్ తచ్ఛాడి పుష్పంబులన్
సరిగా వ్రాలి సరస్సులన్ మెసలి యబ్జాలందు నల్లాడి ముం
దర రాయంచ యొయ్యారముల్ పడసి ఘ్రాణాలన్ శరీరాల సుం
దర నేత్రంబుల తాకి విందిడుచు వాతం బెవ్వరిన్ దన్పదే. 2052

ఇట నీతోడను భ్రాతతోఁ గలిసి యుంటే సెన్ని యేండ్లైన నెం
తటి శోకం బయినన్ స్పృశింపద ననున్ నానాద్విజ శ్రేణియున్
నిటు పుష్పంబుల పండ్ల నిండు తరువుల్ శృంగంబు లొప్పారి ము
చ్చటఁ గూర్చున్ విహరింతుఁ గాననపుఁగష్టాలే గనన్ రావిఁకన్ 2053

ఈవన వాసముచేతను
నీవేళ ఫలములు రెండు నిట లాభించెన్
ఈవిధి పిత ఋణ ముక్తియు
నే వడిగ భరతునికి ప్రియము నెఱవేర్చుటయున్. 2054

మనసును వాక్కును కర్మం
బును నియమించుకొని వివిధములు భావములన్
కనుగొనుచుఁ జిత్రకూటం
బున నాతో సీత ! సుఖము పొందుదువు గదే ! 2055

అనఘులు రాజర్షులు నగు
మనముత్తాతలు నిదె మన యీసంసా
ర నిఖిల కష్టంబుల క్షయ
మనయ మొనర్చు నమృత మని యందురు రాణీ ! 2056

గిరిశిలలు విశాలములై
గిరి చుట్టును నీలి పసుపు కెంపును తెలుపై
మరిరక రకముల రంగుల
వఱలుచు వందల కొలంది పరఁగెడుఁ గంటే 2075

వెలిఁగెడి యగ్నుల శిలం
బలెను గిరిప్రభల లక్ష్మివల్లను వేలై
వెలుఁగు నోషధులు నిశల
* వెలిఁగెడి దీపంబు లట్లు వెదఁజల్లు ద్యుతుల్. 2058

కొన్ని గృహమ్ములువోలెను,
కొన్ని పురోద్యానము లటు కొమరయి కాంతా !
కొన్ని యిఁక నేక శిల లయి
యెన్నో తగుఁ బ్రదేశము లిట నీశైలముపై 2059

ఈచిత్రకూట శైలము
చూచి ధరను జీల్చి లేచి యుబ్బినయటులున్
తోఁచును,నెల్లెడ శుభమై
గోచర మగుఁ జిత్రకూట కూటం బిదిగో. 2060

సురపొన్నయు స్థగరము తా
మర భూర్జంబుల దళాలు మడతలు వెలయున్
సరియగు తామరతేకుల
మురు వగు కాముకుల పానుపులు నవె కనుమీ. 2061

లలనా! కాముకు లొడలన్
నలిగియు వాడినవి యయిన నలినస్రజముల్
వలురకపుఁ బండ్లు గూడను
నలరారెను జూడు మచట నాదరులందున్. 2062

అలకాపురి నమరావతి
నల యుత్తరకురుల మించి యదిగో కనుమీ
ఫల మూలము లుదకంబులు
నలరెడి యీచిత్రకూట మానంద మిడున్. 2063

---

* దీనిని కాళిదాసు అనుకరించెను.

ఇట సీతో లక్ష్మణుతో
నిటు లీకాలంబున విహరించుచు సుఖినై
పటు వగు నియమంబుల ము
చ్చటఁ గుల ధర్మముల పెంచు సత్పథి నుందున్. 2064

పిదప గిరినుండి వెలికిం
బదపడి బైల్దేరి వచ్చి మైథిలి కపుడున్
నది మందాకిని శుభజల
మెదుటన్ రాముండు చూపె హృష్టుం డగుచున్. 2065

అఘ రహితుఁ డబ్జనయనుఁడు
రఘు రాముం డమల చంద్ర లలితాననతో
సుఘటితరమ్యాంగనతో
అఘదూర జనకజ తోడ ననియెను నిటులన్. 2066

* నానాసూనవిరాజిచిత్ర పులినాంత ర్లీన హంసావళీ
స్వానామోది త మందమందపవన స్వైర ప్రచా రోత్థ సౌ
ఖ్యానందో ద్భవ పారవశ్య కలితో గ్రారణ్య వృక్షాగ్ర శా
ఖా నృత్యాంచిత భంగి దృష్టి పరశృంగం బద్రి నీక్షింపుమీ. 2067

గట్టున మొలచు రకరకపుఁ
జెట్టులు పువ్వులను పండ్లఁ జెలఁగుచునుండన్
పట్టుగ నా యమరావతి
యట్టుల నీచిత్రకూట మను గిరి యొప్పున్. 2069

పాఠాంతరము :
* మునులున్ పుష్పబలు లిడన్
గనులకుఁ జిత్రం బగు పులినంబుల లోనన్
ఆణఁగి మణఁగి సోలియుఁ గ్ర
మ్మిన సారస రాజ హంస మిథునము లవిగో. 2086

ఒకచో బురద నీటి నొగి మృగములు గ్రోల
విమలమై తీర్థముల్ ప్రీతి గూర్చు
ఒకచో జడలు చర్మ లూని వల్కములతో
మునుగుచుండిరి ముని గణంబు
ఒకచో విశాలాక్షి యూర్ధ్వ బాహువు లౌచు
సూర్యు నుపాసించు చుండి రిదిగొ
ఒకచో పువులు నాకు లూడ్చి గాలి కొన లా
డించు చెట్టుల నద్రి నృత్యమాడు.

ఒక్కచోట స్ఫటిక మట్టు లుదక మెసగు
ఒక్కచోట నిసుకతిన్నె లొప్పుచుండు
ఒక్కచో సిద్ధజనములు మొక్కుచుండి
రిదిగొ మందాకినీ నది యిట్లు చూడు. 2070

అట గాలిచేఁ బూవు లల్లాడి పోగయ్యె
* శైలమధ్య! జలాలఁ దేలు నివియు
అచ్చోటఁ గళ్యాణి! యా చక్రవాకముల్
చక్కఁ గూయుచు నద్రి నెక్కుచుండె
ఇదిగొ శోభన! నిన్ను నీక్షింప నది గిరి
దర్శనము నయోధ్య దాటిపోయె
ఇదె దమశమ తపోనిధులు సిద్ధులు స్నాన
మాడు నదిని నన్నుఁ గూడిముమ్మఁగు

కమల పుష్కరములఁ జిమ్మి కమల నయన!
సఖియ వోలె మందాకినిన్ స్నానమాడు
జను లటుల జంతుల, నయోధ్య శైల మట్లు
సరయు నట్లు మందాకిని సరయు దయిత! 2071

* శైలమధ్య=కృశయగుటచే శైలమువలెఁ గదలలేని నడుము గలదానా!
అని వ్యాఖ్యాతలు అర్థము చెప్పిరి.

ధర్మపరుఁడు లక్ష్మణుఁడు మదాజ్ఞ చేయు;
నీవొ యనుకూల, విటు మీరు ప్రీతి గూర్తు
మూఁడు సంధ్యలు వార్చి నీతోడ తేనె
పండ్లు వేళ్ళు తిందు నయోధ్య రాజ్య మెంచ. 2072

మృగముల్ సింహములున్ గజంబులు కపుల్ బృందంబులై వచ్చి చ
క్కగ నీళ్ళానుచునుండఁ బుష్పవనులన్ గై సేయు మందాకినిన్
తిగ స్నానంబులు చేసి యేనరుఁడు ప్రీతిం బొందఁడే యంచు శాం
తిగ తాఁ బ్రేయసితో చరించె దయితా నేత్రాంజనా ఖాద్రిపై 2073

జానకి కిటు రాముఁడు నదిన్ గానఁ బఱచి
శైలతటిని గూర్చుండి మాంసమును జూపి
ఇదిగొ మేధ్యము యిది స్వాదు విదియు నగ్ని
బాగుగాఁ గాల్చబడె నంచుఁ బలికెఁ బ్రియను. 2074

ఇటులనుండ రామునిముందె యేగుదెంచు
భరతు సైన్య ధూళియుఁ జప్పు వరగె మింట
ఇంతలో పెద్దచప్పు డాలించి దిశల
వరువు బిడె యూథపులు యూథభరము తోడ. 2075

అటుల వినఁబడు నాశబ్ద మాలకించి
పరువు లిడు యూథపుల నెల్ల నరసి యపుడు
మిగుల తేజమును గలుగు సౌమిత్రి తోడ
రాముఁ డిట్లని చెప్పెను ప్రకట రీతి. 2076

లక్ష్మణ! సుపుత్రి యగు నీవలన సుమిత్ర
ఇదిగొ నిటు చూడుమీ, యౌర! యేమొ కాని
మేఘ నిర్ఘోష గంభీర మీఘసంపు
శబ్ద మేదొ వినఁబడు నేస్థలము నుండొ. 2077

ఇదిగో గజ యూధంలో
మదించు మహిషములో లేత మహితమృగాలో
పదపడి యేసింహముచే
నో దఱుమఁ బడి భీతిఁ బఱచు చున్నటు తోచెన్. 2078

రాజో రాజుఁ బోలిన వాఁడో రయము తోడ
వనికి వేటకు నిట్టులు వచ్చె నేమొ
లేక యే క్రూర మృగమైన లేచి యిట్లు
గర్జ చేయునో సౌమిత్రి ! కనుము సుంత. 2079

ఈనగమొ పక్షినైనఁ జరింప నీదు
ఇదియు నేమొ సరిగ వేగ యెఱుఁగు మనఁగ
ఇట్టె లక్ష్మణుఁ డొక పూచు చెట్టు నెక్కి
దిశలు పరికించుచును తూర్పు దిక్కు చూచె. 2080

మరల నుత్తర దిక్కుగా నరసి యచట
కరి తురంగ రథ పదాతి ఘన బలంబు
సిద్ధముగ నుంట యరసి చెచ్చెఱ నతండు
రాము దరి చేరి చెప్పి యిట్లనియె నింక. 2081

వహ్ని నార్పుఁ డార్పును గాక, వదిన సీత
యీ గుహను చొచ్చుత, ధనుస్సు నెక్కు పెట్టు
అమ్ములు కవచము ధరింపు మనఁగ రాముఁ
డనియె నోయి లక్ష్మణ ! వేరి దయ్యె బలము. 2082

అనుడు రాముడు: లక్ష్మణుఁ డగ్నిఁ బోలె
మండి యాసేన దహియించు మహితుఁ డటులు
అనియె నభిషిక్తుఁడై రాజ్య మఖిల మొంది
మనలఁ జంపఁ గైక కొడుకు మరలి వచ్చె. 2083

భరతు సైన్యము చూచి లక్ష్మణుఁడు కోపించుట :—

ఇదె శ్రీమంతమునై మహాంత మలరున్ వృక్షంబు జెండావయిన్
ఇదె స్కందోపరి నెట్టి కాంచనపుఁ జెట్టంతే విరాజిల్లు, వీ
రదె యేనుంగుల నెక్కి స్వేచ్ఛమెయి నశ్వారూఢులై మావటుల్
విదితుల్ రౌతులు నిట్టులన్ ముదముతో వేగంబ యేతెంత్రుగా. 2084

మనమీ యిద్దఱమున్ ధరించిధనుసుల్, మాటై గిరిన్ నిల్త, మిం
కను పోనీ యిట నైన నుంద ముదితోగ్రాస్త్రంబులన్ దాల్చి; నా
కనిలో లోఁబడి యెట్టి కాంచనపుఁ జెట్టల్లాడు జెండాయె కూ
లెన, మేలౌ సరి, చూడు నాభరతు నిట్లెవ్వండు గెంటించెనో. 2085

ఎవ్వనిచేతనైతె కడు నీవును సీతయు నేను నివ్వడి
ట్లెవ్వని నెన్నొ పాట్ల నుభవింతుమొ, వేనినిమిత్తమైతె నిం
కివ్విధి శాశ్వతం బయిన యీపృథు రాజ్యమునుండి భ్రష్టమై
నెవ్వగ గాంతు మాభరతు డీయరి వచ్చెను, వధ్యుఁ డెట్టులున్. 2086

భరతున్ జంపుటలోన దోష మెదియున్ ప్రాప్తింప, దోవీర ! యీ
వర కీతం డపకారముల్ పొనరిచెన్ పాపంబు గావించె, నా
వర ధర్మంబు త్యజించె, వానివధలో స్వల్పం బధర్మంబు లే
దరయుంగా; భరతుండు పోవ, సకలంబౌ లోక మీవేలుమీ. 2887

ఈ యఖిలమైన రాజ్య మాశించు కైక
పట్టి నాచేత హతుఁడైన భరతు సుతుని
చూచి దుఃఖార్తయౌను క్షోణిఁబడును
గజముచేఁ గొట్టఁబడిన వృక్షంబువోలె. 2088

బాంధవుల్ ననుబంధముల్ వఱలి యున్న
కైక నిప్పుడె మృత్యుముఖాన వైతు
ఇట్టిదౌ మహాపాపంబు నిట్ట వీడి
యవని మాతయు ముక్తురా అగునుగాక. 2089

ఇంతవరకుఁ జిత్తములోన నెట్టు లెట్లు
యాపుకొని మింగి కొన్నట్టి కోప మింక
గాఢ ధిక్కృతిన్ రిపు సేనఁ గ్రక్కి వైతు
మానధన ! యగ్ని నెండు తృణానఁ బోలె. 2090

రిపులమేను వాడి శరాల వ్రీల్చి వైచి
పచ్చి నెత్తుటి యేఱులు పాఱఁ జేసి
యిపుడె యీచిత్ర కూటపు టద్రి నున్న
యడవి యంతయు మిక్కిలి తడపివైతు. 2091

ఏనుఁగుల గుఱ్ఱముల నెల్ల మానవాళి
పొగరు హృదుల భిన్నా భిన్నముగ నొనర్చ
నిహతు లగు వారి దేహనివహములను
క్రూర మృగము లీడిచి లాగుకొనును గాక. 2092

సైన్యములతోడ భరతుని జంపివైచి
యుద్ధరంగాన శరముల పెద్ద వింటి
బరఁగి యెప్పటినుండియొ బాకి యున్న
ఋణము తీర్చికొందును సంశయింప కుండ. 2093

వ. ఇట్లు యుద్ధమునకు సిద్ధమై క్రోధముచే నొడలు తెలియకున్న లక్ష్మణుని జూచి రాముఁడు అతనిని శాంతపఱచుచు నిట్లు పలికెను. 2094

స్వపరజ్ఞుండు సుధన్వియౌ భరతు డిచ్చన్ తానె యేతేరఁగా
నిపుడీ చాపముతో పనేమిటి యొకో నీఢాలు కత్తేటికిన్
స్వపితన్ గూర్చి ప్రతిజ్ఞ చేసి భరతున్ స్వైరాగతుం జంపి యీ
యుపవాదంబును నేమిబావుకొనెదన్ ప్రాప్తించు రాజ్యంబుతో. 2095

సఖులున్ బంధులు పోవఁగా దొరకు రాజ్యంబున్ విషాన్నం బటే
ముఖమున్ పెట్టుకు తిందు, నర్థము ప్రియంబున్ ధర్మమున్ కామమున్
సుఖమున్ రాజ్యముగాని మీకొఱకె యిచ్చోఁ గోరుచున్నాను, నే
నఖిలం బియ్యది నీదుతోడె చెపుదు న్నాలింపు మోలక్ష్మణా ! 2096

సకల రాజ్యమున్ సోదర సంగ్రహంబు
కోఱకె సోదర సౌఖ్యంబు కోఱకె సుమ్ము
కోరుచుంటిని సద్ధియుఁ గూడ నాయు
ధమ్ము తాకి మిక్కిలి శపథంబు చేతు. 2097

సాగరముదాఁక నున్నట్టి సకల ధరయు
రమ్యగతిఁ జూడ నాకు దుర్లభము కాదు
లక్ష్మణా ! నాకు దేవేంద్ర రాజ్య మేని
వలదుసుమి యధర్మముచేత వచ్చు నేని 2098

ఈవు భరతుండు శత్రుఘ్నుఁ డెవ్వ రేని
మీరు లేకున్న నేసౌఖ్య మేమి నాకు
వలదు మఱి యాసుఖంబును, వహ్ని మిగుల
శిఖలతోడుత భస్మంబు చేయు గాక. 2099

భరతుఁడు భ్రాతృ వత్సలుఁడు ప్రాణముకంటెను నాకు నిష్టుడున్
మఱి కులధర్మమున్ దలఁచి మైథిలితోడుత నేను నీవు నీ
కరణిని నారబట్టలను గట్టి జడల్ ధరియించి కానకై
పురము నయోధ్యనుండి యిటు వోయిన సంగతి యాలకించియున్.
2100

స్నేహమున వ్యాకులంబైన చిత్త మొప్ప
ఇంద్రియము లాకులం బొంద నీత డిట్లు
మనలఁ జూడఁగ నరుదెంచె ననుచుఁ దలఁతు
ఇంకొక విధి వచ్చియొ యుండఁ డిది నిజంబు. 2101

తల్లి యగు కైకమీఁదఁ గ్రోధంబు చూపి
ఎంతొ పరుషముగా నామె నితఁడు దూఱి
మఱి పితఁ బ్రసన్నుఁ జేసి శ్రీమంతు డగుచు
నాకు రాజ్యంబు నీయగన్ వచ్చి యుండు 2102

ఇప్పు డిటు రాఁగ నుచితంబు నెంచి భరతుఁ
డిట్లు మనలఁ జూడంగ వాంఛించి యుండు
మనసుచేఁ గూడ నప్రియంబును నితండు
మనకు నేమాత్రమును సెంచఁ డని తలంతు. 2103

ఇదివఱ కెపుడైనను బోని యితఁడు మనకు
విప్రియంబును చేసిన విధముఁ గంటె
ఇప్పు డిటు భరతునిగూర్చి యిట్టి భయము
నేల శంకింతు వోయి యీక్షింపు సరిగ. 2104

భరతుఁ డప్రియ మేమియుఁ బలుకఁ దగఁడు
భరతు, డేయప్రియమునుచేసి యెఱుంగ డోయి
భరతునికె కనుక ననిష్ట మరసి తేని
నాకు నప్రియమును నొనర్చ నట్లె. 2105

ఎందు నెపు డెట్టి యాపదయందు నైన
ఎటు లయిన సుతులు పితన్ వధింతు రయ్యా
తనకు ప్రాణమౌ భ్రాత హత్యను నొనర్ప
భ్రాత సిద్ధమై సౌమిత్రి ! పఱుఁగు నయ్య. 2106

రాజ్య హేతువుచే సుమిత్రా సుపుత్త్రి !
యిట్టి మాట యింకెపుడేన్ వచింతువేని
లక్ష్మణుని కిమ్ము భరత ! యీ రాజ్యమనుచు
భరతుతోడుత నిట్టులు పలుకు వాఁడ. 2107

లక్ష్మణుని కిమ్ము భరత ! యీరాజ్య మనుచు
మాట మాట కేను పలికిన మాత్రముననె
లక్ష్మణ ! యిపుడె లక్ష్మణాగ్రజుఁడు భరతు
డట్లె యని సత్యముగ రాజ్య మప్పగించు. 2108

భ్రాత ధర్మశీలుండు నీరీతిఁ బలుక
రాముని హితంబె కోరెడి లక్ష్మణుండు
లజ్జచేతను స్వీయ గాత్రములయందె
కుంచుకొని తనలోఁ దానె క్రుంగి పోయె. 2109

సిగ్గుపడి లక్ష్మణుం డన్న చెప్పినట్టి
మాట లాలించి నిటు మఱి మాట లాడె
"స్వయముగా దశరథుఁడె యీవనిని నున్న
ప్రథమసుతు నిష్టు నినుఁ జూడ వచ్చె నేమొ. 2110

అనఁగ నిటు సిగ్గుపడిన లక్ష్మణుని జూచి
మరల రఘురాముఁ డిట్లని మాటలాడె
"అవును నామహాబాహువ యైన తండ్రి
మనలఁ గన్గొన వచ్చెనో యని తలంతు 2111

పోని యాదశరథ మహాభూవిభుండు
మనల సుఖమునకు దగువారినిగఁ దలఁచి
మనదు వనవాసము తలఁచి వనటఁ గుంది
స్వగృహమును దీసికొని పోవ వచ్చె ధ్రువము. 2112

మిగుల సౌఖ్యములందును మెసలి యున్న
యీజనకజను గాని తా నిపుడె తండ్రి
యారఘు కులుఁడు శ్రీమంతుఁ డడవినుండి
తీసికొని పోవ వచ్చెనో తెలియ వలయు. 2113

ఇవిగో వాయు వేగము మనోజవము గలిగి
ప్రణుత గాత్రము గలిగిన వారువములు
ఇదె మహాకాయు మయిస్సేన కెదుట నడుచు
వృద్ధు శత్రుంజయంబను పితృ గజంబు. 2114

అయితె మఱి లోక సత్కృత మయి వెలుంగు
నాజనకుని శ్వేతఛత్ర మచట నేల
కానఁబడదు మహాబాహు! కనఁగ నాకు
సంశయము కల్గు నటు తోచె స్వాంతమందు. 2115

వ. అనుచు ధర్మాత్ముఁడైన రాముఁడు సౌమిత్రితో పలికి "లక్ష్మణా! చెట్టు చివర నుండి దిగి నేను చెప్పి నట్లు చేయు మనుటయు ఆలక్ష్మణుఁడు దిగి ప్రాంజలి యయి యుండెను. ఇంక నక్కడ భరతుండును రాముని యాశ్రమమునకు సమ్మర్దము కలుగ కుండ నుండుఁడి అని సందేశింప అసైన్యమంతయు ఆగిరి చుట్టు పక్కల విడిసిరి. అభరతుని సైన్య మంతయు అటు ఒక యోజనమున్నర ప్రదేశమును గజవాజి రథములతో వ్యాపించి దర్పము విడిచి ధర్మము గైకొని రఘునందనుని యనుగ్రహము కొఱకు నేర్పఁబడి నీతి గలదై యుండెను. 2116

వ. మనుజ శ్రేష్ఠుఁడైన యాభరతుండు గురుశుశ్రూషాపరుఁడైన రాముని సమీపింపఁ గోరి వినీతుఁడై భరతుఁడు తమ్ముఁడైన శత్రుఘ్నునితో నిట్లనియెను. 2117

జన బృందంబులు బోయువాండ్రు పనిలో శత్రుఘ్న! సాయంబు రా
వని నన్వేషణ చేయు, ఖడ్గ శరచాపా లూని జ్ఞాతి ప్రజల్
వెనుకన్ రా రఘుపుత్త్రులన్ గుహుఁడె యన్వేషించుతన్ నే ద్విజుల్
ఘనులౌ పౌరు లమాత్యులున్ గురులు రాఁగాఁ గాల్నడన్ జూచెదన్. 2118

పద్మంపు రేకులవంటి కన్నుల వాని
హరిణాంక శుభవక్త్రు నరయు దాక
రామున్, మహాభాగురాలు సీతను, మహా
వీరుని లక్ష్మణున్, జేరు దాఁక

రాజ లక్షణములు రాజిల్లు మాయన్న
పాదాల శిరముంచి పడెడి దాఁక

తాత ముత్తాతల దారిఁ బోవు ఘనుఁడున్
రాజ్యాభిషేకమున్ గనెడు దాక

సకల జీవితంబున నాకు శాంతె లేదు
ధన్యు డారాముఁ గను సుమిత్రా సుతుండు;
వార్ధి తుచ దాక గల భూమి ర్త యైన
రాము వెన్నాడు సతి ధన్యురాలు సీత. 2119

గిరిరాజు వంటి గిరి యిది
యరయుమి యీచిత్ర కూట మతి సుందరమౌ
నరవరుఁడు రాముఁ డెచ్చట
వర నందనమునఁ గుబేరు పగిదిని నుండెన్ 2120

ధను వూను నరుల లోపల
నెన యగు తేజస్వి రాముఁ డెట నుండెనొ యా
వనమో దుర్గమ మగు, స
ర్ప నిషేవిత మయ్యు ధన్యపదమై యొప్పున్ 2121

వ. అని యిట్లు మహాతేజుండును, పురుషశ్రేష్ఠుఁడును. మహాబాహువునైన భరతుండు పాదచారి యగుచునే యామహావనము ప్రవేశించెను అట్లు ప్రవేశించి పుష్పితాగ్రము లయిన తరుసమూహములగుండ కొండ చఱియల గుండ మాట నేర్పరి యగు భరతుఁడు వెడలెను. అట్లు వెడలి చిత్రకూటగిరిదరి నున్న పుష్పించిన చెట్టు నెక్కి రాము నాశ్రమమందు ఎత్తుగా నున్న ధ్వజమునుచూచి శ్రీమంతుఁ డగు భరతుఁడు బంధు సహితుం డయి నిర్మలుడయి ఇక్కడరాము డున్నాఁ డని యెఱింగి మూర్ఛిల్లెను. అంత కొంతపడికి లేచి చిత్రకూటగిరి యందున్నట్టి తపస్సులతో నిండి నట్టియు నగు నాశ్రమము చూచి మహాత్ముఁడైన యాభరతుఁడు గుహునితోఁ గలసి తన సైన్యమును అన్వేషణ కార్యము నుండి మరలించి వెడలెను. అంత. 2122

సేన యట నిల్పి భరతుండు జ్యేష్ఠు నన్నc
జూడ నుత్సుకుc డగుచు నచ్చోట నున్న
రాము నాశ్రమపుం గుర్తులను క్రమంబ
సరిగ శత్రుఘ్ననకుc దెల్పి వడిగెత్వరగ. 2124

శీఘ్రమే జవనులను తీసికొని రమ్ము
అని వసిష్ఠునికిని కబు రంపి తాను
భరతుcడు గురువత్సలుc డయి భ్రాత cజూడ
త్వరగc జనుచు మంత్రులను శత్రుఘ్నుc బలికె. 2124

ఆ భరద్వాజముని చెప్పినట్టి చోటు
ఇదియె యగును, మందాకినీ నదియు నదిగొ
అన సుమంత్రుcడు శత్రుఘ్ను ననుసరించె
భరతుని కటు రామునిc జూచు వాంఛ కలుగ. 2125

భరతుcడో శ్రీయుతుండు తా నరుగు చుండి
తాపసుల యిండ్లతోc గల్సి తనరి యున్న
అన్న పర్ణశాలను జూచి యతని యెదుట
విఱచు కట్టెలు కోసిన విరులుc గాంచె. 2126

—: భరతుడు పర్ణశాలను జూచుట :—

రామలక్ష్మణు లాశ్రమ ప్రాంత మేగ
కుశలతో నారబట్టతోc గుజములందు
అక్క డక్కడ గుర్తుకై యపుడె యుంచు
చిహ్నముల భరతుcడు చూచె శీఘ్రముగనె. 2127

చలిని పోగొట్టు కొనుటకై యల వనాన
లేళ్ళ పోతుల పిడకల గూళ్ళు చాల
అచటం గనుపట్టెను, నతలనుందు తెలియ
లక్ష్మణుండు పైని గట్టు పల్కులము లరసె. 2128

ఒక టొకటి యెదుర్కొనుచుండి యున్నతంపు
దంతములు గల యేనుగు లెంతొ సేపు
ఘీంకరించుచు పోరాడి గిరికి ప్రక్క
నడుచు నడుగు జాడలు కానం బడును నవిగో. 2129

ఎట్టి త్రేతాగ్నిం గొన మౌను లెపుడు నిష్ట
పడుదురో యట్టి యగ్నుల వ్యాకులంపు
పొగయు నదె కానం బడు ఋషిం బోలు రాము
శ్రేష్ఠ సంస్కారు నన్న వీక్షింతు మిపుడె. 2130

అటు ముహూర్తానం జిత్ర కూటాద్రిం జేరి
భరతుం డంత మందాకినిన్ దరిసి స్వజన
మరసి యనె నరవరుండు వీరాసనమున
విజన వని నుండె, జీవిత మిదేల. 2131

—: భరతుండు తన్ను నిందించుకొనుట :—

నానిమిత్తమై యీలోక నాథు డిట్లు
అఖిల కామంబులను వీడి యడవి నుండె
ఇట్లు చేసిన నాజన్మ యిట్టి బ్రదుకు
ఉండి యేల యింక నిది లేకుండి యేలం 2132

ఇట్లు లోకాలయందు నిందింపఁ బడిన
నేను రాములక్ష్మణు సీత నియమవరుల
పాదములపైని బడి యట్లె వ్రాలి యుండి
చిరమున కనుగ్రహింపఁగ జేసికొందు. 2133

వ : ఇట్లు చాలవడి భరతుండు విలపించుచు,

మద్దివి తాటివి న్మద్ది వాకులు నేయు
యజ్ఞవేదివలె దర్భాదు లెసఁగ

వజ్రాయుధముఁ బోలి పసిఁడి ఫీపులు గల్గి
సారంబు లౌ విండ్లు చాలవెలుఁగ

అర్కరశ్ములఁ బోలి యహిలోక మహులట్టు
నంబుల పొదిఁజొచ్చి యమ్ములొప్ప

బంగారు టొరలందు బంగారు పొడలొప్పు
ఖడ్గాలు డాలులు కరము మెఱయ

వ్రేళ్ళఁ గాపాడు నుడుముల తోళ్ళదనర
పసిఁడి భూషణములఁగడు దిశలు వెలుఁగ
సింహగుహ లేళ్ళువలె రిపున్ చేర్వరాని
ఘలవిమల పర్ణశాలను భరతుఁ డరసె. 2134

అచట నీశాన్యదిక్కుగా నలఁతి క్రిందు
నగుచు నుండియు నిప్పున్న య్యా విశాల
వేది నా పర్ణశాలలో వెలసియుండ
రాముఁడు నివాసమున్న యా భూమిఁగాంచె. 2135

వ : అచట

నిడుద జడలదాల్చి చర్మంబు లేడిది !
దాల్చి వల్కలమూని తనరుచుండి

అగ్నియట్లలరి మహాబాహువై సింహ
మున కెట్లు స్కంధముల్ పొలుపు మీఱ

తమ్మిపూలవలె నేత్రమ్ములఁ దనరారి,
వార్ధిమేఖల భూమి భర్తయగుచు

ధర్మముచేయుచు ధాతవోలెను శాశ్వ
తుండయ్యు నేల గ్రూర్చుడియుండి

వట్టి దర్భచాప వయిని నేలపయినె
సీతలక్ష్మణుండు చేరియుండ
నామహామహిమతుని నగణ్య పు
ణ్యగరిమాత్ముని భరతు డరసె వరగ. 2136

ఒక క్షణమె చూచి శోకాన వికలుఁ డగుచు
శ్రీకరుండు ధర్మాత్ముఁడు కైక సుతుఁడు
భరతుఁ డన్నను కనుఁగొని పరువులెత్తి
ధృతిని వ్యథ యాపుకొనలేక యేడ్చి యనియె. 2137

సభలలోఁ బ్రకృతు లర్చలు చేయఁ గూర్చుండు
వాఁడిప్డు మృగములతోడ నుండె

విలువైన వేలుగా వలువలు దాల్చిన
వాఁడిప్డు మృగచర్మపై వసించె

వివిధ పుష్పాలను వేడ్కఁ దాల్చెడు వాఁడు
జడలగుంపును దాల్చి యడవి బడలె

బహు యజ్ఞములు చేసి బహుదక్షిణ లిడిన
ధార్మికుఁడు శ్రమించి ధర్మ మరసె

విలు వయిన గంధము లలంది వెలయుఁవాడు
ధూళి మేనునఁ గప్పఁగ నేలఁ బండె
కరము సుఖ మొందు నన్న నాకతన నిట్లు
కష్టపడు; ఛీ! ఖలుఁడ నేను గర్వ్య మతిని. 2138

## —: రాముని స్థితి చూచి భరతుడు మూర్ఛిల్లుట :—

అని యిట్లుల్ విలపించుచున్ తడియు వక్త్రాబ్జుండయ్యె దీనుఁడై
వనటం జెందుచు రాము పాదములు సంప్రాప్తింప కుంటన్ ధరి
త్రిని కూలంబడి యేడ్చుచున్ భరతుఁ డార్తిన్ స్రుక్కి వెం
టనె యన్నా! యని దీనుఁడై యిఁకను మాటల్ రాక యట్లే పడెన్. 2139

బాష్పములచేత కంఠానఁ బల్కరాక
భరతుఁడు యశస్వి యౌరాము నరసి పిదప
అన్న! యనుచు నాక్రోశించి యప్పు డింక
వెండి పల్కక యట్లనె యుండి పోయె. 2140

పిదప శత్రుఘ్నుఁ డారాము పదయుగంబు
నేడ్చుచు నమస్కరింప నీక్షించి రాముఁ
డాయిరువురు సోదరుల నత్యాదరమున
కౌగిలించుకొని తుడిచెఁ గంటినీరు. 2141

అవల గుహుఁడు సుమంత్రుఁడు నధిపసుతులఁ
గాననంబున భక్తితోఁ గలిసికొనిరి.
ఆకసంబున శుక్ర బృహస్పతులను
గూడి సూర్యచంద్రులు కల్సికొనిన యట్లు 2242

మదపు టేనుంగులం బోని యధిపసుతుల
ఘన మహారణ్యమునఁ గల్సి కొనఁగఁ జూచి
ఆవనంబున నున్న మహరు లెల్ల
వెతల పాలయి కన్నీళ్ళు పెట్టుకొనిరి. 2143

జడలన్ నారలఁ దాల్చి మోడ్చి కరముల్ స్వాంఘ్రి ద్వయంబ దిలన్
బడియుండన్ రఘురాము డంతఁ బ్రళయం బందున్న సూర్యంబలెన్
కడు దుర్దర్శుని వాని నెట్లొ భరతుంగా వేగ గుర్తించి, ప్రా
న్పడి ప్రేలంబడి మోము చిక్కు భరతున్ బైకెత్తె హస్తంబుతోఁ 2144

-: రాముడు భరతుని కుశలప్రశ్న లడుగుట :-

శిరమున్ మూర్కొని కౌగిలించు కొనుచున్ స్వీయాంకమందున్ తగన్,
భరతున్ జేరిచి సావధానపడియున్ ప్రశ్నించె నీవీవనం
బరుదేరన్ గల హేతు వేమి మఱి నీయాతండ్రి యెందుండె, భూ
వరుఁడో జీవముతోడ నుండువఱకున్ బాదం బిడన్ రాదిటన్ 2145

చిరకాలమునకు దవ్వుల
సరుదెంచిన యట్టి భరతు నరయుచు నుంటిన్
భరతా! నాయన! యేటికి
నరుదెంచితి, దుర్గమవని నవసరమేమీ, 2146

నాయన నీవు వచ్చితివె నాయన ప్రాణము లున్న వేగదా
పోయెన లేక దీనుడయి ముందుగ వెంటనె యన్య లోకమున్
పోయెన పోని భ్రష్టమయి పూర్వపు రాజ్యము నిన్ను బాలునిన్
న్యాయమ సత్యవిక్రముడు నాయన సేవలు చేతువేగదా. 2147

అశ్వమేధము రాజసూయంబు చేసి
నట్టి సత్య సంగరుడు ధర్మాత్ముఁ డైన
ఆ దశరథ మహారాజు నవనిమీద
కుశలియేగద భరత! వాకువ్వు మిపుడు. 2148

బ్రాహ్మణుఁడు ధర్మనిత్యుఁడు ప్రథిత యశుఁడు
అంద తిక్ష్వాకులకు గురు వగుచు నుండు
ఆవసిష్ఠు డ ల సమయంబులందు
సత్కరింపఁబడును గాదె శాస్త్ర విధిని. 2149

ఆకౌసల్య సుమిత్ర సుప్రజయు సౌఖ్యంబేగదా యార్యరాల్
కై కాదేవి ప్రమోద మొందుఁగద యింకన్ ప్రాజ్ఞుడున్ శాస్త్రచ
ర్చాకౌతూహలి వంశపుత్త్రుఁడు ననుష్ఠాన ప్రియుం డీర్ష్యయే
లేకన్ నీదు పురోహితుండు సుకృతుం డీవేళ నమ్ముండెగా. 2150

ఇఁక నీబ్రహ్మయు నగ్ని కార్యముల నెంతేనిన్ విధిజ్ఞుండ యై
సకలం బౌ హుతహోష్యమాణములలో చక్కం బ్రవర్తించున్‌గదే
సకలాచార్యుల దేవులన్ పితల నీసన్మాతలన్ తండ్రి వం
టి కులీనార్యుల వృద్ధులన్ భిషజులన్ వేదజ్ఞులన్ గొల్తువే. 2151

ఇషులం దస్త్రములందు జాణయుయు యుందే నర్థశాస్త్రజ్ఞుఁడై
విషయజ్ఞుం డగు నాసుధన్వ గురు నావిజ్ఞాను మన్నింతె, స
ద్విషయంబుల్ గని శూరు లాత్మసములై విశ్వాస మొప్పన్‌శుభా
యుష విజ్ఞానులు నింగితజ్ఞులు నమాత్యుల్ సుకార్యుల్ గదే. 2152

:- రాముఁడు రాజకార్యములగూర్చి ప్రశ్నించుట :-

మంత్రమె రాజుల విజయము
మంత్రమె గద సర్వులకును మాన్యముసుమి యా
మంత్రము సరిగాఁ దెలిసిన
మంత్రులె శాస్త్రార్థవిదులు మనకుం బూజ్యుల్. 2153

నిద్రకు వశమౌచు నిద్ర పొందవుగద
వేళకుఁ దగినట్లు మేలుకొనుదె
అపర రాత్రుల నర్థ మాలోచన మొనర్తె
యొంటి నాలోచన యొనరుపవాకొ
ఎక్కువ ప్రజల మంత్రింపవేగద
మంత్రులన్ మంత్రాలు మసలవు గద
ఏదియేని స్థిరపర్చి మృదువయి ఘనకృతిన్
వడిఁ జేయుదే చిరంబు గనవు గాదె.

సుకృతముల్ కృత తుల్యముల్ సకల విధులు
తెలిసి కొనుచు కర్తవ్యముల్ తెలియుదు గదె
మంత్రులే యుక్తి హేతులన్ మంత్ర మెఱిగి
తెలుప కున్నను నీవెర్గి తెలుప విద్రదె 2154

వేవు రగు మూర్ఖులఁ గనక విజ్ఞు నొకనిఁ
దెలిసికొందువె, కష్టాలఁ దీర్చు నతఁడె
వేవురె కాదు లక్షలు వెదలి రేని
వారు వ్యర్థులె; కృతి మంత్రి ఫలముఁ గూర్చు. 2155

క్రూరశిక్షలు పొంది కుందు ప్రజలఁ గైక
తనయ! యమాత్యు లాదరతఁ గాంత్రె
పతితు యాజకు లట్లు, బల్మి లాగు నరు స్త్రీ
లటు, లంచము గొను నిన్ గటువులంద్రె.
యుక్తిజ్ఞ నృపుఁ దిట్టు నున్నతపద కాంక్షు
శూరుఁ జంపుచు భటుల్ మీరుదురొకొ
హృష్టుని శూరుని ధృతిమంతు ననురక్తు
కులశుద్ధు సేనానిఁ జలుపుదురొకొ
సంగరజ్ఞుల శూరుల సత్కరింత్రె
సైన్యముల జీతభత్యాలు సరిగ నిత్త్రె?
అంగరక్షుల జ్ఞాతుల నాచరింత్రె?
ప్రాణములు వారు నీకయి యప్పగింత్రె 2156

జానపదుని దక్షు సత్ప్రతిభాఢ్యు య
థోక్తవాదిని దూత ననుపుదయ్యా
పరుల * నష్టాదశస్వజనులఁ బదునైదు
తీర్థాల చారులు తెల్ప వినుదె
గెంటఁబడియు మఱి యింట వచ్చిన
దుర్బల శత్రుల దూఱకుంద్రె
జడము ననర్థకుశలము పండితమాని
* లోకాయతిక విప్రలోక మెంతె

---

అష్టాదశ :– 1. మంత్రి 2. పురోహితులు 3. సేనాపతి 4. యువరాజు 5. ప్రతీహారి 6. అంతర్వంశికులు 7. చెఱసాలఅధికారి 8, అర్థసంచయకర్త 9. కార్యనియోక్త 10. ప్రాడ్వివాకుడు 11. సేనకుజీతాలిచ్చువాడు 12. వేతనగ్రాహులు 13. పురపాలకుడు 14. ధర్మాధికారి 15, సభ్యులు 16. సీమాంతపాలకుడు 17. జలదుర్గ 18దండపాలకులు. పదునైదు– యువరాజు మొదలైనవారుపదునైదుగురు

* లోకాయతికులు=లోకములో ఆయతముగా=ఎక్కువగా వ్యాపించినవారు, నాస్తికులు

ముఖ్య ధర్మ శాస్త్రి లుండ మూర్ఖు లెపుడు
దండనీతిఁ బట్టి ఖలు వాదములఁ గాంత్రు
అట్టి మార్గంబులంబట్టి యవనిఁ గనక
యెప్పుడుండవు గద, నీవ యిందు భరత. 2157

మన ప్రాచీనులె యైన వీరులు స్వకర్మాసక్తు లుత్సాహులై
ఘనులై క్షత్రియ విప్ర వైశ్యులు వశుల్ గ్రామంబు గ్రామంబగన్
దనరన్ వాజి రథ ద్విపేంద్ర తతులన్ ప్రాసాద హర్మ్యాదులన్
ప్రణు తానంత బలం బయోధ్య సరిగా పాలించి రక్షింతువే. 2158

శత*చిత్యంబుల దేవతాలయములన్ ఛాయాప్రపాశాలలన్
సుతటాకంబుల హృష్టపుష్టజనతా శోభన్సమావిష్టమై
సతతంబున్ పశుమంతమై బహువికాసంబై నదీకూత్రుక
క్షితియై శ్వాపదశూన్యమై జనపద శ్రేష్ఠంబు క్షేమంబొకో. 2159

కృషిగోరక్షణ వైశ్యులెంతయు సుఖంబేకాదె తజ్జీవికా
విషయంబందిట శ్రద్ధచూపుదువె స్త్రీబృందాలనోదార్తిఁ త
ద్విషయంబున్ మది నమ్మఁబోవకయె యుందే యెంటి భాషింపకన్
కృషిలోనేస్గులు కామధేనువులకున్ దృప్తిన్గడున్ గూర్తువే, 2160

ఉదయంబందునె నిద్రలేచి సభలో నుండుండి కార్యంబులన్
సదయున్ జూచుచు దర్శనంబిడుదువే, సర్వంపు భృతున్ భయం
బెదియున్ బొందకయుండ వాకొనుచు వారిండ్లున్ జనన్ బంపుదే
గద, ధాన్యాయుధయంత్రకోశము ధనాగారంబు రక్షింతువే. 2161

విలుకాండ్రున్ వరశిల్పులున్ సుఖులె. యేవేళన్ ధనాదాయముల్
విలువై యెక్కువ యుండఁగా వశె వ్యయంబేతక్కువై యుండఁ గా
వలె కోశంబొ యపాత్రహస్తములకున్ పాల్పొందగారాదు, దే
వులు మిత్రుల్ పితలాగతుల్ భటులు విప్రుల్ పొందుచున్నారెగా. 2162

* చిత్యములు=అశ్వమేధాంతమహాయాగ చయనప్రదేశములు.

పరిశుద్ధాత్ముల పాపదూరుల నెటుల్ ప్రశ్నింపకుండన్ నిజం
బరయుం బోవక శాసకుల్ మిగుల లోభాసక్తి శిక్షింపకుం
దురుగాదే, కనిపట్టుకోబడియుఁబల్ దొంగల్ ధనం బిచ్చి హె
చ్చిరయానన్ జెఱసాల నుండి యెటకో శీఘ్రంబు పోరేగదా. 2163

ధనికునకు బీదకును కష్టమొదవినపుడు
నీయమాత్యుల్ బహుశ్రుతుల్ న్యాయపక్ష
మూనుచు విరాగులయి ధనంబు గొనకయె
యుందు వ్యవహరించుచు నెందునుందురెగద. 2164

నేర మన్యాయముగ మోప నింద పడిన
వారి కన్నులనుండియుఁ బడిన బొట్లు
రాజభోగాల కొఱకు పాలనము చేయు
వారి పశుపుత్త్రులను జంపి వైచుఁ జుమ్ము. 2165

బాలురను వృద్ధులను వైద్యవరుల నెపుడు
ఇచ్చి తంపోసి భాషించి తృప్తి గూర్తె
తపసుల గురుల వృద్ధుల దైవతముల
బ్రాహ్మణులఁ జైత్యములఁ దన్ని ప్రాంజ లిరుదె, 2166

ధర్మ మర్థాన నర్థంబు ధర్మమునను
ఆశచేఁ గామమున రెండు నడఁచవుగదె
ధర్మ మర్థంబుఁ గామంబుఁ దగినవేళ
విడ మఱచుచుఁ గాలజ్ఞ ! సేవింతుగాదె. 2167

సర్వ శాస్త్రముల యందు చతురు లగుచు
పౌర ముఖ్యులతో జానపదులతోడ
బ్రాహ్మణులు మహాప్రాజ్ఞ ! నీపరమ సుఖము
కర మెపుడు కోరుచుందురుగాదె భరత ! 2168

వ : మఱియు నీవు నాస్తికత్వము అసత్యము క్రోధము ప్రమాదము అదే పనిగ ఆలోచించుచుఁ గూర్చుండుట జ్ఞానులను దర్శింపకుండుట, సోమరి తనము, నేత్రాది పంచేంద్రియములకు లొంగియుండుట, రాజ కీయాదివిష యములను అమాత్యాదులతోఁ గాక యెంటరిపై చింతించుట, అనర్థము చేయువారితో ఆలోచించుట, అమాత్యాదులతో ఆలోచించి నిశ్చయించిన విషయములను ఆచరణలో పెట్టకుండుట, ఆలోచించిన దానిని వెల్లడించుట, ఉదయమున మంగళాచరణము చేయక పోవుట, చీటికి మాటికి ఎవరు వచ్చి నను లేచుట, అను నీరాజదోషములను వర్జింతువుగదా.

వేట, జూదము, పగటినిద్ర, పరివాదము కాంతలు, మదము నృత్యగీత వాద్యవ్యసనము స్వేచ్ఛా సంచారము, కామము అనుపదింటిని, సపత్ని వైరము వస్తువైరము, వాగ్వైరము అపరాధ వైరము అనువైదింటిని, సామ దాన భేదదండము లను నాలుగింటిని, స్వామి, అమాత్యులు, రాష్ట్రము, దుర్గము, కోశము, మిత్రబలము, అన్యోన్యోపకారకబలము అను సప్తాంగములను, పిశు నత్వము సాహసము, ద్రోహము, అసహనము, అసూయ అర్థములను దూషిం చుట, వాగ్దండము, క్రోధ పరుషత్వము లను నెనిమిదింటిని, ధర్మార్థకామము లను, ఉత్సాహ ప్రభు మంత్ర శక్తులును వేదత్రయి, కృష్యాదియము, దండ నీతి, నీతిశాస్త్రము అను మూడేసి వానిని, ఇంద్రియజయోపాయములను, సంధి విగ్రహము యానము ఆసనము శత్రువర్గముల యుపజాపము అగ్ని, జలము వ్యాధి కఱవు మారి మొదలైన దైవాపదలను రాజబంధువులనుండి వచ్చు కష్టములను మానుషాపదలును, జీతము పుచ్చుకోనివాడు లోభి అహంకారి యునుఅవమానితుడు కోపి హఠాత్తుగాకోపపెట్టఁబడినవారు భీతుడు భయపెట్టఁ బడినవాఁడు శత్రుభేద్యులును నృపకృత్యమును బాలుడు వృద్ధుడు దీర్ఘరోగి, వెలివేయబడినవాఁడు పిఱికివాఁడు భయంకరుడు లోభి లోభత్వమును గూర్చు వాఁడు విరక్త ప్రకృతి గలవాఁడు విషయ వ్యసని, చలచిత్తుడు దైవ బ్రాహ్మణ నిందకుఁడు, దైవవంచితుఁడు దైవచింతకుఁడు దుర్భిక్షవసని, బలవ్యసని, అదేశస్థ శత్రువు అకాలమునఁ గూడినవాడు సత్యదూరుడు ధర్మదూరుడు అను నిరువది మందిని, అమాత్యులు రాష్ట్రము దుర్గము కోశము దండము అను ప్రకృ

తులు మిత్రుఁడు గావ్యవహరించు శత్రువు, శత్రుమిత్రము, మిత్రమిత్రము, మిత్రాదిమిత్రుఁడు విజగీషు మిత్రుడు ముందుగా నున్నవారు వెనుక వున్న వారు తరువాతనున్న వారు ఆక్రందుడు తదనంతరుడు మధ్యమస్థుడు ఉదాసీనుడు అను మండలమున మాత్రావిధానము దండవిదానము సంధివిగ్రహము లను దీనినన్నిటిని సరిగాఁ దెల్సికొని విడువవలసినదానిని వర్జించుచు గ్రహింపవలసిన దానిని గ్రహించుచు న్నావుగదా నల్గురు గానిముగ్గురు గాని కలసిగాని విడిగాని మంత్రులతో రాజకార్యములను యథాశాస్త్రముగా మంత్రించు చున్నావుగదా. 2169

సఫల మగునె నీకుఁ గ్రియలు
సఫలం బగునెగద నీకు సర్వశ్రుతులన్
సఫలముగ మన్నె భార్యయు
సఫలంబె యగు గద నీకు సర్వశ్రుతమున్ 2170

వ : అప్పుడు నేను జెప్పిన యేధర్మములందైతే నాబుద్ధి స్థిరపడియున్నదో యట్లే నీబుద్ధియు స్థిరపడి యున్నదిగదా ఆబుద్ధి ధర్మకామార్థసహితమైనది. అది ఆయుష్కరము, యశస్కరముకూడ. 2171

ఏవృత్తి శుభమొ సుపథమొ
ఏవృత్తి మన పిత యనుసరించుచు నడచెన్
ఏవృత్తి తాత లేగిరొ
అవృత్తిఁ జక్కఁ దెలిసి యనువర్తింతే, 2172

రుచికర మగు భోజనమును
నెచటను తిన్నప్పటికిని నెంతయుఁ బ్రీతిన్
సుచరిత పరిచిత సఖులకు
రుచిగాఁ బెట్టెదవె యొక్కరుండవె తినకే. 2173

క్షితిపతి ధర్మము యేలుచు
మతియుతుఁ డయి దండ మూని మంచిగ ప్రజలన్
సతముగని వసుధ పొందుచు
నతఁడే చనిపోయి స్వర్గమందును బుధుడై. 2174

వ. అని యిట్లు రాముఁడు అనఁగా భరతుఁడు మరల నిట్లనియె. 2175

—: పెద్దవాడు రాజు కావలెనని భరతు డనుట :—

మన ప్రాచీనపు రాజధర్మము మదిన్ మన్నింప కున్నట్టి నీ
చుని, నన్ ధర్మ మదేమిచేయు, నిటజ్యేష్ఠుం డుండఁగా జిన్న వా
నిని రాజున్ బొనరింప రాద, యిదియే నిత్యంపు ధర్మంబుగా 2176
మనలో నుండె, నయోధ్యరా జగుమి యస్మద్వంశ భద్రంబుకై.

మరి మామూలుగ రాజు మానవుఁడెయౌ, ధర్మార్థ సద్వృత్తమున్
నరులం జూడము, నీవు దేవుఁడవుగా నాకున్ మదిం దోచు, ముం
దర నేఁ గేకయ దేశముల్ చన నరణ్యం బీవిటుల్ చేర, న
ధ్వరముల్ చేసెడి తండ్రి సాధుసుతుండున్ స్వర్గంబ యేగెన్ గటా!
2177

నీవును సీత లక్ష్మణుఁడు నీగతి కానకు వచ్చినంతనే
భూవిభుఁ డార్తిచేఁ గుమిలి భూతలి నింకను నిల్వలేక యా
దేవులఁ జేరఁ బోయె నరదేవ! యికన్ వడి లెమ్ము తండ్రికిన్ 2178
నీవును నీరముల్ విడుము నే మొదటే విడినాఁడ భ్రాతతో.

కడు శ్రేష్ఠపులు నిచ్చు నీళ్ళు పితృ లోకాలందు నక్షయ్యమ
య్యెడు నంచున్ బుధు లంద్రు నీవు పితకో యిష్టుండవున్, నిన్నె య
య్యెడఁ జింతించుచు నిన్ గనం దలఁచి నిన్నే చొచ్చు బుద్ధిన్ మర 2179
ల్పండ, నీవుండమి నీదిగుల్ పడి చనెన్ త్వత్తాత నిన్నెంచుచున్

అది యాదీనపు మృత్యువార్త భరతుం డారీతి వాక్రువ్వగన్
మది నాలించెనొ లేదొ రాముఁ డపుడున్ జైతన్యమే పోవఁ జెన్
కదనానన్ బడు నింద్రువజ్రమటు వాగ్వజ్రంబు పైఁ గూలఁ గేల్
చదలన్ జాపుచు, పుష్పితాగ్రతరుఁ గూల్చన్ బడ్డటుల్ వేపడెన్. 2180

అటులన్ నేలను బడ్డ రాముని మహేష్వాసున్ వ్యథాకర్శితున్
పటువిక్రాంతుని జూచి సోదరు లటన్ గాఢంబుగా నేడ్చుచున్
తటముల్ గొట్టుచు సోలి కూలిన గజేంద్రమ్మున్ బలెన్ సీతతో
నటు గాత్రంబుల నీళ్ళు చిల్కుచును నొయ్యంజేసిరాయాక్రియల్. 2181

అటు రఘురాముఁ డొక్క వడి కల్లనఁ దేర్కొని కంట నశ్రు లె
ట్లెటొ మెల మెల్లఁ దుడ్చుకొని యింకను దీనముగా విలాప మె
ట్లెటొ నొనరించుచున్ పిత గతించుట నెంచుచు ధర్మమూర్తియై
యిటు వచియించె సోదరులు నింకను జేయ బహూపచారముల్ 2182

"ఇంక నయోధ్య వచ్చి యొనరించెడి దేమిటి, తండ్రె పోవఁగా
నింక నెవండు వచ్చి పితృహీన నయోధ్యను నేలఁ బూనెడున్
నుంకొక యామహామహునికో చెడఁబుట్టిన నేను చేతునే
మింక మదార్తిఁ దండ్రి చనియెన్ జలమే నిడ నే నభాగ్యుడన్. 2183

జగతిన్ ధన్యుఁడ వన్న నీవె భరతా ! శత్రుఘ్నుతోఁ దండ్రికిన్
తగు సంస్కారము లెల్లఁ జేయు ఘనసత్కారంబు లీవందినా
వు గదే, ముఖ్యుఁడె లేక పల్ ప్రభుల పెంపుల్ గల్గి రాజన్న వా
రెగఁ న్రాని యయోధ్య కీనియతితీర్చిం గూడ రాలే నిఁకన్. 2184

అడవిన్ వాసము పూర్తిచేసియు నయోధ్యన్ రాఁగ, ఆతండ్రి య
య్యెడఁ దానుండగలేకె మృత్యుఁగన నింకేనాఁడు మాక్షేమ మె
వ్వఁడు చూచున్, తన చెప్పుచేఁతలగతిన్ వర్తించు నాకున్ సుఖం
బిడియోదార్చెడి తండ్రి పల్కయిన వింద్యున్ వినన్ దోరెదన్. 2185

అని యిట్టుల్ భరతుం గుఱించియని, యర్థాంగిని సమీపించి పెన్
వనటన్ రాముఁడు పూర్ణచంద్రముఖితో వాక్రుచ్చెనో సీత! నిన్
గని ప్రేమించెడి మామపోయె, పితృహీనాభాగ్యుఁడై నావు ల
క్ష్మణ! చెప్పున్ భరతుండు తండ్రి మృతి దుఃఖానిష్టవార్తన్ గటా! 2186

ఇట్లు రాముఁడు కుమిలి వచించుచుండఁ
గనుల నీరూన నప్పుడు కరము రాము
నూరడించి తండ్రికి నీళ్ళు నొసఁగు మనుచు
భ్రాత లందఱు రాముతోఁ బల్కి రంత. 2187

## —: రాముడు తండ్రికి నీళ్లు వదలుట :—

సీత తనమామ స్వర్గము చేరెననుచు
వినుచుఁ గన్నీళ్ళునిండిన కనులతోడ
ప్రియుని మోమును వీక్షింప లేక యుండ
రాము డోదార్చి యిఁక నేడ్చు భ్రాత కనియె. 2188

లక్ష్మణా! గారపిండి జలాలు వదల
చలువ నుత్తరీయము తెమ్ము వడి మహాత్ముఁ
డైన తండ్రికి జల మీయ అది సీత
పిదప నీవు నవల నేను వెడల వలయు. 2189

అనఁగ వారిని నిత్యము ననుసరించు
సుమతి రామునియెడ భక్తి మసలు ఘనుడు
మృదువు దాంతుఁడు శాంతుఁడు నెపుడు గూడ
ఆత్మవిదుఁడౌ సుమంత్రుఁతు నపుడు వచ్చి. 2190

వారి నోదార్చి రామునిబట్టు కొనియె
యెల్లమందాకినిని దింప మిగిలినట్టి
వారు నెటొదిగి శుభమైన నీరు పితకు
వదలి, నీకిదియౌఁగా కని పలికిరపుడు. 2191

జలముతో నిండియున్న దోసిలిని పట్టి
రాముఁడును దక్షిణదిశగ మోము నుంచి
యేడ్చుచు 'నృపేంద్ర' పితృలోకమే గ నీకు
నేనిడిన నీరు నక్షయంబౌను గాత. 2192

అనుచుమందాకినీ తటంబునకు వచ్చి
జనకునకు నివాపాంజలి ననుజయుతుఁడు
రాముఁడన ఘతేజస్వి తర్పణము లిచ్చి
గారపిండి రేగిఫలాలు గలిపి యపుడు. 2193

కుశల పైనుంచి యేడ్చుచుఁ గుమిలియనియె
ఇదె మహారాజ ! భుజియించి ప్రీతిగనుము
ఇదియె మా యన్నము, పురుషుఁ డేది తినునో
అట్టి యన్నమె దేవుల కగును గాదె. 2194

అనుచు వా దారినె నదియెడ్డుననె లేచి
వరవరుఁడు రమ్యతటము భూధరము నెక్కి
యువల పర్ణశాలా ద్వారమందుఁ జేరి
ప్రేమ భరతులక్ష్మణుఁ గౌగిలించుకొనియె. 2195

పితకు నీళ్లిచ్చు చుండిఁయు బిగ్గరగను
నింక సీతయు భ్రాతలు నేడ్చుచుండ
దరుల సింహగర్జనవోలె మఱియు మ్రోగ
నాలకించి భరతుసేన లనియె నిట్లు. 2196

భరతుఁడు రాము లక్ష్మణు ధ్రువంబుగఁ గల్సికొనంగఁబోలు, నె
ల్లరు మృతుఁ దండ్రి నెంచుచు విలావముచేసిడి శబ్ద మేమొకో
యరయుద మంచు నేన్గులొ హయాలొ రథంబులొ యెక్కి నాగరుల్
పఱచిరి, కాల్నడన్ బరులు పర్విడి రాఘ్వనివైపు మకామె వీడియున్. 2197

కానకు రాముఁ డేగి చిరకాలము కాకయె యున్నఁ గాని యెం
తైనను కాల మైన యటు లాశ్రమమున్ గనఁగోరి యెల్లరున్
యానము లెక్కి భ్రాతల సమాగమమున్ గనులారఁ దృప్తిగా
కానఁ దలంచి పర్విడ మకాములె శూన్యము లయ్యె నత్తఱిన్. 2198

బహుయానాల ఖురాల చక్రములచేఁ బాచాలచేఁ గొట్టఁగా
బహు శబ్దంబులు చేసి వర్ష సమయం బందెంతొ కార్మబ్బులున్
బహుళంబై యుఱుమున్ ధ్వనించు గగనం బట్టుల్ దనర్పన్ భయా
న హతా త్తేన్గులు పర్విడంగ మదపున్ గంధాల నొప్పెన్ వనుల్. 2199

జిఱుతుల్ పందులు లేళ్ళు పోతులును వ్యాఘ్రంబుల్ వృకంబుల్ బకా
లును రాయంచలు చక్రవాకములు నిర్దుల్ కోయిలల్ కాకులున్
విని భీతిల్లుచు గుంపుగుంపులుగ వేగన్ నెమ్మదుల్ లేక మిం
టను వ్యాపింపఁగ, మానవుల్ ధర పయిన్ వ్యాపింప మించెన్ ధ్వనుల్ 2100

వట్టినేలపైఁగూర్చున్న ప్రభుని రాముఁ
గని కనుంగవఁ గన్నీరు కారుచుండ
కైకయిని మంధరను దూఱి కటువు లాడు
ప్రజలఁ గని రాముఁ డశ్రుపూర్ణాస్యుఁడయ్యె. 2101

కనులం దశ్రులు నిండ స్రుక్కి నరులన్ గన్గొంచు ధర్మజ్ఞుఁడున్
ఘనుఁ డారాముఁడు తల్లి తండ్రి వగదిన్ గౌఁగింటిలోఁ గుచ్చగా
జనముల్ కొందఱు మ్రొక్క రాముఁ డచటన్ సర్వప్రజన్ బంధులన్
తన మిత్రాళిని నర్హమౌ గతుల నోదార్చెన్ ప్రశంసించుచున్. 2102

అచట నన్యోనమును నామహాత్ము లపుడు
ఏడ్చుచుండఁగ నాధ్వని యెల్ల యెడల
గిరిగుహలయందు దిశలందు
మద్దెలల చప్పుడవలె వినంబడెను జుమ్ము. 2103

దశరథుని భార్యలను ముందు దిశగ నుంచి
యావసిష్ఠుడు రాముని నరయఁ జనియె
రాజ సతులు మందాకినీ ప్రాంత మరిగి
రామలక్ష్మణు లున్న యాభూమిఁ గనిరి. 2104

ఎండి పోయియుఁ గన్నీరు నిండియున్న
యాస్యము గలుగు కౌసల్య యాసుమిత్ర
నితర నరపతి పత్నుల నెంచి చూచి
యిట్లు బాధతో గుమిలి వచించె నపుడు. 2105

నెట్టి స్వధర నుండి నెడలఁ గొట్టఁబడిన
ఇతరులను గష్టపెట్టుట యెఱుఁగ నట్టి
ఆయనాధులకుం గష్టమైన యట్టి
దండకావాస పుణ్యతీర్థంబు నదిగో. 2106

ఇదె నీ పుత్త్రుఁడు లక్ష్మణుండు గను మెంతే భక్తి నాపుత్త్రుకై
యుదకంబున్ గొని వచ్చు, హీనమని లో నూహింపకే యేవగిం
పఁ దగుం గార్యమ యైనఁ జేయు,నెపుడున్ భ్రాతర్థమై చేయుఁగా
నెది యైనన్ పరె యద్ది యెంతయొ గుణంబే యౌను శోధింపఁగన్
2107

ఇథుమ లొఅదగఁ దగని నీకొడుకుకూడ
నేటినుండియు నీచమై నేర్వ నట్టి
పిద్ధ మగునట్టి కర్మ త్యజించి యింక
సౌఖ్య మొందెడుఁ గాకను సర్వగతుల. 2108

క్షోణి దక్షిణాగ్రంబుగఁ గుశలపైని
కష్టమున రాముఁ డుంచిన గారపిండి
ఆ విశాలాక్షి కౌసల్య యరసి యధిపు
సుతులతోఁ జెప్పె బాధతో గ్రుక్కి మిగుల. 2209

ఇది యిక్ష్వాకుకులేందు వౌ దశరథోర్వీశానునిం బోని వా
డెద కిష్టం డగునట్టి రాముఁ డిడఁగా నెంతేని సంప్రీతితో
డఁ దినంగాఁ దగునట్టి యన్నమె. యమూల్యం బైన భోగాలు నె
మ్మది సంప్రీతిని దిన్న రాజున కివేమాత్రం బనర్హంబె గా. 2210

చతు రబ్ధి పరీత మగుక్షి
తి తల మనుభవించిన పతి దేవేంద్రసముం
డు తిను నెటు లీయరుచికర
ము తినఁ దగని గారపిండి ముద్దను నకటా ! 2211

పితకు రాముఁడు నీగారపిండి ముద్ద
మిగుల శ్రీమంతు డయ్యు నొసగుట కంటె
నింక దుఃఖకరం బైన దెందు కూడ
నాకుఁ గనిపింప దక్కట ! లోకమందు. 2212

తండ్రి కీగారపిండి ముద్దను కరంబు
రాముఁ డిడుచుండఁ గని బండరాయి వంటి
నాదు హృదయంబు బ్రద్దలై యీధరిత్రి
వేయి ముక్కలుగా కుండె వెతలఁబడియు. 2213

ఎట్టి యన్నము నరుఁడు భుజించుచుండు
అట్టి యన్నమె దేవతల్ ముట్టి తింద్రు
అనెడి యీశ్రుతి వాక్కు సత్యంబ యనుచు
చూచి చూడ నామదికిని తోచుచుండె 2214

ఇటుల నేడ్చు కౌసల్యతో నాసపత్ను
లరసి యట రాము దివి జాఱు సమరునట్లు
అఖిల భోగాలు త్యజియించి నట్టి రాముఁ
గనుచుఁ గన్నీరు విడి ఖారు మనిరి వారు. 2215

అమల విక్రముఁ డగురాముఁ డపుడు లేచి
మాత లందఱ పాదాలఁ జేతఁ బట్టి
ఆవిశాలాక్షులు మృదుల సౌఖ్యముగఁ దాకి
కోమల కరాలఁ దుడిచి రారాము వీపు. 2216

మెండు దుఃఖము గల లక్ష్మణుండు గూడ
తల్లు లందఱకు నభివాదనము చేయ
వార లందఱు రాముని పగిదిఁ దట్టి
రంతటను లక్ష్మణు సులక్షణావయవుని. 2217

కనుల నీరూన సీతయుఁ గదలి యెదుట
అత్త లందఱు పాదాల హత్తుకొనగ
మరలి కౌసల్య కని సుతన్ మాతవోలె
నడవిఁ జిక్కు సీతను గౌఁగి లిడుచు ననియె. 2218

ఆజనక మహారాజున కాత్మజ యయి
ఇల దశరథమహేశు కోడలియు నగుచు
రామునికి నర్థగాత్రమై రాణ గనిన
సీత విజనవనిని నెట్టి చిక్కు లొందె. 2219

వడి నెండంబడు పద్మమట్లు" మృదితంబౌ నెత్తికల్వం బలెన్
కడు దుమ్మంటిన మేల్మిబంగరువలెన్, గార్మబ్బులం గమ్ము చం
ద్రుఁడువోలెన్ కళ పోవు నీదుమొగమున్ జూడంగ ఈనామదిన్
కడు బాధారణిజ వ్యథాగ్ని యు నమన్ గాల్పం జొచ్చెనో జానకీ! 2220

వ. ఇట్లు ఆర్తురాలయి తల్లియగు కౌసల్య పలుకు చుండ ఇంద్రుఁడు బృహస్పతి పాదములు పట్టుకొని నట్లు భరతాగ్రజుం డయిన రాముఁడు గురువు వసిష్ఠుని పాదములు పట్టుకొని యావసిష్ఠునితోడనే కూర్చుండెను. అపుడు భరతుఁడు మంత్రులతోడను సైనికులతోడను పురప్రధానులతోడను ధర్మజ్ఞు లగు జనులతోడను కూడ అన్నయైన రాముని పృష్ఠమునఁ గూర్చుండెను. అట్లు అతఁడు కూర్చుండి ప్రయతుం డయిన మహేంద్రుఁడు ప్రజాపతితో బలె కృతాంజలియై నమస్కరించిన భరతుఁడు రామునితో చక్కఁగా నేమి పల్కునో గదా అని యందఱును కుతూహలమునఁ జూచుచుండిరి.అట్లు వారునుసత్యధైర్యము గల రాముఁడును లక్ష్మణుఁడును మహానుభావుఁడైన ధర్మాత్ముఁడు భరతుఁడు స్నేహితులు కూర్చుండి యుండ వారుముగ్గురు, అధ్వరమున సదస్యులతోఁ గూడిన త్రేతాగ్నులవలె భాసిల్లు చుండిరి. 2221

అంత రాముఁడు గురువత్సలు (భక్తుఁ) డగు భరతుని చూచి భ్రాత యగు లక్ష్మణునితోఁ గూడి యిట్లడుగ మొదలిడెను. 2222

ఇది నీచెప్పెడి దేమియో విన మనంబే కోరు, నీవిప్పుడే
మిది నారల్ జడ లూని రాజ్యమును నిట్టి వీడి యేతెంచి, తే
మిది యంచున్ బలవంత పెట్టి మదియున్ పృచ్ఛింపఁ గేల్మోడ్చి యా
యుద నందున్ భరతుండు చెప్ప దొడగెన్ స్వచ్ఛ స్వభావంబుతో. 2223

అన్నా! నాయన స్త్రీయు నాజననియౌ ఆకైక చేయింప లో
సెన్నన్ దుష్కర కర్మ చేసి సుతుపై నెంతో మదిన్ బెంగ నా
పన్నుండై దివమేగె, నామెయు మహాపాపంబు గావించి, కీ
ర్తి న్నామంబును పాడుచేసికొనె నిందే లోకముల్ దూఱఁగన్. 2224

అట్టి నాతల్లి రాజ్యంబు నందకుండి
విధవ రాలయి శోకాల వెతలు పొంది
కరము ఘోరమౌ నరకలోకంబునందు
పడి సుదారుణ బాధలఁ బడయఁ గలదు. 2225

ఆమె సుతుఁడ నీ దాస్యమునంద యున్న
నన్ననుగ్రహింపఁ దగిన యన్న వీవు
స్వర్గలోకాన సురలోక పతియు వోలె
ఇపుడె రాజ్యమున నభిషేకించు కొనుము. 2226

నీ సమీపమునకు నిపు డిట్టె వనికి
వచ్చినా రిదె కనుఁగొను ప్రకృతు లెల్ల
విధవ లగు మాతలును వచ్చి రిదిగొ కనుము
ఇంక నిపుడు మమ్మును నను గ్రహింప దగుదు. 2227

అనఘ మగు పూర్వ సంప్రదాయమును బట్టి
అగ్రజుండవు నీవెల్ల కర్తఁ డవుదు
మానధన! ధర్మముగను సామ్రాజ్య మీవు
పొంది మిత్రులఁ బూర్ణకాములను జేయుము. 2228

అమలుం డగు చంద్రునిచే
నమల యగుశరదృతు రాత్రి యట్టుల నిపుడో
క్షమలో క్షముఁ డగు నీచేన్
క్షమయు ననాథత చన సనాథయె యగుతన్. 2229

ఇదిగొ నీసచివులతోడ నిపుడె నేను
శిరసు వంచి సమ్మతిని యాచించుచుంటి
తమ్ముఁడను శిష్యుఁడ నగు నీదాసు నెడల
కడుఁ బ్రసన్నుఁడవై యనుగ్రహము చూపు. 2230

ఇదిగొ శాశ్వతం బగు మంత్రిబృంద మనఘ
ఇట్టి పూజార్హుల నతిక్రమింప దగవు
అని మహాబాహువౌ కైకతనయు డపుడు
కమల నీరాన మఱి రాము కాళ్ళఁ బడెను. 2231

ఇట్టు లని పదె పదె నిశ్వసించు చుండి
మదపు టేనుగువలె నున్న మాన్యుఁ దమ్ము
భరతుఁ గౌగిలించు కొనుచు మరల రాముఁ
డిట్టులు వచించె సంప్రీతి యెద దనర్చ 2232

ఉత్తమ కులీనుఁ డవు సత్త్వ యుక్తుఁ డవును
వ్రతివి తేజస్వి వైన నీవంటి వాడు
రాజ్య హేతువుచేత నేలాగు పాప
మాచరించును నిది నమ్మ నగును నెట్లు. 2233

శత్రుసూదన ! నీయందు స్వల్పమైన
దోష మెంతమాత్రము నామదిఁ దోఁచ దోయి
ఇంక నీవు బాల్యంబుచే నెంతమాత్ర
నీవు జననిని నిపుడు నిందింప దగవు. 2234

అనఘ ! భరత ! మహాప్రాజ్ఞయు నవరతము
దారలందు భృత్యులందు తనయులందు
పెద్దలో తమ కున్నట్టి స్వేచ్ఛ నిట్లు
కడుఁ బ్రవర్తించు టది యున్న యదె గదయ్య. 2235

సౌమ్య ! సాధులతో పాటు ఛాత్ర గణము
భార్యలును పుత్రులును గూడ వారి యిచ్ఛ
పూర్తి గావించుటయు గూడ భువిని గలదు
ఇట్టి సంగతి నీవును నెఱుఁగఁ దగుదు. 2236

నారబట్ట గట్టించి కృష్ణాజినంబు
లూను నటుజేసి యడవుల నుంచుటకును
రాజ్యమున నుంచుటకు మహారాజు తాను
సర్వవిధములఁ జేయింప శక్తు డగును. 2237

ధర్మవిదుఁ డౌచు నుండెడి తండ్రియెడల
లోకములును సత్కారముల్ చూప దగును
అట్టి ధర్మజ్ఞురా లైన యమ్మ యెడల
గౌరవము చూపదగు ధార్మికాగ్రగణ్య ! 2238

ఇటు దశరథమహారాజె యెంచి పంచి
జగ మెదుటఁ జెప్పి తేజస్వి చనియె దివికి
లోక గురువు ధర్మాత్ముఁడు నీకు పెద్ద
పిత సలిపిన భాగమనుభవింపఁ దగుదు. 2239

పదియు నాల్గేండ్లు దండకా వనమునందు
సౌమ్య ! నేన యిప్పుడు నివాసంబు చేసి
పిత మహాత్ముడు నాకు నర్పించినట్టి
భువన రాజ్య భాగంబును పొంది యుందు. 2240

ఈనర జగంబుచే నత్కరింపబడిన
పిత మహాత్ముడు సుర లోకపతి సముండు
ఏది చెప్పెనో యదె నాకు నెంతొ హితము
నిఖిల లోక సామ్రాజ్యముఁ హితము గాదు. 2241

వ : ఇట్టులు ఆస్నేహితుల బృందముతో పాటు కూర్చుండి యాపురుష సింహులు ఆలోచించుచుండ అతికష్టముగా ఆరాత్రి గడచెను. ఎటులో ఆరాత్రి గడువఁగా ఆసోదరులు స్నేహితులతో పాటు మందాకినియందు హోమములు చేసి గాయత్ర్యాది మంత్రములను జపించి రాముని దగ్గఱకు వచ్చి కూర్చుండగా అందెవ్వరు మాటాడక యూరకుండిరి. అంతఆస్నేహితులమధ్యభరతుఁడు రామునితో నిట్లనియె. 2242

రాజు నాతల్లి నోదార్చి రాజ్య మిచ్చె
ఆమె యారాజ్యమును నాకు నప్పగించె
అట్టి రాజ్యము నీకు నే నప్పగింతు
ననఘ ! కంటకములు లేని రాజ్య మనుభవింపు 2243

అతిగ వర్షకాలపు ప్రవాహంబుచేత
కొట్టఁబడిన తటాకపు గట్టువోలె
ఈ మహారాజ్య ఖండంబు నీవు గాక
యింక నొక్కఁడిల నిలువరింప లేడు. 2244

పరులను బ్రదికించెడి యా
నరుని బ్రదుకొ చాలసుఖమునన్ వర్ధిల్లున్
పరులవలన బ్రదికెడి యా
నరుని బ్రదుకొ హీనమని యనంబడుఁజుమ్మీ. 2245

పొట్టి వారి కందక పెంచి నట్టిచెట్టు
పూచి పండ్లీనిచో నింక పెంచి యేల
అట్లె నిను ఘనుఁ జేయ నర్హుఁడయ్యు
శ్రేష్ఠుఁడవె యయ్యు మమ్ముఁ బోషింప వేల. 2246

ఉదయం బొందు రవిం బలెన్ రిపుగణం బుగ్గాడి రాజ్యంబునం
దుదితుండౌ నిను పౌరసంఘములు పూర్ణోత్సాహులై చూచుతన్
త్వదపేక్షన్ కడు ఘీంకరించుచుఁ గరుల్ మత్తిల్లి వెంటాడుతన్
ముది రాజాంతః పుర కాంత లెల్లరును నానందింత్రుగాతన్ కడున్. 2247

ఇటుల ప్రతిమాలు భరతు వీక్షించి జనులు
మేలు మేలని శ్లాఘింప నాలకించి
యాత్మవంతుఁడౌ రాముండు నపుడు భరతు
నూరడించెను నీతి యుక్త రీతి. 2248

మన యిష్టంబెది కూడఁగాదు, నరుఁ డేమాడ్కిన్ పరాధీనుఁడే
మనలన్ దైవ మిటట్టు లెట్టి సమయం బెందైన నీడ్చున్, సమ
స్త విధానాలు క్షయించు నవ్వె, పతనాంతం బెల్ల యౌన్నత్యముల్
మన సంబంధము వీడి పోవు, బ్రదు కెల్లన్ చావు పర్యంతమే. 2249

పండినట్టి పండ్లకుఁ జెట్టునుండి క్రిందఁ
బడుట కంటెను వేఱైన భయమె లేదు
అట్టులే పుట్టిన నరుఁడు గిట్టి చనుట
కంటె వేఱైన యెట్టిభయంబు గనఁడు 2250

మంచి దూలాల యిల్లు జీర్ణించి పడును
మృత్యువు జర నరుని పట్టి యీడ్చి చంపు
గడచిపోయిన రాత్రి వెన్కకును రాదు
పూర్ణమైనట్టి యమున సముద్రుఁ జేరు. 2251

ఎల్ల ప్రాణికి రేయింబవళ్ళు గడుచు
అంబువులు వేసవిని నెండు, నాయు వేగు
నిను గుఱించియె యోచించు, గనకు పరుని
ఉన్న కడచిన వారి యాయువు గతించు. 2252

మనతోనే చావు నడచును
మనతోనే కూరుచుండు మన చావెపుడున్.
మనతోనె చావు మరలును
మన మాచావుఁ బరదేశ మంపంగలమే. 2253

మన యొడలో ముడతలు పడును
మన జుట్టును నెఱసిపోయి మఱిమఱి రాలున్
మనుజుఁడు జరచే చివుకును
మనుజుం డేబలమును గొని మహిమ వహించున్ 2254

కులుకుదు దుదయింపఁగ రవి
కులుకుదు రిఁక నస్తమింపఁ గువలయ మందున్
తెలియరు మనుజులు నిత్యం
బిలలో తమతమ బ్రతుకు నశించుట యెపుడున్. 2255

తనమోమే చూచు కొనుచును
న్వముఖంచే నవనవముగ వచ్చె నటంచున్.
తమ మదిని పొంగి పోదురు
స్వమతిఁ గనరు ఋతులు మాఱి చచ్చెద మనుచున్. 2256

ఎటనుండో వచ్చి నదిలో
నెటు లెటులో పుల్ల పుల్ల యిట్టే కలియున్
అటులే త్రుటి విడిపోవును
తటుకునఁ గాలంబు వచ్చు తరుణమునందున్. 2257

ఇటులే భార్యాపుత్త్రులు
ఇటులే బంధువులు ధనము లెటు లెటొ తమలో
త్రుటిలోఁ గలియుచు విడుదురు
ఎటులున్ తప్పదిఁక వీరి కెడబా టిలలో 2258

ఎదియైనఁ దనస్వభావము
వదలదు రవ్వంత దాటి వర్తింపదుగా
మదిఁ జూడఁ బ్రేత భావము
వదలని ప్రాణి కిట నెట్టి బలమును లేదే. 2259

నడుచుచును బాటసారియు
నుడువును నేవత్తు మీ వెనుకనే యనుచున్
వడి తాత తండ్రి చని రిటె
నడచుచు పగచు నెటు తప్పి నడచుట లేదే. 2260

వడి వయసు గడుచు చుండుం
బడి నడచి ప్రవాహ మింక మరలదు సుమ్మీ
కడు సుఖియింపగఁ నాత్మను
నడపుమి, ప్రజ లవుదురు సుఖజను లపుడే. 2261

ఇష్ట దక్షిణలతో నెన్నొ శుభం బైన
యజ్ఞలు కర్మలు నావరించి
ధర్మంబుతోడ నర్థార్జన గావించి
ప్రకృతుల భరియించి ప్రజల నేలి
ఉత్త మాయువు పొంది యోగ్య భోగము లొంది
పాపాలు వర్జించి ప్రమదాన బ్రతికి
బ్రహ్మలోకమునందు స్వైర విహారాల
మనియెడి దైవ సంపదల పొంది

అరిగి పోయిన మనుజ దేహంబు వదలి
కదలి మన తండ్రి స్వర్గలోకమున కరిగె
అట్టి శ్రుతవంతుఁ డేఁగఁగ నట్టి నీవు
వగవఁ దగనట్టి తండ్రికై వగవఁ దగవు. 2262

ఇట్టి శోకంబు లేడ్పులు నిట్టి వ్యథలు
ఎపుడు బుధుఁడు ధీరుండు వర్జింపవలెను
స్వస్థుఁ డగుము, శోకము వీడు చనుము పురికి
వాగ్విదః వశియౌ మన తండ్రి పనిచె నిట్లు. 2263

పుణ్యుఁ డగుతండ్రి యెదీ నాకు మునుపు పనిచె
అట్టి యతని యాజ్ఞనె నేను నాచరింతు
అతని యానతి విడరాని దరివినాశి !
అదియె నీకు మాన్యమ్ము, తండ్రి యాప్తుఁ డతఁడె 2264

ధర్మము చరించువాని తద్వాక్కె ప్రియము
దాని వనవాస కర్మచేఁ బూని చేతు
నృవర ! పరము గెల్చుపతి ధార్మికుఁడె యగుచు
సదయుఁడై గురు సేవియై బ్రదుక వలయు. 226

తండ్రి దశరథు ధర్మవర్తనము నెఱిగి
మనుజవర ! స్వభావమున నాత్మమును గనుము
అని మహాత్ముఁడు రాముఁడు జనకు నాజ్ఞ
ఆచరింపఁ దమ్ముని బల్కి యట ముగించె. 22

అని రాముండు వచించియూరుకొనఁగా నా యేటి తీరంబునన్
అనఘున్ వత్సలు రాముఁజూచి భరతుం డాశ్చర్య మౌ ధర్మ్యవా
క్కును బల్కెన్" రిపుసూదనా ! జగతినీకున్ సాటిలేఁ డెవ్వఁడున్
నినుబాధల్ వ్యధ పెట్టలేవు, సుఖమేనిన్ సౌఖ్యమే పెట్టదున్. 57

—: భరతుని ధర్మవిచారణ :—

వ : నీవు వృద్ధ సమ్మతుఁడవె యయ్యువారిని సంశయనివృత్తికై 268
యడుగుచుందువు.

మృత్యునిం బోలెను జీవుని
క్షితిలో లేనట్టిదివలె క్షితిఁగల దానిన్
మతిలో నెవ్వడు నొకటే
గతిగాఁ దలపోయు, వాఁడు గనునే వ్యథలన్. 2269

పరమును నపరము నెఱిఁగిన
నరుఁడటు నీవును నెఱిఁగిన నరుఁడవు నృపతీ !
వరుఁ డిట్టి వ్యసన మొందియు
ధర నెట్టి విషాదమొందఁ దగఁడెటులైనన్, 2270

నుతదేవోపమ ! నీవు సత్యగుణపూర్ణుండౌ మహాత్ముండవున్
సతమెల్లగన్ గనుసత్య విక్రముఁడవున్ సర్వజ్ఞ సద్బుద్ధివిన్
స్థితియున్ సృష్టినెఱుంగు సద్గుణుఁడవున్ నీకెట్టు లెందే నస
హ్యతనుంబౌ వ్యథగాని బాధ యిడశక్యంబౌనె శత్రుంజయా. ! 2271

నే నటు దూరదేశముననే పడియుండఁగ, నీచురాలు నన్
కానక కన్నతల్లి యొడిగట్టియె పాపము, నా నిమిత్తమై
తానిటుచేసి నన్నువిపదంబుధి లోపల ముంచివైచె, నీ
వోనను ఈయునిష్టమున నుండి తరింప ననుగ్రహింపుమీ. 2272

వశమయి ధర్మపాశమున బద్ధుఁడ నౌటను తల్లికైకయిన్
అశుభను తీవ్రదండమున కర్హను పాతకిఁ జంపకుంటి ఆ
దశరథు నుండి శుద్ధ కులదైవము నుండి జనించి యేవగిం
ప శుచియునౌ నధర్మమునె యక్కట ! చేతున ధర్మ వేత్తనై 2273

గురువాచరించు ఘనుఁడు ను
వరనరపతి, వృద్ధుఁడు పిత స్వర్గగతుండున్
పరదైవమని తలఁచి చె
చ్చెఱ సభలో తండ్రినింద చేయక యుంటిన్. 2274

ధర్మము నర్థము లేని య
ధర్మంబగు నిట్టి పనిని ధర్మజ్ఞుఁ డెవం
డర్మిలిస్త్రీకయి చేయును
ధర్మజ్ఞా ! సరిగఁజూడు ధరణీతలిలో. 2275

తనకు వినాశము ప్రాప్తిం
చిన తఱి విపరీత బుద్ధి చేరును ప్రాణిన్
అని మును శ్రుతియును విందుము
జనపతి యిటుచేసి దాని సార్థకపఱిచెన్, 2276

భయమున మోహమున విమ
ర్శయు లేనందువలనఁ బిత సలిపెను నిటులన్
అయితే మఱి నీ వియ్యది
నయముగ సరిచేసి దాని నడిపింపవలెన్. 2277

పిత దారి తప్పినపుడే
సుతుండు తనమతిని నేది శుభమని చేయున్.
అతఁడే యపత్య మనఁబడు
నితరుఁ డపత్య మని జగతి నెటు చెప్పఁబడున్. 2278

శుభ మొనరించు నపత్యము
ప్రభు! నీవగు;పిత చెడు గనువర్తించకుమీ
శుభ మయ్యది కాకుంట న
శుభమని నిందింపఁబడియె సుజనుల చేతన్. 2279

కైకేయిని నను తండ్రిని
లోకంబునఁ గల సుహృదుల లోకుల నీవా
లోకించి యీసమయమున
వీఁకన్ రక్షింపఁ దగుదు వీరాగ్రసరా! 2280

విన:- పతనముకానీయనివాడు=అపత్యము.

ఎక్కడ ఈ వనవాసం
బెక్కడ క్షాత్రంపుఁ గర్మ యెక్కడ జడలున్
ఎక్కడ పరిపాలనమును
ఇక్కడి యీవికృత కర్మ యిఁక మానఁదగున్. 2281

ఇఁక క్షత్రియాభిషేకం
బొకటే మొట్ట మొదట నిపు డొనరింపఁదగున్
ఇఁక దానిచేతనేగద
సకల ప్రజ పాలనంబు శక్యంబ యగున్. 2282

ఎదుటఁ గనబడు దానిని
వదలి, మొదటె సంశయంబు పడఁదగి యశుభా
స్పదమయి యెపుడొ లభించెడి
యదృథము నేక్షత్రబంధు వాశించుఁగదో. 2283

మఱి శ్రమపడి ధర్మము నా
చరింపఁ గోరుదువ యేని సరియే యింకన్
సరి యయిన స్వధర్మముతో
ధరఁ జాతు ర్వర్ణ్య మేలి తగు శ్రమ పడుమీ. 2284

—: చిన్నవగు నేను పాలింపలేనని భరతుఁడనట :—

నాలుగె యాశ్రమములలో
నాలోకింపఁగ గృహస్థు నాశ్రమ మొకటే
చాలాశ్రేష్ఠం బందురె
యేలీలన్ దానివిడువ నెంతు సుధర్మా! 2285

శ్రుతమున పదమున జన్మను
క్షితిలో నీకంటె నేను చిన్ననె యౌటన్
క్షితిలో నీవుండఁగ నీ
క్షితి నెటు పాలింపఁగలను చెప్పుమి యన్నా! 2286

గుణముల బుద్ధిని పదవిని
కనుఁగొన నీకంటె నెందుఁగడు చిన్ననె గా
నిను గనకుండనె యీవ
ర్తనమును గావింప నేను తగ నిఁక భువిలో. 2287

పితృ పైతామహ మయి యగ్ర
థత లేక యకంటకముగ లభియించిన యీ
క్షితి రాజ్యమ్ము స్వధర్మ
వ్రతమునఁ బాలింప వోయి బంధులతోడన్, 2288

ప్రకృతుల్ ఋత్విజులున్ వసిష్ఠముఖ మంత్రజ్ఞుల్ సఖుల్ మంత్రులున్
సకలాంగంబులతోడ నిన్ను, నిచటన్ రాజ్యాభిషిక్తున్ బొన
ర్చి కడున్ మోదము గాంత్రు గావుత, మరుద్బృందాల నింద్రుండటుల్
సుక మెప్పన్ జగముల్ జయించి చనుమిచ్చోనుండి మాతోడుతన్. 2289

పితరుల దేవఋషుల ఋణ
ము తీర్చి, దుష్టహృదయములను పూర్తిగ నాశం
బు తగన్ జేసి. సుహృదయుల
నె తృప్తి పఱచి మము నేల నీవును రమ్మా. 2290

ఇపుడు నీసుహృదు లభిషేకించి నిన్ను
తృప్తి గాంతురు గాక, భీతిల్లి రిపులు
పోవుదురు గాక, నాతల్లి పొందు నింద
వీడఁ దుడిచి, పాపమునుండి పితను బ్రోవు. 2291

శిరసు వంచి నిన్నిపుడు యాచించుచుంటి
శివుఁడు భూతము లందట్లు భువములోన
నాయెడల నెల్ల ప్రాణులన్ బంధులందు
కరుణ చూపించి బ్రోవుము త్వరగ నన్ను. 2292

అట్లుగాక నీవు వనికే యరిగి తేని
నేను గూడ నీతోపాటె కాన నుందు"
అనుచు భరతుఁడు బ్రతిమాలుకొనినఁ గాని
సత్య యుక్తుఁడు పితృవాక్కె సలుపఁ దలఁచె. 2293

అపు డాయద్భుత మైన స్థైర్యము కరం బారాము నందుంట చూ
చి పరితాపముతోడ నెంతొ ముదమున్ శీఘ్రంబుగాఁ బొంది, వా
రపు"డయ్యయ్యో! యయోధ్య కీఘనుఁడు రాడంచున్ విచారించి ర
ట్లు పురిన్ జేయు ప్రతిజ్ఞ తప్ప డని లోలోఁ బొంది రానందమున్ 2294

ఇటు ధర్మంబుగఁ బల్కుచున్న భరతున్ వీక్షించి ఋత్విక్కు ల
చ్చటి పౌరుల్ స్మృతి వీడి యశ్రు లురలన్ సంతాపముంబొంది య
క్కట! దుఃఖించెడి మాతలున్ మిగుల శ్లాఘల్ చేయుచుంగూడ నా
దట శీర్షంబులు వంచి కోరిరి యయోధ్యన్ బ్రోవగా రామునిన్. 2295

వ. ఇట్లు మరలఁ బల్కుచున్న భరతునితో బంధువుల మధ్య జ్ఞాతులచే సత్కరింపఁబడిన శ్రీమంతు డైన రాము డిట్లనెను.. 2296

-: రాముడు కైకా వివాహశుల్యము జ్ఞాపకము చేయుట :-

* అనఘ! నృపేంద్రుఁ డౌదశరథాధిపువల్లను గైకయందు జ
న్మనుగను నీవ యిట్లనుట న్యాయమ, మున్ మనతండ్రి నీదు మా
తను నటు పెండ్లిచేసికొను తత్సమయుంబున రాజ్యశుల్క మి
త్తు ననుచు మీదు తాత కటఁ దొల్తనె మాట నొసంగెఁ దమ్ముఁడా!
2297

---

* కైకకు రాజ్యశుల్కము పట్టాభిషేక సమయే భవేయుం స్మారితో హ్యహం! త్వయా వా అన్యేన భూపాల తథా చేత్ కరవాణ్యహం ఇత్థం ప్రతిజ్ఞా మకరోత్ ఆహితాగ్న్య గ్రణీ ర్నృపః (ఉమాసంహిత) పట్టాభిషేక సమయమందు నీవుగాని ఇతరులు గాని జ్ఞాపకము చేసినచో రాజా!

వ. దైవాసుర సంగ్రామమందు నీతల్లికై ఆమె యుద్ధసమయమున ఆరాధనగాఁ జేసిన సాయమునకు సంతోషించి రెండువరముల నిచ్చెను. అపు అమె తరువాత ఇచ్చెదవుగాని అని చెప్పి యొప్పించి ఇపు డాయశస్వినిరెండు

---

అట్లే చేయుదును అని ఆహితాగ్నులలో శ్రేష్ఠుడైనరాజు ప్రతిజ్ఞ చేసెను. "కైకేయ్యాం మమపుత్ర్యాం యః రాజ్ఞో పుత్రో భవిష్యతి రాజ్యంతస్మై స దాతవ్రం ప్రదేహి త్వం సత్యేనానేన గృహ్యతాం "(ఆశ్చర్యరామాయణము) (దశరథ స్వగతం) వివాహస్తు మమాభీష్టః న పుత్రే రాజ్యమర్పణం, యదిచే న్మమ పుత్రాశ్చ భవిష్యంతి హ్యపుత్రిణః తేచాపి స్వస్య వంశస్య మర్యాదాం చ కుమారకాః న త్యజంతి మహాత్మాన స్త్వాదా విక్ష్వకునా కృతాంఇతి నిశ్చిత్య రాజా చ, వసిష్ఠాదిభి రాత్మవాన్, పురంధ్రీభి స్సమాలోచ్య తాభిశ్చప్రేరితో వదత్ యథా వదసి భోవిప్ర తథైవ కరవాణ్యహం (కాశ్మీరరాజపురోహితు డగు గార్గునితో నిట్లు చెప్పెను) ఇత్యుక్త్వా అజసుత స్సద్యః కాశ్మీరం ప్రతి నిర్యయౌ, కాశ్మీరదేశ పాలేన పూజితః వరమార్హణై! చకార గ్రహణం పాణేః" నాకుమార్తె కైకేయి యందు కలిగిన పుత్త్రునికి రాజ్యమివ్వవలెను ఇట్లు మాట యిమ్ము నీవీసత్యము గ్రహింపుము అని కైకేయరాజనగా దశరథుడు తనలో నిట్లనుకొనెను. నాకు వివాహము ఇష్టమేకాని కైక పుత్రునికి రాజ్య మిచ్చుటకు యిష్టములేదు పుత్త్రులేలేనినాకే ఒకవేళ కొడుకులు గల్గినచో ఆ కొడుకులు పూర్వవంశ మర్యాదచే పెద్దకొడుకుకే రాజ్యమివ్వవలయుననుయిక్ష్వాకువు చేసిననియమమును నాకుమారులు మహాత్ములై దాటరు అని రాజు వసిష్ఠాదులతోను స్త్రీలతోను ఆలోచించి వారు పేరేపబడిన యాత్మ గలవాడై ఓవిప్రా నేనట్లే చేయుదును కాని ఆసమయములో జ్ఞాపకము చేయువలె నని దశరధుడు కాశ్మీరముపై పువెళ్లెను. కాశ్మీరరాజుచే పూజలచే పూజింపబడికైకేయిని పెండ్లాను. ఇదిరామునికి తెల్సి యెట్లుసత్యవంతుడైనరాముఁడుపట్టాభిషేకమునకొప్పుకొనెను. లేక రాముని కపుడు తెలియదేమో తెలిసినను తండ్రిమాటకా దనలేక అంగికరించెనేమో.

వరములను అడిగెను. అందులో ఒకటి నీకురాజ్యమును, రెండవది నాకు వన
వాసమును. వరబలముచే నియోగింపఁబడి రా జానరముల నిచ్చెను. నీవు వన
ములో పదునాలుగువత్సరము లుండు మని రాజు నన్ను నియోగించెను. నే
నెదురు చెప్పక సత్యవాక్కున నిలఁబడిసీతతోను లక్ష్మణునితోను ఈ వనమునకు
వచ్చితిని. నీవు కూడ నీవు అభిషేకము చేసికొని తండ్రిని సత్యవాదిగాఁ జేయఁ
దగుదువు. భరతా! నాకోసము ధర్మజ్ఞుఁడైన తండ్రిని ఈ ఋణమునుండి విడి
పించి తల్లిని కూడ ఆనంద పెట్టుము. నాయన! యశస్వి యైన గయుఁడు
గయము లను పేరు గల దేశములందు పితృదేవతల గూర్చియజ్ఞముచేయుచు
గానము చేసిన యొక శ్రుతి గలదు వినుము. 2298

* 'పు'మ్మను నరకమునుండి స
తమ్మను తండ్రి నయినఁ' దనతలిదండ్రుల నేన్
ఇమ్ముగ త్రాణ మొనర్చి జ
గమ్మునపుత్త్రుఁడ యటంచు ఖ్యాతుం డయ్యెన్. 2299

పలుపుత్త్రులు యజ్ఞంబులు
సలుపఁదగి గుణములు గలిగి సకల శ్రుతముల్
తెలిసియ యుందుర, యవ్వా
రలలో నొకడయిన గయకు రయమునఁబోవున్. 2300

వ : అని గయుఁడను వాఁడనెను. కావున నిట్టి రాజర్షులందఱు మిన్న
యుంటిరి. కనుక రాజనందనా ! నరశ్రేష్ఠా ! తండ్రినరకమునఁబడకుండ రక్షిం
పుము, అయోధ్యకు వెళ్లుము. భరత ! శత్రుఘ్నునితో పాటు సర్వద్విజులతోఁ
గూడ ప్రకృతులను రంజింపఁజేయుము. నేను కూడ ఆలస్యము చేయక ఈ
సీతతోను లక్ష్మణుని తోడను దండకారణ్యమును ప్రవేశించును. 2301

* పుమనామ్నో నరకాత్ త్రాతేపుం అను నరకమున నుండి రక్షించుగాన
పుత్త్రుడని వ్యుత్పత్తి.

-: నీవు రాజ్యము నేను వనమును పాలింతమని రాముడనుట :-

భరత ! నీవు మానవులకు ప్రభుఁ డవగుము
వనమృగములకు నే సార్వభౌముఁ డవుదు
ఇపుడ మోదమున నయోధ్య కేగుమెప్పొయ్యి
ప్రమదమున నేను దండకావనికిఁ జనెద. 2302

దినకరుని యెండ నిన్ను బాధింపకుండ
గొడుగు నీకు శీతచ్ఛాయ నిడునుగాక
ఈ యడవి చెట్లికను నాకు ఛ్ఛాయనిడఁగ
నేను గూడ హాయిగ విహరింతుఁ జుమ్ము. 2303

బాణ శత్రుఘ్నుఁడును నీకు సాయముండు
చతురమతి లక్ష్మణుఁడు నాకు సాయపడును
భరత ! మనము నల్వురు పుత్త్రవరుల మగుచు
జనకు సత్యాత్ముఁ జేతము పనట గనకు. 2304

-: జాబాలి నాస్తిక బోధ :-

వ : ఇట్లు భరతుని ఓదార్చుచున్న ధర్మజ్ఞుఁడైన రామునితో జాబాలి యను బ్రాహ్మణోత్తముడు ధర్మవిరుద్ధముగా నిట్లు పలికెను. సెబాసు ! రామా ! ఉత్తమ బుద్ధి గలిగి తపస్వియైననీవంటి వానికి పామరునికి వలె నిరర్థకమైన యిటువంటి బుద్ధి కలుగక పోవుఁగాక. 2305

ఎవనికి నెవ్వఁడు బంధుం
డెవని కెవనితో నెదియగు నెది పొందవలెన్
భువిలో నొక్కఁడె పుట్టును
ఇవికిని నొక్కడె నశించి తిన్నగ పోవున్. 2306

క్షితిలో నున్మత్తుని వలె
నెతఁ "డిది తల్లియని తండ్రి యీతఁడ టంచున్"
మతిలో నాసక్తుండగు
మతిగన్నెవని కెవడగును మఱి యెదికాడున్. 2307

మనుజుఁడు గ్రామాంతర మే
గినపుడు తన యిల్లువదలి కేవల మెటకో
చని నెలుపల వసియించుచుఁ
గని మఱునాఁ డెందొ యుండుఁగద లోకమునన్, 2308

మనుజుల కిటులే జననియు
జనకుఁడు గృహమును ధనమును సత్రము వలెనే
యునికి యవుచుంద్రు, సుజనులు
కనరెపుడును వారియందుఁ గాంక్షను భువిలో 2309

తరతరమునుండి వచ్చిన
ధర యీ రాజ్యలక్ష్మి తటుకున విడియున్
నరవర ! బహు కంటకములు
వఱలిన కష్టంపువన్నిని బడఁ దగదోయీ ! 2310

బహుసంపదలన్ నిండియు
బహురమ్యంబయిన యయోధ్య పట్టనమందున్
ఇహమున నభిషేకము గొను
మహహా ! పురి* యేకవేణి యయియునిను గొల్చున్. 2311

* ఏకవేణి, స్త్రీలుపతి విరహములో ఒకటే జడతో నుండుట ఆచారము.

విలువగల రాజ్యభోగము
లిలలోపల నెన్నొ యనుభవించుచు నృపతీ!
పలుగతులఁ బురి విహారము
సలుపుము స్వర్గంబు నందు శక్రుఁడు వోలెన్. 2312

చూడు దశరథుఁ డేమియుఁ గాఁడు నీకు
నీవతనికి నేమియుఁ గూడ గావుసుమ్ము
అన్యుడా రాజు, నీవును నన్యుడవుదు
వందుచే నీవు నేఁజెప్పినట్లు చేయు. 2313

ప్రాణికోటికి బీజ మాత్రంబె తండ్రి
ప్రాణకోటికి క్షేత్రమాత్రంబె తల్లి
శుక్లశోణితములు తల్లిఁ జొచ్చి కలియు
ప్రాణి జన్మహేతువు శుక్లశోణితములె. 2314

నృపతి యే ప్రదేశమునకు నేగవలెనొ
ఆతఁడా ప్రదేశమునకె యరిగెఁ జుమ్ము
ఇదె సమస్తభూతముల ప్రవృత్తి సుమ్ము
ఈవొ యనవసరముగ శోకింతువయ్య. 2315

* అష్టకయు పితృదైవత్య మైనకర్మ
అని జనంబు లటఁ బ్రవృత్తులగుచు నుంద్రు
అదియు నన్నము పాడుచేయుంగఁ జనుటె
చచ్చిపోయిన వాడెట్లు వచ్చి తినును. 2316

* మాఘ పౌర్ణమాస పిదప పచ్చు అష్టమి జ్యేష్ఠతోఁ గూడినచో అష్టక అందురు. దానియందు చేయు పితృదేవతలనుద్దేశించి చేయు హోమాదిక శ్రాద్ధ కర్మ,

ఎవ్వడెవ డర్థమున ధర్మ మెంచుచుండు
వానికై గాక యన్యుకై బాధపడను
అట్టి ధర్మనిష్ఠుఁడె యిట వ్యథలఁ జెంది
సర్వనాశనమై పోవు జగతిలోన. 2317

శ్రాద్ధమున భోక్త యిటఁ దినన్, జనినవాని
కెట్లు ముట్టు, వాని తనువు లితరమౌట,
అట్లయైన దేశాంతర మరుగువారి
కిచట నిడు శ్రాద్ధ ముపయోగపడును పథిని. 2318

దేవుఁ బూజింపు, యాగంపు దీక్షపూను
దానమిడు, త్యాగమొనరింపు, తపముచేయు,
అనుచు మేధావులు రచించి జొనుపు కృతులు
కేవలమును దానపు వశీక్రియలు కాదె. 2319

పర మనునదె లేదని బుద్ధి నెఱుఁగుమయ్య
కనుము ప్రత్యక్షమె, పరోక్ష మునుపు వెనుక
అఖిలలోక నిదర్శన మరసి యెదుట
అనుజుకోర్కె మన్నించి రాజ్యము గ్రహింపు. 2320

అనుచు జాబాలియను మాట లాలకించి
సత్యవీరుఁడౌ రాముఁడు స్వచ్ఛ మతికి
కడు విరుద్ధముగా నవి కానిపింప
సూక్తిగల బుద్ధితో సరిచూచి చెప్పె. 2321

నీవు నా ప్రీతికై రాజ్య మెనయుకొఱకు
కడు నకార్యమౌనది మహాకార్యముగను
అహిత మైనదానిని హితమైన యట్లు
బాగుగా నిపు డిట్టులు పలికినావు. 2322

పితృసత్య మొప్పు కొనుచును
సతతము లోభమునఁగాని సంమోహమునన్
మతి నజ్ఞానము చేఁగా
నితమము గని సత్యదీక్ష నే నికదాటన్. 2335

అనృతంబాడెడి యస్థిర
మనస్కుఁడఁజంచల హృదయు సమస్త క్రియలన్
అనయము దేవులు పితరుల
యిన గ్రహియింపరనుచు వింటి మిలఁ బెద్దలచే. 2336

ప్రతియొకనికి నీసత్యమె
సతతము ధర్మంబయనుచు నిజంబుగఁ దలతున్
మతియుత సుజనుల చేనిది
యతిజాగ్రత చేయఁబడుచు నభినందితమౌ, 2337

ధర్మమువలెఁ గనఁ బడెడి య
ధర్మమయిన యిట్టి క్షాత్ర ధర్మము విడుతున్
ధర్మమటుతోచునిది దు
ష్కర్ములు లోభులు నృశంసశఠు లొనరింతుర్. 2338

మనసున నిశ్చయమూనుచు
ననృతంబును నాల్కచేత నాడుచు నెపుడున్.
తనువునఁ బాపము చేయుచుఁ
గనికావింత్రు త్రివిధమగు కలుషపుఁ బనులన్. 2339

ధరణియు కీర్తియు ఖ్యాతియు
సిరియును సత్యంబె పలుకు సుశీలునె గోరున్.
వరసత్య సంధుఁజేరును
అరసనె యిది సత్యదేవు నర్చింపవలెన్. 2340

వరమిదెయని స్థిరపఱచుచు
సరసంబగు యుక్తి వాక్యసంతతిచేతన్
కరమిది భద్రము చేయుమి
యరసియనుచు నీవనిన దనార్యమె సుమ్మీ! 2341

వనమున వసింతు నంచును
మును తండ్రికి మాటయిచ్చి పోయిన పిదపన్
కనుమఱంగి తండ్రినుడి కా
దని యిపుడు భరతుని కోర్కె యదియెటు చేతున్. 2342

స్థిరమగు ప్రతిజ్ఞ యట్టులు
గురునెదుటను గూడఁ జేసి కొంకనుసుంతన్
ఎఱింగి యిది దేవి కైకయు
పరితుష్ట మనస్కయెయయి వఱలెనెకాదే. 2343

వనవాసము చేయుచునే
యనయము శుచినయి నియతిని నదియిది తినుచున్
వనిశుచియగు దుంపలఁ బం
డ్లను పూలనిడి పితృదేవులను నర్చింతున్. 2344

పంచేంద్రియములు సంతో
షించెడు నటులోకయాత్ర చేయుచునుంటిన్
ఇంచుక కుటిలము చేయక
మించియె కార్యము నకార్యమెంచుచు నడతున్. 2345

కురుక్షేత్రం బిటుగని
ధర్మంబగు కర్మచేయఁ దగుఁ గదయెటులున్
కర్మల ఫలమును గనిన సు
కర్ములు గద సోమపావకానిలదేవుల్. 2346

పూర్ణ మర్యాదయే లేని పూరుషుండు
పాపమైన యాచారంబు చూపువాఁడు
మంచిదగు ప్రవర్తన లేని మానవుండు 2323
సజ్జనుల గౌరవము పొందఁజాలఁ డెపుడు.

మానవుఁ డకులీనుండొ కులీనుఁ డగునొ
పూరుషంమన్యుఁడో లేక వీరుఁ డగునొ
అమల శుచియొ లేక యశుచియైనవాఁడొ 2324
వీని తత్ప్రవర్తనమె యావిష్కరించు.

తనరి యశౌచతన్ శుచివిధాన. ననార్యుఁడ నయ్యు నార్యరీ
తిని, అవలక్షణుండనయి దీపిత లక్షణుఁడట్లు దుష్టవ
ర్తనుఁడను సత్ప్రవర్తనుని లాగున ధార్ముడధార్మికుంబలెన్
దనరియు మంచి వీడియ యధావిధి లోకము పాడుచేయఁగా. 2325

జగతిని మంచిచెడ్డల విచక్షణ యుండిన ప్రాజ్ఞుఁ డెవ్వఁడీ
విగుణుని లోకదూషణు నవిశ్వసనీయుని నన్ను మెచ్చు, ని
ట్టిగతి ప్రతిజ్ఞ వీడి వికటించిన వృత్తినినుండి యెట్టులే
సుగుణుని వృత్తమున్ బడియు చొత్తును, నెట్టులు స్వర్గమందెదన్. 2326

ఇటునే నిష్టము వచ్చిన
యటునడచిన లోకమెల్ల నటులే నడచున్
ఎటులన్ రాజులు నడతురొ 2327
యటె రాజునుబట్టి నడతు రఖిల ప్రజలున్.

మునుపు సనాతన నృపవ
ర్తనమ్మె సత్యమయి భూతదయ గలదయ్యెన్
కనుకన్ రాజ్యంబిది స 2328
త్యనిష్ట, మాసత్యమె జగమఖిలము నిలుపున్.

పరమఋషులు దేవతలును
నిరతం బీసత్యమందె నిలిచిరి కనుకన్
వరసత్య మాడువాఁడే
పరమపదము పొంది యెపుడు వరసుఖ మొందున్. 2329

ఉరగము చేవలె భయపడు
దురు జనము, లబద్ధమాడు దుర్జను వలనన్
వరసత్యాత్మము ధర్మము
వరసత్యమె మూలమెల్లవానికి జగతిన్. 2330

సత్యమె జగతిన్ దైవము
సత్యముననె రాజ్యలక్ష్మి సతతము నిలుచున్
సత్యమె సమస్త మూలము
సత్యముకంటె వరపదము జగతిన్ గలదే, 2331

దానము యాగము హోమము
నేనాఁడును జేయునట్టి యెల్లతపంబుల్
మానమగు వేదములు స
త్యాన నిలుచుఁగాన సత్య మాడఁగవలయున్. 2330

ఒకఁడే లోకము నేలును
ఒకఁడే పాలించుఁ గులము నురుసత్యముతో
ఒకఁడే నరకంబునఁ బడు
ఒకఁడే స్వర్గంబునందు నుండును ఘనుఁడై. 2333

సత్యంబగు పిత్రాజ్ఞను
నిత్యంబెటు చేయకుందు నిజమే గనుచున్
సత్యప్రతిజ్ఞుఁ డవుదును
పత్యము సత్యంబుచేత పరిగా చేతున్, 2334

క్రతువులు నూటిని చేసియె
శతక్రతువు నింద్రుండనంగ స్వర్గముపొందెన్.
అతిగా తపములు చేసిన
శతముననె మహర్షులనటుగాంచిరి దివమున్. 2347

వ. ఇట్లు రాముండు పలుకుచు 'పరలోకమెలేదు'అను నాస్తిక వాక్యము
లను స్మృతిం దెచ్చుకొని తన యుగ్రతేజస్సుతో వానిని సైచక వానిని మదిలో
నిందించు కొనుచు మరల ఈ విధముగ బలికెను. 2348

సత్యము ధర్మము శౌర్యము
నిత్యము భూతానుకంప నిజదై వార్చల్
స్తుత్యాతిథి విప్రార్చన
నిత్యప్రియవాక్కు స్వర్గనిలయము లందుర్. 2349

కనుకనె విప్రులు సర్థం
బును సరిగాం దెల్సికొనుచు ముక్తినెగొనుచున్
అనయము విధిగా ధర్మము
గనుచును స్వర్గాదికమును గాంతురుగాదే. 2350

ఇటువంటి బుద్ధిం జనుచును
అటు ధర్మవిరుద్ధ నాస్తికాగ్ర్యుండవయి యు
త్కట విషమబుద్ధియగు ని
న్నెటు మాతండ్రి గ్రహియించె నిదె నిందింతున్, 2351

ఇలదొంగల్ ప్రజసొమ్ములాగు కొనునట్లింతేని బుద్ధుండు బు
* ద్ధుల మర్లించిగొనున్, తథాగతుని నిందున్ నాస్తికుంగా నెఱుం
గు, లలాటంబున మేధయున్న బుధుఁడో గూర్చుండి వీలైన ప
ట్టుల నానాస్తికునుండి తప్పుకొని యెట్లోపోవుటే మేలగున్. 2352

ఇపుడు నీకంటె పూర్వులౌ సెల్లద్విజులు
జనులు శుభమైన కర్మలు జరపియుంట
ఇహపరంబుల ఁజూడక యెల్లద్విజులు
శ్రేయమును నిష్టి ధర్మముల్ చేతురిపుడు 2353

ధర్మపరులు సత్పురుష నిదానమతులు
దాతలును సుతేస్వుల్ ప్రధానజనులు
నిర్మలు లహింసకులగు మునీశు లొకరె
మాకు నిత్యము పూజ్యులు మాన్యతములు. 2354

---

* ఈ రామాయణము పాశ్చాత్యుల లెక్క ప్రకారము చూచినను గౌతమ బుద్ధుని కాలమునకంటె పూర్వమందె రచింపఁబడినది. అపుడీ రామాయణములో గౌతమబుద్ధుని పేరును బుద్ధుని నామాంతరమైన తథాగతపదమును వచ్చుటకు వీలులేదు. ఇది యెవరిచేనైన ప్రక్షిప్తమై యుండును లేక బుద్ధివాది బుద్ధుడని ఆకాలమున వ్యవహరింపబడియుండవచ్చును. ఆ వ్యవహరింపఁబడిన దానిని జూచియే గౌతముని బుద్ధుడని వ్యవహరించియున్నారేమో. తథాగతుడన తపస్విన కెట్లు వెళ్లెనోఅట్లె=(తథా) వచ్చినవాడు ఆగతుడు. అర్థము, ఇంక నిచట అట్లే కోరకుండ నాస్తికత్వము బోధింప అట్లు వచ్చిన వాడని యర్థము చెప్పవచ్చును. ఈవిధముగాజాబాలి బుద్ధివాదియునునర్థములో బుద్ధుడుగాను తథాగతుడుగాను నిన్ను తెలిసికో అని నాస్తికనిందరాముఁడు చేసినట్లు భావింపవలెను. ప్రపంచము పుట్టినప్పటి నుండి ఆస్తిక నాస్తికభావములున్న వే గనుక వాల్మీకి యిట్లు వర్ణించుటలో బాధలేదు అని గ్రహింపవలె.

అనుచు దీనసత్త్వుడుగాక మహాత్ముడైన
రాముఁ డిట్లురోషముగఁ బల్కంగ నెఱిగి.
యపుడు జాబాలి బ్రాహ్మణుఁ డాస్తికమును
సత్యమును పథ్యముఁ జెప్పె సవినయముగ, 2355

నాస్తికుల వాక్కులను నేను ననుటలేదు
నాస్తికుఁడఁగాను, లాభమున్ నాకులేదు
ఉండు వేళఁబట్టియె యాస్తికుండ నైతి
వెండియుఁ బరిస్థితుల నాస్తికుండ నౌదుఁ 2356

ఆ పరిస్థితి యీనాఁడొ యరుగుదెంచె
అందుచేత నాస్తికతత్వ మాడినాను
నీ నిమిత్తమై మరలింపఁ బూని నిన్ను
నిను ప్రసన్నుని జేయువాకొనితి నిట్లు, 2357

వ : అనుచు జాబాలి యనఁగ అపుడు రాముడు క్రోధముతో నుండుట యెఱింగి యాతనిశాంతపఱుప రామునితో వసిష్ఠుఁడుపలికెను. లోకనాథా! జాబాలియుఁగూడ ఈ లోకముల రాకలను ఎఱింగిన వాఁడె అయిననునిన్ను అడవి నుండిమరలించుటకు మాత్రమె యిట్లు పలికెను. ఇపుడు లోకముల యుత్పత్తిని గూర్చి చెప్పెద వినుము. ఆది యందు అంతయు నీరుగానె యుండెను. ఆ నీటియందు పృథివి బయలుదేఱెను. అందుండి బ్రహ్మయు స్వయంభువయి దేవతలతో పాటు బయలువెడలెను. అపు డతఁడు వరాహమయి ఆ నీళ్ళనుండి భూమిని పైకెత్తెను. ఆతఁడు సమర్థులైన పుత్త్రులతోఁ గూడ సర్వజగములను సృజించెను. ఆకాశమునుండి వెడలిన బ్రహ్మ శాశ్వతుఁడు నిత్యుఁడు మార్పులు లేనివాఁడు, అతనినుండి మరీచివానినుండి కశ్యపుడు కశ్యపుని నుండి వివస్వంతుఁడు అతనినుండి వైవస్వతమనువు, అతఁడు పూర్వపుఁ బ్రజాపతి. ఆతనికి ఇక్ష్వాకువు పుట్టెను. మొట్టమొదట ఆమనువె ఇక్ష్వాకుల యయోధ్యకు మొదటి రాజు. ఇక్ష్వాకువునకు కుక్షి, కుక్షికి వీరుఁడైన వికుక్షి పుట్టెను. వికుక్షి మహ తేజ-

డైన బాణుఁడు బాణునికి మహాబాహువు మహాయశుఁడైన యనరణ్యుడు కలిగెను. అతఁడు రాజ్యమేలుచుండ అనావృష్టిగాని కఱవుగాని కలుగలేదు. ఆతఁడు మహారాజుగా నుండ దొంగవాఁడన్న వాఁడెలేడు. ఆయనరణ్యుని నుండి పృధువు పుట్టెను అతనినుండి మహాతేజుఁడై త్రిశంకువు కలిగెను. ఆతఁడు సత్యవచనమువల్ల వీరుఁడై సశరీరుఁడై దివమున కేగెను. త్రిశంకువునకు యువనాశ్వుఁడు యువనాశ్వుని నుండి మాంధాత, అతనినుండి సుసంధి, అతనికి ధ్రువసంధివానినుండి రిపుసూదనుడైన భరతుఁడు అతనినుండి అసితుఁడుకలిగెను. హైహయులు తాళజంఘులు శశిబిందువులు అను నతని సామంత రాజులు వీరులైన శత్రువులై అతనిని యుద్ధమున ఓడింప అతఁడు హిమాద్రియందు మునియై తపస్సు చేసెను. అతని భార్య లిద్దఱు గర్భవతులైరని వింటిమి అందులో మహా భాగురాలైన యొక పద్మపత్రాక్షి దేవవర్చస్సు గల భార్గవుని నమస్కరించి యుత్తమపుత్త్రుని గోరి యుండెను. అందులో ఒకతె గర్భవిచ్ఛిత్తికై తన సవతికి గరము (విషము) నిచ్చెను, అపుడు భార్గవుడైన చ్యవనుఁడు హిమాద్రికి వచ్చెను. అతనిని కాళిందియను నామె నమస్కరింప ప్రీతుఁడై అతఁ డిట్లనియెను. ఓదేవీ ! నీకు ఒక పుత్త్రుడు కలుగును. అతఁడు మహాత్ముఁడై లోకప్రసిద్ధుఁడై యుండును. అతఁడు ధార్మికుఁడు సుశీలుఁడు వంశస్థాపకుఁడు అని యాముని చెప్పఁగా నతని సగౌరవముగా వీడ్కొని యింటికి వచ్చి తామరతేకుల వంటి కన్నులు గలిగి తామరస గర్భునితో సమానమైన ప్రభగలిగిన యొక్క పుత్త్రుని కనియెను. గర్భవిచ్ఛిత్తికావలయునని సవతికిగరము (విషము) నిచ్చియుండుటచే ఆతఁడు ఆగరముతోనె (చావక) పుట్టెను గాన సగరుఁడనఁబడెను. ఆసగరుఁడు పుత్త్రులచే సముద్రమును త్రవ్వించెను. అతఁడు పర్వములందు యజ్ఞముచేయుచు సముద్రమును త్రవ్వించు వేగమునకు ప్రజలు భీతిల్లిరి. అతనికి అసమంజుఁడను కుమారుఁడు కలిగెను. ఆతఁడు పాపకర్మ చేయుటచే తాను బ్రదికియుండఁగనే తండ్రిచే వెళ్లఁగొట్టఁబడెను. అసమంజసుని కొడుకు అంశుమంతుఁడు, అతని కొడుకు దిలీపుడు. ఆతనికి భగీరథుఁడు అతనికి కకుత్స్థుఁడు పుట్టెను. అతనివల్లనె మీ కందఱకు కాకుత్స్థులని పేరు వచ్చినది. ఆ కాకుత్స్థునికి రఘువు కలిగెను. అతని వల్లనె మీరు రాఘవులయిరి. రఘువుకొడుకు ప్రవృద్ధుడని పురుషాదకుఁ

డని, కల్మాషపాదుఁడను సౌదాసుడని ప్రసిద్ధి పొందెను. కల్మాషపాదునికి శంఖణుఁడు పుట్టెను. అతఁడు వీరుఁడయ్యును సైన్యముతో పాటు యుద్ధమున నశించిపోయెను. ఆతనికి శూరుఁడైన సుదర్శనుఁడు అతనికి అగ్నివర్ణుఁడు అతనికి శీఘ్రగుఁడు అతనికి మరువు అతనికి ప్రశుశ్రువుఁడు వానికి నహుషునికి పరమధాత్మకుడైన నాభాగుఁడు అతనికి అజుఁడు సువ్రతుఁడను నిద్దఱుకొడుకులు పుట్టిరి. అజునికి ధర్మాత్ముఁడయిన దశరథుఁడు కలిగెను. అతనికినీవు జ్యేష్ఠ సుతుఁడువు, కనుక రాజా! నీవు నీరాజ్యమును చూచుకొనుము. ఇక్ష్వాకువులందఱకు పెద్దకొడుకె రాజు కావలసియుండెను, పెద్దవాఁడు ఉండఁగా చిన్నవాఁడు రాజుకారాదు. జ్యేష్ఠడే రాజ్యమందు అభిషేకింపఁబడును. రఘువంశస్థుల ఈ సనాతనధర్మమును పోగొట్టకుము సమృద్ధమైన రత్నములు గలిగి యనేకములైన ఛిన్నరాష్ట్రములున్న యీ భువిని మహాయశుఁడవై తండ్రివలె పాలింపుము.

వ. అని యిట్లు రాజపురోహితుఁడగు వసిష్ఠుఁడు ధర్మసహితమైన వాక్యమును పలికి మఱియు రామునితో నిట్లు చెప్పెను. 2358

## —: వసిష్ఠుని బోధ :—

పొడమిన నరునికి నాచా
ర్యుఁడు పిత మాత యని ముగ్గు రుఁరదురు గురువుల్
కొడుకును పితకను, నాచా
ర్యుఁడొ విద్య నొసఁగుఁ గనుక గురుం డనఁబడియెన్. 2359

నీదు తండ్రికి నీకు నేనొ యాచార్యుఁడ
నందుచే నాపల్కు లాలకింపు
ఇదె వీరు పరిషదు అదె వారు జ్ఞాతులు
నందుచే తద్ధర్మ మాచరింపు

ఇదె ధర్మశీలయు వృద్ధురాల్ కౌసల్య
నీ మాత చెప్పిననియుతిఁ జేయు
ఈరీతి బ్రతిమాలు నీ భ్రాత భరతుని
ప్రార్థన వినుచు నాలాగు చేయు

ఇట్లయిన సద్గతి నతిక్రమింప వీవు
ధర్మము నతిక్రమింపవు ధర్మమూర్తి
సత్య ధర్మ పరాక్రమ ! సత్యమూర్తి
ఇట్లయిన నందఱ నతిక్రమింపవయ్య. 2360

అని మధురముగ వసిష్ఠుం
డనవిని దరిగూరుచుండిన వసిష్ఠునితో
వినయముగ నరశ్రేష్ఠుఁ డ
యిన రఘురాముఁడు స్వయముగ నిట్లని చెప్పెన్. 2361

జననీజనకులు తమ తమ
తనయులయెడ నెటు ప్రవృత్తి తగఁ జూపెదరో
జననీజనకు లెది సుతుల
కొనరింతురొ దానికిఁ బదులొనరుపఁగలమే. 2362

తమకొలఁది యిడుచునిఁక స్నా
నము చేయించుచు వసనము గట్టుచు ని
త్యము ప్రియముగఁ బలుకుచు ప్రే
మమునన్ బెంచుచు నెటు లెటు మముఁగనిరొ గదా. 2363

మనుజపతి యా దశరథుఁడు
జనకుఁడు నను గన్నయట్టి సత్రమాట్టు గదా
కనుక నెది యతఁడు శాసిం
చెనొ యది యెన్నటికి మిథ్యచేయను జుమ్మీ. 2364

వ. అని యిట్లు రాముఁడు చెప్పఁగా విని పరమోదారుఁడయిన భరతుండు మిక్కిలి బాధపడుచు తనకు దగ్గఱగానేయున్న సూతునితో నిట్లనియె. 2365

—: భరతుని ప్రాయోపవేశము :—

తొరగా సారథి ! దర్భలు
పఱపుమి యీాకటికనేలపయిఁ బండెద నీ
నరవరుఁ డన్న ప్రసన్నత
నర్థుద్దెంచి యనుగ్రహించు నంతటి దాఁకన్. 2366

* ధన మ్మఱఁగిన ద్విజువలె భో
జనమును మాని మొగముపయి వసనమిడియుట జం
బునకును ముంద్దె పరుండెద
వనినుండిఘ్ను న్నన్నుఁగ్రూర్చి వచ్చెడిదాకన్. 2367

అపుడు తేజస్వి రామ రాజర్షి యనియె
"భరత ! నీకేమిచేసితిఁ బండెద విటు
** బ్రాహ్మణుం డొకవైపు పరుండి పరులనాపు
ఇదియె మూర్ధాభిషిక్తుల కేమీ తగదు. 2368

---

* ధన మప్పిచ్చి, యప్పు తీసుకొన్నవాఁడు ఇవ్వకపోగా ఆ ధనము పోయిన ద్విజుఁడు గుడ్డ మొగమున గప్పికొని ద్వారమున కడ్డము పండుకొనును. అటువంటి ద్విజునివలె.

** బ్రాహ్మణు డట్లు పండుకొనవచ్చును గాని రాజుల కట్లు పండుకొనరాదని భావము.

రాముపై పు చూచు సుసుంత్రు రాము భ్రాత
భరతుఁ డారసి మిక్కిలి వగనుజెంది
స్వయముగా దర్భలనుదెచ్చి పఱచి యటనె
నేలమీదనె కూర్చుండె నియతితోడ. 2369

లెమ్ము నరవర ! ఈ దారుణమ్ము వదలు
రాఘవ ! యయోధ్యకేగు శీఘ్రముగ" ననఁగ
భరతుఁ డచటఁ గూర్చుండియె ప్రజలనెల్ల
నరసి యనె యేల శాసింప రార్య మీరు. 2370

అనినంతన్ విని పౌర జానపదు లా యత్యంత ధర్మాత్ము తో
నని, రీ రాముని మే మెఱుంగుదుముగా న్యాయంబుగానే యితం
డినుచుండెంగద, యీ మహాత్ముఁడును పితాజ్ఞా పరిపాలనం
బును గావించును గానఁ గాదనుచు మేమున్ బల్కలే మీతనిన్. 2371

అను పౌరోక్తుల నాలకించి యట ధర్మాత్ముండెయౌ రాఘవుం
డనె నీరీతిగ, ధర్మచక్షువులెయౌ నాప్తార్య మిత్రాదు లా
డిన మాటల్ గ్రహియింపు మీ యుభయమున్ వీక్షించి న్యాయంబుగా
గనుమో రాఘవ ! లెమ్ము తాకు నను నింకన్ * మాని, నీళ్ళానుమీ.
2372

వినుడో సభ్యులు ! మంత్రులార ! పితనేవేళన్ స్వరాజ్యంబు గో
రను, నాతల్లిని చేయుమిట్లని యెటుల్ శాసింప ధర్మాత్ము న
న్నను రామున్ వనవాసముండఁగ నను జ్ఞాన నేను నిర్దీయఁ ద
ప్పనిచో మాపితృనాజ్ఞ నేనె నిలుతున్ పద్నాలుగేండ్లీ వనిన్. 2373

* శుభములోఁ గాని పశ్చాత్తాపపడునపుడు గాని నీళ్ళు స్పృశించుట అనగ ఆచమించుట పూర్వాచారము.

వ. అని రాముఁడు పలుకుటయు నటనుండి మెల్లఁగ లేచి జలము స్పృశించి యాచమించి క్షత్రియుఁడు చేయదగని యా దురాగ్రహంబునకు పశ్చాత్తాపపడి భరతుఁ డిట్లనెను. 2374

ఇంక ధర్మాత్ముఁడౌ రాముఁ "డిట్లు భ్రాత
భరతుఁడన్న సత్యోక్తి""" కచ్చెరువు చెంది
పౌర జానపదులనెల్ల తేఱిచూచి
ఇట్టులనియెను వారితో నెంచి మదిని. 2375

బ్రదికియున్నప్డు మాతండ్రి యెది వచించె
ఏది విక్రయించెఁ గుదువ యేది పెట్టె
ఏది కొనియెనో యదియెల్ల నేనుగాని
భరతుఁడును గాని మార్చఁగ వలనుగాదు. 2376

నాదగు వనవాసమునకున్ బదులుకాఁగ
రాజ్యమును గొని నాదు నరణ్యమింక
నొకనికిచ్చుట నింద్యము: యుక్తముగనె
కైకచెప్పె, మాతండ్రి యుక్తంబె చేసె. 2377

భరతుఁడు క్షమకల్గినవాడు గురులనెల్ల
సత్కరించెడివాడును సర్వమిపుడు
ఈ మహాత్ముఁడు సత్యంబె యెంచువాఁడ
నగుట ఈ భరతుండౌ కళ్యాణకరుఁడు. 2378

వనమునుండి తిరిగివచ్చి పట్నమునకు
భ్రాత ధర్మశీలుఁడునైన భరతుతోడ
ఈ వసుంధరా తలమందు నెల్లగూడ
ఉత్తముఁడవైన ప్రభువునై యుండిపోదు. 2379

ప్రభుని దశరథుఁ గై కవరాలు కోరె
వారియానతి నేనిప్డు కోరిచేతు
అట్టితండ్రి సకల రాజ్యాధిపతిని
ఈ వనృతమునుండియె ప్రోచి యిలను నేలు. 2380

—: మహర్షులు భ్రాతలను మెచ్చుట :—

ఇలలో సాటియెలేని తేజుగల యాయాభ్రాత లన్యోన్య మి
ట్టుల సౌహార్ధముతోడఁ గూడఁగని బిట్టున్మై, గగుర్పాటు రా
జిల నంతర్హితులై మహర్షులు మునుల్ సిద్ధుల్ కరంబున్ మహా
త్ములఁ గాకుత్థ్సుల నిట్టిభ్రాతలను నెంతోమెచ్చి రుప్పొంగుచున్. 2381

"ఇటుల ధర్మవీరులగు వీరెవని సుతులొ
అట్టి ధర్మజ్ఞ రాజు ధన్యాత్ముఁడు గద
ఆ యిరువురి సంభాషణ మాలకించి
మేము మిగుల సంతుష్టులైనాము యిపుడు. 2382

అనుచు రావణు వధ కోరునట్టి ఘనులు
ఋషిగణంబులు సిద్ధులు నిట్టులపుడు
పార్థివ శ్రేష్ఠుఁడై నట్టి భరతుతోడ
కలసియుందఱు వాకొనిరలరి మిగుల. 2383

భరత! ఓమహాప్రాజ్ఞ! మహాయశస్వి
నీవు సద్వృత్తుఁడవు మహానిర్మలుఁడవు
తండ్రినే గనుకను నీవు తలఁతువేని
రామువచనమె నీకును గ్రాహ్యమగును. 2384

ఎవుడు తండ్రి ఋణము నుండి యిట్లు ముక్తి
నెసయు రాముని మేము వాంఛింతు మయ్యు
కైక ఋణము నుండియును మోక్షంబు పొందె
త్వరగ స్వర్గము పొందెను దశరథుండు. 2385

అట్లు పల్కిగంధర్వుల్ మహర్షి గణము
రాజఋషులు తమతమ యిండ్లకు చనంగ
భరతు శుభ వాక్యమును విని ప్రమద మొంది
రాముండు ఋషులం గొల్చె శుభదర్శనుండ యగుచు. 2386

భరతుడంత భీతిలి గొంతుపణంకు చుండ
అంజలి ఘటించి రాముతో ననియె మరల
రాజధర్మము కాలధర్మంబు చూచి
నాదితల్లిది కోర్కె యొనర్పునున్న 2377

ఎటులన్ మేఘునిం గర్షకుల్ జనములున్ వీక్షింతురట్లే నినున్
భటులున్ మిత్రులు మంత్రులున్ సుహృదులున్ ప్రార్థించవీక్షింత్రు నీ
విట నీరాజ్యము పొంది నిల్పుమింక నీవే రాజ్యమున్ బ్రోవంగా
పటుశక్తుండ" వటంచుం గూలి భరతుండా యన్న కాళ్ళంబడెన్ 2388

అపుడు రాముండత్యంత ప్రేమతో భరతునిలేవనెత్తి తనయొడిలోం గూరు చుండంబెట్టుకొని మదించిన రాయంచకూతవంటి మంధరమైన స్వరముతో తామర రేకుల వంటి కన్నులు గల భరతునికిట్లనియె. 2389

ఇదె నీకున్ సహజంబె నాగురులచే నీబుద్ధి నేర్పంబడెన్
పదబైర్దేబుము నాయనా! పృథివిం బ్రోవంగా సమర్థుండవే
హృదయంబున్న యమాత్య మంత్రి సుహృద్రశేణి సమాలోచనల్
మదిలోం గైకొని యెంత గొప్పపనులేన్ మంత్రించి గావింతురే 2390

ద్యుతి యాచంద్రుని వీడుగాక హిమవద్గోత్రంబునామంచు వీ
డుత: బాధోనిధివేల దాటుతను, నెట్లున్‌దాట బ్రిత్రాజ్ఞ, యీ
క్షితి నీప్రేమనొ రాజ్యకాంక్షనొ భవత్ క్షేమంబుకై తల్లి యీ
గతి చేసెన్ మది దానినెంచకుమి, యింకన్ జూడు తల్లింబలెన్. 2391

## —: భరతుడు తుదకు రాముని పాదుకలను రుట :—

ఇటు కౌసల్య సుతుండు పల్కభరతుం డిట్టుల్ గురుప్రేరణన్,
పటు తేజంబున సూర్యునట్లు ప్రతిపత్ స్వచ్ఛాంశు సందర్శనం
బటు భద్రుండగు రాముతోఁ బలికెఁ "నన్నా! పోని యీపైఁడివై
పటువౌ పాదుకలెక్కి యీయు మివి జగద్భద్రంబు గావించుతన్. 2392

వ. అని భరతుఁడు పల్కగా

అపుడా పాదుకలెక్కియుందిగి నరవ్యాఘ్రుండు రాముండదే
యుపకారంబుగ నెంచి వాని విడ ధన్యుండై మహాత్ముండు తూ
రుపు మోమై భరతుండు పాదుకుల నమ్ముండొచు దండంబు భ
క్తి పురస్కారముగా నొనర్చి యిటు ప్రీతిన్ బల్కె నాయన్నతో. 2393

పదునాల్గేండులు నారబట్టలు జడల్ పాటించుచున్ వేళ్ళు పం
డ్లదనందే తిని నీదురాకగనుచు న్నా కాంక్షతోఁ బట్న పుం
దుది బైటన్ వసియించి పాదుకలయందే రాజ్యమున్ నిల్పి యీ
పదునాల్గేండ్ల తుదిన్ నినున్ గననిచో వహ్నిన్ బ్రవేశించెదన్ 2394

అన, నట్లేయనిచెప్పి సాదరముగా నాలింగనంబిచ్చి యం
తనె శత్రుఘ్నుని గౌగలించుకొని యేనాడేని యామాత యం
దును రోషింపకు మాతఁగావుసుమి నాతో సీతతోనొట్టె సూ
యని వాక్రుచ్చుచు కండ్లనీళ్ళురలగా నంపించె నాతమ్మునిన్, 2395

అవలన్ బాదుకలన్ గ్రహించి భరతుండవ్వానికిన్ బూజలన్
మివులంజేసి ప్రదక్షిణంబు చని వానిన్ వట్టపేనుంగు శ్రీ
ర్షవతంసంబుగఁ జేయఁ రాముడును సర్వాచార్య మంత్రి ప్రజన్
సవిశేషంబుగఁ గొల్చి ధర్మమె గొనెన్ శైలేంద్రవద్ధీరుడై. 2396

అంతనశ్రులు కంఠము నడ్డగింప
జనములాతని వీడ్కొల్పఁ జాలరైరి
అంత రాముఁడున్ తల్లుల కంజలించి
యేడ్చుచు స్వకుటీరము ప్రవేశించె నెట్లొ. 2397

—: భరతుడు తలను పాదుకలనుదాల్చి వెళ్లుట :—

ఇఁకను భరతుండు తలనుపాదుకలఁ దాల్చి
తొరగ రథ మెక్కె శత్రుఘ్నుతోడ మెచ్చి
వడి వసిష్ఠుఁడు జాబాలి వామదేవు
లుదిత మంత్రులు మంత్రులు మొదటఁ జనిరి. 2398

ముందు మందాకినికిని తూర్పుమొగము పెట్టి
చిత్రకూటగిరికి ప్రదక్షిణము చేసి
గైరికాదిధాతులఁ జిత్రమై రుచించు
గిరిని గనుచు సైన్యములతో భరతుఁడేగె. 2399

చిత్రకూటగిరి దరిసె చేరియున్న
యాభరద్వాజు నాశ్రమ మరసి భరతుఁ
డరదము దిగి భరద్వాజు నంజలింప
నరిగిన పనియయ్యెనె చెప్పు మఖిలమిపుడ, 2400

అనిభరద్వాజుఁ డన నన్నియందు భక్తి
సెలవు భరతుండుననె "నేను గురువు కోర
రాముఁడును పరమప్రీతిరంజిలంగ
నీవసిష్ఠునితోడ వచియించె నిట్లు. 2401

జనకు నా ప్రతిజ్ఞనె నేను సరిగ దాల్చి
పదియు నాల్గేండ్లువని నుందునిదియె విడువ
నన మహాప్రాజ్ఞుఁడును వచించె
వాక్యకౌశల మేర్పడ భ్రాతతోడ 2402

ఇవిగొ బంగారు పాదుక లివ్వె యులరి
మాకునిచ్చి యయోధ్య క్షేమమును చేయు
అని వసిష్ఠుఁడు వచియింపఁ బ్రాజ్ఞుఖుడయి
రాముఁడిచ్చెఁ బాదుకలనే రాజ్యమేల 2403

ఆ మహాత్ముఁడు రాముండు సనుమతింప
యోగ్యపాదుకలుగొని యయోధ్యఁ జనెద
అని మహాత్ముడైన భరతుఁడనఁగ నపుడు
విని భరద్వాజుఁడు శుభవాక్కును వచించె 2404

శీలముగల నీయెడనిది చిత్రమేది
నీరుపల్లాన బలెఁ బొందె నిన్నె నడత
ఇటుల ధర్మాత్ముఁడౌ పుత్త్రుడీవె యవుట
ఆనృపతి దశరథునప్పు నిప్పుడేగె. 2405

వ. అని యిట్లు చెప్పిన మహాత్ముఁడైన మహర్షి పాదములకు నమస్క రించి ప్రదక్షిణము చేసి యాభరద్వాజు దగ్గఱ సెలవు తీసుకొని యయోధ్యకు భరతుండు మంత్రులతోఁ గూడ వెడలెను. అపుడు యానములతోడను శకటము లతోడను గుఱ్ఱములు గజములతోను విస్తీర్ణమైయున్న యాసేనతో కూడ

వెళ్ళుచు మార్గమధ్యమున శుభజలముగల యయునానదిని అపార జానపదులు చూచి అటనుండె శృంగిబేరపురమును ప్రవేశించి అట దూరము నుండియె యయోధ్యను జూచిరి. అపుడా భరతుడు సారథితో ఇట్లనెను, ఓసారథీ: చూచితివా పాడయిపోయి ఈయయోధ్య యెట్లున్నదో ఆకారము చెడి ఆనందమెలేక దీనమై శూన్యమై సవ్వడిలేక యుండెను అని. 2406

శ్రుతి గంభీర మనోజ్ఞ ఘోషరథ మారోహించి గేహాంతర
స్థితులౌగేస్తులు మూసికొన్ తలుపులన్ జేటౌనయోధ్యాపురిన్
సతమున్ పిల్లులు గబ్బిలాలు తిరుగన్ గాఢాంధకారంబుతో
డుత నిండారిన రాత్రినట్లు భరతుండున్ చొచ్చె శీఘ్రంబుగా. 2407

ప్రభసిరి నలరారి రాహువు ప్రియుగ్రమింగ
నేకఁ జంద్రుప్రియరోహిణినిబోలి
వేఁడినీటఁదపించు విహగాలు, నణఁగిన
మీలఁ జిక్కిన కొండ కాలువట్లు
పొగలేక పసిఁడట్లు సిగగల్గిహవిసుచే
చెలఁగి యారినయగ్ని శిఖనుబోలి
కవచాలు తెగిపడఁ గరితురగరథకే
తులు వీరులు పడుబలముపోలి. 2408

నురుగు ఘోషము గల్గియు మరుతులఢర
నుఱికి కూలియు పడుసముద్రోర్మిఁబోలి
ఇష్టి ముగియస్రుక్కు స్రువముల్ ఋత్విజులను
నాయుధాల్ లేనివేదియట్లమరె నగరి. 2409

ఆఁబోతుచనఁ బచ్చికైనఁ దినకబెంగ
చెందిన మత్తగోశ్రేణిపోలె
స్ఫటికమువలె వెల్గిచారువయ్యును జాతి
రత్నా లతేని హారంబుపోలె

తన చోట విడి పుణ్యమును బోవ దివిజారి
ధరఁబడి కళలేని తారఁబోలె
విరులతో నిండి భ్రమర ఝుంకృతిఁ దగియు
దావాగ్నిఁ గాలిన తీవఁబోలి

పానపాత్రలు కుండలు పగిలిపోయి
త్రాగుబోతుల్ చనిన కల్లుపాకఁ బోలి
నేల పాత్రలు పాడయి నీళ్ళులేకఁ
యమరు చలివందిరివలెను నలరెనగరి. 2410

వ. మఱియు నాయయోధ్య.

మీరి విలుకాండ్రు తెగఁగొట్టు నారిఁబోలె
భటులు పడఁగొట్టఁ గూలిన బడబఁబోలె
చేపలుండి కల్వలులేని చెఱువుఁ బోలె
మురికిమెయి, మబ్బుదరు సూర్యుఁబోలె నేసఁగె. 2411

అపల దాశరథి భరతుం డనియెనిట్లు
సూత! మన్ననుల నయోధ్యఁ జూడఁ బడదు.
లేవు గీతవాద్యములు పూఁదావి లేదు
గజమదము చందనాగురు గంధమేది. 2412

రాముఁడును సీతలక్ష్మణుల్ వనికిఁ బోవ
బండ్ల యానాల రథముల ధ్వనులెపోయె
యువకులును రాము బెంగ నొదిగి తినరు
యావముత్సవములు రాముతోనె పోయె 2413

పనికి మాయన్న వెళ్ళ సర్వంబు కూడ
కళయుఁ గాంతిఁగు నన్నతోఁ గదలిపోయె
ఈ యయోధ్య కార్మబ్బులెసగి కురియు
శరదృతు నమయంబటు ప్రకాశంబు కనదు, 2414

ఇటకెపుడొ యన్న యుత్సవంబటులు వచ్చి
వేసవిని మబ్బటుమము సంతోసపెట్టు
ఈ యయోధ్య మార్గములొ హర్షించి తిరుగు
చారువేషనరులు లేక మీర విపుడు. 2415

అనుచు సారధితో పల్కియపుడు భరతుఁ
డా యయోధ్యలో పితలేని యాగృహంబు
సింహమది లేని గుహఁబోలె చేరి కుమిలి
అర్కుఁడేలేని మిన్నటు లరసి యేడ్చె. 2416

—: భరతుడు నందిగ్రామమేగుట :—

ఒగి భరతుఁడు తల్లుల నయోధ్య నుంచి
ఏడ్చిప్రవతియొచు గురులతో నిట్టులనియె
నేనుబోదు నందిగ్రామ మిపుడు మిమ్ము
వీడ్కొనెద రాముఁడోలేఁడు వెతలసైతు. 2417

రాజొదివయేగె నన్న యరణ్య మరిగె
రాము నెదురుచూతు, నతండె రాజుధరకు
అనుచు భరతుండు పల్కగ వినియు మంత్రు
లావసిష్ఠుఁడు భరతుతో ననిరి యిట్లు. 2418

భరత! బాగున్న యది నీవు వాకొనినది
భ్రాతృభక్తి నీకయను రూపంబ యిదియు
బంధుమైత్రి గలిగి భ్రాతృభక్తి గలిగి
సాధుపథినేగు నిన్ను మెచ్చదె జగంబు. 2419

మంత్రుల వచస్సు విని మతికి నచ్చ
సారథము పూన్పుమని సూతుననియె భరతుఁ
డెల్ల తల్లులతో వచియించి యల్లరి
యరదమెక్కి శత్రుఘ్నుతో నరిగె ముందు. 2420

ఆవసిష్ఠ ప్రభృతులును ప్రాజ్ఞ్యముఖులయి
యపుడె ముందె నందిగ్రామ మరిగినారు
పిలువకుండనె రథము నేన్గులబలంబు
బయలుదేఱె, వెళ్ళిరి కూడ పౌరగణము. 2241

భరతుఁడును పాదుకలు తలపైని దాల్చి
యవల త్వరగ నందిగ్రామ మందు దిగియు
గురులతోననె నన్న మా కుశలమునకు
న్యాసమువలె పాదుకలు రాజ్యము నొసంగె. 2422

న్యాసమగు పాదుకల శీర్షమందుఁదాల్చి
పలికె ప్రకృతులతో దుఃఖపడుచు మిగుల
గొడుగు పట్టుడి యాయన్న యడుగులకును
ఇవియె నాయన్న పాదము లివియె ప్రోచు. 2423

నేను మాయన్న పాదుకల్ నియతిఁ దాల్చి
యన్న వచ్చు వఱకును రాజ్యంబు చూతు
వీని నన్నగఁ దలపోసి వీని తోడ
రాజ్యగతి నివేదించి తర్వాతఁ దినెద. 2424

అన్న పాదుకల్ రాజ్యంబు నన్నకిచ్చి
అఖిలపాప దూరుఁడ నౌదు ననుచుపలికి
జడలు నారబట్టలు దాల్చి సైన్యసహితుఁ
డయి మునివలె నందిగ్రామమందె యుండి. 2425

గొడుగున్ చామరమూని పాదుకలకున్ గొల్చి నివేదించి నె
వ్వడి నాయానతిచేతఁ బాదుకులకుం బట్టాభిషేకంబు నా
తఁడు గావించి యధీనుఁడై వినతితోఁ దద్రాజ్యమేలెన్ మరె
వ్వఁడె యేన్కానుకలీయఁ బాదుకలకే వానిన్ సమర్పించెడిన్. 2426

భరతుఁడేగ రాముఁడు కొంతవఱకు నటనె
* యుండి పూర్వము నుండి యందున్న మునులు
భీతులై యింక నొకెడకు వెడలఁ దలఁచి
యుత్సుకులెయౌటఁగను గొనియుండెనంత. 2427

కనులతో బొమ్మముడులతోడ గనుచు రాము
కొంకి యన్యోన్యముగను గుసగుసలుపోవ
వారియౌత్సుక్యమును గాంచి వారి శంక
ఏదొగన మ్రొక్కికుల పతి కిట్టులనియె. 2428

---

* చైత్రశుద్ధమినాడు రాముడడవికి బైలుదేఱెను పిదప పూర్ణిమనాడు దశరథుఁడు చనిపోయెను. పిదప పక్షమునకు భరతుఁ డయోధ్యకు వచ్చెను పిదప అంత్యేష్టితో పక్షము గడచెను. వైశాఖము పూర్తికాగ జ్యేష్ఠలో భరతుఁడు చిత్రకూటమునకు వచ్చెను వర్షాకాలము మొదలు కార్తీకము చివర వఱకు రాముడు చిత్రకూటమున నుండెను.

ఇటులన్ మౌనులు విక్రమున్ గనుటకే నేమైన దోషంబు చే
యుట లేదేగద, లేక నానుజుఁడేదో కొంత కావ్పించెనా
ఇటు నాసేవలు చేయుచున్ మఱచిమి మ్మేదైన పూజించి కొ
ల్చుటలో భ్రాంతిమెయిన్ ప్రమాదమును నిచ్చో సీత గావించెనా. 2429

అని రాముండన వయసుచే
తనెగాక తపసునఁ గూడ తగవృద్ధుండౌ
మునివరుఁకుచు నిటు భూతద
యను పొందిన వాఁడె యగుచు ననె రామునితో 2430

కడుఁ గళ్యాపుమూర్తి యౌచు నెపుడున్ గళ్యాణమే చేయు చి
య్యెడ నీతోఁ దగు సీతవల్ల పొరపాటెట్లా విశేషించి యా
జడదారుల్ కడ చేయునెట్లు మఱి మీసాన్నిధ్యమందెప్పుడె
య్యెడ నేరాక్షసు నుండి కష్టమవునో యేమంచు శంక్రింత్రిటుల్ 2431

ఖరుఁడన్ రాక్షసుఁ డుండె రావణునికిన్ గారాపుఁ దమ్ముండిటన్
నిరతం బాతఁడు బాధపెట్టి మమునిందే యీ జనస్థానమున్
దిరుగున్, వాఁడు నృశం సుఁడెంతొ ఖలుపాపాత్ముఁడౌ దుష్టుఁడున్
పురుషాదుండును: వాఁడు నిన్ను నిట నిప్డున్ సైపఁడెట్లేనియున్ 2432

ఇటు నీవెప్పటి నుండియైతె నిటకీ వేతెంచి యున్నావొ య
ప్పటి నుండే మము బాధపెట్టి వివిధంబౌ క్రూరకృత్యంబులున్
పటు బీభత్సపు రూపుచూపుచు విరూపంబైన కష్టంబు లి
చ్చటనే గాక యొసర్చుచుండెను సుమీ సర్వ ప్రదేశంబులున్. 2433

హవనంబుల్ పొనరించునప్పుడును హోమాగ్నిన్ గరంబార్పి స్రుక్
స్రువముల్ పాఱగవైచుచున్ కలశముల్ చూర్ణంబు గావించుచున్
వివిధంబైన భయంకరంపుఁ బనులెన్నోఁ జేయుఁ బేరేచి ను
న్నవి వీక్షింపఁగలేక వెళ్ళఁ దలపోయం జొచ్చిరన్యస్థులుల్ 2434

ఇఁక శారీరిక హింసవారు జరుపన్ వీక్షించి యందుండఁ జా
లకపోఁ జూచుట మేము నాశ్రమము వీడన్ బోవుచున్నామ యిం
తకు నిచ్చోటకుఁ గూడ దగ్గఱనె పండ్లన్ దుంపలన్ నిండి యిం
కొక పుణ్యాశ్రమముండె, నచ్చటనె మీకున్ వాసమేయుక్తమౌ. 2435

ఖరుఁడున్ నీయెడఁ జెడ్డఁజేయఁ గలఁ డింకన్ మీరు మాతోనె యి
ప్డరు దేఱన్ గడు యుక్తమౌ ననుచు నాస్వాంతంబు నందోచు, ని
త్తఱి నీవెంతొ సమర్థుఁ డయ్యుసతితోఁ క్రూరకృత్యంబులున్
భరియింపన్ గడుఁ గష్ట, మల్పమయినన్ సందేహమేలేదిటన్ 2436

అని వృద్ధుండన యుక్త వాక్యములచే నామౌని సంఘంబు నా
ప నశక్తుండయి పోవనుత్సకులెయౌ వారిన్ నివారించు ని
చ్ఛను వర్జించి సరేయటంచును ప్రశంసన్ జేసి వీడ్కొల్పఁగా
చనె నయ్యాశ్రమముం ద్యజించి మునివంశాధ్యక్షుఁడవ్వారితో 2437

ఋషులు లేకుంట నాశ్రమ మింక నెపుడు
క్షణము కూడ వదలక రాముఁడును వసించె
రామునే నమ్మి రాముని వ్రతము నెఱుఁగు
తాపసులు కొందఱట నుండఁదలచి యుండ్రు. 2438

అందఱట నుండి పోవుట నరసి రాము
డెన్నొ హేతుల నటనుండ నిష్టపడఁడు
భరతుఁదల్లులఁ బౌరుల నరసితిటనె
సతతము తలంప వారు నాస్మృతికి వత్తు్రి. 2439

ఆ మహాత్ముఁడు భరతు సైన్యములు విడిసి
యుంట నశ్వాలునేన్గులు నుండి యచట
వేసినట్టిలద్దెల నిండి వెగటుతోఁప
నచట నుండి పోవుటయె మేలనితలంచి. 2440

అటనెదరిగ నత్రిమహర్షి యాశ్రమున
కపుడు లక్ష్మణుఁడును సీత యరుగదేఱ
నరిగి యామహర్షికి మ్రొక్కనతఁడు రాము
నరసి పుత్త్రవాత్సల్య మర్యాద నెఱపె: 2441

తెచ్చి స్వయముగ నాతిథ్యమిచ్చి మెచ్చి
జానకికి లక్ష్మణునికి సంతసమ్ము గూర్చి
వేగ వృద్ధయౌ ననసూయఁ బిలిచి రాము
పత్ని సీతవచ్చెనని స్వపత్నిఁ బలికి. 2442

ఈమె సీతనిటఁ బరిగ్రహింపు "మనుచు
రధ్మచారిణి తాపసి తనదుభార్య
యైన యనసూయకును జెప్పి యప్పుడిట్లు
తన పతిని గూర్చి రాముతో ననియెనతడు 2443

పదియునేండ్లు ననావృష్టిపరలిలోక
మెల్లదగ్ధము కాఁ బండ్లు వేళ్ళు సృష్టి
చేసి మంత్రాల నియమాలు చేసిపిదప
నీమె గంగను నిటఁ బ్రవర్తింపఁజేసె. 2444

పదియు వేలేండ్లు ఘోరతపంబు వ్రతముఁ
జొచ్చి చాలవిఘ్నము లనసూయ బాపె
దేవకార్యముకై యీమె తెలిసి తల్లి
కరణిఁ బదిరాత్రు లొక్క రాత్రిగఁజేసె. 2445

---

అనసూయ సఖురా లొకతె తన పతిని ఒకవేశ్య దగ్గఱకు తీసి కొని వెళ్లుచుదారి శూలమునఁ గుచ్చబడిన మాండవ్య మునిని పొరపాటున

ఎల్ల భూతాలకు నమస్కరింపఁ దగిన
వృద నక్రోధ ననసూయ నీమె సీత
యరసి తల్లిఁ బలెను గనుత అనుచునత్రి
చెప్ప సీతతో రాముఁడు చెప్పె నిట్లు 2446

వింటె నృపపుత్త్రి ! యీ ముని విభునిమాట
మన శుభంబున కీతాపసిని భజింపు
జగతి ననసూయ యనుచు స్వాచరణ వలన
ఖ్యాతి పొందిన తాపసి గరము కొల్వు. 2447

అనుచు రాముఁడు చెప్ప నాజకనతనయ
ధర్మ మెఱిఁగిన ననసూయ దరికిఁ నేగి
సడలి ముడుతపడి జుట్టు నెఱిసిన వృద్ధఁజూచి
విధివణఁకు జుట్టు నెఱసిన వృద్ధఁ జూచి 2448

ఆ పతివ్రత యనసూయ యనఘురాలి
దరి కరిగి స్వనామము చెప్పి కరము లొగ్గి
కుశల మడుగంగ ననసూయ కూర్మి సీత
కనియె "దైవవశత ధర్మమును భజింతె. 2449

---

తాక నాతడు కోపించి నీ భర్త పదిరోజులలో సూర్యోదయమునకు చనిపోవునని శపించెను. అపు డామె సూర్యుఁడుదోరాకుండు గాకయనగా సూర్యోదయము కాలేదు. దేవతలు వచ్చి యొక బ్రాహ్మణుని అనసూయ దగ్గఱకు పంపగా ఆమె ఆ పదిరాత్రులు ఒకరాత్రిగాఁ జేసి "మీరా చనిపోయిన భర్తను బ్రతికింపుడు" అని ఆమెచే సూర్యోదయవుగునట్లు చెప్పి చేయించెను అపుడాపతి బ్రదికెను. అని పురాణ కథ.

ఆప్తులను వీడి యభిమానమైన విడిచి
వనిని రాము నదృష్టాన ననుసరింతు
పురిని నున్నన్ దని నున్నఁ బుణ్యుఁడైన
పాపియైనన్ బతి గొల్చు స్త్రీ స్వర్గ మొందు 2450

దుష్టుఁడైనఁ గాముకుఁడైనఁ గష్టుడైన
బీదయైన నార్యకు స్త్రీకి విభుఁడె దేవుఁ
డెంత శోధించినన్ మించి యింతకంటె
నెపుడు గన యోగ్య, మవ్యయ పదముఁ బోలె 2451

పతికిఁ బతు లౌచుఁగామంపు వశలెయైన
యసతు లీగుణ దోషంబుల ననుసరింప
రాయకార్యవశము పొంది యపయశంబు
చెంది భ్రష్టలయ్యెద రట్టి స్త్రీలు సీత ! 2452

పరము నిహమును జూచు నీవంటి స్త్రీలు
పుణ్యలై స్వర్గమును గాంత్రు పుణ్యులట్లు
ఇటు పతివ్రతపై వేళ యెఱిఁగి పతికి
ధర్మచరివగు కీర్తిని ధర్మమొందు. 2453

చూచి యనసూయ యనననసూయయగుచు
సీత మరలఁ బూజించియున్ జెప్పదొడఁగె
సతివి నీవిట్టులనుట నాశ్చర్యమేమి
సతికి పతిదైవమగుట నామతియు నెఱుఁగు 2454

భర్త జీవనగతి లేని వాఁడైయైన
క్రూరుఁడైన శంకయె లేక కొలువవలయు
తల్లివలెఁ దండ్రివలె రక్తిదయయుఁ గలిగి
శీలయుతుఁడైన వశియైనఁ జెప్పవలెనె. 2455

ఎట్లు కౌసల్య నెపు డాదరించు రాముఁ
డటులెయన్య మహిషులను నాదరించు
ఒక్కపరి తండ్రి చూచిన నొగ్గిని స్త్రీల
మాతల బలెఁ జూచును నభిమాన ముడిగి. 2456

భయదమగు విజనవనికి వచ్చు నపుడు
నాదుస్థిర భావమునె యత్త నాకుఁజెప్పె
అగ్ని సాక్షిగ పెండిలి యాడినపుడు
నాకు తల్లి చెప్పినదాని వీఁకఁదాల్తు. 2457

పతిసేవ కంటె నితరము
సతికిన్ లేదనెడి నీదు సద్వాక్కులచే
మతిలోన విన్నయవి వి
స్మృతములు గాకుండ నిపుడు స్మృతములెయయ్యెన్, 2458

సతిసావిత్రి పతిన్ సదాకొలిచియే స్వర్గంబు పొందెం గదా
పతి దేవున్ భజియించి నీవును నటుల్ స్వర్లోకముంబొందు మీ
గతి సావిత్రి నమస్తకాంతలకు సగ్రా రాధ్య దై వంబటుల్
క్షితినుండెన్, శశిలేక రోహిణి త్రుటిన్ సీతా ! కనన్ రాదుగా 2459

ఇటులే యెందఱొ యీ పతివ్రతలు నిందే యెంతొ పేరొంది తా
మిటఁ బుణ్యంపు స్వకీయ కర్మలముల చేనేపారి సల్లోకముల్
త్రుటిలో బొందిరియంచు సీతయన సంతోషించి యత్యంత మం
తట శీఘ్రం బనసూయ మూర్కొనుచు సీతన్, బల్కె నీరీ తిగన్ 460

వివిధంబౌ నియమాలఁ బొందిన తపంబెంతో యిటం గల్గెఁగా
భువిలో దానిని బట్టి నీకు ఁగడు నామోదంబు గల్గింతు నీ
సువచస్సుల్ విని ప్రీతురాల నయితిన్ శుభ్రస్మితా ! యిత్తు నీ
కెవియన్నన్ "త్వదను గ్రహం బొకట" యంచున్‌సీత పల్కెన్‌సతిన్.461

అన నాతాపసి యింక మెచ్చియనె దివ్యంబైన మాల్యంబి దే
ఘనవస్త్రంబిదె భూషణంబు లివిగో కమ్రాంగ రాగంబిదే
తను లేపంబిదె నే నొసంగినవి త్వద్గాత్రాల రజించు నీ
కను రూపంబిది స్వచ్ఛమైనది సతంబందంబు నిచ్చుంగదా ! 2462

దివ్యమౌ నంగరాగము దేహమందు
అలఁదికొని నీప్రియుని హర్షమందుఁ దేల్పఁ
గలవు లక్ష్మియవ్యయు విష్ణుబలెను నీవు
నాఁగ నవి సీతప్రీతి దానముగఁ గొనియె. 2463

అటుల గ్రహియించి కూర్చుండి యంజలించి
కరము సేవించు సీతను గాంచి యపుడు
ఆయయి ప్రియంబులైన వృత్తాంతములను
సీత ననసూయ ప్రేమఁ బ్రశ్నింపసాగె. 2464

రాముఁడీ యశస్వి స్వయంవరంబు నందు
నిన్నుఁ పెండ్లాడెనంచు వింటినిగదమ్మ
దానినెల్ల విస్తరముగ తథ్యముగను
చెప్పఁగాఁ గోరుచుంటిని చెప్పుతల్లి ! 2465

అనుచు ననసూయ యడుగఁగ నపుడు సీత
తాపసికి ధర్మచారిణి కీప్రకార
మఖిల మగు తన వృత్తాంత మాదరమున
చెప్పఁ బూనియు నప్పుడు చెప్పెనిట్లు. 2466

ధరణిపతి జనకుండు స్వధర్మరతుఁడు
క్షత్ర ధర్మరతుండయి ధాత్రినేలు
తొరగ నతఁడు నాగలిని భూమి దున్నుచుండ
నే నృపసుత వచ్చితిన్ ధరన్ జీల్చుకొనుచు. 2487

సరిగ గుప్పిటన్ గింజలు చల్లుచుండి
దుమ్ముచే గప్పియున్న నన్ దులిపి వేగ
అచ్చెరువు వడి యనపత్యుఁడగుట మిగుల
స్నేహమున స్వయంబుగ నొడిఁ జేర్చుకొనియె 2468

ఈమె నాసుతయని యెంచి ప్రేమనిడఁగ
ఇట్టె యాకాశవాణి విన్పించె నపుడు
రాజ! యీమె నీపుత్త్రి)ధర్మమున ననఁగ
అతఁడు హర్షించి సంపదయట్లు గొనియె, 2469

అతఁడు తన జ్యేష్ఠ మహిషికి నప్పగింప
నామె నను మాతవలెఁ బెంచి యాదరించె
పెండ్లియీడు వచ్చుటఁ జూచి విభుఁడు మిగుల
వ్యధను గొనె ద్రవ్యనాశాన నధనుఁడట్లు. 2470

సాటియును తక్కువయునైన జనుల వలన
నవనతి గొను నింద్రునికంటె నధికుఁడయ్యు
అట్టి నింద దగ్గఱనుండ నాత్మఁ దలచి
కష్టజలధిఁ బడవవలె గట్టు కనఁడ. 2471

ధర నయోనిజనౌ నాకుఁ దగిన యట్టి
పతిని చింతించి కూడను బడయలేక
ఇమ్ముగ తనూజకు స్వయంవరమ్ము చేతు
ననుచు నాతండ్రి జనకుఁడు నాత్మఁదలఁచె. 2472

ఇంతలో మహాయజ్ఞాన స్వేచ్ఛతోడ
ఆమహాత్ముఁడౌ వరుణుండె యొకధనుస్సు
నక్షయంబైన బాణాలు నమ్ముపొదులు
నిచ్చె నావిల్లెవరు కదలింపలేరు. 2473

అది మిగుల బరువౌటచే వదియు నెత్తి
వంచుటకు మనుష్యులిల స్వప్న మందు
గూడఁ జాలరది గ్రహించి క్షోణిపతుల
నెల్లరావించి యాసత్య ధృతి వచించె. 2474

ఈ ధనుస్సు నెవఁడెత్తి యెక్కు పెట్టు
వానికిని నాసుతను నిత్తువలదు శంక
అనుచు ఘోషింప గిరివంటి యాధనుస్సు
నెత్తలేక మ్రొక్కుచు నృపులెల్లఁ జనిరి. 2475

చాలకాలంబునకు మహాశక్తి కలుగు
నీమహాబాహువగు రాముఁ డేగుదెంచె
మౌనియైన విశ్వామిత్రుతోనె యిటకు
నాజనకుఁడు జనకుని జన్నంబు చూడ. 2476

భ్రాతయౌ లక్ష్మణునితోడ వచ్చినట్టి
సత్యవిక్రము రాముని సత్యనిరతుఁ
డైనమౌని విశ్వామిత్రు నరసియపుడు
నాదు తండ్రి పూజించె వినమ్రుఁడగుచు. 2477

అవలమౌని విశ్వామిత్రుఁ డరసి పితను
రాములక్ష్మణుఁ జూపి యీ రాజసుతులు
ఆధనుస్సును జూడఁగా నరుగుదెంచి
రనుచు నామౌని వచియింప నాలకించి. 2478

మనుజ గణముచే దివ్యమౌ ధనుసునపుడు
నాజనకుఁడు తెప్పించి, కన్పడఁగఁ జేయ
ఆబలుండు రాముం డనాయాసముగనె
దానిఁ బూరించి యెత్తె తత్క్షణమునందె. 2479

అటులు ధను సెక్కు పెట్టెడి యంతలోనె
వేగనావిల్లు మధ్యకు విఱిగిపోయి
వెడలి గొప్పశబ్దముచేసి పిడుగుఁ పడిన
యట్టులగుచుఁ బ్రతిధ్వనియడరఁ జేసె. 2480

అపుడు సత్యసంధుండైన యట్టి తండ్రి
నన్ను నిడఁ బూర్ణకుంభమును వడిగతేఁగ
నాయయోధ్యేశు దశరథునాజ్ఞ గొనక
నన్ను స్వీకరింపఁగ రాముఁడెన్నఁ డయ్యె. 2481

అపుడు దశరథున్ వృద్ధుఁడై నట్టిమామ
నపుడు రప్పించి యాతఁడు ననుమతింప
నేను నీయఁబడితి, సాధ్వియైన యనుజ
యూర్మిళయు లక్ష్మణునికిని నొసఁగఁ బడియె. 2482

ఇట్లు నేను రాముని కొఱ కీయఁబడితి
నేను నిత్యంబు రామునినే తలంచి
యతని యందునె యనురక్తనై సతంబు
పతిని దైవంబుగా నెంచి వఱలు చుంటి. 2483

ఇట్టు లనసూయ సీత వచ్చించి నట్టి
యాస్వయంవర కథ విని మతిని మెచ్చి
సీత శిరము మూర్కొని కడుఁ బ్రీతితోడ
చేతులను గ్రుచ్చి కౌఁగిటం జేర్చుకొనియె. 2484

విశదమగు నక్షరంబుల వింతగూర్చి
మధురముగ నీస్వయంవర కథను వింటి
మధురభాషిణి! నీకథం బ్రమదమయ్యె
రవియు నస్తమించెను నిదె రాత్రివచ్చె. 2485

పగలు తిండికి పక్షులు పఱచి వచ్చి
వేగగూండ్ల నణఁగి కూయు వినఁగఁబడియె
మునులు నీరె పాత్రలతోడ మునిఁగి తడియు
నారబట్టలతో వచ్చి నారుకనుము 2486

ఋషి యథావిధిగా నగ్ని వ్రేల్చుచుండ
పావురపు రంగుగల పొగపైకి నెగుర
ఆకు లల్పమెయయ్యు నన్ని యెడల
గాఢమై దవ్వుగా దిశల్ గానఁబడియె. 2487

రేయి తిరుగు జంతులు చరించుచుండె
ఆశ్రమమృగాలు వేదిక లాశ్రయించె
సీత నిశ హెచ్చ నక్షత్ర చిత్రమగుచు
వెన్నెలలు గప్ప శశి మింట వెలుగుచుండె 2488

వెళ్ళు సెలవిత్తు రాముని వెంటనుండు
ఇట్లుచెప్పి నీవల్ల హర్షించినాను
ఇపుడె నాముందునె యలంకరించుకొనుము
ప్రీతి గూర్చు దివ్యపు భూషలెల్లఁ దాల్చి 2489

అననలంకరించుకొనియు నామె దేవి
వలెను, ననసూయకును మొక్కి వడిగ రాము
నెదుట కనుబోవఁగ నలంకరించు కొన్న
సీత నరసి రాముడెంతొ ప్రీతిపొందె 2490

అమరి యనసూయ ప్రీతిదానముగ నిడిన
భూషలను గావించి రాముఁడు మోదమొంద
లక్ష్మణుడు మానవులకు దుర్లభమయ్యెన
యట్టి జానకి సత్క్రియ నరసి యలరె. 2491

వ; పిదప రాముఁడు పూర్ణాచంద్రాస్యయగు సీతను జూచి సంతసించి యా తాపసులందఱుచేత పూజితుఁడై ఆ రాత్రి యచటనెయుండి రాత్రిగడవఁగా అభిషేకము చేసికొని యగ్నిని వ్రేల్చిన తాపసులను వీడ్కొనఁ జూచు యామును లిట్లనిరి. 2493

పురుషులను జంపురాక్షసుల్ నిరతమిచట
నుందు, రెఁకసెత్తురులు పీల్చునురగములును
వణులు; నశుచిఁ బ్రమత్తు బ్రహ్మచారిఁ
దినుచు నుంద్రు. వారిని నివర్తింపు రామ ! 2493

ఇదియె పండ్లు తెచ్చుకొనెడి ఋషులదారి
దీన దుర్గమ వనికేగ నౌను రామ !
అనుచుఁ బుణ్యాహమును జేయు మునుల మ్రొక్కి
వనికిఁ జనెరాము, డర్కుఁడంబరము నట్లు. 2494

ఇది

మహర్షి వాల్మీకిచే రచింపఁబడి
చర్ల వెంకమాంబానారాయణ శాస్త్రుల,
తనయుడగు గణపతిశాస్త్రిచే తెనుఁగున సరిగ తీర్చి
దిద్దఁబడిన గణపతి రామాయణమున నయోధ్యకాండము.

—: సమాప్తము :—